


# విషయసూచిక

సంపుటి 1. సంచిక 39

శుక్రవారం, ఏప్రిల్ 29, 1949



పల్లెటూరి చెరువు

చిత్రకారుడు—హెచ్. వి. రామగోపాల్

# స్వతంత్ర

సంపుటి-1 | ఏప్రిల్ 29, 1949 | ప్రచురణ:
సంచిక-39 | | ప్రతి శుక్రవారం

## కలుగవలసిన పరివర్తన

సత్వర రాష్ట్ర సిద్ధికోసం ఆంధ్రులు మద్రాసు నగరంపై తమకు గల హక్కును శాశ్వతంగా వదలుకోవాలనే డాక్టరు పట్టాభిగారి అమూల్యమైన సలహాలోని అంతరార్థాన్ని గుర్తించలేకపోయినా, అందులో గర్భితమై వున్న ప్రమాదాన్ని ఆంధ్ర ప్రజానీకం క్రమంగా గుర్తిస్తున్నది. గత సోమవారంనాడు విజయవాడలో సమావేశమైన ఆంధ్రా కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ సభ్యులు, అగ్రనాయకత్రయ నివేదికపై తమ అభిప్రాయాన్ని వివరిస్తూ, చెన్నపురిపై హక్కులు వదలుకోవాలని ఆంధ్రులకు సలహానివ్వడం సాధ్యంగా తాము భావించలేమని తీర్మానించారు.

రాష్ట్ర కాంగ్రెసు సంఘం కూడా సాహసించని సలహా యివ్వడానికి రాష్ట్రపతి పట్టాభి వెనుదీయలేదు: గత సోమవారంనాడు మద్రాసు ఆంధ్ర మహాసభలో జరిగిన బహిరంగసభలో ప్రసంగిస్తూ శ్రీ బులుసు సాంబమూర్తిగారు పట్టాభివాదాన్ని కపటవాదం అని నిర్వచించారు. స్వప్రయోజనాలను అన్వేషించే యే కొద్దిమందో మినహాయిస్తే, మద్రాసుపై గల హక్కును వదలుకోవడానికి ఆంధ్రుడెవడూ అంగీకరించడని ఆయన స్పష్టం చేశారు. ఈ పరిస్థితిలో ఆంధ్రదేశంలోని సమస్త ప్రజానీకం సభలూ సమావేశాలూ జరిపి తమ అభిప్రాయం విస్పష్టం చెయ్యవలసిన అవసరం ఎంతైనా ఉంది.

ఏ కారణాల ప్రోద్బలాన మద్రాసు వదలుకోమని సలహా యివ్వవలసి వచ్చిందో నేటికీ రాష్ట్రపతి స్పష్టం చెయ్యలేదు. ఆయన వాదనప్రకారం బొంబాయి పట్టణంలో. అధికసంఖ్యాకులు మహారాష్ట్రులయినప్పటికీ, వారికి ఆ పట్టణం చెందడంలేదు; అది ప్రత్యేకంగా చీఫ్ కమీషనర్ పరిపాలనక్రింద ఉంటుంది; అటువంటప్పుడు ఆంధ్రులు అధికసంఖ్యాకులు కాని మద్రాసు వారికెట్లా వస్తుంది? ఆ వాదన ప్రకారం మద్రాసు ప్రత్యేకంగా విడదీసి కేంద్ర ప్రభుత్వ పాలనకింద ఉంచాలి; లేదా, ఆంధ్ర తమిళ రాష్ట్రాలకు ఉమ్మడి రాజధానిగా ఉంచాలి. అంతేకాని అగ్రనాయకుల నిర్హేతుక చిత్తవృత్తి ననుసరించి మద్రాసు భవితవ్యం నిర్ణయించడానికి ఆపట్టణం ఏ ఒక్కరి స్వంతఆస్తి కాదు. ఆంధ్ర తమిళ కర్ణాటకులు, మళయాళీలు, కొందరు ఔత్తరాహులు ఇలా సంకీర్ణమైన జాతులు శతాబ్దానికి పైగా శ్రమించిన కృషి ఫలితమే నేటి

మద్రాసు. ఇంతకూ. ఏయే ప్రాంతాలు యెవరివో నిర్ణయించడానికి నిరాక్షేపణీయమైన మార్గం సరిహద్దు సంఘం నియమించడం సామ్యవాద సూత్రాలపై ప్రజాస్వామిక రాజ్యాంగం నిర్మించడానికి దీక్షవహించిన అగ్రనాయకులు ప్రజల అభిప్రాయం ఎటువంటిదో తెలుసుకోకుండా సరిహద్దులు ఏవిధంగా నిర్ణయిస్తారు?

రాష్ట్రనిర్మాణం సూత్రప్రాయంగా అంగీకరించిన తరవాత, అందుకు కావలసిన ఏర్పాట్లు చెయ్యడంలో అవసరమయిన దానికంటె క్షణమాత్రం ఎక్కువ ఆలస్యమయినా, పరిస్థితులు విపత్కరంగా పరిణమించడానికి ఎంత అవకాశం ఉందో, అగ్రనాయకులు యీపాటికే అనుభవంమీద తెలుసుకుని ఉండాలి. రాష్ట్ర విభజన జరిగేటప్పుడు ఉద్వేగాలకు తావులేకుండా, వారివారి సహజమైన, న్యాయమైన హక్కులకు భంగకరం కాకుండా చూడాలి. అందుకు స్థోమత, ప్రజానురాగం కల్గిన నాయకత్వం అవసరం. ప్రస్తుతం తమిళ, ఆంధ్ర ప్రదేశాలలోని నాయకత్వపు పోకడలు గమనిస్తున్న వారి కెవరికీ, వారి నాయకత్వం గురించిగాని, ప్రజలలో వారికిగల పలుకుబడి గురించి గాని, ఎట్టి భ్రాంతులూ లేవు ప్రజాహృదయాలకు ఏనాడో వారు దూరమైపోయారు. రాష్ట్రవిభజన ఆలస్యం అయిన కొద్దీ వీరి ముఠా రాజకీయాలలో సంచలనం, వ్యక్తిగతమైన ఒడంబడికలు, పోటీలు అధికమౌతాయి. దేశవిభజనే మూడు మాసాల్లో ముగిసినప్పుడు రాష్ట్ర నిర్మాణం సంవత్సరం పడుతుందని అనడం సరళమైన రాజనీతి కాదు. ఆంధ్రదేశానికే గనక నేడు బలీయమైన, ఐకమత్యంగల నాయకత్వమే ఉంటే, కనీసపు కోర్కె అయిన మన రాష్ట్ర వాంఛకి యిన్ని అభ్యంతరాలు, అవరోధాలు పరాభవాలు ఉండేవి కావు కాని దురదృష్టవశాత్తూ మన నాయకులలో అనేకులకి మూడుకోట్ల స్వజాతీయుల క్షేమంకంటె, స్వంత పదవులు భద్రంగా కాపాడుకోవడమే ఎక్కువ ముఖ్యమైంది ఆంధ్రేతరులెవరో మన అభివృద్ధికి అడ్డు తగులుతున్నారని వాపోవడం అవివేకం: మనకి ప్రాతినిధ్యం వహిస్తున్నామని ప్రగల్భాలుపలికే నాయకులే వారితో చేతులు కలుపుతున్నారు.

అందువలననే, నేడో రేపో ఆంధ్రరాష్ట్రం సిద్ధించినా, దాని సరిహద్దులు ఏ స్వరూపంలో నిర్ణయించినా, అంతటితో మన సమస్యలు హరించిపోవు అకస్మాత్తుగా ఆంధ్రదేశం భూతల స్వర్గంగా మారిపోదు. అసలు ఆంధ్రరాష్ట్రం దేని కొరకు? ప్రస్తుత నాయకుల భావనలో, కేవలం వారిలీలకొరకు. మరికొంతమందికి మంత్రి పదవులు లభించి. వారి అనుయాయులకు మనోవాంఛా ఫలసిద్ధిరస్తు అని దీవించడానికి నేడు మన రాష్ట్ర రాజకీయాలు తీవ్రమయిన పరివర్తన చెంది, నాయకత్వ స్వరూపమే మారవలసిన అవసరం ఎంతైనా ఉంది ప్రజలలో సంచలనం లేనిదే, వారినుండి ఒత్తిడి లేనిదే, ఏ నాయకత్వానికీ స్వచ్ఛందంగా మారే శక్తి ఉండదు.

# కామన్వెల్తులో ఇండియా ప్రాముఖ్యం



కామన్వెల్తు సమాలోచనలు అతి గోప్యంగా ఉంచబడి ఒక్క చిన్న వార్త అయినా బయటికి రాకపోయినా రాయిటరు వాళ్లూ, ఇతరవార్తా సంస్థలవాళ్లూ ఈ సమావేశాన్ని గురించి చాలా అట్టహాసాలు చేస్తున్నారు. 'సర్వస్వతంత్ర రిపబ్లికుగా ఉంటూకూడా ఇండియా కామన్వెల్తులో ఉండగలందులకు అనుకూలించేలాగా కామన్వెల్తును నిర్వచించటం ఒక్కటే ఈ సమాలోచనల ఉద్దేశం' అయితే ఈ గోప్యమంతా దేనికో మనం ఊహించలేం.

ఇతర కామన్వెల్తు రాజ్యాలతో సహకరించడం కోసమే ఇండియాకు ఈ సమాలోచనల్లో ఇంత ప్రాముఖ్యం ఇవ్వబడుతున్నదా? నిన్న కాక మొన్న స్వాతంత్ర్యం సంపాదించి ఇప్పటికీ దారిద్ర్యంలోనూ, నిరక్షరతలోనూ ఓలలాడే ఇండియా, ఇతర కామన్వెల్తు రాజ్యాలపై అనేక విషయాలలో ఆధారపడి ఉండటంలో వింత లేదు. కాని పారిశ్రామికంగానూ, ఆర్థికంగానూ ఎంతో ముందుకువచ్చి ఇండియాకు ఎన్నో విధాల సహాయం చేయగల కెనడా, ఆస్ట్రేలియా, న్యూజీలాండు, దక్షిణాఫ్రికాలవంటి దేశాలు ఇండియానుంచి కోరేదేమిటి? ఇండియాను కామన్వెల్తులో ఉంచగలందులకు వీరు కామన్వెల్తు నిర్వచనాన్ని కూడా మార్చటానికి ఎందుకు సిద్ధపడుతున్నారు?

ఇండియాకు స్వాతంత్ర్యంరాగానే ఇండియా మీద ఈ దేశాలకు అకస్మాత్తుగా ఎన్నడూ లేని గౌరవం పుట్టుకొచ్చిందా? ఇండియా నాయకత్వంలేంది ఒక్క అడుగు ముందుకు జరగలేమని వారు అనుకోవటం మొదలుపెట్టారా?

ఇది నమ్మదగిన విషయంకాదు. సోషలిస్టు నాయకుడు డాక్టరు రామమనోహరలోహియా ప్రకటించినట్లు విదేశంలోనూ ఇండియా ప్రజలపరపతి హెచ్చలేదు— మీదుమిక్కిలి చాలా క్షీణించింది. ఈ కామన్వెల్తు రాజ్యాలన్నీ జాత్యహంకారపూరితమైనవి. వీళ్ళ దృష్టిలో భారతీయులు హీనజాతికి చెందినవారు. వారి రాజకీయపరిభాష వేరు, మన రాజకీయపరిభాష వేరు. మనం రాజకీయాలలో నైతికదృష్టికి ప్రాధాన్యం ఇస్తాం. మనం సామ్రాజ్యవాదాన్నీ, పరపీడననూ సహించం. ఈ రెంటిలోనూ మిగిలిన కామన్వెల్తు రాజ్యాలవారు మనకు భిన్నంగా ఉన్నారు. శాంతీ, ఐక్యతా అనే పదాలుకూడా మనం వాడే అర్థంలో వారు వాడరు. ఈ పరిస్థితులలో ఇండియాకు కామన్వెల్తులో ప్రాముఖ్యం ఎందుకు వచ్చింది? ఈ ప్రశ్నకు మనం సరి అయిన సమాధానం తెలుసుకోవాలి.

పూర్వం బ్రిటను బలయుతమైన దేశమైతే ఆకాశం విరిగి నెత్తిని బడే పరిస్థితిలో మనం బ్రిటను అండను క్షేమంగా ఉండగలమనే ఉద్దేశంతో మనంతట మనమే కామన్వెల్తులో స్థానంకొరకు కేలుమోడ్చవచ్చు. కాని ఈనాడు బ్రిటను కలువంటి బలంలేదు. బ్రిటనే అమెరికా అండ జేరింది. 'బ్రిటను తన ప్రాణం దక్కించుకునే ప్రయత్నంలో ఉన్నది' అని రాయిస్టులు చెప్పినమాట ఋజువవుతూనే ఉంది. అట్లాంటిక్ వ్యూహంలో బ్రిటను ఒక తల దాచి ఉంది. పశ్చిమ రాజ్యాల యూనియనులో మరొక తల దాచి ఉంది. ఇప్పుడు బ్రిటిషు కామన్వెల్తులో మరొక తల దాచ జూస్తున్నది. ఈ మడతపేచీలన్నిటికి అర్థం ఏమిటోకూడా మనం తెలుసుకోవటం అవసరం. కామన్వెల్తు దేశాలకు పశ్చిమ యూరపు దేశాలు ఎటువంటి బంధువులు? పశ్చిమ యూరపు దేశాలకూ, కామన్వెల్తు దేశాలకూ కలిపి ఉత్తర అట్లాంటిక్ వ్యూహంతో గల బాంధవ్యం ఏమిటి? ఈ సంబంధాలన్నీ ఐక్యరాజ్య సమితితో ఏ విధంగా సమన్వయమవుతాయి?

కామన్వెల్తు రహస్యాన్ని కొంతవరకు రివ్యూ క్షనరీలు బయట పెడుతున్నట్లు కనిపిస్తోంది. ఈ మధ్య ఒక కన్సర్వేటివు పత్రిక లండను సమావేశం గురించి రాస్తూ, నెహ్రూ బుద్ధికలిగి ప్రవర్తించనట్లయితే ఇండియాకు కామన్వెల్తులో

స్థానం ఉందదనీ. అందువల్ల రష్యా దిగ్విజయం ఆరంభించినప్పుడు ఇండియా ఒంటరిదైపోతుందనీ బెదిరించింది. రష్యా జైత్రయాత్ర సాగిస్తే ఇండియాకు ప్రమాదం లేకుండా నలుగురు అదుకోవడం కామన్వెల్తు ఆశయమా? అందుకే ఇండియాను కామన్వెల్తులోకి ఆహ్వానిస్తున్నారా? చైనాలో కమ్యూనిజం విజయం పొందుతూంటే ఎవరూ ఆపలేకపోయారేం? ఆఖరుకు చంగ్ కై షేక్‌కు ఒక్క అణువు బాంబయినా ఇచ్చారు కాలేం?

ఇండియాను కమ్యూనిజంనుంచి రక్షించటం కూడా కామన్వెల్తు ఆశయంకాదని మనం రూఢి చేసుకోవచ్చు.

పోతే అమెరికా బ్రిటనుల దృష్టిలో ఇండియాకు ఒక్క ఆకర్షణే ఉంది. ఆగ్నేయాసియా దూరప్రాచ్యాలలో కమ్యూనిస్టు ఉద్ధృతం లేని గొప్పదేశం ఇండియా ఒకటే. ఏదేశంలోనైనా కమ్యూనిస్టులు అల్పసంఖ్యాకులుగానే ఉంటారు. కాని, ఇతరదేశాలలో వాళ్ళకి కర్షక కార్మికులలోనూ, మేధావులలోనూ కూడా పలుకుబడి ఉండి విప్లవచర్యలు సాగిస్తున్నారు. ఇక్కడ. ఇండియాలో అది అంతగా కనిపించటం లేదు. కమ్యూనిస్టు వ్యతిరేక వ్యూహంలో ఇండియా చేరటానికి సమ్మతించే యెడల కామన్వెల్తు రాజ్యాలు ఇండియాను ఆహ్వానించటంలో ఆశ్చర్యంలేదు. దక్షిణాఫ్రికా, ఆస్ట్రేలియాల జాత్యహంకారాన్నీ, బ్రిటను ఈనాటికీ వదలలేకుండా ఉన్న డచ్చి వగైరాల సామ్రాజ్యవాదాన్నీ కూడా సహించి నెహ్రూ పటేలులు కామన్వెల్తులో ఉండ।నిశ్చయించితే ఇండియా ప్రజలు వారి మాట కాదనరు.

ఇప్పటిధోరణిలో కాంగ్రెసు ప్రభుత్వం కమ్యూనిజముకు అనుకూలవైఖరి అవలంబిస్తుందనేది కల్లోమాట. కనుక ఇండియా కమ్యూనిస్టు వ్యతిరేకవ్యూహాల్లో చేరినా ఇబ్బందిలేదు. ఎటూ చేరకుండా తటస్థంగా ఏకాకిగా ఉండి ఇండియా సాధించగలిగే లాభా లేమీలేవు, నష్టాలుంటే ఉండవచ్చును. కామన్వెల్తులో చేర నిరాకరించిన మాత్రాన ఇండియాకు లాభం ఉంటుందని సోషలిస్టులు భావించేటట్టు కనిపిస్తుంది. కాని ఆ లాభాలు వాళ్లు స్పష్టం చేయటంలేదు.

ఒకవేళ పెట్టుబడిదారీ దేశాలు ఇండియాను కమ్యూనిస్టు దేశాలపైకి యుద్ధానికి లాగితే ఆ నాటికి నెహ్రూ పటేలుగార్ల నిర్ణయాలు మారవని చెప్పటానికిలేదు; ఒకవేళ వాటిని ప్రజలే శిరసావహించటం జరిగేపక్షంలో ఇవాళ ఇండియా కామన్వెల్తులో చేరటంవల్ల ఇబ్బంది లేనేలేదు.

ఒక్క కామన్వెల్తులోనే కాదు, అట్లాంటిక వ్యూహంలోగాని, పశ్చిమ రాజ్యాలలో గాని కమ్యూనిజముపై యుద్ధం సాగించే నిర్ణయం జరిగితే ఈ సమాఖ్యలు ఎందుకూ కొరగావు. ప్రతిదేశంలోనూ అంతర్యుద్ధం వచ్చి తీరుతుంది. అందుకని, ఇండియా కామన్వెల్తులో చేరరాదనే అభిప్రాయం కలవాళ్ళందరూ, కామన్వెల్తులో చేర నిరాకరించే పక్షంలో ఇండియా తన వైఖరిలో కలిగించుకోవలసిన బ్రహ్మాండమైన మార్పులను గురించి ఆలోచించాలి.

ఆఫ్రికాలో ఒక పట్టణంలో ఎన్నికలకు నించున్న నీగ్రో అభ్యర్థి ఒకడు తన జాతివారి ఓట్ల కోసమని ప్రచారానికి వెళ్ళాడు. ప్రచారం చక్కగా పనిచెయ్యడానికిగాను, అందరికీ తలొక చెప్పుజోడూ పంచిపెట్టి, "నన్ను మీరంతా ఎన్నుకున్నాక, తక్కిన జోడు యిస్తాను" అన్నాడు. ఎన్నికలో ఆతనికి అఖండమైన విజయం లభించింది.

# "గణితం అధికాహారోత్పత్తి చెయ్యదు"

రావెళ్ళ హనుమంతరావు

ఈ రోజున మన ఆహారసమస్య విషమంగావుంది. అనేక రాష్ట్రాల్లో, సంస్థానాల్లో లక్షలు కొలది ప్రజలు తినటానికి సరిపడినంత తిండి దొరకక నానా బాధలు పడుతున్నారు.

ఈ పరిస్థితినుండి ప్రజలను కాపాడడానికి ప్రభుత్వం అనేక ప్లానులు వేస్తోంది. మార్గాలనన్వేషించుతోంది. ఇతర దేశాలనుండి ఆహార పదార్థాలు దిగుమతి చేసుకోవడానికి ప్రయత్నించుతోంది. దేశంలోనే అధికంగా పంటలు పండించడానికి ప్లానులు వేస్తోంది. దీనికే మనదేశంలోవున్న రాష్ట్రాలు, సంస్థానాలు ప్రభుత్వాలలో పనిజేస్తూన్న ఆహారశాఖామంత్రులు ఢిల్లీలో సమావేశమయ్యారు. వివిధ విషయాలు చర్చించారు. బాగోగులు పరిశీలించి—కష్ట సుఖాలు గ్రహించి ఏ విధంగా పనిజేయాలో నిర్ణయించుకున్నారు. ఎంత ధనం ఖర్చుపెట్టాలో నిర్ణయించుకున్నారు. ముందు ఏ పనులు పూర్తిజేయాలో నిర్ధారణ జేసుకున్నారు. తీర్మానాలు వ్రాశారు. ఉపన్యాసాలు చెప్పారు. పత్రికల్లో ప్లానులు వివరాలతో సహా ప్రకటించారు. ఈ నిర్ణయం ప్రకారం 1951 నాటికి మనదేశం స్వయంపోషక మౌతుంది. మన ప్రజలకు తినటానికి సరిపడినంత తిండి లభించుతుంది. ఆకలి మంటలు— వాటిద్వారా వచ్చే అంటురోగాలు మనదేశం నుండి తొలగిపోతాయి. ఇండియా మొత్తం మీద చేయబడిన యీ నిర్ణయంలో మన రాష్ట్రం కూడావుంది. మామూలుగా ఉండటమేగాక ముందు భాగాన్నేవుంది.

ఆహారపదార్థాల నధికంగా పండించడానికి, మన రాష్ట్రానికి సంబంధించినంతవరకు తీసుకోబడిన నిర్ణయాలు, చేయదగినవిగా నిశ్చయించిన విధానాలు ఆకర్షవంతంగా వున్నాయి. అవి అన్నిటికంటె ముందుగానే కేంద్రప్రభుత్వ ఆహార శాఖామంత్రి జయరామదాసు దౌలత్ రామ్ గారి ఆశీర్వచనాలను కూడా సంపాదించుకున్నాయి.

చెరువులు మరమ్మతు చేయాలనీ, చెరువుల్లో నీరు ఇంకనూ అధికంగా నిలబెట్టాలనీ, చెరువుల క్రింద సాగవుతూన్న భూములకు నీరు సకాలంలో సరిపడినంతగా సప్లయిజేయాలనీ, ఇంకనూ అధికంగా భూమిని చెరువులక్రింద సాగులోకి తీసుకరావాలనీ, ఇందుకుగాను 18 కోట్లు రూపాయలు అదనంగా ఖర్చుపెట్టాలనీ, ఈవిధంగా ఇంతధనం ఖర్చుపెడితే 26000 చెరువులు మరమ్మత్తు చేయించవచ్చుననీ, తద్వారా 50 లక్షల యకరాల భూమిని అధికంగా సాగులోకి తీసుకురాగలమనీ, యకరానికి అరటన్ను పంట అంచనావేసినా 25 లక్షల టన్నులు అధికంగా పండించగలమనీ, రాగల మూడు సంవత్సరాలలో ఈ పని జేయటంవలన ఆహార సమస్య మన రాష్ట్రానికి సంబంధించినంతవరకే గాక, దేశానికి సంబంధించినదాంట్లో కూడా కొంతవరకు మన రాష్ట్రముద్వారా తగ్గించడానికి వీలుంటుందని అన్నారు.

తరువాత వ్యవసాయపు పనులకోసం రైతుకు కావలసిన ఇనుము- ఉక్కు- సిమెంటు- ఇటుకరాళ్లు వగైరాలను సప్లయి జేయటానికిగాను కేంద్రప్రభుత్వం వ్యవసాయశాఖలో ఒక ప్రత్యేకాధికారిని నియమించాలని, అతను ఎప్పటికప్పుడు రాష్ట్రప్రభుత్వాల అవసరాలను స్వయంగా పరిశీలించి ఆ రాష్ట్రంలోని రైతులకు కావలసిన ఇనుము- ఉక్కు వగైరా సామగ్రిలను వెంటనే సప్లయిజేయగల యేర్పాట్లు జేయాలని తీర్మానించారు.

ఆహార ధాన్యాలను ఎక్కువగా పండించడానికి; పండించేటట్లుగా వ్యవసాయదారులను ప్రోత్సహించడానికిగాను అప్పుడప్పుడు రైతుల్లో పోటీలు యేర్పరచి అధికంగా పండించేవారికి బహుమానాలు ఇస్తూండాలని, అభివృద్ధికరమైనవి, ఆచరించుటకు వీలైనవి అయిన క్రొత్త

కొత్త వ్యవసాయపద్ధతులను ప్రదర్శించి చూపుతూ రైతులకు నూతనమార్గాలను బోధించాలని కూడా అన్నారు.

దేశంలోనున్న మ్యునిసిపాలిటీలన్నీ 'కంపోస్టు' ఎరువులు తయారుచేయాలని, ఇందువలన మ్యునిసిపాలిటీలకు నష్టం సంభవించితే ఆ నష్టాన్ని ప్రభుత్వమే భరించాలని, మరోనిర్ణయం జేశారు.

పంటలకు అవసరమైన 'భాస్వరపుటెరువులను' సగం ధరకే రైతుకు సప్లయి జేయాలని, మిగతా సగం ఖర్చు రాష్ట్ర—కేంద్ర ప్రభుత్వాలు భరించాలని, ఎరువులు పంపకం ఆహార ధాన్యాలు పండించే ప్రాంతాలలోనే జరిగేట్లు చూడాలని, పైరులకువేయవలసిన తరుణంలోనే యీ ఎరువులు అందించే యేర్పాట్లు చేయాలని తీర్మానించారు.

ప్రభుత్వం ఇదివరకు అనేకసార్లు ఇలాంటి ప్రకటనలు చేసింది; ప్లానులువేసి ప్రజలకు చూపింది. వాటిని ఆచరణలోపెట్టవలసివచ్చేసరికి పరిస్థితులు యథాప్రకారంగానే జరిగిపోయాయి; అప్పుడప్పుడు, అక్కడక్కడ మరింత విషమ దశలోకికూడా వెళ్లాయి.

అలాంటిదే ఇప్పుడుకూడా జరగదని చెప్పడానికి అవకాశాలు లేవు. మళ్లీ ఆచరణలో పెట్టవలసి వచ్చేసరికి యీ నాడు చేయబడిన నిర్ణయాలను గూడా బుట్ట దాఖలు చేయడానికే తగిన అవకాశాలున్నాయనటానికి ఎట్టి సందేహం లేదు. మొన్నటి సమావేశంలో జరిగిన చర్చలు-ప్రశ్నలు, సమాధానాలు చూస్తేనూ, వారు ప్రకటించిన లెక్కలు జూస్తేనూ ఇది స్పష్టంగా అర్థమౌతుంది.

మద్రాసు రాష్ట్రంలో గల 26 వేల చెరువులను మరమ్మతు చేయాలంటే షుమారు 20 కోట్ల రూపాయలు ఖర్చవుతుంది. అందులో సగభాగం ఖర్చులు కేంద్ర ప్రభుత్వం భరించాలని రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వాన్ని కోరింది. దీనికి కేంద్రప్రభుత్వ మంగీకరించలేదని, ప్రస్తుతం యీ విషయంలో కేంద్రప్రభుత్వము ఎలాంటి సహాయం జేయటానికి సంసిద్ధంగాలేదని, కొంత పని జరిగిన తరువాత-కొంతకాలము గడిచిన పిమ్మట; రాష్ట్రప్రభుత్వము, కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ (అప్పుకో, సహాయానికో!) దరఖాస్తు పెట్టుకుంటే అప్పుడు కేంద్రప్రభుత్వం ఏదో ఆలోచించి తన కిష్టమొచ్చినట్లు అప్పుడే జేస్తుందిగాని, ఇప్పుడేమీ నిర్ధారణగా చెప్పలేదని మద్రాసు వ్యవసాయశాఖా డైరెక్టరు శ్రీ ఆర్. యమ్. సుందరంగారు పత్రికా విలేఖరులతో మాట్లాడుతూ చల్లగా బయట పెట్టారు.

అప్పుడిక రాష్ట్రప్రభుత్వ మేమిచేస్తుంది! కేంద్రప్రభుత్వం ఏవిధంగానూ సహాయం చేయటంలేదు. ఈపని కవసరమైన పెట్టుబడి అంతా ఒక రాష్ట్రప్రభుత్వమే భరించాలంటే సాధ్యం గాదు కనుక మమ్ముల నేమి చేయమంటారని చెప్పుతూ కాలం గడిపేస్తుంది; లేదా-ఏదో పని చేయబోతూన్నట్లుగా ప్రకటనలుచేస్తూ-ప్లానులు వేస్తూ ఉంటుంది. మొత్తంమీద జరిగే ఫలితం మాత్రము ప్రజలక్కి, పత్రికల్లోవచ్చే ప్రకటనలు చూసి కడుపు నింపుకోవలసిందే.

ఇటువంటిదే మరొకటివున్నది. అదివ్యవసాయపు పనిముట్లకు సంబంధించిన విషయము. ఈ సమావేశంలో మన రాష్ట్రానికి మూడునెలల కొక సారి 15 వేల టన్నుల ఇనుము- ఉక్కు కావలసి వుంటుందని, ఇంత ఇనుము-ఉక్కు అందితే రైతుల కవసరమైన వ్యవసాయపనిముట్ల కొరత తీరిపోతుందని నిర్ణయించేశారు. ఇటువంటి నిర్ణయాలు ఇదివరకు చాలాసార్లు జరిగాయి.

ఈ సంవత్సరం మార్చి ఆఖరు నాటికి మన రాష్ట్రానికి సప్లయి జేయబడిన ఇనుము-ఉక్కు 360 టన్నులు మాత్రమే. జూన్ నాటికి ఎంత ఇస్తారో ఇంకా తెలియలేదు. కాని అదికూడా వందల పరిమాణంలోనే వుంటుంది. పోతే సెప్టెంబరుతో అంతమయ్యే మూడు మాసాలకు 4 వేల టన్నులు మాత్రం సప్లయి జేస్తారు.

ఇటువంటప్పుడు దీనికిగాను ప్రత్యేకంగా ఒక ఉద్యోగిని నియమించినంతమాత్రం వచ్చే లాభ మేమి వుంటుంది? రైతులకు, ప్రజలకు కలిసివచ్చే అధిక సౌకర్యాలేమి వుంటాయి? ఏమీ వుండవని వేరేచెప్ప నవసరంలేదు.

# హేతువాద పరామర్శ

ఒకప్పుడు బహుళసంఖ్యాకుల్ని ఆకర్షించగలిగిన హేతువాదాత్మక మైన ఆదర్శాలు నేడు కొరగానివై పోయాయి. హేతువాదంద్వారా పురోభివృద్ధి సాధించవచ్చునన్న ఆలోచనతో పదునెనిమిదవ శతాబ్దంలో వెల్లుబికిన నైతికోత్సాహం అంతరించిపోయింది; సామంజస్యంకంటే ఎంతో బలీయంగా కనిపించే ఆటంకాలను ఎదుర్కొందికూడ. భయసంబంధమైన పరిభాషలోతప్ప, హేతువాదపరంగా పురోభివృద్ధినిగురించి చింతించడం మానుకున్నాం మనం; భయంమూలంగా హేతువాదం నీరసమైన, ఆచరణ నిరుపయోగమైన విధానంగా దిగనారి ఊరుకుంది. దీనికి పరిష్కార మార్గమేమిటి?

మానవసంఘు సమస్యల్ని హేతువాద దృష్టితో పరిశీలించడం నేడు సర్వత్రా మూల బడినమాట వాస్తవం. దీనిని విశదీకరించవలసిన అవసరం ఉంది. ఈ విషయమై సందేహమేమీ లేదు. ప్రపంచ జాతులూ, రాజ్యాలు హేతువాద బోధ నెంతమాత్రం పట్టించుకోడం లేదు. ఉదాహరణకి, ఇప్పుడు అగ్రరాజ్యాలు అనుసరిస్తున్న మార్గం అనివార్యంగా యుద్ధానికి దారితీస్తుందని మనలోని ఉత్తమ ధీమంతులు ఎన్నిమార్లో హెచ్చరించి ఉన్నారు. గత కాలంలో, సైనిక సన్నాహ విధాన మెప్పుడూ యుద్ధాన్ని తీసుకు రాకుండా ఉండలేదు; ఇప్పటి జాతీయవిధానాలు చూస్తూంటే, యివి గడచినదానికంటె దారుణమైన విధ్వంసాన్ని కలిగించే యింకొక యుద్ధాన్ని తెచ్చి పెట్టగలవని న్యాయంగా అనుకోవలసి వస్తోంది. కాని యీ హేతువాద పరిశీలన మన మనసు కెక్కలేదు. మనము యుద్ధ సన్నాహాలు కొనసాగిస్తూనే ఉన్నాం. యాటం బాంబునుంచి తలదాచుకొనేమార్గం ఏదీ లేదనీ; మనం బాంబులులేని ప్రపంచాన్ని రూపొందించుకో గలిగితే తప్ప, చివరికి ప్రపంచమే లేకుండా పోగలదనీ పదార్థ విజ్ఞాన శాస్త్రజ్ఞులు మనల్ని ప్రబోధించారు కూడా. ఇదీ మన మనసు కెక్కలేదు. యాటంబాంబులు గుట్టగా చేరవేస్తూనే ఉన్నాం. గడచిన కొద్ది సంవత్సరాల్లోను, హేతువాదం ఆధారంగా తయారు చేసిన ఆదర్శాత్మక పథకాలు వందలకొద్దీ ప్రపంచానికి సమర్పించడం జరిగింది. వాటిని లెక్క చేసిన వారొక్కరూ లేరు.

హేతువాదం ఆధునికుల మనస్సును ఆకర్షింపలేకుండా ఉందనడంవల్ల, మానవసంఘం ప్రవర్తన ఒకప్పుడు వివేచనాత్మకంగా ఉండేదనీ, యిప్పుడు ఉండడం మానిందనీ అనుకోనక్కర లేదు. విషయమేమిటంటే - హేతువాదం మీద ఆధారపడిన ఆదర్శాలు ఒకప్పుడు బహుళసంఖ్యాకుల్ని ఆకర్షించగల శక్తిగలిగి ఉండి, యిప్పుడలా చెయ్యలేక పోతున్నాయి. హేతువాదంద్వారా అభ్యుదయం అందుకోవచ్చునన్న ఆలోచన వల్ల పదునెనిమిదవ శతాబ్దంలో వెల్లుబికిన నైతికోత్సాహం అడుగంటిపోయింది. అది వివేకం కంటె అన్ని విధాలా ఎన్నోరెట్లు బలీయంగా కనిపించే అవరోధాలను ఎదుర్కొంది కూడా. భయసంబంధమైన పరిభాషలోతప్ప హేతువాద పరంగా అభ్యుదయాన్ని గురించి ఆలోచించడం మనం మానుకున్నాం; భయంమూలంగా వివేచనాత్మక దృష్టివాదం ఆచరణ యోగ్యంకాని దుర్బలమైన సూత్రీకరణంగా దిగనారి వూరుకుంటుంది. టూకీగా చెప్పాలంటే - నిర్మాణాత్మక మానవసంఘ జీవితానికి సంబంధించిన అతి ప్రధానమైన సామర్థ్యము - మానవసంఘ సంబంధ

బాంధవ్యాలకి సంబంధించిన సమస్యలు వివేచనతో పరిశీలించాలనే సంకల్పము - కోల్పోయి మనం బాధపడుతున్నాం.

## చారిత్రక సమీక్ష

ఈ సందర్భంలో - వివేచనాత్మక దృష్టికీ, వివేచనశూన్యదృష్టికీ సంబంధించిన మానవుని చైతన్యం ఏవిధంగా పరిణతి పొందిందో చారిత్రకంగా సమీక్షించడంవల్ల లాభం వుండగలదు. పదునెనిమిదవ శతాబ్దంవరకు, రసవాదులవంటి కొన్ని వర్గాల అధునాతన భావాలు మినహాయిస్తే, మత సంబంధమైన పారిభాషిక పదాల పరంగా మానవస్వభావాన్ని సమాలోచించడం జరిగింది. పవిత్రాత్ములకు పాపాత్ములకు ఉత్తర దక్షిణ ధ్రువాలంత తేడా: మోక్షలబ్ధి, నరకప్రాప్తి జీవిత ముఖ్యవిధానాలు. ఆ తరవాత, ఆధునిక శాస్త్ర విజ్ఞాన విచారం ఆరంభం కావడంతో కలిగిన మనోవికాసంతో మానవుడు వివేచనాపరుడన్న భావన క్రమక్రమంగా ప్రపంచామోదం పొందింది. రెండు మూడు సహస్రాలపాటు వివేచనశక్తిని దేవతలా పూజించిన ఫ్రెంచి రివొల్యూషన్ సమయంలో యీ పరిణామం ఉచ్ఛస్థితి నందుకుంది. ఈ పదునెనిమిదవ శతాబ్దపు ఆశావాదం, పందొమ్మిదవ శతాబ్దమంతా వ్యాపించి-ఇరవైయో శతబ్దాంలో ప్రవేశించింది. ప్రపంచ పురోభివృద్ధి కెంతో తోడ్పడింది. అనాటితో ప్రపంచ చరిత్ర, మానవ మనస్తత్వ శాస్త్రము - రెండూ మానవ స్వభావంలో ఉన్న వివేకరాహిత్య తత్త్వపు అపారశక్తిని బహిర్గతం చేశాయి. ఇందులో అసందర్భమేమీ లేదు. వివేకం భర్జించలేని డల్లా గాఢప్రదం, వివేచనప్రేరితం అయిన జీవన ప్రాంగణం అడుగున లోతుల్లో భావోద్రేకపు అగ్నిగోళంగా మారుతుందని ఫ్రాయిడ్ విశదం చేశాడు. సొంతకాలానికి దేశాలు దేశాలే యిప్పుడు హేతువాద సంప్రదాయంగా పరిగణిస్తోన్న దానిని భీభత్సమైన ఏహ్యభావంతో తోసిపుచ్చాయి. హేతువాదానికి చెందిన రాజకీయ సిద్ధాంతాలలో న్యాయతః ఉన్న లోటులను బట్టబయలుచేసి, వాటిని కొత్తగా బయలుదేరిన వివేచనశూన్యవాదానికి చెందిన అనాగరికమైన యుద్ధ నినాదాలలోకి మార్చారు; మానవుల అసమత్వాన్ని క్రమసిద్ధమైన అమానుషత్వానికి ప్రాతిపదికగా ఉద్ఘోషించారు; వివేచనకాదు, రక్తం మానవ లక్ష్యాలను వెల్లడిచేస్తుందన్నారు; పాక్షికోద్రేకమైన జాతీయతత్వం ప్రతి అన్యాయానికీ మందు అయింది. ఒక అర్ధ శతాబ్దంలో - ఆశాపూర్ణము, వివేచనా మహితము, అభ్యుదయాత్మకము అయిన ప్రపంచము నిరాశోపహతులై, నరాల పటుత్వం కోల్పోయిన మనుష్యులు, రాజ్యాలు ఉండే విశాల చికిత్సాగారంగా పరివర్తన చెందింది. మన కర్థంకాని యీ దుర్లక్షణం ప్రపంచమంతటా స్వైరవిహారం చేస్తోంది, మానవుల వివేచనాప్రేరితాలైన ఆశలను మాడ్చివేసే భీతిని ప్రతిదినం కొత్తగా కల్పిస్తోంది, అంతకంతకు వారిని భద్రతా భావం కోసమని వివేచన లేని భావోద్రేకతత్వం పెంపొందించుకునేటట్టు చేస్తోంది. మన తత్వరీత్యా చూస్తే, ఏ మనిషయినా ఒక మూఢమతం చేపడితే గాని, సైన్యంలో జేరితేగాని ఏం జరుగుతుందో అదే జరిగింది: ఆనాటికానాడు మాధ్యం పెరిగిపోతూ, స్పష్టంగా న్యాయవిదూరమైన ప్రపంచంలో న్యాయంకోసము, సత్యంకోసము వెదకి విభ్రాంతి లోనయిన బలులు—'దేవుడు నన్ను కాపాడుతాడు' లేక 'నా దేశం-తప్పో, ఒప్పో' అనే మనస్తత్వం అయింది.

## యు. యన్. అసెంబ్లి హాగ్వివాదం

ఐక్యరాజ్యసమితి (అసెంబ్లి) తన సమాలోచనలకు సర్వసభ్య సమ్మతమైన తాత్విక ప్రాతిపదిక నొకదానిని కనుగొనడానికి చేసిన విభ్రాంత ప్రయత్నాలలో పైసమస్య సిద్ధాంతాల స్థాయిని ప్రస్ఫుటంగా చాటుతుంది. సమితి నిర్మాణపురోజులలో, అమెరికా ప్రభుత్వ కార్యదర్శి 'ఒకనిమిషం పాటు నిశ్శబ్దంగా, గంభీరంగా ధ్యానంచెయ్యడంతో' అంతర్జాతీయసంస్థకు సంబంధించిన సమావేశాన్ని ప్రారంభించిన సందర్భాన్ని ఈ సమస్య శాన్ ఫ్రాన్సిస్కోలో తొలిసారిగా ఉదయించింది. అప్పటినుంచీ, వికలస్వాంతులైన మతాభినివేశపరులు ఐక్యరాజ్యసమితి భగవంతుని అస్తిత్వాన్ని గుర్తించకుండా ఉండరాదని పట్టు

బడుతూ వస్తున్నారు. 'సమితి భగవంతుని ధ్యాస లేకుండా లేదు, సమితి సమావేశాలు భగవత్ప్రార్థనతో ప్రారంభించకపోడానికి కారణం స్వయం సంపూర్ణ భావం కాదు' అని విశదీకరిస్తూ సమితి కార్యాలయం మర్యాదపూర్వకంగా ఉత్తరాలు వ్రాయవలసి వచ్చింది. మానవస్వత్వాల ముసాయిదా ప్రస్తావనలో 'మానవస్వత్వాలకేకాక సకలవిధస్వత్వాలకు మూలకందమైన భగవంతుని ప్రశంస' ఉండాలని ఒక కేథలిక్ ప్రతినిధి కోరాడు. ఆ ప్రస్తావనలో 'మతధర్మ విషయక మైన ప్రశంస, కొన్ని ప్రతినిధివర్గాలకు అంగీకారయోగ్యంకాదు కాబట్టి ఉండరా'దని సోవియట్ ప్రతినిధి పైదానికి సమాధానమిచ్చాడు. చివరికి, పారిస్‌లో జరిగిన అసెంబ్లీ సమావేశంలో పి. సి. చాంగ్ (చైనా) ఉభయపక్షాలనీ సమాధానపరచడానికి ప్రయత్నించాడు.

## డా॥ చాంగ్ రాజీమార్గం

ఆయన (డా॥ చాంగ్) పై వ్రాతమూలక ప్రకటనను పదునెనిమిదవ శతాబ్దపు తత్వజిజ్ఞాసను అనుసరించి చూడవలసిందిగా అర్థించాడు. 'మానవుడు చాలావరకు జంతుప్రాయుండే అయినప్పటికీ, అతనిలో తనను జంతువులనుంచి వేరుపరిచే ఒక భాగం ఉండటంవల్ల. మానవుడు స్వతస్సిద్ధంగా సౌజన్యం కలవాడని ఆ తత్వజిజ్ఞాస విశ్వసించింది; అభాగమే నిజమైన మానవుడు: సౌజన్యం కలది; అందుచేత ఆ భాగానికే ప్రాముఖ్యం యివ్వాలి.' 'సుజనత్వమే మానవుని ప్రధాన స్వభావమన్న పదునెనిమిదవ శతాబ్దపు భావానికీ, భగవంతుడు అన్నీ ఆనేదానిని ప్రసాదిస్తాడన్న భావానికీ మధ్య పరస్పరవైరుధ్యంలేదు; ఎందుచేతనంటే- దైవానికిసంబంధించిన భావన మానవ స్వభావంలోని జంతుభాగానికి కంటె, మనుష్య భాగానికే ప్రత్యేక ప్రాముఖ్యం యిచ్చింది.' అని డా॥ చాంగ్ వాదించాడు. 'భగవంతునిలో నమ్మకమున్నవారు బలీయమైన ఆ ప్రస్తావనో ద్ఘాటనలోనే ధ్వనిగా సూచితమైన భగవంతుని ప్రశంసతో తృప్తిపడవచ్చు; విభిన్న భావనలున్న యితరులకు ఆ ప్రస్తావన పాఠాన్ని ఆమోదించడానికి అభ్యంతరం ఉండనక్కరలేదు.' అని ఆయన అభిప్రాయపడ్డాడు. (న్యూయార్క్ హెరాల్డు ట్రిబ్యూన్, అక్టోబరు 28,1948.)

## మానసిక పరిణామాల ఉపేక్ష

మానవసత్వాల ప్రకటనపత్రంలోని ప్రస్తావనపాఠం విషయమై ఏకాభిప్రాయం కుదరడానికి జరిగే అటువంటి ప్రయత్నాలు చూసి, ఏదో తాటాపూటంజేసి తప్పించుకో జూసే ప్రయత్నాలేగాని- యుద్ధరహితమైన ప్రపంచ పరిస్థితుల సంస్థాపనకు సంబంధించిన ప్రధాన సమస్యను పరిష్కరించడానికేమీ తోడ్పడేవి కావని పరిశీలకులు బహుశా భావిస్తారు. అయినప్పటికీ దేవుని అస్తిత్వానికి, మానవుని నైజానికి సంబంధించిన ప్రశ్నలు మానవుల కార్యాలను ప్రేరేపించే కారణాలకు మూలాధారాలు. పదునెనిమిదవ శతాబ్దపుస్థాయినే వాదన ఇంకా సాగుతున్నదని గుర్తించాలి: క్రైస్తవులు భగవంతునికి అనుకూలురు; నాస్తికులు భగవంతునికి ప్రతికూలురు; తాత్విక హేతువాదులు మానవ సహజ సౌజన్యంలో నమ్మకమున్నవారు. నాస్తికవిశ్వాసాలవల్ల మనోతత్వాల్లో కలిగే పరిణామాలను గాని, మానవుని సుజనత్వంవల్లగాక మితిమీరిన దుర్జనత్వం ఫలితంగా ఐక్యరాజ్యసమితి ఏర్పడిందన్న విషయాన్నిగాని పరిగణించడం జరగలేదు. అంటే- అసెంబ్లీ చర్చించిన విషయాలు పదునెనిమిదవ శతాబ్దంలో వాస్తవసమస్యలే గాని, నేడవి కేవలం అప్రధానవిషయాలు. సమకాలికమైన ప్రాతిపదిక సమస్యలను యీవిధంగా సన్నసన్నగా త్రోసిపుచ్చడం అఖిల మానవకోటి పెట్టుకున్న ప్రగాఢమైన ఆశలపట్ల అపచారం చెయ్యడమే అవుతుంది. ఐక్యరాజ్య సమితి ప్రతినిధులకు పదునెనిమిదవ శతాబ్దపు రాజ్యాంగనిర్మాతల కున్నటువంటి మహోద్దేశమే ఉన్నట్టయితే, మానవస్వత్వాల ప్రకటన పత్రంలోని ప్రస్తావనవిషయమై హేతువాద ప్రధానతత్వానికీ, ఆస్తికత్వానికీ, నాస్తికత్వానికీ మధ్య సున్నితమైన దార్శనిక సమాధానంకోసం ప్రయత్నించడానికి బదులు, వారు నేటి ప్రాతిపదిక సమస్యల నెదుర్కొని, వాటికి ప్రాతిపదిక పరిష్కారాలు సమకూర్చడానికి ప్రయత్నించాలి.

## భీతికి మూలకారణ మేమిటి?

వారు మొదట మానవజాతిని ఆందోళన పరుస్తున్న భయానికి మూలకారణాలు విశా

రించాలి. ఈ భయమే వివేచనాత్మక దృక్పథాన్ని నిర్వీర్యము, నిష్ఫలము చేసి పూరుకుంది. నిలకడైన శాంతి లభిస్తుందని ఆశపెట్టుకోడానికి లేశమైనా ఆస్కారం ఉండాలంటే, ముందు యీ భయాన్ని లొంగదీసుకోవాలి. పదునెనిమిదవ శతాబ్దపు తాత్వికులు వివేచనాత్మక దృష్టి మహత్యాన్ని గ్రహింపగలిగినట్టే, ఇరవైయో శతాబ్దపు మనస్తత్వశాస్త్రజ్ఞులు వివేచన రాహిత్యానికి మూలకారణాలను కనిపెట్టగలిగి ఉండాలి; సమితి రాజ్యతంత్రజ్ఞులతో సహా తక్కిన ప్రపంచమంతా వారు చెప్పినదానిని వినిపించుకోడానికి సుముఖంగా ఉండాలి. కొందరు మనస్తత్వజ్ఞు లప్పుడే ప్రాథమిక నివేదికలు తయారుచేశారు: వాటిప్రకారం, మానవుని సహజ కాలుష్యంవంటి కొన్ని మతసిద్ధాంతాల కారణంగా పాశ్చాత్యజాతుల్లో అధిక సంఖ్యాకులలో ఆత్మనిరసనభావం పాతుకుపోయింది; యీ భావానికి ఫలితంగా తెంపులేని యుద్ధాలకు దారితీసే ఆందోళనస్థితులు, ఆత్మసమర్థన ఉత్పన్నమయాయి. అధికారపూర్వకమైన మత సిద్ధాంతాలవల్ల కలిగే దుష్పరిణామాలను గూర్చి పదునెనిమిదవ శతాబ్దంలో చేసిన నిశ్చయాలకంటె పైనివేదికలు చాలా ముందుకు వెళ్ళాయని చెప్పాలి. విప్లవకాలానికి ముందున్న నిరీశ్వర వాదులు లోకవ్యవహారదృష్టితో మాత్రమే మతవిమర్శనం చేశారు. మతాధికార ప్రభుత్వాధికారాలమధ్య మిత్రత్వాన్నీ, అంతులేని మతయుద్ధాలవల్ల కలిగిన వర్ణనాతీతమైన దురవస్థనూ వారు కనుగొన్నారు. వారు దార్శనిక విమర్శకులుగాని, అగాధ మనస్తత్వశాస్త్రజ్ఞులు గాని కారు. రాజుల కంటకపాలననీ, మతాచార్యుల కాపట్యాన్నీ అసహ్యించుకుని, తత్ఫలితంగా వారు ప్రజాస్వామికవాదులు, నాస్తికులు అయారు. డా॥ చాంగ్ పునరుద్ఘాటించిన పదునెనిమిదవ శతాబ్దపు విశ్వాసం వీరి మతం మీది దాడికి ఫలితం.

### మనస్తత్వజ్ఞుల కృషి

నేటికాలపు మానసశాస్త్రజ్ఞులు మానవమనస్తత్వపు లోతులు పరిశోధించారు. వీరి ప్రకారం చెడుగుకంతకీ కారణం మతాచార్యులూ, రాజులూ కాదు; మానవుల సామ్రాజ్యాభిప్రాయాలు. వారివి ప్లేటో భావచైతన్యవాదమూ కాదు, క్రైస్తవుల ఆత్మ చైతన్యవాదమూ కాదు. కాని ప్లేటోతో పాటు 'ప్రపంచం భావాత్మక' మంటారు; క్రైస్తవులతో పాటు 'మానవుడు తన హృదయగతాభిప్రాయాల ప్రకారమే రూపొందుతాడు' అంటారు. మానవుల్లో అస్థిగతాలై ఉండే భావోద్రేకవిన్యాసాల ప్రాబల్యాన్ని ఉపేక్షిస్తుందని ఆధునిక మనస్తత్వశాస్త్రజ్ఞులు సాంప్రదాయిక హేతువాదాన్ని విమర్శిస్తారు. దీనినిబట్టి, మానవునికి తన్నుగూర్చి ఉన్న అభిప్రాయాల్లో ప్రధానమైన సంస్కరణ జరగాలని తేలుతుంది. కాని తన్నుగూర్చిన అభిప్రాయానికీ, తన భయానికి చెందిన సర్వవ్యాపియైన సమస్యకీ, సంబంధమేమిటి?

### డా॥ చాంగ్ వాదంలో లోపం

సంపాదనకాంక్షియైన అహమున్నదీ అంటే, జన్మసిద్ధకాలుష్యభారమొకటి తోడయినా కాకపోయినా, దానికి భయమువలని పీడ ఉండి తీరుతుందన్నది స్పష్టమే. ఆస్తి, హోదా, గౌరవాలు పొందుపడ్డంతో భద్రభావం కలిగే అహం సంపాదనకాంక్షియైనఅహం. కాని ఆవస్తువులన్నీ యితరులు దురాగతాల ద్వారా లాగుకొనగలిగినవే. భీతిలేని అహం-సూత్రప్రాయంగా గాని, వాస్తవంగా గాని వేరుచేయడానికి వలనుపడని వస్తువులుండే అహం ఆవాలి. సోక్రటీస్ గాంధీల వంటివారు బుద్ధిపూర్వకంగా ఉంచుకున్నటువంటి వస్తువులిటువంటివి. సోక్రటీస్ గాంధీ లిరువురూ కూడా నిర్భీకులన్న సంగతి గమనించాలి. దీని అర్థమేమిటంటే, మానసశాస్త్రజ్ఞులు నిజంగా భయాన్ని సమూలంగా నిర్మూలించదలచుకున్నమాటుంటే, తాము నిరపేక్షులు కావాలి. కాని దానికింకా చాలాకాలం పట్టవచ్చు. ఈలోపుగా, వారింతవరకు సాగించిన విషయపరిశోధనను పూర్తిగా వినియోగించుకొని ప్రపంచం లాభం పొందాలి.

వివిధమత సిద్ధాంతాలవల్ల, ధార్మిక మతానికీ తాత్విక మతానికీ మధ్య ఉండే ముఖ్య మతభేదాలవల్ల, కలిగే మనోతత్వ సంబంధమైన

పరిణామాలను గూర్చి, బహిరంగంగా, కూలంకషమైన చర్చలు సాగించా లన్నమాట. ఉదాహరణకు, 'మానవుడు సహజంగా మంచివాడన్న భావానికీ, 'భగవత్ప్రసాదితమైన ఆత్మకు సంబంధించిన భావానికీ మధ్య పరస్పర వైరుధ్యం లే'దన్న డా॥ చాంగ్ భావన విమర్శనీయం. భగవంతుడు కటాక్షించిన ఆత్మ భగవంతునికి జవాబుదారీగా ఉంటుంది; చారిత్రికానుభవం పట్టిచూస్తే— భగవంతునిపట్ల మానవుని బాధ్యతలను మతాచార్యులు, ఇంచుమించు ఎప్పుడుకూడా, భూమిమీది మతాచార్య వ్యవస్థకు ఐహికలాభం సమకూర్చడమైనట్టుగా వ్యాఖ్యానిస్తూ వచ్చారు. పద్ధెనిమిదో శతాబ్దపు తత్వజిజ్ఞాసువులు సరిగ్గా యీ ఫలితం కలుగకుండా చెయ్యడానికే ప్రయత్నించారు. తాత్వికుల అభిప్రాయంలో, మానవుని ఆత్మ - అంటే మానవునిలోని మంచి తనం - యితర మానవులలోని మంచితనానికి జవాబుదారీగా ఉంటుంది; దీనికి ధర్మపరంగా భగవంతుని నిర్వచింప నక్కర లేదు, మానవజాతి కేది సామాన్యంగా మంచిదో సహేతుకంగా చెప్పితే చాలు. కాని అక్కడ మళ్లీ అధికారపూర్వకసిద్ధాంతీకరణ ప్రమాదం వస్తుంది- యీవిషయంలో లౌకిక సిద్ధాంతీకరణ మవుతుంది. మతసంబంధమైన అధికారపూర్వక సిద్ధాంతీకరణం సమాజపు భౌతికరాజకీయ జీవితాన్ని శాసిస్తే, ఆత్మచైతన్య వాదానికి విపరీతార్థంకల్పించి కలిగించిన భయంద్వారా పాలిస్తుంది. బాహ్యశక్తి ఆత్మకు నాకమో,నరకమో నిర్ణయించవచ్చు. లౌకికమైన అధికారపూర్వక సిద్ధాంతీకరణం, 'ఇహలోకసంబంధమైన భయం' కలిగించి, ప్రభుత్వ నిరంకాశాధికారం ద్వారా శాసిస్తుంది. ఏ సమాజమయినా ప్రతి హింసాపరుడైన భగవంతుని భీతిగాని, ప్రాణం బలిగొనే ప్రభుత్వం భయంగాని లేకుండా మానసికంగా ఉద్ధరింపబడిననాడే అది నిజమైన స్వేచ్ఛా సమాజ మనిపించుకుంటుంది. అసలు అటువంటి సమాజం సాధ్యమైన విషయమేనా?

## స్వేచ్ఛా సమాజం సాధ్యమా?

పై రెండువిధాల భయాలను దుర్భేద్యమైన మానవత్వ భావనకోసం చూడ్డంద్వారానే ఈ ప్రశ్నకు సమాధానం చెప్పగలగడం సాధ్యం. చరిత్రను పరిశీలిస్తే, మూడు ప్రపంచ విఖ్యాతమైన దృక్పథాలు స్ఫురిస్తాయి. సోక్రటీస్ ఆదర్శవాదం, రోమన్ సామ్రాజ్య క్షీణదశకు చెందిన ఆత్మసంయమవాదం, పందొమ్మిదవ శతాబ్దపు బర్మా ప్రజానీకపు బౌద్ధమతం. ఈ జీవిత దృక్పథాల మూడిటికీ, పద్ధెనిమిదవ శతాబ్దపు తత్వజిజ్ఞాసయొక్క హేతువాద మూలసూత్రాలకీ ప్రాతిపదికల్లో విరోధభావమేమీ లేదు; అయినా తాత్విక హేతువాదంలో కనిపించని దార్శనిక భావాభివృద్ధి యీ దృక్పథాలలో లభ్యమవుతుంది. తాత్విక మతవాదంలా కాకుండా, అవి వ్యక్తిరహితమైన ఆధ్యాత్మిక వాస్తవికతను గుర్తిస్తాయి; దానినుంచి మనోదృఢతను, ప్రయోజనస్థిరతను పొందవచ్చు. మరణమంటే భీతిలేకపోవడం మూడు వాదాలకీ ముఖ్యలక్షణం. వాటికి ఆదిభౌతిక సంపదల వ్యామోహంకూడా లేదు. ఈ విధానాలలో వ్యక్తిత్వసహిత, వ్యక్తిత్వరహితమైన ద్వివిధ అమరత్వ భావకల్పనలకీ తావుంది; వ్యక్తిత్వరహితమైన ప్రకృతి వ్యవస్థాక్రమం వాటి కాధారం; ఈ వ్యవస్థాక్రమంలో దార్శనిక వాస్తవికతకీ, భౌతిక అస్తిత్వానికీ చోటున్నప్పటికీ, దేవుడు లోకాతీత రీతిని కల్పించుకుంటూండడం లేదు—వ్యక్తి, సమాజము, ప్రభుత్వవ్యవస్థ, జాతి భౌతికసూత్రాల కనుగుణంగా వర్తిస్తూంటాయి.

హేతువాదం పరిపోదని నేడు చరిత్ర నిరూపిస్తోంది. అందుచేత దేవుని పేరిటనో, దేశం పేరిటనో తిరిగి భావోద్రేకాత్మకమైన హేతువాద ప్రతికూలతను చేపట్టడమో; లేక ఐహికవాదంగాని, ఆముష్మికవాదం గాని అవలంబించకుండా సహజయుక్తిలో వివేకం నిర్ణయాలకు తోడుపడే ఆత్మ చైతన్యవాదంలో హేతువాదాన్ని బలపరచడమో మనం ఎన్నుకోవలసి ఉంటుంది.

('మనస్' నుండి—అనువాదం : నళినీకాంతరావు)

# ఎడతెగని సమస్యలు

తాడిమళ్ల జగన్నాథరావు

ఏ వ్యక్తిజీవితమూ నిర్విఘ్నంగా, నిరాఘాటంగా సాగిపోదు. ఒకవేళ సర్వదానందమయ జీవితాన్ని గడుపుతున్న వ్యక్తి ఎవడైనా ఉంటే అతను సర్వసంగపరిత్యాగియైన యోగి అయి ఉండాలి. ఆ యోగులకు కూడా భగవంతుని నిజ రూపం తెలుసుకోలేకపోయామే అనే విచారం ఉండవచ్చును. వ్యక్తిజీవితంలాగే రాజ్యపాలన కూడ నిర్విఘ్నంగా సాగిపోదు. వ్యక్తులు, రాజ్యాలు సాధించవలసిన వ్యవహారాలనేకం ఉంటాయి. అనేక సమయాల్లో క్లిష్టపరిస్థితుల్లో పడి ఏదో ఒక ఆత్మనిర్ణయం చేసుకోవలసిన అవసరాలు ఏర్పడతాయి. ఈ క్లిష్టపరిస్థితులు ఏర్పడడానికి అనేకకారణాలుండవచ్చును. ఈ కారణాలకు చాలావరకు మూలం బైటివ్యక్తులు, రాజ్యాలు అయినా, తనంతట తానే కల్పించుకొనే కారణాలు కూడ ఉంటాయి. మానవులకు, రాజ్యాలకు కలిగే ఈ సమస్యలను గూర్చి విపులంగా వ్రాయడం ఎవ్వరితరం కాదు. ఒకరికి ఒక విషయం పెద్దసమస్యఅయికూర్చుంటే, మరొకరికదేవిషయం అలక్ష్యంగా తోచవచ్చును. కాని అందరికి ఏదో ఒక సమస్య ఉండితీరుతుందనిమటుకు ఘంటాపథంగా చెప్పవచ్చును. సమస్య అనేపదాన్ని నిర్వచించడం కూడ ఒక సమస్యే. సమస్య అంటే 'ఇది' అని నిర్దిష్టమైన పదజాలాన్ని వాడడం కష్టమయిన పని. ఒక విషయాన్ని గురించి ఒక వ్యక్తిగాని, ఒక ప్రభుత్వంగాని నిరంతరాయంగా ఆలోచిస్తూ, ఆ విషయాన్ని సాధించడానికి, ఆ క్లిష్టపరిస్థితిని తొలగించడానికి చేసే ప్రయత్నాలన్నిటినీ సమస్యలుగా పరిగణించవచ్చు. అంటే సమస్యలన్నీ సాధింపవలసినవి అన్నమాట

సమస్యలన్నిటినీ ముఖ్యంగా రెండు తరహాలుగా విభజింపవచ్చు: వ్యక్తిగత సమస్యలు; రాజకీయ సమస్యలు. సాంఘిక, ఆర్థిక సమస్యల్ని రాజకీయ సమస్యలక్రిందే జమకట్టవచ్చును. కొన్నిపరిస్థితులలో సాంఘిక సమస్యలే వ్యక్తిగతసమస్యలు కూడా అవవచ్చును. వ్యక్తిగత సమస్యలను గురించి వ్రాయలేము. ఆ సమస్యలు అందరు వ్యక్తులకు ఒకలాగే ఉండవు. ఒకనికి తినతిండి, కట్టబట్ట సంపాదించుకోవడం పెద్దసమస్య అయితే, కోటీశ్వరునకు ఉన్నది తినడం ఒక పెద్దసమస్య అవవచ్చును. ఒక వ్యక్తికి డబ్బుసంపాదన ప్రధానమయితే, మరో వ్యక్తిని ఉన్నడబ్బును ఎల్లాఖర్చుపెట్టాలి అనే ఆలోచన పీడించుకుతింటూ ఉండవచ్చును. ఇంక మనం వ్రాయకలిగిందల్లా ఒక్క రాజకీయ సమస్యలను గురించే.

సమస్యలు ఉత్పన్నమవడానికి క్లిష్టపరిస్థితులే ముఖ్యంగా మూలకారణం అనలేము. ఒక మంచిపనినుంచి కూడ సమస్యలు బయల్దేరవచ్చును. మద్యనిషేధం చాలా మంచిపనే. కాని అది ప్రవేశపెట్టబడినప్పటినుంచి అనేక సమస్యలు ఉత్పన్నమయాయి.

కల్లుగీతగాళ్లకు వృత్తి కల్పించడం ఎలాగ? ప్రభుత్వ ఆదాయంలోని లోటును భర్తీ చెయ్యడం ఎలాగ? అంటూ అనేక సమస్యలు బయిల్దేరాయి. ఇలాగే జనులను విద్యావంతులుగా తయారు చెయ్యడం మంచిపనే. పట్టభద్రులు ఎక్కువవుతున్నకొద్దీ నిరుద్యోగ సమస్యకూడ ఎక్కువవుతోంది. మద్యనిషేధం వల్ల అనేక సమస్యలు, విద్యావ్యాప్తివల్ల నిరుద్యోగ సమస్య ఉత్పన్నమవుతూన్నాయి. కాబట్టి ప్రజలంతా మద్యనిషేధమునకు వ్యతిరేకంగా పనిచెయ్యాలి, అందరూ విశ్వవిద్యాలయాలు త్యజించాలి అని వాదించడం సమస్యలకు సాధనమా? కాదు. ఈ సమస్యలను పరిష్కరించడానికి సాధనం మూలాన్ని తొలగించడంకాదు. సమస్య ఉత్పన్నంకాకుండా వేరు మార్గాలను పరిశోధించడమే.

ఐక్యరాజ్య సమితిముందు ఏ విషయాన్ని ప్రవేశపెట్టినా ఒక సమస్య అయి కూర్చుంటుంది. బెర్లిన్ సమస్య, పాలస్తీనా సమస్య, కాశ్మీరు సమస్య, ఇండోనీషియా సమస్య, ఇటలీవలసల భవిష్యత్తు సమస్య- ఇంకా ఇలాటి అనేక సమ

ష్యలు ఉత్పన్నమయాయి. జర్మనీని పంచుకోవడం విషయంలో అగ్రరాజ్యాలవారికి మాటపొత్తు కుదరక బెర్లిన్ సమస్య బయల్దేరింది. యూదులకు స్థిరనివాసం ఏర్పరచుకోవాలనే కోరిక బయల్దేరడంతో పాలస్తీనా సమస్యబయల్దేరింది. ఇండియా పాకిస్తానులకు పొత్తుకుదరకపోవడంచేత, పాకిస్తాన్‌వారు కాశ్మీరుపై దాడిచేసే దండయాత్రదార్లకు సహాయం చెయ్యడా మొదలు పెట్టడంతో కాశ్మీర్ సమస్య పైకి వచ్చింది. డచ్చివారి దురాక్రమణ, వలసవిధానం మారకపోవడంతో ఇండోనీషియా పరిస్థితి సమస్యగా పరిణమించింది. ఇటలీవలసలు ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వ సంఘం క్రింద ఉండాలా? లేక కొన్ని అగ్రరాజ్యాల చేతిక్రిందనుండాలా? అనే వాదంతో ఇటలీవలసల భవిష్యత్తు సమస్య బయిల్దేరింది.

ఇటువంటిసమస్యలన్నీ బయల్దేరడానికికారణం అగ్రరాజ్యాలు రెండు విభిన్నదృక్పథాలు కల మార్గాలలో సంచరించడం. రష్యా, అమెరికాలు సౌజన్యంతో వ్యవహరిస్తేనేగాని ఈ అంతర్జాతీయ సమస్యలకు పరిష్కార మార్గాలు గోచరించవు. డచ్చివారు తమ వలస విధానాన్ని మార్చుకొని రిపబ్లికన్ ప్రభుత్వాన్ని సంపూర్ణాధికారాలతో ఇండోనీషియాలో ప్రతిష్ఠిస్తేనేగాని ఇండోనీషియా సమస్య అంతంకాదు. ఈ సమస్యలన్నిటికీ మూలకారణమైన వ్యక్తుల మనస్తత్వాలు మారాలి. అప్పుడే ఆ సమస్యలు అంతం అవుతాయి. లేకపోతే ఈ సమస్యలు పెరిగి పెద్దవయి అంతర్జాతీయ శాంతిని భంగపరచేవిగా తయారవవచ్చును. అగ్రరాజ్యాలు 'ఇచ్చి పుచ్చుకోవడమనే సూత్రంతో వ్యవహరించుతూ, పరస్పరం అపోహలు తొలగించుకొంటే శాశ్వత శాంతి చేకూరుతుంది. పాకిస్తాను ప్రభుత్వం యుద్ధవిరామపు ఒడంబడికను భగ్నం చెయ్యకుండా ఇండియాతో కలసి వ్యవహరించి నిష్పాక్షికమైన ప్లెబిసైటును కాశ్మీరులో జరుగనిస్తే కాశ్మీరు విషయమై సమస్యే ఉండదు. ఐక్యరాజ్యసమితి ధర్మకర్తృత్వంక్రింద ఇటలీ వలసలనుంచి ఆ సమస్య తొలగించవచ్చును. పై సమస్యలు ఉద్భవించడానికి తోడ్పడ్డ మూలకారణాలను తొలగించడంతో ఈ విధమైన సమస్యలు అంతం చెందుతాయి.

ఇక మనదేశానికి సంబంధించిన కొన్ని సమస్యలనుగూర్చి విచారిద్దాం. ఇండియా పాకిస్తాన్లు రెండుకావడంతో, మతకలహాలు చెలరేగి, బయల్దేరింది కాందిశీక సమస్య. ఈ సమస్య సాధించడానికి చాలాకాలం పట్టుతుంది. తరువాత ప్రాధాన్యం, సంస్థానాల సమస్యకు చెందుతుంది. సర్దార్ పటేల్ తన ప్రతిభా విశేషంతో ఈ సమస్యను చాలావరకు సాధించాడు. ఆసాధనలో సామ, దాన, భేద, దండోపాయా లుపయోగింపబడ్డాయి. హైదరాబాదు మున్నగు సమస్యలలో దండోపాయం ప్రయోగించక తప్పలేదు. ఇక సంస్థానాల సమస్యలు అన్నిటిలో మిగిలింది కాశ్మీర సమస్య. మన దురదృష్టం కొద్దీ ఈ సమస్య ఐక్యరాజ్యసమితికి వెళ్ళింది; కాబట్టి ఇది ఎప్పుడు పరిష్కరింపబడుతుందో చెప్పలేము. ఇండియా ఎదుర్కోవలసిన ఇంకో ముఖ్యసమస్య ఆర్థికసమస్య. దేశంలో చెలామణీముమ్మరంవచ్చింది. దీన్ని ఎదుర్కోడానికి కేంద్ర, రాష్ట్రప్రభుత్వాలు శక్తికొద్దీ కృషి చేస్తున్నాయి. ఆహారసమస్య విషయంలోకూడా తగిన ప్రయత్నాలు జరుగుతున్నాయి. 1951 సంవత్సరానికి దేశం ఆహారం విషయంలో స్వయంపోషకమయే పథకాలు తయారవుతున్నాయి. ఇక మన ఆంధ్రరాష్ట్ర సమస్యనుగురించి: ముఖ్యమైన అనేక ఇతరసమస్య లున్నాయంటూ భాషా రాష్ట్ర సమస్యను వాయిదా వేస్తూ వచ్చారు. కాని ఆంధ్రరాష్ట్రం విషయం ఆందోళన ఎక్కువగా ఉండటంచేత ఈరాష్ట్రనిర్మాణానికి అంగీకరింపక తప్పలేదు. అయితే ఇందుకు అంగీకరిస్తూ కొన్ని హిరణ్యాక్షవరాలు పెట్టారు. ఆంధ్రులు మద్రాసుకు నీళ్లువదలుకోవాలి సందిగ్ధమైనసరిహద్దుల విషయం ప్రస్తుతం ఆందోళన చెయ్యకూడదనీ, మొదలైన షరతులు పెట్టబడ్డాయి. వీటికి నాయకులంతా అంగీకరిస్తే రాష్ట్రం ఏర్పడవచ్చును.

లోకంలోని వివిధ సమస్యలను గూర్చి చర్చిస్తూ ఎంతైనా వ్రాయవచ్చును. ప్రపంచం ప్రస్తుతరీతిని ఉన్నంతకాలం సమస్యలు ఏర్పడుతూనే ఉంటాయి.

# ఏమిటీ మానవజాతి?

పెనుమర్తి కామేశ్వరరావు

కాలం, కాలిన గుడ్డ పీలికై
శీలం, మబ్బుల చంద్రకిరణమై
న్యాయం, ప్రాకిన అంధతమసమై
ధర్మం, రాలిన పండుటాకులై
దేవుడు, గుడిలో రాతి బొమ్మై
మతం, సారంలేని మాటమై
కలికాలం స్తిమితంలేనిదై!
ధనమే జనులకు ముఖ్య సాధనం
సౌఖ్యమె ప్రజలకు దైవభక్తి:
మోసమె నరులకు రాచబాట!
దీనులకు సలహా లిచ్చేవారు
కానీకూడా సహాయం చేయరు;
వ్యాపారం, లాభం, రాబడి
వర్ధిల్లినకొలదీ డంబం!
పేదల్ని పిప్పి చేస్తూండడం
ప్రీతితో పురాణాలు వింటూండడం!
ఏమిటీ మానవజాతి?
ఏమిటీ మానవరీతి?
ఏర్చ బడిన మానవనీతి
కెటసున్నది స్థిరతరకీర్తి?
జాతికీ జాతికీ విరోధం-
రాజ్యానికి రాజ్యానికి యుద్ధం!
అమాయిక ప్రజల మారణం
అరాజక శక్తుల తాండవం!
పొలివోయెడి మాటలెకానీ
భూమిపైన లేదొక స్వర్గం!
సర్వ మానవ సౌభ్రాతృత్వం-
మానవ నాగరికత కషాయం-
రాజకీయవాదుల మాటలు
ప్రజల్ని మభ్యపరచే బాటలు!

కథానిక

# అవ్యక్తం

దాసరి సుబ్రహ్మణ్యం

సుబ్బారాయుడు ఘోర ప్రతిజ్ఞ చేశాడు; దారుణమైన శపథం పూనాడు. ప్రకృతి వైపరీత్యాలు కొన్ని, యాంత్రిక విపర్యయాలు మరి కొన్ని జరిగినై.

ఉత్తరధ్రువప్రాంతాల్లో భూకంపం కలిగింది. మద్రాసులో ట్రాము పట్టా వదిలేసి ప్రక్కన వున్న కాలిబాటమీదికి వెళ్ళి నిలబడింది. ఆకాశంలో రెండు విమానాలు తప్పుకునేందుకు ఖాళీ లేక ఢీకొన్నై. బి. ఏ. ఆనర్సు చదివిన ఓయువతి భర్తకోసం పత్రికల్లో ప్రకటన చేసింది.

ఈ వార్తలన్నిటినీ ఆరోజు పత్రికలు ప్రకటించినై. కాని సుబ్బారాయుడి ప్రతిజ్ఞ విషయం ఏ పత్రికా ప్రకటించలేదు. ఎందువల్ల?

'ఎందువల్ల?' సుబ్బారాయుడు పత్రికని టేబిలుమీదనుంచి కిందకు నెట్టేసి ఆలోచించడం ప్రారంభించాడు.

ఈ లోకంలోని సకల చరాచరజీవకోటి భవిష్యత్తును నిర్ణయించేటంత బరువు, బలమూ వున్న తన ప్రతిజ్ఞను, లోకం యెందుకని చూడలేక పోయింది? అసలు లోకానికి యీవిషయం ఏమంత ప్రాముఖ్యమైంది కాదా?

గట్టిగా ఓ పొడుం పట్టుబట్టి తలపంకించి, పెన్సిలు తీసుకున్నాడు. ఇంతలో వెనక ఎవరో వస్తున్న చప్పుడయింది. తిరిగి చూశాడు.

'మూడో ప్రపంచయుద్ధం వచ్చేటట్టుగా వుంది.' లోపలకు వస్తూనే జర్నలిస్టు రావు అన్నాడు.

'రానీ'

'యీసారి ఇండియాకూడా యుద్ధభూమిగా మారుతుంది'

'మారనీ'

రావు, సుబ్బారాయుడు ప్రక్కనవున్న కుర్చీలో కూర్చుంటూ-

'కులాసాయేనా?' అన్నాడు.

సుబ్బారాయుడు పెన్సిలు తిరిగి టేబిలుమీద పెట్టి-

'ఆ అనుమానం నీకెందుకు కలిగింది?' అన్నాడు కొంచెం కఠినంగా.

'నీ జవాబులు' రావు నత్తిగా జవాబిచ్చాడు.

సుబ్బారాయుడు మరోమారు పొడుం గట్టిగా పీల్చి వుపక్రమించాడు.

'అసలు యుద్ధాలు ఎందుకు వస్తయ్?'

రావు కిందపడివున్న పత్రికను చేతిలోకి తీసుకుంటూ—

'ఈ విషయాన్ని మనం చాలాసార్లు చర్చించాం. మళ్ళీ యిప్పుడా చర్చ అనవసరమనుకుంటాను. అసలు - నీ వాట్లో...'

సుబ్బారాయుడు గట్టిగా టేబిలుమీద గుద్దేడు. రావు చేతిలోనుంచి పత్రిక జారి తిరిగి నేలమీద పడింది.

'ఏ ముఖ్య విషయాన్నైనా సీరియస్‌గా చర్చించుదామనుకున్నప్పుడల్లా, నువ్వు నీవాట్లో అంటూ అడ్డు తగులుతూంటావు. అసలు నీ వుద్దేశ్యం నాకు మతి స్తిమితంగా లేదనా?'

రావు బలవంతంగా పెదిమలమీదికి నవ్వు తెచ్చుకొని, నేలమీదినుంచి పత్రికను తీస్తూ—

'నీవాట్లో - అనడంలో నావుద్దేశ్యం - నీచెవి బాధనుగురించే. కావాలంటే నీతో ఏవిషయాన్నయినా - ఎన్ని గంటలకాలమైనా సరే చర్చించడానికి తయారు. నీవు యం. ఏ. వయితే - నేను బి. ఏ. ను. నీవు వేదాంతి వయితే - నేను జర్నలిస్టును. ఇక ప్రారంభించు.'

సుబ్బారాయుడు ప్రశాంతవదనంతో, రావు వంక ఓమారు చూ

'ఏమైనా మీజర్నలిస్టులు మహా ఘటికు లోయ్! జర్నలిజం అంటే, నాకు చర్మంఒలవడం అన్నట్టు వినబడుతూవుంటుంది. ఇక నా చెవి విషయం. మామూలుగా అనుకున్నట్టు యీసారి కుడిచెవి చీముకారడమూ కాదు - బాధపెట్ట పెట్టడమూకాదు - ఒక అపూర్వ విషయం - ఎడమ చెవి...' సుబ్బారాయుడు కుడిచేత్తో తన ఎడమ చెవిని అతి సున్నితంగా తాకి, దీర్ఘా లోచనలో పడ్డాడు.

రావు నిశ్శబ్దంగా పత్రికచదువుకుంటున్నాడు. మౌనంగా ఆలోచించుకునేటప్పుడు సుబ్బారా యుణ్ని పలకరించడం మహా ప్రమాదకరమని అతనికి తెలుసు. అలాంటి సందర్భాల్లో పలక రించామా అంటే - హఠాత్తుగా ఏ మాత్రం హెచ్చరికా యివ్వకుండా, కాంట్ - నీట్జే - రస్సెల్, జోడ్‌లను ఒంటరిగానూ, కలగూర గంపగానూ ఎదటివాళ్ళమీదికి విసురుతాడు. అచ్చగా వాళ్ళ పుస్తకాల్లా మాట్లాడేస్తాడు.

సుబ్బారాయుడు గట్టిగా ఓమారు తుమ్మి, పొడుండబ్బా దగ్గిరకు చేయిపోనిస్తూ అన్నాడు 'ఈ ప్రపంచాన్ని ఓమారు గట్టిగా జుట్టుపట్టు కుని కుదిలించదలుచుకున్నాను.'

'ఏ రూపంగా?'

'అదే ఆలోచిస్తున్నాను. ప్రపంచాన్ని మనం జుట్టు పట్టుకుంటే - తిరిగి అది మన పీకలంకించు కోకుండా ముందు జాగ్రత్తపడాలి. అందుకు మనకు కొన్ని అపూర్వశక్తిసామర్థ్యాలు కావాలి.' సుబ్బారాయుడు టేబిలుమీద గడ్డం ఆనించి కళ్లుమూసుకున్నాడు.

రావు పత్రికని టేబిలుమీద పడవేసి, సిగ రెట్టు ముట్టించేందుకుఅగ్గిపుల్లగీసి, దాన్ని అలాగే చేతులో వుంచుకొని—

'అంటే' అన్నాడు.

సుబ్బారాయుడు కళ్లుమూసుకునే జవా బిచ్చాడు.

'మనం చెప్పేదానికి అవును- అనడం తప్ప కాదు- అనడం యీ ప్రపంచానికి తెలియకుండా చేయాలి. అలాంటి పరమశక్తిని ముందు పొందాలి.'

'అసాధ్యకార్యం అనుకుంటాను.' రావు చప్ప రించాడు.

సుబ్బారాయుడు కుర్చీలో నిటారుగా కూర్చుని - పొడుంకాయతో టేబిలుమీద తాళంవేస్తూ, 'అసాధ్యాలూ, దుస్సాధ్యాలూ అనేవి యీ ప్రపంచంలో వున్నవనేది నాకు తెలుసు. కాని ఒకసారి దైవకృప, ఆయన హెచ్చరిక మనకు పూతగా దొరికిన తరువాత - ఏ కార్యాన్నైనా సాధించవచ్చు...' మాట పూర్తిచేయకుండానే, కుడిచేత్తో ఎడమచెవిని సున్నితంగా పట్టుకొని కళ్లు మూసుకున్నాడు.

'ఆ చెవి ఏమైనా బాధపెడుతూందా?' రావు సానుభూతితో అన్నాడు.

'బాధకాదు. కొన్ని అపూర్వ సందేశాలూ, అవ్యక్త భావాలూ గత నాలుగు రోజులనుంచి యిది నాకు వినిపిస్తోంది. కొంతవరకు అర్థమయినై. మరికొంత అర్థంచేసుకునేందుకు ప్రయత్నం చేస్తున్నాను.' సుబ్బారాయుడు కంటిపాపల్ని పైకి తిప్పాడు.

'ఆ సందేశాలూ వాటి విషయంలో, మన దృక్పథాల్లో చాలా తేడా వుంది. కనుక ఆవిష యం నేను చర్చించను. ఒకవేళ చీము కారడం కుడి చెవినుంచి ఎడమ చెవికి మారిందేమో డాక్టరుకు చూపించావా?'

సుబ్బారాయుడు ఓ నిమిషంసేపు కోపాన్ని తొక్కిపట్టేందుకు గట్టి ప్రయత్నం చేశాడు.

'ఇది డాక్టరుకు చూపించవలసిన విషయం కాదు. నీకు యిదివరకు చెప్పాననుకుంటాను - చిన్నప్పుడు నాకు ఓ చెవి చీముకారడం - దానిమీద మా తలిదండ్రులు మోపిదేవి సుబ్బా రాయుడుకు మ్రొక్కుకోవడం - అది నయం కావడం - ఆయన పేరే నాకు పెట్టడం. అదంతా-'

'అవును యిదివరకు చెప్పావ్. కాని యీ మధ్య తిరిగి తిరిగి ఆ చెవి చీము కారుతోందనీ, బాధగా వుందనీ అన్నావుకూడా.'

సుబ్బారాయుడు కుర్చీలోనుంచి, రావు వైపువంగి మెల్లగా అన్నాడు.

'అదంతా మన మానవుల్లోని దంభ గర్వాల కారణంగా దేవుడుచూపే ప్రతీకారం.'

'అర్థంకాలేదు.'

'అయితే విను' సుబ్బారాయుడు పొడుం కాయను దగ్గిరకు లాక్కున్నాడు. రావు రిస్టు

వాచీవంక ఓమారుచూసి నిశ్చలంగా కూర్చున్నాడు.

'చిన్నప్పుడు ఆ మొక్కుకోవడంతో పోయిన ఆచెవి బాధ, తిరిగి కాలేజీలో చేరిన తరవాత ప్రారంభమైంది-యం. ఏ. ప్యాసయిన తరవాత ఎక్కువయింది.'

రావు తల మరోవైపు తిప్పుతూని 'ఆఫీసు కెళ్ళాలి. సాయంకాలం వస్తా' అన్నాడు.

'ఇంతా ప్రారంభించిన తరవాత-మధ్యలో నీవు వెళతాననడం బాగాలేదు. అందులో నేను ఓ నిశ్చయం-దాన్ని ప్రతిజ్ఞ, శపథం అని అనవచ్చు. ఆ విషయం చాలా ముఖ్యమైంది. అదికూడా నీకు చెపుతాను.'

ఆలోచించకుండా - సుబ్బారాయుడు ఏ ప్రతిజ్ఞా చేయడని రావుకు తెలుసు. సిగరెట్లు మానేస్తానన్నాడు. అంతే! మళ్లీ యీనాటి వరకు ముట్టలేదు. పొడుం అలవాటు చేసుకున్నాడు. కాఫీ ముట్టనని ప్రతిజ్ఞ-కోకో తాగుతున్నాడు.

రావు మరో సిగరెట్టు ముట్టించి కుర్చీలో కదలకుండా కూర్చున్నాడు. సుబ్బారాయుడు యింకోమారు పొడుంపట్టుపట్టి ప్రారంభించాడు.

వూహా బాగా వచ్చిన దగ్గిరనుంచీ-ముఖ్యంగా కాలేజీ చదువు ప్రారంభించిన దగ్గిరనుంచి-నా పేరు విషయంలో కొంత వ్యాకులత పడసాగాను. కొన్నిసార్లు పేరు మార్చుకుందామని గట్టిగా నిశ్చయించుకున్నాను కూడా.'

రావు అతడి ధోరణికి అడ్డుతగల దలుచుకున్నాడు. లేకపోతే సుబ్బారాయుడు గంటల తరబడి మాట్లాడేటట్టు కనబడ్డాడు.

'అసలు పేరులో ఏముంది? నీవు అనవసరంగా బాధపడడం తప్పు!'

సుబ్బారాయుడు ముఖం చిట్లించి 'రావులూ, ప్రసాద్‌లూ లాంటి పేర్లతో బతికేవాళ్లకు నా లాంటివాళ్ళ బాధ తెలీదు. సుబ్బారాయుడు, యం. ఏ. చూడు ఎంత అసహ్యంగా ధ్వనిస్తోందో.'

'ఇంతకూ అసలు విషయాన్ని మర్చిపోయావ్. నీ ప్రతిజ్ఞ-'

'దాన్ని చెప్పేముందు-ఒకప్పుడు ఎంతగానో నాకు న్యూనతగా తోచిన నాపేరు-నన్ను వృద్ధరించడానికి - అసలు నా జీవితాన్నే మరో మార్గంలో పెట్టడానికి ఎలా సాయపడిందో చెప్పాలి.'

'సరే త్వరగా కానీయ్.'

'పేరు మార్చుకుందామని నేను తీవ్రంగా ఓ నిశ్చయానికి వచ్చినప్పుడల్లా, చెవి బాధ పెట్టడం చీముకారడం ప్రారంభించేది. చిన్నప్పుడు మోపిదేవి సుబ్బారాయుడికి మొక్కుకొని ఆయనపేరు పెట్టగానే ఆచీము కారడం ఆగిపోయింది. ఇప్పుడు యీ సంఘటనల్ని మొత్తం కలిపి, విడదీస్తే వచ్చే అన్సరు?'

'నాకు తెలియడంలేదు' రావు కళ్లు తేలవేసి గాలి పీల్చుకునేందుకు గట్టి ప్రయత్నంచేశాడు. సుబ్బారాయుడు కుర్చీలోనుంచి లేచి, చేతుల్ని నడుం వెనకకు పోనిచ్చి-గదిలో అటూయిటూ తిరగడం ప్రారంభించాడు.

'సాయంకాలం కనబడతాను' రావు కుర్చీలోనుంచి లేచాడు.

'నా ప్రశ్నకు జవాబు రాలేదు.'

'సాయంకాలం మాట్లాడదాం.'

'ఇక యీ విషయాన్నిగురించి మాట్లాడేందుకు ఏమీలేదు. ఒక్కవిషయం నిశ్చితంగా తేలిపోయింది. దేవుడున్నాడు!'

'లేడని నేను ఎప్పుడూ అనలేదు.' రావు గాభరాగా అన్నాడు.

'అదే యీ ప్రపంచంలో వచ్చిన చిక్కు. ఉన్నాడంటూనే- లేడన్నట్టుగా ప్రవర్తిస్తుంది. నీ మట్టుకు నీవు- చాలాదారుణమైన అనుమానాలు ప్రకటించావ్.'

'ఎప్పుడు?'

'ఒకమారు నీవు అన్నావు—కని, నిర్దయగా రోడ్డుమీద బిడ్డనువదిలిపోయే క్రూరురాలైన మాతలాగా దేవుడు యీ లోకాన్ని సృష్టించి-తరవాత యిక్కడ జరిగే దారుణహింసాకాండని, యుద్ధాన్ని చూస్తూ సహించివూరుకోడం చాలా ఘోరం అని. గుర్తుందా?'

'ఆ మాట యిప్పుడూ అంటాను.' రావు రోషంగా రెట్టించాడు. సుబ్బారాయుడు సాక్షిప్రాయంగా అతడివంక చూసి—

'యిది దైవదూషణకంటే ఎక్కువైంది. దేవుడు యీ ప్రపంచాన్ని సృష్టించాడని ఒప్పు

కుంటూ- తరవాత మన అల్పమైనబుద్ధితో ఆయనచర్యల్ని స్వల్పంచేసి మాట్లాడడం! రాజకీయాల్లో యిటు కాపిటలిజమో, అటు కమ్యూనిజమో కాక మధ్య మార్గాలంటూ చెప్పేవన్నీ ఎలా దగుల్బాజీ వ్యవహారాలో—దేవుడి విషయంలోకూడా యిటువున్నాడని తనను అర్పించుకోవడమో, అటులేడని తనకు తానుగా ప్రవర్తించడమోతప్ప, మధ్య మార్గాలంటూ లేవు. జర్నలిస్టువి కనక, యీ మాత్రం నీకు తప్పక తెలిసివుండాలి.'

సుబ్బారాయుడు నవ్వుతూ రావు భుజం మీదచేయివేసి- తిరిగి కుర్చీలో కూర్చో పెట్టాడు. ఇద్దరు ఒక నిముషం నిశ్శబ్దంగా ఒకళ్ళని ఒకళ్లు చూసుకుంటూ వూరుకున్నారు.

రావు టేబిలుమీదవున్న పొడుంకాయను
గా చూస్తూ—

'యీ పూటకు నా ఆఫీసుపని చెడింది. ఏదో ప్రతిజ్ఞ, శపథం అంటూ ప్రారంభించావు. ఆ విషయమన్నా చెప్పు.'

'చెప్పేందుకు ప్రస్తుతం ఎక్కువలేదు. టాం పెయిన్‌లూ, అనటోల్ ఫ్రాన్సులూ పచ్చడి కింద నలిగిపోయారు. అతి స్వల్పవిషయాలుగా కనబడే వాటిద్వారా పరంజ్యోతి నా కళ్లు తెరిచాడు. ఒక వారంరోజుల్లో తపస్సుచేసి— యీ లోకం, లోతుపాతుల్ని తెలుసుకునేందుకు, అందరికళ్లు తెరిచేందుకు ప్రతిజ్ఞపూనాను—' సుబ్బారాయుడు ఎడమచెవిని కుడిచేత్తో, అతి సున్నితంగా పట్టుకుని బుజ్జగించాడు.

'నీవు యిప్పటి పరిస్థితుల్ని బాగా అర్థం చేసుకున్నట్టులేదు. అయినా — ఆ తపస్సు యిక్కడేవుండి ఎందుకు చేయకూడదు?'

'ఇక్కడేవుండి అలా చేయడంగాని-ఏదైనా సాధించడంగాని అసాధ్యమైనపని. మనం, మత గ్రంథాలన్నీ తిరగవేస్తే కాషాయవస్త్రాలుకట్టి కమండలం చేతబట్టి, నిర్జనారణ్యాలకు వెళ్ళకుండా ఎవరూ దైవదర్శనం చేసుకోలేదు.'

'అయినా—' రావు అంతటితో ఆగాడు.

'ఊఁ! కానీ,' సుబ్బారాయుడు ఆత్రుతగా అన్నాడు.

'చాలా శ్రమ, ప్రయాస, యింకా—'

'శ్రమప్రయాసల్లేకుండా దేన్నీ సాధించలేం. శరీరంకోసం ఎంత వెగటూ, డోకూ పుట్టించేట్టున్నా కళ్లు మూసుకుని కాడ్‌లివర్ ఆయిల్ తాగేస్తాం. కాని ఆత్మకోసం ఏమాత్రం శ్రమ చేయడానికి అంగీకరించం. నేటి మానవ సంఘంలో దినదినాభివృద్ధి అవుతున్న జబ్బు యిదే.'

'నీ ఎడమచెవి- దాని ద్వారా నీవు వింటున్నాననే అపూర్వసందేశాలు- అదంతా నాకర్థం కావడంలేదు."

సుబ్బారాయుడు ఓ చిరునవ్వు నవ్వి, జేబుగుడ్డతో చెవు తుడుచుకున్నాడు. 'నిజంచెప్పాలంటే నాక్కూడా ఆ సందేశాలు సరిగా అర్థం కాక, అరణ్యాలకువెళ్లి నిర్మలంగా తపస్సులో కూర్చుని, తేల్చుకుందామని నిర్ణయించుకున్నాను. ముందు ఆ సందేశాన్ని నేను సరిగా అవగాహన చేసుకున్న తరవాతనే- మానవజాతిని వుద్ధరించ కలగడంగాని- దైవాజ్ఞను అమలు జరపడంగాని-'

రావు కుర్చీలోనుంచిలేచి రిస్టువాచీవంక చూశాడు!

'నేను సాయంకాలం వస్తాను. నా భయం ఏమిటంటే- నువ్వు పరిస్థితులను బాగా ఆలోచించి యీ నిర్ణయానికి రాలేదేమో అని. మాటవరసకు- ద్వాపరయుగం తరవాత, అరణ్యాలకు వెళ్లి కాషాయంగుడ్డలూ, కమండలంపట్టి తపస్సుచేసిన వారెవరూ లేరు.' రావు గడప దిగి రోడ్డుమీదికి పోతున్నాడు.

టేబిలుమీద పొడుండబ్బాకోసం వెతుకుతున్న సుబ్బారాయుడు, రావు గదిలోనుంచి బయటకు పోవడం గమనించలేదు. అతడి చివరి పదాలు సుబ్బారాయుడుకు బాణాల్లా తగిలినై. తలయెత్తిచూశాడు. రావు రోడ్డుమీదవున్నాడు, కోపంగా అతడు గట్టిగా కేకవేశాడు.

'నీ పౌరాణిక పాండిత్యానికి, చరిత్ర జ్ఞానానికి సంతోషిస్తున్నాను. మహావీరుడూ, బుద్ధుడూ ఏ యుగంలో వాళ్లు? వల్లమాలిన జర్నలిస్టువి!'

వికారంగా, హేళనగా సుబ్బారాయుడు నవ్వే ధ్వని, రావుకు ఆ రోడ్డు మలుపుతిరిగే వరకు వినబడుతూనే వుంది.

సుబ్బారాయుడు ఆరాత్రి మెయిల్‌లో బయలుదేరాడు. ప్రశాంతంగా ఆలోచించుకు

కేందుకు అవకాశంవుంటుందని, మొదటితరగతి టిక్కెట్టు కొన్నాడు. కాషాయవస్త్రాలు, కమండలం- యింకా ఆ రకమైన సరంజామా అంతా ఓ సంచీలో పెట్టాడు. వాటిని నల్లమల అడవుల్లో ప్రవేశించిన తరవాత బయటికి తీయాలని అతని నిర్ణయం.

రైలు వేగంగా పోతోంది. అనేక భావాలూ, పూర్వఋషులచరిత్రల్లో తాను చదివిన వివిధ ఘట్టాలు అతని మనస్సులో గిర్రున తిరిగినై. విశ్వామిత్రుడు!—ఆ పేరు గుర్తురాగానే కొంచెం వులిక్కిపడ్డాడు. అతని తపస్సు చెడగొట్టడానికి ఎన్ని ప్రయత్నాలు జరిగినై. తనుకూడా అలాంటి విఘ్నాలను ఎదుర్కోవలసివస్తుందా?

'నేను ఇంద్ర పదవినిగాని- అంతకంటె విలువైనమరే అధికారాన్నిగాని కాంక్షించడంలేదు. ఇప్పటికి, నా ఎడమచెవుద్వారా వింటున్న సందేశాల అర్థం తెలుసుకోవడం, దివ్యదృష్టి, త్రికాలజ్ఞత- అంతే నాకు కావలసింది. తరవాత యింటికివచ్చి- యీ ప్రపంచంలో జరిగే ప్రతి ఘటనకూ, కారణ కార్యాలను చెప్తూవుంటాను. నేను ఆశించే యీ స్వల్పానిక్కూడా అడ్డు తగిలేందుకు రంభల్నీ, మేనకల్నీ నా మీద ఎవరు ప్రయోగిస్తారు?'

పక్కపెట్టెలో ఎవరో మూడవ ప్రపంచ యుద్ధాన్నిగురించి తీవ్రంగా చర్చిస్తున్నారు. సుబ్బారాయుడు వాళ్ళమాటలు ఒక్క నిముషం సేపు విని, తిరిగి ఆలోచనలో పడ్డాడు.

'ప్రశాంతంగావుండే నిర్జనారణ్యాల్లోతప్ప మనం దేవుణ్ని కనుక్కోలేం. కాని అలాంటి అరణ్యాలన్నీ యీ నాడు నశించిపోతున్నై. భారతదేశం తన ఆధ్యాత్మిక శక్తిని కోల్పోవడానికి ఒకే ఒక కారణం; అరణ్యాలు నశించడం. దానితో ఋషులూ, తపస్సుచేసేవాళ్ళుకూడా లేకుండా పోయారు. రైళ్ళ అరుపుల్లో, మోటార్ల మోతల్లో, ఫ్యాక్టరీలకూతల్లో మానవుడికి ఏకాగ్రత ఎలా అలవడుతుంది. మరి ఋషులు ఎలా వుద్భవిస్తారు?'

పక్కపెట్టెలో మూడో ప్రపంచయుద్ధం ప్రారంభమయింది. సుబ్బారాయుడు ఆగోలలో యిక ఆలోచించలేక పోయాడు. చెవిని ఆ వైపు తిప్పాడు.

'మాస్కో ఆజ్ఞ ప్రకారం నల్లమల అడవుల్లో కమ్యూనిస్టులు స్థావరాలు ఏర్పరుచుకుని- స్టాలిన్ అర్డరురాగానే మొత్తం ఇండియాను ఆక్రమించుకునేందుకు ప్రయత్నంచేస్తున్నారు.'

సుబ్బారాయుడి గుండె ఆగిపోయినట్టయింది. తపస్సు చేసేందుకు తను అక్కడికేపోతున్నాడు!

'అసలు రష్యాలో కూలివాళ్ళదే రాజ్యం. రైతులు నానా అవస్థలు పడుతున్నారు. మచ్చుకు; ఏ కూలివాడికైనా జబ్బుచేసిందంటే- రైతును పట్టుకొచ్చి రక్తంలాగి- ఆ కూలివాడికి యింజక్షన్ద్వారా ఎక్కిస్తారు.'

'ఎవరు చెప్పారు?'

'మా...'

తరవాత చేతులో కర్రలో కలిసినై. అంతా గందరగోళం. సుబ్బారాయుడు గట్టిగా చెవులు మూసుకున్నాడు. ప్రపంచానికి వెర్రి పుట్టింది. వైరుధ్యాలతో తన్నుకు చస్తున్నారు. కాని అంతా సృష్టించిన ఆతండ్రి, ఏమి చేస్తున్నట్టు? ఎడమచెవునుంచి వస్తున్న అవ్యక్త సందేశాల్లో ఆ ప్రశ్నలకు జవాబులకోసం సుబ్బారాయుడు ప్రయత్నంచేశాడు.

రైలు ఆగింది. సుబ్బారాయుడు కిటికీగుండా తల బయటకు పెట్టి స్టేషనువైపు చూశాడు. అది తను దిగవలసిన చోటు.

సంచి చేత్తో పట్టుకుని వేగంగా నడవడం ప్రారంభించాడు. సూర్యాస్తమయానికి ముందే తను గమ్యస్థానం చేరుకోవాలి.

అడవిలో కొంతదూరం కాలిబాటన నడిచి, పక్కమార్గం తీశాడు. గుబురుగా పెరిగిన వివిధ జాతి వృక్షాల్ని ఆశ్రయించి బతుకుతున్న తిప్పతీగలూ, ముండ్లపొదలూ అతడి మార్గాన్ని అడ్డుకుంటున్నై. నడక సాగడంలేదు. చెట్ల కొమ్మల్లోనుంచి అక్కడక్కడా తునకలు తునకలుగా కనబడుతున్న ఆకాశంవాక చూశాడు. సాయంత్రం అయిదుగంటలై వుంటుంది.

. తనువెంట తెచ్చుకున్న బిస్కట్లూ, రొట్టెలూ నాలుగైదు రోజులకు సరిపోతై. తరవాత ఏం తిని బతికేట్టు? హఠాత్తుగా అప్రయత్నంగా యీ ప్రశ్న అతడిముందు గుబురుగా నిలబడింది.

ఋషులు ఏంతిని తపస్సు చేసేవాళ్ళు? కంద మూలాలూ, ఆకు అలములూ, సెల ఏటినీళ్లూ!

అవును-తనూ అదే చేయాలి. కందమూలాలు ఎక్కడుంటై? చుట్టూ చూశాడు. అన్నీ వేరు లేని పెద్దమాన్లూ, పిచ్చిఆకులూ, ముళ్లతీగలూ! నిష్ప్రహతో సంచీవంక చూసుకున్నాడు.

కొంచెం విశ్రాంతి తీసుకుందామని, అతడు సంచీ కిందపెట్టి కూర్చోబోయాడు. ఎదురుగా వున్న తీగలు విపరీతంగా కదిలినై. కారణం ఏమైవుంటుంది? భయంతో ఆశ్చర్యాన్ని కలిపి సుబ్బారాయుడు రెప్ప వాల్చకుండా చూస్తున్నాడు.

ఏదో జీవి నల్లని మూతిని ఆకుల్లోనుంచి బయటకు పెట్టి కాలమేఘంలా ఒక్క వూపుతో అతడివైపు దూకింది. జాంబవంతుడు-కాదు ఎలుగొడ్డు! అతడు వికృతంగా అరిచి పరిగెత్తాడు.

తిరిగి కాలిబాటమీదికి ఎలావచ్చాడో అతడికి తెలీదు. చెవుల్లో శబ్దం ఎక్కువయింది. శరీరమంతా చెమటతో తడిసిపోయింది. నిరాశతో-'ఏమైతే అదే కానీ,'అనుకుంటూ అక్కడే ఆ కాలి బాటమీదే కూర్చున్నాడు.

తను చదివిన పురాణాల్లో, ఋషులు చాలా మంది రంభోర్వసుల తాకిడికి తట్టుకోలేక బాధ పడ్డారేగాని క్రూరమృగాలనుంచీ ఆకలి దప్పికల నుంచీ అవస్థలపాలు కాలేదు. ఒకవేళ క్రూర మృగాలనుంచీ, ఆకలి దప్పికలనుంచీ బలికి బయట పడిన ఏ కొద్దిమందినో మాత్రమే పురాణకర్తలు గ్రంథస్థం చేశారా? లేక కలియుగంలోనే మానవులతోపాటు, జంతువులుకూడా క్రూరత్వాన్ని అలవరుచుకున్నాయా?

'చేతులెత్తు, హ్యాండ్స్ అప్, హాత్ వుతావ్.'

సుబ్బారాయుడు వెనక్కి తిరిగి చూశాడు, ఇద్దరు పోలీసులు! నిశ్చేష్టితుడయ్యాడు. వణుకుతున్న గొంతుతో 'ఎందుకు?' అన్నాడు. గాలిలో తుపాకి పేలింది. అతడు చేతులెత్తాడు సంఘటనలన్నీ అపూర్వంగా-అమానుషంగా కనబడినై.

'తుపాకి ఎక్కడ దించావ్? మీవాళ్ళంతా ఎక్కడున్నారు?'

ఒకడు జేబులూ ధోవతి మడతలూ పరీక్ష చేస్తూంటే, రెండోవాడు తుపాకి గురిపెట్టి ప్రశ్నించాడు. సుబ్బారాయుడుకి అంతా ఓ పీడకలలా వుంది.

'నాకు తుపాకీలేదు-తోడుగా ఎవరూ లేరు. ఒంటరిగాణ్ని.'

'అబద్ధం! పేల్చేస్తా. నిజంచెప్పు, నీ పేరు?'

'సుబ్బారాయుడు.' ఒక్కక్షణం ఆగి- 'యం. ఏ.' అన్నాడు.

'మొదటిది అసలుపేరు- తరవాత చెప్పింది గెరిల్లా మారుపేరు.'

ఆ ఇద్దరు పోలీసులు నవ్వుకున్నారు. 'యీ ఒక్కరోజున యింతవరకు ఆరుగురు కమ్యూనిస్టు గెరిల్లాలను పట్టాం. నీవు ఏడోవాడివి. ఇనస్పెక్టరుగారి దగ్గరకు నడు.' పోలీసు తుపాకి మడమతో, సుబ్బారాయుడి వీపుమీద పొడిచాడు. అతడికి బాధకలగలేదు. కల! పీడకల!!

ఇనస్పెక్టరు సుబ్బారాయుడిని చూస్తూనే తృప్తిగా తలవూపి, పోలీసులతో-

'ఆయుధాలు ఏమైనా దొరికినవా?' అన్నాడు.

'లేదు సార్!'

ఇనస్పెక్టరు నోటుపుస్తకం తీసి, పెన్సిలు వేళ్ళమధ్య ఆడిస్తూ అధికారస్వరంతో అడిగాడు.

'మీ దళంపేరు? నాయకుడు?'

నా పేరు సుబ్బారాయుడు—'

'నీ పేరు తరవాత చెప్పొచ్చు. ముందు మీదళంపేరు- నాయకుడు.'

సుబ్బారాయుడు ఓ నిమిషం యినస్పెక్టరు వంక దీనంగాచూసి-

'నేను కమ్యూనిస్టునూ కాదు- గెరిల్లానూ కాదు. మీ పోలీసులు పొరబడ్డారు- తపస్సు చేసుకునేందుకు వచ్చాను.'

ఇనస్పెక్టరు నోటుపుస్తకంలో అంతవరకు రాసుకుని నవ్వాడు:

'నల్లమల అడవులకు ప్రభుత్వాన్ని కూలదోసేందుకొక్క- తపస్సు చేసుకునేందుకు ఎవరూ రారు. అసలు తపస్సుచేయడమేంటి- నాకు ఆశ్చర్యంగావుంది.'

సుబ్బారాయుడు ఎడంచెవును ఓమారు సున్నితంగా తాకి-

'ఏదో దైవప్రేరణవల్ల అలాబుద్ధిపుట్టి బయలుదేరాను.'

'యిది ఇంకా ఆశ్చర్యంగావుంది. యీ రోజుల్లో ఎవడైనా తపస్సు చేయడానికంటూ అడవులకు వెళ్ళాడంటే నేను నమ్మను. అలాం టివి పట్టి కాకమ్మకథలు. అలాంటివాళ్ల వున్నా రంటూ ఎవడైనా చెప్తే- వాణ్ని విశాఖపట్టణం పిచ్చాసుపత్రిలో చేర్చమంటాను.'

సుబ్బారాయుడు కొద్దిసేపు మౌనంగా వూరు కున్నాడు. తనలో మిగిలిన కొద్ది ధైర్యాన్నీ, సమయస్ఫూర్తినీ కూడగట్టుకొని-

'నేను తపస్సు చేసుకునేందుకు వచ్చానంటే మీకు ఆశ్చర్యంగావుండవచ్చు. కావాలంటే నా సంచిని పరీక్షించండి. అందులో కాషాయ వస్త్రాలు, కమండలం- అన్నీవున్నై.'

ఇనస్పెక్టరు కుర్చీలోనుంచి స్ప్రింగులా లేచి నుంచున్నాడు.

'ఎక్కడ! ఆ సంచి ఎక్కడ! అందులో పిస్టల్సూ, యింకా మనకు అవసరమైన యితర కాయితాలు వుండివుంటై.'

పోలీసులు ఒకళ్ళమొఖం ఒకళ్లు చూసు కున్నారు.

'మాకు తెలీదు, మేం పట్టుకున్నప్పుడు యితడి దగ్గర సంచిలేదు.'

ఇనస్పెక్టరు కోపంగా రెండడుగులు ముందుకు వేశాడు. పోలీసులు భయంగా మూడడుగులు వెనక్కి వేశారు. పట్టరానంత వుద్రేకంతో అతడు సుబ్బారాయుడి మెడ గట్టిగా పట్టుకొని-

'నిన్నూ, నీ వాళ్ళన్నీ ఒక వారంరోజుల్లో నామరూపాలు లేకుండా చేస్తాను. తపస్సు అని నన్ను మోసపుచ్చదల్చుకున్నావా?'

సుబ్బారాయుడి ముఖం వెల వెల పోయింది:

'సంచివున్నమాట నిజమా? అయితే ఎక్కడ దాచావ్.'

నీరసంగా గోడకు చేరగిలబడి కూర్చుని, హీనస్వరంతో సుబ్బారాయుడు అన్నాడు: 'మీరు అనవసరంగా బాధిస్తున్నారు. సంచి, అందులో కమండలం, కాషాయవస్త్రాలు వున్న మాట నిజం. ఎలుగ్గొడ్డును చూసి భయపడి, వాటిని అక్కడే చెట్లల్లో వదిలేశాను.'

నోటు పుస్తకం మూసి యినస్పెక్టరు ఆశ్చ ర్యంగా, హేళనగా అతడివంక చూశాడు.

'అన్నీ జిత్తులు! ఆ సంచికోసం వెతికేందుకు యిప్పుడే పోలీసుల్ని పంపుతున్నాను. అది దొరికి- అందులో యితరవస్తువులుకాక, నీవు చెప్పినవే వుంటే సరే, లేకపోతే——' సిమెంటు, ఇనుమూ ఘర్షించినై.

'మీరు తొందరపడుతున్నారు. నాపేరు సుబ్బారాయుడు యం. ఏ., బెజవాడ, రామా లయం వీధి, శివాలయం సందు. ఇంటి నెం.-'

'ఆపేసెయ్! ఆ భారతమంతా నాకనవసరం. సంచి దొరికి అందులో నీవు చెప్పే వస్తువులు కనబడేంతవరకు, నీకు లాకప్. అరే! నంబర్... త్రీనాట్ !'

ఆ రాత్రి — ఇనుపచువ్వల వెనుక, దేవుడి సృష్టికాళలంమీద అభివృద్ధి చూపిస్తూ మాన వుడు నిర్మించిన, ఆ మరో ప్రపంచంలో సుబ్బా రాయుడు బుర్రవేడెక్కేవరకు ఆలోచించి కన్ను మూశాడు.

కలతనిద్దరలో కల: భారత దేశంలో వున్న మహారణ్యాలన్నీ ఒకేసారి ముట్టుకుని, బ్రహ్మాండ మైన మంటలతో పొగలతో తగలబడిపోతున్నై. ఆమండే అగ్నిలో చిక్కుకుని పెద్ద పులులూ, సింహాలూ. తోడేళ్లూ, గుంటనక్కలు,ఋషులూ అందరూ, అన్నీ బూడిదైపోతున్నై. చుట్టూ లక్షల, కోట్ల సంఖ్యల్లో చేరిన ప్రజానీకం "పండించేందుకు పొలాలు! ఇళ్లు కట్టుకునేందుకు స్థలాలు!" అంటూ వుత్సాహంతో కేకలు వేస్తున్నారు. సుబ్బారాయుడు నిద్దరలో మూలుగుతూ యింకోవైపు పొర్లాడు - 'దేవా! భారతదేశం ఆధ్యాత్మికశక్తిని కోల్పోతోంది. మానవుడు నిన్ను సాధించేందుకు యిక ఏనిర్జనా రణ్యానికి వెళ్లితపస్సు చేసుకుంటాడు? వున్నావా? వుంటే-చూస్తూవూరుకుంటావా? అంతామోసం! మోసం! సుబ్బారాయుడు పెద్దగా అరుస్తూ లేచి కూర్చున్నాడు. ఎడం చెవు బాధ పెడు తోంది. చేత్తో తాకి చూశాడు. విపరీతంగా చీము కారుతోంది!

కథానిక

# మరో ప్రపంచం

టి. జగన్మోహనరావు

అనూరాధపురంలో వున్న ఒక్క దేవుని గుడీ బాగా శిథిలమైపోయింది. దాని స్థితిని వర్ణిస్తే దేవుళ్లంటే జాలి వేస్తుంది. ఆ గుడిలో రోజూ పూజ అంటూ యేమి జరుగదు. కాని ప్రతిరాత్రి గుడి మండపం దగ్గిర అధమం పాతికమందైనా గ్రామస్థులు పోగవుతారు. అధ్యక్షుడులేని సభ ఒకటి తయారవుతుంది. అసలు ఎక్కువసేపు మాట్లాడేవారు నలుగురైదుగురు మాత్రం వుంటారు. తక్కిన వాళ్లందరూ రేడియో వింటున్నట్లు వుండిపోతారు. అప్పుడప్పుడు తమకు తెలిసిన కొత్త సంగతుల్ని ఆ నలుగురైదుగురు ప్రధాన పురుషులకు వన్నెలు చిన్నెలు పెట్టి చెప్పుతుంటారు. ఆ కొత్త విషయాన్ని చర్చించే వాళ్లు ఆ నలుగురే. వారి ప్రాముఖ్యానికి కారణం యిదని చెప్పడానికేం లేదు. ఆవూరిలో వార్తాపత్రికలు తెప్పించి చదివేవాళ్లు వారే. పైగా తరచుపట్టణానికి వెళ్లేవారే. పైగా తరచు పట్టణానికి వెళ్తుండటంచేత ప్రపంచం అంటే సరిగ్గా తెలియని అనూరాధపురం ప్రజలకు నాయకులైపోయారు.

ఆ మంటపంమీద వారు చేయని ప్రసంగాలుండవు. మొదట్లో ప్రపంచ పరిస్థితులనుగురించి, అవి తమకెంతో దగ్గరగావున్నట్లు భావిస్తూ వాదనలు చేస్తారు. క్రమంగా దేశంలోని రాజకీయాలు, వస్తువుల ధరలు, కార్మికుల తగవులు మున్నగు విషయాల్లోకి దిగి చివరకు అనూరాధపురం పంచాయతిబోర్డు వ్యవహారాల్నీ శ్రీరామనవమి వుత్సవాల్ని వారి సంభాషణల్లోకి తీసికొని వస్తారు. ఈ భాగమే అంతటిలోనూ రసవత్తరమైన ఘట్టం. అక్కడ చేరే వాళ్లలో చాలామందికి కొన్ని కొన్ని అభిప్రాయాలు జీర్ణమైపోయి వుండేవి. వాటికి వ్యతిరేకంగా మాట్లాడేవారంటే అనుమానం, అపనమ్మకం వారికెప్పటికీ పోదు.

ఒక నాటిరాత్రి వెన్నెల బాగావుందేమో, మామూలుకంటె ఎక్కువ కాలం మంటపం సభ్యులు ముచ్చటించుకొంటున్నారు. వారి మాటల్లో ఆవేశం ఆదుర్దా కనిపిస్తున్నాయి. ఓ నలభై సంవత్సరాల మనిషి తన మానగౌరవాలకి ఆపదవచ్చినట్లు చెప్పుతున్నాడు.

'...నాలుగు రోజులైందిట వచ్చి. రాధారి బంగళాలో మకాం పెట్టాడు. రోజూ నేను అటు వెళ్తూంటే వరండాలో పడక కుర్చీలో కూర్చుని చదువుతుంటాడు. అతనివైఖరంతా విచిత్రంగా కన్పించింది.'

'ఇంతకీ నీవాయనతో ఎప్పుడైనా మాట్లాడావా?' అన్నాడొక సభ్యుడు అడ్డొస్తూ.

'ఎంసుకాతోంపట చెపుతూంటేను,' అని సమాధానంచెప్పి, ఒకసారి గొంతుక సవరించుకొని తిరిగి మొదలు పెట్టాడు.

'మన బంగళా జమాను హడావుడిగా తిరుగుతూంటే, 'ఏంరా, దొరగారేమైనా వచ్చారా' అన్నా. వాడు 'కాదు బాబయ్యా. ఎవరో పట్టణాన్నించిటండి వచ్చారు. ఓ నెలరోజులుంటారండి మనూళ్లో. మా సరదా మనిషండీ. మాంచి పనులేంటో చేయాలని వచ్చారట. అదుగో బయటికి వస్తున్నారండి' అని ప్రక్కకు తప్పుకున్నాడు. ఆయన దగ్గరగా వచ్చి నన్ను పరీక్షచేసినట్లు చూసి 'తమరేం చేస్తుంటారు యీ వూళ్లో' అన్నాడు. ఏదో భూమి దున్నుకొని బ్రతుకుతున్నానని చెప్పా. ఇంతలో జమానుగాడుండి 'బాబూ, మా అయ్యగోరికి మూడొందల ఎకరాలున్నయ్యండి' అన్నాడు. 'అంత మొహమాటంగా మాట్లాడుతారేం' అని ఆ వ్యక్తి బంగళాలోకి తీసుకెళ్ళాడు.'

'చాలసేపు అనేక ఖబుర్లు అందంగాచెప్పాడు. ఏవో బిస్కట్లు యింత టీ యిచ్చి. 'అయ్యా మీరీ వూరెందుకు వచ్చారు, చుట్టాలెవరైనా

వున్నారా?' అన్నా. దాంతో మొదలెట్టాడు పొద. ఏదో సొసైటీకి చెందిన మనిషిట. పల్లెటూళ్ళంటె యిష్టంట. అవి బాగుపడితేగాని దేశం బాగుపడదట: అందుకోసం పల్లెటూళ్ళను ఆదర్శంగా, జీవించుటకు తగిన విధంగా, తయారు చేయటమే తన జీవిత పరమావధిగ చివరకి తేల్చాడు.'

సభలో కొందరు గుసగుసలు మొదలెట్టారు. కొందరు నవ్వుకున్నారు.

'గాంధీగారి అవతారమా ఏమిటీయన' అన్నాడొకడు.

'లేదుట. ఆయన కసలు రాజకీయాలంటానే గిట్టవుట. కాంగ్రెసులో మెంబరే కాదుట. పైగా అంటాడూ, మానవసేవ చేయాలని సంకల్పించు కొన్న వాళ్లకు ఓ పార్టీ అనీ కక్షలని వుండవుట.'

'మరి వీడేంచేయగలట్టు?' అన్నాడొక సభ్యుడెగతాళిగా.

'అయితే యిక్కడేంచేద్దామని వచ్చాడేమిటి?'

'ఆ బంగాళాలోనే కూర్చొని టీలు త్రాగుతూ సిగరెట్లు వూదుతూంటాడు. అని ఒకరి జవాబు.

'రేపు ఆఫీసరు క్యాంపుకొచ్చాడంటే బంగాళా ఖాళీ చేయాలి వీడు' అన్నాడు మరొక సభ్యుడు.

ఎందుచేతనో ఆ నూతన వ్యక్తి అంటె, అక్కడి నాయకవర్గం వారికి అనుమానం, అయిష్టత, అసూయ కలిగాయి—చూడకుండానే.

'ఆయనగారి ప్రోగ్రామంతా చెప్పాడు.'

'ఏమిటేమిటి?'

'ఏమీలేదు. మన వూరంతా చూస్తాట్ట. బాగుచేయటానికి మార్గాలు సూచిస్తాట. నాలుగు ఉపన్యాసాలు పెట్టి. మనల్ని 'ఎడ్యుకేటు' చేయటం ముఖ్యమైన పనిట.'

'ఆమాత్రం ఉపన్యాసాలుచేసే మొగాడిక్కడ లేకపోలేదు' అన్నాడొక నాయకుడు.

'మనమే వీడికి 'లైసన్సు' యిద్దాం' అన్నాడింకొక నాయకుడు.

ఆరాత్రలా గడచిపోయింది.

రెండుమూడు రోజులైంది. ఆ నూతనవ్యక్తి వూళ్ళో అందరికీ కనిపిస్తున్నాడు. ఒకరోజు సాయంత్రం ఆవూరి పెద్దల్ని [illegible] బంగాళాకు ఆహ్వానించాడు. ఆ సంగతీ [illegible] సంగతి మాట్లాడిన తర్వాత సంఘసేవ [illegible] గురించి ఏదో అన్నాడు. అనూరాధపురం [illegible] చక్కనిగ్రామం కాగలదని చెప్పాడు. కొన్ని అశ్రద్ధ చేయకూడని విషయాలున్నాయని చెప్పాడు. తాను ప్రతిరోజు రాత్రి గ్రామస్తులకు కొన్ని ప్రధాన విషయాల్లో శిక్షణను యివ్వాలనుకొంటున్నానని చెప్పాడు. 

అనూరాధపురం చేరాలంటే సరైన మార్గం లేదు. ఆ వూరికి పదిమైళ్ల దూరాన ట్రంకు రోడ్డు వుంది. అక్కడితో ప్రపంచం ఆఖరవుతుంది. అనురాధపురం అలా వాస్తవిక జగత్తుకు సంబంధం లేకుండానే బ్రతికి వుంది. ఆవూరిప్రజలకు పొలిమేరదాటి వెళ్ళాల్సిన అగత్యం వుండేదికాదు. అవసరంవున్న కొద్దిమంది ఆ పదిమైళ్ళు ఎంతోకష్టంతో నడచి ట్రంకు రోడ్డు చేరుకొని, అక్కడ బస్సుకోసం కాచుకొని, జీవితంలో అదృష్టంఅనేది బస్సుదొరకటంతప్ప మరోటి కాదనే భావాన్ని పొందేవారు. పరాయివూరివాళ్లు ఆ వూరు సాధారణంగా రారు; వారానికోసారి పోస్టుమనిషి తప్ప. ఇంక వూరి విషయాంవర్ణించుటంకంటే వూహించుకొంటేనే బాగుంటుంది. అసలు చిత్రమైన విషయం ఏమిటంటే ఆవూరి ప్రజలెప్పుడూ ఓ రోడ్డుకోసంగాని, తపాలాఫీసుకోసంగాని, పాఠశాలకోసంగాని ప్రయత్నం జరిపి ఎరుగరు. అవన్నీ లేకపోయినా వారికేమీ లోటంటూ కనిపించినట్లు లేదు.

ఈ చివరివిషయమే నూతనవ్యక్తికి ఎంతో ఆశ్చర్యంగా కనిపించింది. ఏ యుగంలోనూ స్వలాభానికి పాటుపడని మనుష్యులుండరు. అనూరాధపురం ప్రజలకు స్వలాభాపేక్ష లేనట్లు కనిపించిందతనికి; లేకపోతే అలా వుండటమే వారికి లాభమేమో అనుకొని నవ్వుకొన్నాడు. అయినా తన కృషికేమైనా ప్రయోజనముండక పోతుందా అనుకొన్నాడు.

అతని ధోరణిఅంతావిన్నతర్వాత ఆ నలుగురు పెద్ద మనుష్యులు ఏమాత్రం మానసికచలనం

లేకుండానే వెళ్ళిపోయారు. తమ నాయకత్వానికి అవరోధంగా వుండటానికి పట్టణ నాగరకతను వొంటెనిండా పూసుకొని వచ్చాడని నూతనవ్యక్తిని అసహ్యించుకొన్నారు. అతనికి పరాభవం చేయాలనే దృఢసంకల్పం కల్గింది వారికి మామూలు సభల చర్చల్లో.

* * *

నూతనవ్యక్తి చాలా ఆనందపడ్డాడు, వూరి వారందరు తనను బహిరంగసభకు ఆహ్వానించగానే; తనగాలి వారికి బాగానే సోకిందని భ్రమపడ్డాడు. ఆ సభలో గ్రామస్థులందర్ని నిజమైన మనుష్యులుగ చేయగల ననుకున్నాడు.

సాయంత్రం సభ ప్రారంభమైంది. అనూరాధపురంలో సొంతంగా పాఠశాలను నడుపుతూన్న శర్మగారు వేదిక ఎక్కారు మాట్లాడటానికి— 'భారతీయ విజ్ఞానం' మీద. నూతనవ్యక్తి నాయకుల ప్రక్కనే ముందువరసలో కూర్చున్నాడు. ఉపన్యాసకుడు అందరికి నమస్కారం చేసి వినయవిధేయతని గర్వాన్ని మిళితంచేసిన చిరునవ్వుతో మొదలెట్టాడు.

'ఆంగ్లంలో మాటలాడ్డం ఫేషన్ అయినప్పటికి నేను అలాచేయదలచుకోలేదు. నాకు ఇంగ్లీషు రాదనికాదు. కాని స్వాతంత్ర్యాన్ని అనుభవించే ఏ హైందవుడైనా తన మాతృభాషను విడనాడడు. నాకు సంస్కృతం అంటే అభిమానమని మీ అందరకు విశదమే. అది ఆర్యులభాష. కాని ఏంలాభం? ఆభాష మాకు పరాయిదై పోయింది. అందువలన తెలుగులోనే చెప్పదలచుకొన్నాను నాకు తోచిన నాలుగు మాటల్ని. (సభలో హర్షం).

ఈరోజున మన ప్రాచీననాగరకత ఎక్కడున్నదని వెతికితే యీ మన పల్లెగ్రామాలలోనే కనిపించుతుంది. (చప్పట్లు. నాయకుల కళ్ళలో ఆనందం మెరుస్తుంటుంది. నూతనవ్యక్తికేసి చూస్తుంటారు. మధ్యమధ్య) మన పూర్వీకులు సంపాదించి మనకందించిన విజ్ఞానమును భద్రంగా కాపాడవలసిన ధర్మం మనదైయున్నది. నేటి ఇంగ్లీషుచదువు మనలనే దిక్కునకు తీసుకొనివెళ్తున్నదో మనకందరికి తెలుసు. అపూర్వమైన మన సంస్కృతిని కాపాడుకొనుటకు మన ప్రాచీనగ్రామ జీవనమే ఆధారము. కనుక మన గ్రామములను పట్టణముల ఒత్తిడినుండి, మన గ్రామ ప్రజలను నాగరికులమని గర్వించే మోసకారుల బారినుండి రక్షించుకొనవలయును. (అందరి కళ్లు నూతనవ్యక్తిపై వుంటాయి). ఒక చిన్న ఉదాహరణ యిస్తాను. మన అనురాధపురం ఎవ్వరికి అందనిది. అందుచేతనే మన నాగరకత పూజనీయమైవుంది యింకా. రోడ్లు నిర్మించి రాకపోకల సౌకర్యాలు ఎక్కువ చేసినచో మన ప్రాచీన సంస్కృతి మైలపడి పోతుంది. పట్టణాల అలజడిలో మన ధర్మం అంతా నాశనమైపోక తప్పదు...' .

నూతనవ్యక్తి దిగ్భ్రాంతుడై తానెక్కడుంది తెలీక చూస్తున్నాడు శూన్యంలోకి. ఒక్కసారి అతనావూరిలో నిర్మించుకొన్న సౌధాలన్నీ కూలిపోయాయి. పల్లెటూరి ప్రజలు అమాయకులని, భగవంతుడు సృష్టించిన రూపానికి దగ్గర వారని అనుకున్నాడు.

వారికి సరైన జీవిత విధానాన్ని తెలియ బరుస్తే వింటారనే నమ్మకంతో అవూరు వచ్చాడు. అతడు చూసిన చిత్రం మరోలావుంది. అక్కడ వుండే ధనికులు అహంకారంగలవారు. కక్షల్లో మునిగివుంటారు. బీదవారందరు బానిసలే. గ్రామంలో కట్టు బాటు వుందంటారు. అది సమ్మతంతో కూడిన కట్టు బాటు కాదు. అధికారం వున్న వాడి మాట మిగతావాళ్లు వినటం. ఆ అధికారవంతులను మార్చటం కష్టం. 'వారు తాము ప్రపంచానికి మూలాధారం అనుకొంటారు. హేతు వాదనకు లొంగరు. వారి అధికారం యితరుల అజ్ఞానం పై కట్టబడి వుంది. పునాదిని ఎవరైనా కదపటానికి ప్రయత్నంచేస్తే ఒప్పుకోరు.

తిరిగి ట్రంకు రోడ్డుకేసి ప్రయాణం చేస్తున్నాడు. ఈసారి అపరి మైళ్లు కొన్నియోజనాల్లాగ కనబడ్డాయి. ఒక్కసారి అనురాధ పురాన్ని దూరానించి చూస్తే పాడు పడ్డ దేవాలయం ప్రతిభ తెలిసినదా అన్నట్టు కనపడింది.

అనూరాధపురం అతని దృష్టిలో మరో ప్రపంచం. తానుండే ప్రపంచంలో వున్న విజ్ఞాన సాధనాల్నటిని అవూళ్లో వుపయోగించినా అక్కడిప్రజలకు జ్ఞానం ఎంతో దూరంగానే వుంటుంది. తన అశక్తి అర్థమయింది చివరికి.

# ఒక రాయి కథ



మల్లంపల్లి సోమశేఖర శర్మ

అంతా హడావుడిగా ఉంది అక్కడ. తవ్వేవారు తవ్వుతూ ఉంటే పారలతో మట్టి తీసేవారు తీస్తున్నారు; తట్టలలోనికి ఎత్తి పోసేవారు పోస్తున్నారు. ఒకటే గందరగోళం. అలసట కనబడకుండా ఉండడానికి ఆ కార్మికులలో ఒకడు పదం ఎత్తుకొని పాడుతూ ఉంటే మిగిలినవారు వంతపాట పాడుతున్నారు. అందరూ రెక్కలు ముక్కలయేటట్టు పాటుపడుతున్నారు. అయినప్పటికీ దగ్గర ఉండి యజమానులు కార్మికులచేత తరిమితరిమి పని చేయిస్తున్నారు. పని తొందరగా పూర్తి కాకపోతేనా, చండశాసనుడు సర్వాధికారి, సర్వసైన్యాధిపతి నెపోలియను; గంటలప్రకారం నిమిషాలప్రకారం పని పూర్తిచేయించకపోతే, పెట్టిన గడువులో పని పూర్తి కాకపోతే ఇక నెపోలియను బోనపార్ట్ ముందు బతుకగలవా డెవడు?

ఫ్రెంచి ప్రజానాయకుడు నెపోలియను అంటే ఫ్రాన్సుదేశీయులే కాదు, యూరోపులోని ప్రతి రాజ్యంవారూ గడగడ లాడుతారు. అతడు అంతటి ప్రతాపవంతుడు; అతని యుద్ధవిద్యా వైశద్యం అటువంటిది. ఫ్రెంచి ప్రజారాజ్య సంస్థాపనకు కినిసి ఆనాడు ఫ్రాన్సుదేశంమీద కత్తి దూయని యూరోపియను రాజ్యమూ లేదు, నెపోలియను దండెత్తి వెళ్లి సాధించని దేశమూ లేదు. ఫ్రాన్సుమీదికి సాగివచ్చిన దండయాత్రలన్నిటిలోనూ ప్రధానంగా ఇంగ్లీషువారికుతంత్రమే కనిపించింది నెపోలియనుకు.* అది పొరపాటు కావచ్చు. సత్యమే కావచ్చు. దీనికితోడు ఇంగ్లీషువారిమూలంగా హిందూదేశంలో ఫ్రాన్సుదేశీయులకు జరుగుతున్న పరాభవంకూడా మహాదేశాభిమాని, జాత్యహంకార పూరితుడు నెపోలియను మనస్సులో సూది గుచ్చుకొన్నట్లు కరేలుమని బాధించింది.

కానయితే ఒకరి ఎక్కువా లేదు, వేరొకరి తక్కువా లేదు. ఇంగ్లీషువారు ఫ్రెంచివారు కూడా ప్రాచ్యదేశవర్తకంలో అత్యధికలాభాలు గడించి సంచులు నింపుకోడానికి హిందూదేశం చేరినవారే. లాభాలు మరిగి, అంతటితో సంతృప్తిపడక దేశంలో పరిపాలన సాగిస్తున్న ప్రభువులలో ఒండొరులకు గల విద్వేషాలను, శత్రుత్వాలను తమకు లాభకరంగా తీసుకొని ఒక్కొక్కరి పక్షం చేరి వారి శత్రువులను ఓడించి, ఈ విధంగా ఉభయులూ అహమహమికతో పోరాడి రాజ్యాలు సంపాదిస్తూ వచ్చినవారే. ఈరాజ్యసంపాదనపు పోటీలో, ఈవలస సామ్రాజ్య నిర్మాణ ప్రయత్నంలో చివరికి ఇంగ్లీషువారికే పైచేయి అయి వారి ప్రభ వెలగడం, ఫ్రెంచివారి చెయ్యి కిందయి వారిప్రభ దిగనారుకు పోవడం చూసి విజయదర్పితుడయిన జాత్యభిమాని ఫ్రెంచి నాయకుడు నెపోలియను సహించగలడా? ఇంగ్లీషువారికి హిందూదేశంలోనయినా మంచి పేరు ఉంది గనుకనా? వారు అవలంబిస్తూ వచ్చిన కుటిల రాజనీతికి ఒడలుమండి, ఎప్పటికయినా తనకూ తన రాజ్యానికీ ముప్పు తప్పదని బాగా గ్రహించి మైసూరు ప్రభువు హైదరల్లీకొడుకు టిప్పు సుల్తాను వారిని దేశంలోనుంచి తరిమివేయడంలో తనకు సహాయపడవలసిందని తనతో జరిపిన ఉత్తర ప్రత్యుత్తరాలవల్ల ఇంగ్లీషువారిమీద దెబ్బతీయడానికి మంచి అవకాశం దొరికిందనుకొన్నాడు నెపోలియను. ఇంగ్లాండుదేశపు బింకానికి, ఇంగ్లీషువారి ఈ యుద్ధనీతికి కారణం వారి ప్రాచ్యదేశ వర్తకమే అని గ్రహించాడు; వారి వర్తక వ్యాపారాన్ని విధ్వంసం చేసి, వీలయితే ఇంగ్లీషువారిచేత బాధితములయిన రాజ్యాలకు సహాయం వెళ్ళవలెనని నిశ్చయంచేసుకొని ప్రాచ్యదేశాలతోడి రాకపోకలలో కీలకస్థానం

ఈజిప్టుదేశానికి సైన్యాన్ని, నౌకాదళాన్ని తీసుకొని మధ్యధరా సముద్రంమీదుగా పయనమయినాడు నెపోలియను.

నెపోలియను ప్రయత్నం ఇంగ్లీషువారుగ్రహించకపోలేదు. ఈజిప్టును వెదుకుతూఉండగానే తోవలో నెపోలియనును అడ్డగించి అతని ఈజిప్టు దండయాత్రను భగ్నంచేసి ఫ్రెంచి నౌకాబలం నడుము విరుగగొట్టవలసిందని ఇంగ్లాండు ప్రభుత్వంవారు నౌకాదళమిచ్చి నెల్సనును పంపించారు; కాని నెల్సను కనులుగప్పి, అతని నౌకాదళానికి చిక్కకుండా కతిపయ ప్రయాణాల మీద 1798 లో నెపోలియను ఈజిప్టుదేశం చేరినాడు.

ఈజిప్టుకు మబ్బులేని పిడుగులాగు వచ్చింది ఈ ఫ్రెంచిదండయాత్ర. దీనికి ఈజిప్టుదేశీయులు భయ విభ్రాంతులయినారు. వారు కలలోనూ అనుకోనిది ఈ దండయాత్ర. ఎట్లాగో మెల్లిగా నిర్వేరపాటునుంచి తేరుకొని సైన్యాలు సమకూర్చుకొని వారు భయంకరంగా శత్రువులను ఎదిరించి పోరాడినారు; కాని నెపోలియనును ఎదిరించి రణరంగంలో నిలిచి పోరాడగల శూరులు యూరోపియను రాజ్యాలలోనే అరుదు. అటువంటప్పుడు వాటికంటె అన్ని విధాలా ఎంతో వెనుకబడ్డ ఈజిప్టులో ఎక్కడుంటారు? సామాన్యుడా నెపోలియను? మహాప్రతిభాశాలి, అతని పుట్టుకతో యుద్ధతంత్రం ఒక అడుగు ముందుకు సాగింది. ఆ తంత్రపాలుడి నాయకత్వాన యుద్ధ వ్యూహారచనలో కొత్తవిన్నాణం వచ్చింది. సమరాంగణ చక్రవర్తి నెపోలియను, అతనిని అడ్డి నిలవగలవారెవరు? అతిశీఘ్రకాలంలోనే ఈజిప్షనులు (ఈజిప్టు దేశీయులు) నెపోలియను విక్రమఖడ్గానికి దాసోహ మన్నారు. ఈజిప్టు నెపోలియనుకు వశమయింది.



ఈజిప్టుదేశంలో 'గిజే' అనేచోట ఉన్న బ్రహ్మాండమైన పాషాణవిగ్రహం. దీనిపేరు స్ఫింక్స్, నరసింహాకృతిలోఉన్న యీవిగ్రహంఎత్తు 200 అడుగులు. ఇది ఏ కాలంనాడు ఎవరు నిర్మించారో తెలియదు; అనాదినుండీ ఉంది.

ఈజిప్టు అంటే చాలా విచిత్రమయిన దేశం. ఆదేశంనిండా అతిపురాతనకాలంనాటి వింతలే, విశేషాలే. అక్కడ మానవహస్తం నిర్మించిన శిలానిర్మాణాలుఅపూర్వమయినవి; అంతటిఆశ్చర్యకరమయిన బృహన్నిర్మాణాలు మరి ఏ దేశంలోను కానరావు, 'పిరమిడ్లు' అన్నది యూరోపియను జాతులు వాటికి పెట్టినపేరు. ఒకటా రెండా ఇట్టి పిరమిడ్లు, అరవై డెబ్భయికి పైనే ఉన్నవి వాటిలో చెప్పుకోదగినవి; ఇంక చిన్న చిన్న నిర్మాణాలకు వింతలకు విశేషాలకు లెక్కలేదు. ఎప్పటివి ఈ పిరమిడ్లు, ఎందుకు నిర్మించినట్టు వీటిని, ఎవరు నిర్మించినట్టు? వాటిని చూసినవారు ఎందరో శతాబ్దాలనుంచి వేస్తూ వస్తున్న ప్రశ్నలే ఇవి,కొత్తవికావు. కాని వాటికి సంతృప్తికరమయిన సమాధానం ఏది? అవి సృష్ట్యాదినుంచీ ఉన్నవనేవారే; కాని ఈ సమాధానం నిజమే అని నమ్మినవారు—ఎక్కడో ఎందుకు? ఈజిప్టులోనే లేరు. ఆ పిరమిడ్లు ఎప్పటివో, ఎందుకు కట్టినారో, ఎవరు కట్టినారో ఈజిప్షనులకు మాత్రం ఏమి తెలుసు? తరతరాలనుంచి ఆ దేశంలో అవి ఉన్నమాట నిజం. అక్కడి రాళ్ళమీద పంక్తులు తీర్చి చెక్కిన బొమ్మలు—ఏమిటవి? పంక్తులు పంక్తులుగా ఉన్నవి. అవి ఏదయినా వ్రాతా? కాకపోతే పంక్తులు తీర్చి ఎందుకు వ్రాయాలి? ఎక్కడయినా బొమ్మల అక్షరాలుంటవా? బొమ్మల అక్షరాలేమిటి? ఇదేమి లిపి-చిత్రలిపి! దాని కర్థమేమిటి? ఎవరయినా చదువగలరా అది లిపే అయితే? బొమ్మలు చదవడమెట్లా? ఎవరికి తెలుసును అది లిపి అవునో కాదో? ఆ బొమ్మలు ఏమిటో ఎందుకు వ్రాశారో ఎవ రెరుగుదురు? ఆ విధంగా ప్రతి రాతిమీదా అన్నన్ని బొమ్మలు విసుగు అసుగు లేకుండా వ్రాయడానికి వారికి తీరి కెక్కడిది? ఎంతటి కళానిపుణులు వారు! చిత్రాలు గీయడంలో ఎంతటి సిద్ధహస్తులో వారు! అంతా విచిత్రమే, ఈజిప్టుదేశమే వింత!

ఈజిప్టు వింతలు విశేషాలనుగురించి ఫ్రాన్సు దేశంలో ఉన్నప్పుడే విన్నాడు నెపోలియను. నెపోలియనుకు రణక్రీడ ఎంతటి ప్రియమయినదో ఇటువంటి వింతలనుగురించీ, విశేషాలనుగురించీ తెలుసుకోవాలన్న కుతూహలమూ అంత బల



ఈజిప్టుదేశంలోని "పిరమిడ్"అనే రాతికట్టడం ప్రపంచంలోని ఏడు వింతల్లోనూ, 'చియాప్స్' అనే ఈజిప్టురాజుకు సమాధిగా నిర్మింపబడ్డది. దీనిని కట్టడం ఒకటికి సుమారు లక్షమంది మనుష్యులు యిరవై సంవత్సరాలు శ్రమించి కట్టారని శాస్త్రజ్ఞులంటారు.

మయినదే. అతనిది విచిత్రమయిన ప్రకృతి. అతడు విద్యాప్రియుడూ కళాభిగతుడూ కూడాను. కాకపోతే దైత్రయాత్రకు వెడుతూ నెపోలియనుకు పూర్వం ఎవ్వరయినా దండుతోపాటు విద్వాంసులను వెంట బెట్టుకు వెళ్ళడం మనం విన్నామా? కన్నామా? ఈజిప్టు దేశం దండయాత్రలో వంవమంది, ప్రాచ్య విద్యా విశారదులను, వైజ్ఞానికులను కూడా వెంట బెట్టుకు వెళ్ళినాడట నెపోలియను. ఈజిప్టు ఫ్రెంచిసేనకు వశం కాగానే ఆదేశంలోని

పురాతన వస్తు విశేషాలను, నిర్మాణాలను, ఇదేమిటి అదేమిటి, అక్కడజము గొలిపే సమస్త వస్తు విశేషాలను, వింతలను జాగ్రతగా పరిశీలించి వాటిని గురించి నివేదిక తయారు చేయవలసిందనీ, వాటిలో వీలయినవి ప్యారిస్ నగరానికి తీసుకు వెళ్లడానికి సేకరించవలసిందనీ నెపోలియను తాను కూడా తీసుకు వచ్చిన విద్వాంసులకు ఆజ్ఞాపించాడట! ఇంకా నెల్సను తన నౌకాదళంతో మధ్యధరా సముద్రంలో ఫ్రెంచి నౌకాబలం కోసము నెపోలియను కోసమూ, గాలిస్తునే ఉన్నాడు. ఇక్కడ నెపోలియను అప్పుడే ఫ్రెంచి ప్రభుత్వంస్థాపించి, విద్యా విషయాల దగ్గరనుంచి పరిపాలన విషయాల వరకు అన్నీ కట్టు దిట్టముగా, ఎగుడు దిగుడులు లేకుండా చదునుగా సాగిపోయేట్లందుకు ఏర్పాటులు చేస్తూనే ఉన్నాడు. అన్ని పనులు చకచక సాగి పోతున్నవి.

నెపోలియనుకు తెలియక పోలేదు ఇంగ్లీషు వారు తన్ను వెంబడిస్తున్నారని. వారికీ తనకూ ఎక్కడో అక్కడ - ప్రాయికంగా ఈజిప్టులోనే -సంగ్రామం అనతికాలంలోనే జరుగుతుందని అతనికి తెలుసును. అందువల్ల ఈజిప్టుదేశంలో ఫ్రెంచి వారికి వశమయిన కోటలను అన్నిటిని, శిథిలమయినవాటిని మరమ్మతులుచేసీ, చక్కగా ఉన్న వాటిని ఇంకా బలపరిచీ, కట్టుదిట్టం చేయవలసిందని నెపోలియను ఆజ్ఞ. నెపోలియను ఆజ్ఞ అంటే అది సుగ్రీవాజ్ఞే. నెపోలియను సేనానులు, ఇంజనీర్లు అందరూ ఈజిప్టు కోటలను దుర్భేద్యంగా బలపరిచే ప్రయత్నంలో ప్రవృత్తులయి ఉన్నారు.

ఇటువంటి సందర్భంలో 1799 వ సంవత్సరం ఆగస్టు మాసములో—ఒక రోజున.

రోజెట్టా పట్టణానికి నాలుగుమైళ్ళదూరంలో ఉన్న సెయింట్ జూలియను కోటవద్ద పనులు చురుకుగా జరుగుతున్నవి. పనివారిలో తవ్వేవారు తవ్వుతున్నారు. పారలతో మట్టి ఎత్తి పోసేవారు పోస్తున్నారు. ఆ సెయింట్ జూలియన్ కోటను శత్రుజన దుస్సాధ్యంగా చేయాలని దానిచుట్టూ కందకం తవ్వుతున్నారు. ఆ సాయంత్రానికి కందకం పని పూర్తికావలెనని మేస్త్రీలు కార్మిక జనాన్ని హెచ్చరిస్తున్నారు. పనంతా ఇంజనీరు బౌస్సర్డ్ ప్రత్యేక పర్యవేక్షణకింద జరుగుతున్నది. బౌస్సర్డ్ ఇక్కడికి అక్కడికి వెళ్లి పని పరిశీలన చేస్తున్నాడు. అతడు ఒకరితో మాటాడుతున్న సమయంలో అతనికి సమీపాన్నే ఉన్న ఒక పనివాడు నేలలోనికి గునపం పొడవగానే ఖంగుమని శబ్దమయింది. దాన్ని ఆలకించాడు బౌస్సర్డ్. అతని మనసులో ఆశలు చిగిరించినవి; అదేమిటో చూదామని అక్కడికి వెళ్లి తవ్వించాడు. అక్కడ ఏమి బయటబడకూడదు? ఈజిప్టు చిత్రమయినదేశం. నగలు దొరకవచ్చు, నాణేములు దొరకవచ్చు, వెండి దొరకవచ్చు, పసిండి దొరకవచ్చు- ఏది దొరకరాదు? ఆశతో బౌస్సర్డ్ ఖంగుమన్నచోట తవ్వించాడు. తవ్వించగా బయలుపడింగి రజతమూకాదు రత్నమూకాదు, కనకమూకాదు కాంస్యమూకాదు,అది వట్టికర్లరాయి బసాల్తుశిల.

ఆ శిలను పైకి తీయడానికి వీలుందో లేదో అని చూశాడు బౌస్సర్డు. అది అట్టే అంత పెద్ద రాయి కాదు. దానిని పైకి తీశారు. ఈజిప్టులోని వింతలు విశేషాలనుగురించి విన్నవాడే బౌస్సర్డు, పిరమిడ్లు చూశాడు, అక్కడి రాళ్ళమీద చెక్కిన బొమ్మలనూ చూశాడు. ఈ రాతిమీదకూడా ఏవయినా బొమ్మలున్నవా? బౌస్సర్డు దానిని కడిగించి బాగా పరిశీలించాడు; చూస్తే దానినిండా పంక్తులు తీర్చి ఎగువనుంచి దిగువవరకు వ్రాసిన ఏవో బొమ్మలూ వంకరటింకర గీతలూను. అటువంటి 'పిచ్చి' రాళ్లను ఎందరు ఇదివరలో చూశారో, అటుతరువాత ఎందరు చూశారో, దానిని జాగ్రత పెట్టాలనే శ్రద్ధ అందరికీ ఉంటుందా? అందరూ బౌస్సర్డులవుతారా? ఈ వంకరటింకర గీతలు బొమ్మలు ఏమిటో తెలుసుకోవాలని బౌస్సర్డుకు కుతూహలం కలిగింది; కాని అతనికి అతీతమయిన పని అది. ఎంత తల బద్దలు కొట్టుకొన్నా ఒక్క గీటు, ఒక్క వంకర, ఒక్క బొమ్మ-ఏమీ తెలియలేదు; కాని దానిని జాగ్రత పెట్టాలనే సంకల్పం కలిగింది బౌస్సర్డుకు. వెంటనే అతడు ఆ రాతిని అలెగ్జాండ్రియా రేవుపట్టణంలోఉన్న జనరల్ మెనక్ కు పంపించాడు భద్రంగా.

ఆ రోజులలో ఇటువంటి వింత శిలలను, అందమయిన ప్రాచీన శిల్ప శిలాఖండాలను,

అపూర్వమయిన పురాతన వస్తుసామగ్రిని సేకరించడం విద్యాధికులలోను, ధనికులలోను, రాజులలోను, రాజబంధువులలోను, అధికారులలోను ఆచారమయింది. అవి వారి కళాభిరతికి, సంస్కారానికి తార్కాణగా ఉండేవి. అవి ఎవరివద్ద యెన్ని ఎక్కువగా ఉంటే వారికి ఆనాడు అంత గౌరవం. ప్రాచ్య దేశాలలోను ఈజిప్టులోను దొరకిన ఇట్టి పురాతనవస్తు సామగ్రి - రాతిగద్దీ, కర్రగద్దీ, లోహపుదీ - అప్పటికే యూరోపులోని ప్రధాన నగరాలలోని గొప్ప భవనాలను అలంకరించినది. అవిధంగానే ఫ్రెంచి జనరల్ మెనక్ ఈవిచిత్ర శిలను సొంతం చేసుకొని ఫ్రాన్సుకు గొనిపోయి తన యింటికి చేర్చేటందుకు అంతా సర్వసిద్ధం చేశాడు; పగిలిపోకుండా దానిని నూలు బట్టలలో చుట్టబెట్టి, చాపలలో వేసి చుట్టి చక్కగాకట్టి ఓడమీద ఎక్కించి ఎగుమతిచేయడానికి సిద్ధంగా ఉంచాడు. ఈ విధంగానే ఈజిప్టులో సేకరించిన వింతలయిన ప్రాచీన వస్తువులు అనేకాలను ఫ్రెంచివారు తమ రాజధానీ నగరం ప్యారిస్‌కు తీసుకుపోవడానికి ఈజిప్టురాజధాని కెయిరో నగరానికి చేర్చారు.

ఇంతలో కాలం తారుమారయింది నెపోలియను పదకాలు వేసినవి వేసినట్టు, అనుకొన్నవి అనుకొన్నట్లు సాగలేదు. అతనికి ఎన్నో ఒడిదొడుకులు సంభవించినవి. అతని నౌకాబలం నెల్సను నౌకాదళంతో జరిగిన నౌకాయుద్ధంలో హతమయింది. సుప్రసిద్ధమూ ముఖ్యమూ అయిన ఈజిప్టురేవు పట్టణం అలెగ్జాండ్రియా ఇంగ్లీషువారి హస్తగతమయిoది. ఆ రేవుపట్టణాన్ని శత్రువులకు సమర్పిస్తూ చేసుకొన్న ఒడంబడిక షరతులలో ఈజిప్టుదేశపు ప్రాచీన వస్తు విశేషాలను గురించిన షరతుకూడా ఉన్నది. ఇది ఆశ్చర్యకరమయిన విషయంకాదూ? ఆషరతు ప్రకారం ఫ్రెంచివారు ఈజిప్టులో తాము సేకరించిన పురాతన వింత వస్తువిశేషాలను ఇంగ్లీషు జనరల్ హాట్చిన్సనుకు ఒప్పగింత పెట్టవలసివచ్చింది ఆవిధంగా బ్రిటిషు ప్రభుత్వానికి ఇచ్చివేయవలసివచ్చిన వాటిలో బౌస్సర్డుకు దొరికిన ఈ వింతశిల ఒకటి. ఇది నా సొంతఆస్తి అని పేచీ పెట్టి జనరల్ మెనన్ ఆశిలను బ్రిటిష్‌వారికి వశపరచడానికి నిరాకరించాడు. ఈ విషయం బ్రిటిష్ జనరల్ హాట్చిన్సనుకు తెలిసింది. వెంటనే అతడు మేజర్ జనరల్ హెచ్. టర్నరు నాయకత్వాన ఫిరంగిసేనలోని ఒక దళంవారిని జనరల్ మెనక్ మీదికి పంపిసాడు. ప్రాచీన శాసన శిలకోసం దండయాత్ర! వింతకాదూ? ఆకాలంలో అన్నీ వింతలే - ఈజిప్టే పెద్ద వింత! టర్నరు తన దళంతో వెళ్లి జనరల్ మెనక్ వద్దనుంచి ఆ శిల తీసుకొని దానిని వశపరచుకొన్నాడు; తరువాత దానిని అలెగ్జాండ్రియా రేవులో స్వాధీనపరచుకొన్న ఒక మహా యుద్ధనౌకమీద ఎక్కించి ఇంగ్లాండు దేశానికి పంపివేశాడు.

ఆయుద్ధనౌక ఆవింతశిలని తీసుకొని 1802 వ సంవత్సరం ఫిబ్రవరి మాసంలో పోర్ట్స్మత్ రేవుపట్టణం చేరింది. సెక్రటరీ ఆఫ్ స్టేటు అనుమతితో ఆరాతిని లండను నగరంలోని ఏంటిక్వేరీస్ సంఘంవారి (Society of Antiquaries) కార్యాలయంలో చేర్చినారు. ఆటు పిదప ఆరాతిని అక్కడనుంచి బ్రిటిష్ మ్యూజియముకు తీసుకవెళ్ళినారు. ఇప్పటికీ ఆశిల బ్రిటిష్‌వారి విజయదర్పానికి సూచకంగా బ్రిటిషు మ్యూజియములో ఉన్నది. రోజెట్టా నగరానికి సమీపాన ఉన్న కోటవద్ద బయలుపడడంవల్ల అది రోజెట్టా శిల (Rosetta Stone) అని ప్రసిద్ధమయింది. అది బయలుపడడంతో ఈజిప్టు ప్రాచీన చరిత్ర విజ్ఞాన సౌధానికి తలుపులు విడివడ్డవి.



# ఆస్థానకవి సన్మాన మహోత్సవం

సన్మానసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారిట్లు ప్రకటిస్తున్నారు:—

తాత్కాలిక రాజకీయాలు జాతిజీవన సముద్రమందు లేచిపడే తరంగాల వంటివి. తరతరాలుగా వచ్చే కావ్య గాన చిత్ర శిల్పాది కళలచే సంస్కృతమైన జాత్యంతరంగం ఈ పై పై సంక్షోభములను బొరయక నిర్వికారమై నిండారి, నిబ్బరంగా ప్రవహిస్తూ ఉంటుంది. అట్టి కళామయ ప్రపంచమందే సర్వమానవజాతియు ఏకత్వమును భజించును.

మహారాజులు మన కవిత్వాది కళలను పోషించే రోజులు వెనుకబట్టినవి. నేటి ప్రజాతంత్ర రాజ్యము లే కళలను రక్షించి, తద్వారా జాత్యాత్మను రక్షించుకోవాలి. మన ప్రభుత్వం ఈ పరమార్థాన్ని గుర్తించి, అరువదేండ్లుగా ఆంధ్రకవితారాజ్యమును నిస్సపత్నంగా ఏలుకొంటున్న కళాప్రపూర్ణులు, శతావధానులు నగు బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రిగారిని ఆంధ్ర కవితాపీఠమున పట్టాంగట్టడం ఎంతైనా తగియున్నది. ఇంక ఆంధ్రజాతికి కవితాపీఠం శ్రీ శాస్త్రిగారిదే.

79 ఏండ్ల వయసున, నీరసించి, మంచము పట్టియున్న శ్రీ శాస్త్రిగారిని ఉచితరీతిని సత్కరించి, అభినందింప నాంధ్రజాతి కుతూహల పడుచున్నది. వారి కట్టి సత్కారం జరిపే శుభ సమయం ఆంధ్ర కళాసరస్వతికి కల్యాణ ముహూర్తంవంటిదిగాగ, ఆంధ్రజాతి తన సర్వ కళావైభవము కొక్కసారి దర్శించి ఆనందించుట యుక్తము.

కావున జూను నెల మొదటివారంలో, యావదాంధ్రజాతిపక్షాన విజయవాడ పురమందు అట్టి కళామహోత్సవం మూడునాళ్ళు జరపనిశ్చయించి, ఆహ్వానసంఘము మేర్పరచితిమి. ఆ యుత్సవములలో 1 శ్రీ శాస్త్రిగారిని సమ్మానించి అభినందించుటకు, 2 నృత్యగీత కావ్య నాటకాది ప్రదర్శనములు, సారస్వతసభలు జరుపుటకు, 3 శ్రీ తిరుపతి వేంకటకవుల సాహిత్య శక్తిని, వ్యక్తి మహిమనుగూర్చి విమర్శగ్రంథం వ్రాయించి ప్రకటించుటకు, 4 తిరుపతి వేంకట కవుల త్రివర్ణ తైలచిత్రము రచింపించి, యోగ్య స్థలమున నెలకొల్పుటకు- ఇంకను యుక్తమని తోచే కార్యములు జరిపించుటకు నిశ్చయించినాము.

ఆ శుభసమయమందే మద్రాసు ప్రభుత్వము శ్రీ శాస్త్రిగారిని ఆంధ్ర కవితాపీఠమున ప్రత్యక్షముగా నభిషేకించును.

బహుళ ద్రవ్య సాధ్యమగు ఈ మహాకార్యమునకు కళాప్రియులు, ఉదారులు నగు శ్రీమంతులు భూరివిరాళము లొసగియు, కవి పండిత గాయక చిత్రకార నటక లోకము ఆ యుత్సవములలో పాల్గొనియు మా పూనిక తుదముట్టింప వేడుచున్నాము.

విరాళములు కోశాధ్యక్షులగు డా. ఘంటసాల సీతారామశర్మ, బకింగ్ హామ్ పేట, విజయవాడకు చెక్కుద్వారాగాని, మనియార్డరుద్వారాగాని పంప ప్రార్థన.

కార్యక్రమాది వివరములు తరువాత ప్రకటింపబడును.

# నౌకాచరితం

★ ★ అనువాదకుడు: ఆర్. సోమసుందర్రావు

అపరాహ్ణం ముగియవచ్చింది. కరాళ-ధవళ మేఘాలు ఆకాశంలో వివిధ రూపాల్ని పొందుతున్నాయి. దూరంలో గ్రద్దలు ఎగురుతున్నాయి. నది అవతలిగట్టున ఇసుకతిన్నెలు రాసులురాసులుగా పడిఉన్నాయి. సూర్యుని స్వర్ణరశ్మిలో తెల్లని ఇసుకకణాలు మెరుస్తున్నాయి. పిల్లతెమ్మెరల గిలిగింతలకు నదీతరంగమాలికలు కిలకిలా నవ్వుతున్నాయి.

నావ మందగమనంతో సాగుతూవస్తూవుంది. పశ్చిమజలధిలో సూర్యభగవానుడు మునుగుతున్నాడు. చరమభానుని శబలవర్ణం ఆకాశమంతటా ఆవరించింది.

వృద్ధజగధరుడు నావపై ఆసీనుడై హుక్కాను సేవిస్తున్నాడు. కొడుకు గజాధరుడు మెల్లగా తెడ్డువేస్తున్నాడు. ఛప్-ఛప్-ఛప్ అనే శబ్దం మాత్రం పరిసర నీరవతను భంగపరుస్తూవుంది.

నావపై గడ్డిమోపులు వేయబడి ఉన్నాయి. మందగతితో నావ యివతలిగట్టును చేరుతూవుంది. వృద్ధజగధరుని కిదే వృత్తి. నావను ఆ తీరంనుండి ఈ తీరానికి ఈ తీరంనుండి ఆ తీరానికి వస్తుసామగ్రితోను, ప్రయాణీకులతోను చేర్చడమే; ఖాళీసమయాలలో పచ్చిక మోపులను యెక్కించడమే. నావయే అతని జీవనోపాధికి ముఖ్యసాధనం.

దినం అంతమయింది. నావ తీరం చేరుతుంది. ఆలయ ఘంటికాస్వనాలు, శంఖారవాలు, పూజాలాపనలు ప్రారంభమై ప్రతిజీవి నరాలలోను భక్తిరసాన్ని ప్రవహింపజేసినాయి. గజాధరుడు దగ్గరిగుంజకు నావను కట్టినాడు. నావపైనున్న పచ్చిక మోపులనుదించి ఊరివైపు నడకను సాగించినాడు.

ముసలి జగధరుడు అంధకారంలో తంబాకును సేవిస్తూ అర్ధనిమీలిత నేత్రుడైనాడు. మంచుపొగల తెరలలో ఊరి దీపాలు మసకమసకగా కనబడుతున్నాయి. దూరపు చెట్ల నీడల నుండి ఆకుల గలగల స్వనాలు నదీ జలంపై ప్రాకుతున్నాయి.

నావపై యేదో చప్పుడైంది. ఎవరో స్త్రీమూర్తి యెక్కినట్లు, కాళ్ళ అందెల చప్పుడు వినబడింది. పరధ్యానంలో వున్న జగధరుడు 'ఎవరూ?' అని ప్రశ్నించాడు.

'నీ జీవిత సాధనమగు ఈ నౌకనే నేను'— అన్నది స్త్రీమూర్తి—'ఇంతవరకూ నా విలువను నీవు గ్రహించలేదు. ఇప్పుడు తెలియజేయడానికి వచ్చినాను. నీ చిన్నవాడు మీ అవ్వ కథల్ని చెప్పడం నీవు యెంతో కుతూహలంతో విన్నావు. తరువాత నీవే నీబిడ్డలకు కథలు చెప్పడం మొదలు పెట్టినావు ... మరి నేడు మాజాతి శోకపూరిత చరిత్రను నీవు వినుదువుగాక. మానవులగు మీరంతా యెంతటి స్వార్థపరులో తెలుసుకొందువుగాక...ఆఁ...కాలం తారుమారైంది.'

ఒక దీర్ఘనిశ్వాసం ఆ స్త్రీమూర్తినుండి వెలువడింది. ఆ దీర్ఘనిశ్వాసాన్ని జగధరుడు పూర్తిగా అనుభవించాడు. అతనిసంభ్రమాశ్చర్యాలకు అంతే లేదు. అతడు పిచ్చివాడు కాలేదు గదా! లేక కలను గంటున్నాడా!

నౌకాదేవి కథను ప్రారంభించింది.

పదిహేను వందల సంవత్సరాలకు పూర్వం:

ప్రతీహారి ప్రవేశించి-'దేవరకు జయమగుగాక. దేవా! మహాసామంతులు ద్వారమువద్ద వేచియున్నారు.'

చింతా నిమగ్నుడై, రాజు సింహాసనమున ఆసీనుడై ఉంటాడు. ప్రతీహారివైపు తిరుగకనే 'లోనికి రానిమ్ము' అంటాడు.

ప్రతీహారి నిష్క్రమిస్తాడు. కొన్ని క్షణాలకు మహాసామంతుడు లీలాధరుడు యోధవేషంతో ప్రవేశించి రాజునకు నమస్కరించి అంటాడు- 'ప్రభూ! శ్రావణ నగరవాసులు మీ ఆగమనానికై ప్రతీక్షిస్తున్నారు. ప్రభూ! ఇంకా ఆలస్యమా?'

రాజు తీవ్రాలోచనా నిమగ్నుడౌతాడు. కొన్ని క్షణాలకు మహాసామంతుడు మళ్ళీ—
'ప్రభూ మీ ఆజ్ఞయేమి?'

రాజు తలెత్తి—'సామంతోత్తమా! గంగా నదిని దాటుటకేదైన సాధన కల్పించారా?'

మహాసామంతుడు మందస్మితంతో—'ప్రభూ సర్వసన్నాహంతో సంసిద్ధులమై యున్నాము. దుర్గా, చండీ, యశోధరా యిత్యాది నౌకలు అపరిమిత సహాయం ఒనగూర్చినాయి. ఇప్పుడు కేవలం మీ ఆగమనానికై మాత్రమే మేమంతా వేచి యున్నాము.'

సుదూరంలో సైనిక పటహ నినాదాలు, సింహనాదాలు అంతకంతకు అధికమైనాయి. పౌరుల కోలాహలం వీరావేశంతో ఉట్టి పడుతూ వుంది. శ్రావస్తీ రాజుయొక్క అధికాంశభూమి దస్యులచే ఆక్రమింపబడింది. ఇందులో కోశలాధిపతి హస్తంకూడా వుంది. శత్రువుల దాడిని అరికట్టుటకై శ్రావస్తీ నగరవాసుల వీరావేశానికి అంతేలేదు.

'శ్రావస్తి నేడు విషమపరీక్షలో వుంది. కేవలం దస్యులనే కాక కోశలాధిపతి సైన్యాలనుకూడ యెదుర్కోవలసి వస్తుందేమో! శ్రావస్తీ గంభీర శాంతి సాగరంలో నేను వీరావేశ పూరితమైన తుఫాను రేకెత్తింపి. సామంతోత్తమా! నేనూ సంసిద్ధుడనే'—రాజు గంభీరముగా పలికినాడు.

మహాసామంతుడు రాజునకు నమస్కరించి నిష్క్రమిస్తాడు.

మహారాజు ఖడ్గకవచ కేయూరాంగదాదులను ధరించి మాతృ మందిరానికి వెళ్ళినాడు. విధవతల్లి ఆశీర్వదించింది. రాణి హారతియెత్తి సిందూర తిలకాన్ని నొసట పెట్టింది.

ఒక్కుమ్మడిగా తూర్యనాదాలు గగనానికెగిసినాయి. పౌరులసమూహం రెండుపాయలైంది. నీలాశ్వం అధిష్ఠించి మహారాజు కదలినాడు. జయజయధ్వనులు మిన్నుముట్టాయి. ధరిత్రి జలదరించింది. వాయువు కొన్నిక్షణాలు స్తంభీభూతమైంది.

ముందు పటహ సింహనాదాలతో, వెనుక అశ్వికులతో వారి వెనుక గజారూఢులైన సామంత మహాసామంత మహారాజాదులతో, వీరి వెనుక గుల్మపతి, అశ్వపతి మొదలగు వారితో, అందరికీ వెనుక పౌరుల సమూహంతో పగతీర్చుకొనుటకై బుసబుసలుకొట్టు కాలసర్పం వలె పటాలం బయలుదేరింది.

దూరం నుండియే పూర్ణ గంగానది తరగహస్తాలతో వీరందరినీ ఆహ్వానించింది. కొన్ని సైనిక నికాయాలు ఏనుగుల సహాయంతో అప్పుడే నదిని దాటినాయి. మిగిలిన సైన్యం కాత్యాయినీ, దుర్గా, చండీ, యశోధరా,—ఓడలపై నెక్కింది. యుద్ధసామగ్రికూడా ఎక్కించబడింది. మహారాజు సామంతాది వర్గముతో నావనెక్కినాడు. పౌరులు కూడ నౌకలనెక్కినారు. యుద్ధనావలు గాలికెగురు తెల్లని తెరచాపలతో గంగానదిపై సాగిపోయాయి. మహారాజు తమతో వస్తున్నాడని నౌకలు ఠీవితో కదలినాయి. దీనికి సహాయముగా గంగానది తన వీచికాహస్తాలతో వానిని అవతలితీరాన్ని చేర్చింది.

'నాడు మేమంతా నిజముగా దుర్గా చండీ కాత్యాయినీలమే...ఏం వింటున్నావా నువ్వు?' అంటూ నౌకాదేవి జగధరుని కల్పనాలోకం నుండి యెకాయెకి క్రిందికీడ్చింది.

'ఆఁ... వింటూనేవున్నాను'—అంటూ వృద్ధ జగధరుడు ఒక నిశ్వాసాన్ని వదలినాడు. హుక్కాను ఓ మూలనుంచి, గొంగళిని కప్పుకొన్నాడు.

నౌకాదేవి కథను సాగించింది—

'అది ఒక యుగం. మేమంతా యుద్ధనావలై యుంటిమి. మేమంతా దుర్గా చండీ కాత్యాయినీ నామాలతో అలరారుచుంటిమి. నాడు మా విలువ యెంతగా వుండేది! మరి నేడో...?

## 2

శరవేగంతో కాలచక్రం పరుగుతీసింది. భారతావనిలో అనేక మార్పులు జరిగాయి. ఎందరో రాజులుదయించినారు. ఎన్నెన్నో రాజ్యాలు నశించినాయి.

ఏడు వందలయేండ్లకు పూర్వం:

'నావికా! నావికా! నావను త్వరగా తీరం చేర్చు...అదిగో తుపాను వస్తూవుంది. శీఘ్రం... శీఘ్రం...నావికా' నావను త్వరగా తీరంచేర్చు.

మరి లేకున్న...' వర్తకుడు లీలాధరుడు భయోత్పాతంతో బొబ్బరించినాడు.

కర్ణధారులు తమ నిపుణతతో నావలను తీరం చేర్చుటకు ప్రయాసపడినారు. అంతలోనే ప్రబలమైన తుపాను క్రమ్మింది. అనుకూల దిశనుండి నౌకాలుదూరంకొట్టుకొని పోయినాయి. ఒక నావ అప్పుడే నదికి అర్పితమైంది. లీలాధరుడున్న నావ యొక్క ఓడ కంబము విరిగిపోయింది.

తుపాను వచ్చింది, వెళ్ళిపోయిందికూడా. సంధ్యా సమయం, రాత్రిలోకి మారింది. సుధాకరుడు చల్లని కాంతితో జగతినంతా జ్యోత్స్నామయం చేసినాడు. తరంగిణి మిలమిలతో ప్రవహించింది. లీలాధరుడు హృదయ భారము తీరుటకు ఒక దీర్ఘనిశ్వాసం విడువ యత్నించినాడు. కాని లక్ష్మి (నౌక) మునిగిపోయినందుకు అతని హృదయం వేదనా భరితమైనది.

ప్రాతఃకాలం సమీపించింది. అరుణ భానుని కిరణాలు లీలాధరుని నిద్రనుండిలేపాయి. నావికుడు లంగరును పైకి తీస్తున్నాడు. లీలాధరుడు స్నానం చెయ్యడానికి పైకిరాగా కొడుకు కళాధరుడు బిరబిరవచ్చి తండ్రితో అన్నాడు— 'నాన్నా మనం వచ్చేశాం...అదిగో పాటలీపుత్రము. అవిగో ఎత్తైన మేడలు, అవిగో వాటిపై ఎగిరే రజతపతకాలు. నాన్నా...నాన్నా... స్వర్ణకలశాలతో విరాజిల్లే ఆలయగోపురాలు యెంత సుందరంగా వున్నాయో చూడు...

ఏయ్ నావికా...నావికా! చూశావా పాటలీపుత్రాన్ని...మరి త్వరగా ఓడను నడుపు. నాన్నా మనం పాటలీపుత్రాని కొచ్చాం!'— పంద్రెండేళ్ల కుర్రాడు, పొంగిన ఆనందముతో గెంతులు వేశాడు.

నావికులు ద్విగుణీకృతోత్సాహంతో నావలను నడిపినారు. లీలాధరుని సీతాంబరాలు గాలి కెరటాలకు పటపటమని యెగిరినాయి.

లీలాధరుడు ప్రయాగ వాస్తవ్యుడు. అతడు దేశదేశాలు-నగరనగరాలు తిరిగి క్రయ విక్రయాలొనర్చి స్వదేశం చేరుకొనేవాడు.

సరస్వతి, మహామాయ, మహాలక్ష్మి ఇత్యాది నౌకలు మెల్లగా పాటలీపుత్రం చేరుకున్నాయి.

పాటలీపుత్రములో ప్రభాత గీతాలతో దినం ప్రారంభమైంది. స్నానార్థమై వచ్చిన జన సమూహంతో నదీ ఘాట్టాలు నిండివున్నాయి. జనులు ఓడలను పరికించారు. ఓడలు వచ్చిన వార్త నగరంలో వ్యాపించింది. వర్తకులందరూ లీలాధరునితో బేరమాడి అతని వస్తు సామగ్రి నంతా కొన్నారు. అవశ్యమైన వస్తువులను తానూకొని లీలాధరుడు అధికలాభంతో స్వదేశం మరలినాడు.

నౌకాదేవి ఒక పెద్ద ఉచ్ఛ్వాసం తీసింది— 'ఏం! నిద్రపోతున్నావా?' అని ప్రశ్నించింది.

'అహఁహఁ...నేనెలా నిదురిస్తాను? నేను వింటూనేవున్నాను. ముసలితనంతో నాకు నిదురే పట్టదు...మరి కథను సాగించు' అంటూ జగధరుడు గొంగళిని సర్దుకున్నాడు...

'అది ఒక యుగం. మేమంతా యుద్ధనావలమై యుంటిమి. మరియొక యుగం—మేము చీనా, జపాను, బ్రహ్మ, శ్యామ, లంక 'మొదలయిన దేశాలకు మాపై వ్యాపారసామగ్రి నుంచుకొని యాత్రలను సాగించాం. పూర్వం మా విలువ యెంతగావుండేది! రెండువందల యేళ్ళకు పూర్వం మొగలులు కూడా మా సహాయాన్ని స్వీకరించినారు. నాడు మేమే యుద్ధక్షేత్రాలు, మేమే వాహకులు, మేమే దాతలు...మరి నేడో...?

## 3

ఇరవయ్యో శతాబ్దం ... విజ్ఞాన యుగం. అవనీవక్షంపై ధూమశకటాలు పరుగిడుతున్నాయి. నేడు అవి యిక్కడుంటాయి...రేపు నూర్లకొలది మైళ్ళదూరంలో. వాటి విషధూమం రోగాలను ఓమూల పెంచుతూనేవుంది. విజ్ఞానం చాలా ప్రబలింది. వాయుమండలంలో విహంగాల వలె యానమొనరించుటలో కూడ మానవుడు విజయాన్ని పొందినాడు. కాని విజ్ఞానోన్నతి యొక్క అహంభావము యెప్పుడైతే ధూమ నౌకలను జలయాన మొసిరింపజేసిందో అప్పుడే మేము అస్పృశ్యులము, అకర్మణ్యులమునైనాము. విజ్ఞానం మా మహత్తును నాశమొనరించింది. మా అతీతగౌరవాన్ని అపహరించింది.

ఇదీ ఒక జీవనమేనా మాది? ఆ తీరంనుండి ఈ తీరానికీ, ఈ తీరంనుండి ఆ తీరానికీ లేనిబలం తెచ్చుకొని పోవుటేనా మా దైనికజీవనం? మా యీ జీవనం యెంత హీనం! నాటి యుద్ధాలూ, నాటి పర్యటనాలూ మాకేవీ? నేడుకూడ మా మహత్తు యెక్కడో, యే మూలనో యింకా చెలామణిలో వుంది. కాని నాటి యుగం... నాటి గౌరవం?

మళ్లీ ఆ రోజులు వస్తాయా? నాడు తుపాను మాకు ప్రబలశత్రువై యుండేది. నేడు మీ విజ్ఞానం మాకు తీరని శత్రువైంది. మానవజాతి మా మహత్తును అంగీకరించడం మానేసింది.'

ఒక దీర్ఘనిశ్వాసంతో—'మరి నేడు మా విలువ యింతేకదా! జర్జరరూపంతో, శుష్క దేహంతో ఆ తీరంనుండి ఈ తీరానికీ, ఈ తీరం నుండి ఆ తీరానికీ పచ్చిక మోపులతో, రాయి రప్పలతో...'

గజాధరుడు అప్పుడే దుమికినాడు. 'నాన్నా, నేడు పైసలు అధికంగా లభించినాయి' అంటూ ప్రసన్నవదనంతో పల్లెరాగాలు తీస్తూ నావను నడుపడం మొదలెట్టినాడు.

వృద్ధజగధరుడు తన నిమీలిత నేత్రాలను విప్పినాడు నావ వెడుతూవుంది! అతడు స్వప్నావస్థలో మునిగినాడు. ఛప్-ఛప్-ఛప్ అను శబ్దం మాత్రం అధికమై అతని కల్పనాగీతికకు లయగా మారింది.

(హిందీ మాసపత్రిక 'సరస్వతి' నుండి)

# ఇదీ మన దేశం-

వాడ్రేవు శ్రీజోగిపంతులు

'మీకున్న డబ్బు నంతటినీ రెట్టింపు చేయగలను!' అన్నాడు ఆ సాధువు. శాంతమ్మగారి ఎడమచేయి తనకుడిచేత్తో పట్టుకొని, 'అమ్మోయ్! మాతల్లీ! నీకు మాంచి భవిష్యత్తు వుందమ్మా!' చూస్తూ, వేళ్లు లెక్క పెడుతూ అన్నాడు.

'ఒకటిగాని రెండుగాని రూపాయలు ఇవ్వు! నామహిమ నీకిప్పుడే చూపిస్తా!' నన్నాడు.

చూస్తూన్న పాళాన రెండు రూపాయలల్లా నాలుగు రూపాయలైపోతాయనే సరికి శాంతమ్మగారు వూరికే వుండలేక పోయింది. గబాగబా లోపలికి పరుగెత్తివెళ్లి రెండు రూపాయలు తీసుకవచ్చింది. ఆ రూపాయలు ఒకచేత్తో పుచ్చుకుంటూ, శుభ్రమయిన గ్లాసుతో మంచినీళ్లు తెమ్మనన్నాడు.

'ఆ నీళ్లన్నీ నాచేతిమీద పొయ్యమ్మా!'

ఆమె పోసింది. అతడు కళ్లుమూసుకుని రెండు నిమిషాలపాటు ఏమేమో గొణగొణలాడాడు శాంతమ్మగార్ని బోల్తా కొట్టించడానికి!

'అయిపోయింది! అయిపోయింది!' అని అరుస్తూ నాలుగురూపాయల బిళ్లలూ ప్రక్కనున్న శాంతమ్మగారి కూతురు వళ్లో పారేశాడు.

'డబ్బుని రెట్టింపుచేయడం ఈతడికి పెద్ద గగనంకాదు' అనుకొంది శాంతమ్మ రూపాయ బిళ్లలు చేత్తో తడివిచూస్తో సంతోషపడుతో. ఆశ్చర్యంగా సాధువు వేపు చూసింది.

'దీనికి నువ్వు ఆశ్చర్యపడక్కర్లేదమ్మా!' అన్నాడు.

శాంతమ్మగారు నోరువిప్పి చెవులు పెద్దవి చేసుకు వింటోంది.

'అది అట్టే పెద్దపనిగాదు! నీదగ్గరున్న డబ్బంతా నాచేతిలో పొయ్యి, నిమిషంలో రెట్టింపుచేస్తా!'

సాధువు చెప్పేకొద్దీ కళ్లు పెద్దవి చేసుకొంటోంది.

'సాయంకాలం మీపిల్లల తండ్రి ఆఫీసునుండి ఇంటికి వచ్చేసరికి పెట్లోవున్న డబ్బుకి రెట్టింపు చేతుల్లో పోద్దువుగాని!'

సాధువు మాటల్లో గురి కుదిరిందిగాని ఆవున్న రెండువందల రూపాయలుకూడా వారే పెట్లో పెట్టుకుని తాళాలు జేబులో వేసుకపోయారే అని విచారించింది.

సాధువన్నాడు: 'ఒకరిగురించి పని చేసేప్పుడు ఆమెగాని ఆతడుగాని తప్పించి రెండోవారెవరూ అక్కడ వుండకూడదు. అంతేకాదు, ఈవిషయం వారికిరవంతయినా తెలియకూడదు.అల్లాంటప్పుడు మీపిల్లల తండ్రికి ఈ విషయం చూచాయగా తెలిసినా కష్టం!'

'రేపు రాలేవూ? మావారు పడుకున్నాక రాత్రి పెట్లోనించి డబ్బుతీసి జాగ్రత్తపెడతాను!'

'అలాగే!' అసంతృప్తితో గొణిగాడు.

'ఈ విషయంమట్టుకు మీపిల్లల తండ్రికి ససేమిరా తెలియనివ్వకూడదు సుమా!' 'ఏ మాత్రం తెలిసినా పెట్టెలోవున్న డబ్బంతా బూడిదయిపోతుంది!' శాంతమ్మగారు కొంచెం భయపడ్డని.

'మా వారి కళ్లబడకండా నే చేస్తానుగా!' అంది.

ఇతడు మళ్లా వస్తాడో రాడో?- అని ఆలో-చించి,'వుండవోయ్!'తనదగ్గరున్న అయిదురూపాయిల కాగితం అతనికి తెచ్చి ఇచ్చి, 'ఇది రెట్టింపు చేసేయ్!' అన్నది.

'నా మహిమ గురించి ఈమె కేవ్రాత్రం సందేహం కలక్కుండా చేయడానికి మరో ఛాన్సు' అనుకొని వెనకటి మల్లేనే కళ్లుమూసుగుని ఏదో గొణిగి అయిదు రూపాయిాల కాగితాన్ని పదిరూపాయిల కాగితంగా మార్చి ఆమె చేతిలో వుంచాడు. ఇట్లా డబ్బుని రెట్టింపు చేయడం అతనికి ఎంతో చిన్న విషయమని ఆమె ఇంకా తెలుసుకోవాలని అతడు ముఖంలో నిర్లక్ష్యత 'చులకన కనబరచాడు. ఈ డబ్బు రెట్టింపుచేసే పద్ధతి దేవుడు ఇతణ్ణి వొక్కణ్ణీ చాటుగా పిల్చి చెప్పాడేమో ననుకుంది ఆమె.

అనవసరంగా ఆమె భర్తకి తెలియనిచ్చి పెట్టెలోవున్న నిక్షేపంలాంటి రెండువందల రూపాయలలా బూడిదచేసుకోవద్దని మరోసారి హెచ్చరించి ఆ సాధువు వెళ్లిపోయాడు.

* * *

అర్థరాత్రి, శాంతమ్మ భర్త గుర్రుకొడ్తూ నిద్రపోతున్నాడు. తలగడ కిందవున్న తాళాల గుత్తి మెల్లిగాతీసి, కాలివేళ్ల మొనలతో అతి జాగ్రత్తగా పెట్టెదగ్గరకి నడిచి వెళ్ళింది. చప్పుడు రవంతయినా కాకండా మూత తీసింది. చెయ్యి పెట్టెలో పెట్టబోతూవుండగా ఏదోశబ్దం వినబడింది. ఆమె ప్రాణాలు పైనే ఎగిరిపోయి నట్టనిపించింది!—మూత క్రిందికి పడిపోయింది. మరుక్షణంలో - ఈమె వెనుదిరిగి చూసేసరికి, భర్త భయంకంపితురాలైవున్న తనకేసి చూస్తున్నాడు!

తన భర్తకీ విషయం తెలిస్తే డబ్బంతా బూడిదవుతుందని తెల్సినప్పటికీ, విషయమంతా భర్తకు చెప్పక తప్పిందికాదు!

ఆమె భర్త ఆమె చెప్పినదంతా అతిజాగ్రత్తగావిని, ఏమీకూడానమ్మనట్టు కనబడ్డాడు.

'ఈపాటి కప్పుడే ఆడబ్బంతా బూడిదయిపోయి వుండొచ్చు' అన్నది శాంతమ్మగారు విచారంగా.

'చూదాం వుండు! బూడిదకాకపోతే ఒక కవరులోపెట్టి సీలుచేసి రెట్టింపు చేయమని రేపా సాధువు కిద్దాం' అని పెట్టెతీసి నోట్లు బయటికి లాగుతూ,

'చూడు! ఇవి నోట్ల కట్టలుగానే వున్నాయి! ఇంకా బూడిదకాలేదు!' అన్నాడు.

'పోయి పడుకో! ఈ డబ్బు కవరు సీలు చేసి నేనూ పడుకుంటాను!' అన్నాడు.

ఆమె సరే నన్నది.

* * *

మధ్యాహ్నం ఆ సాధువు వొచ్చాడు. సంతోషంతో లోపలికి ఆహ్వానించింది. అతడు స్తిమితపడ్డాక సీల్డుకవరు చేతిలో పెట్టి,'ఇందులో రెండువందల రూపాయలున్నాయి!' అన్నది.

'కొంచెం గ్లాసుతో నీళ్లు తీసుకురామ్మా!'

ఆమె నీళ్ళు తెచ్చేలోపల జేబు రుమాలు చుట్టివున్న ఒక మూట పైకి తీసివుంచాడు.

ఆమూట మీద నీళ్ళు పొయ్యమని ఏమేమో కొత్త కొత్త మాటలు గొణిగాడు.

"ఏం అదృష్టవంతురాలి వమ్మా!" అన్నాడు.

శాంతమ్మకళ్ళు మిలమిలా మెరిసినయి.

'ఇవి ఎక్కువ డబ్బుకనక రెట్టింపు కావ డానికి ఒక గంట సుమారు పట్టుతుంది. అందు చేత వోపికపట్టి ఒక గంటపోయిన తర్వాత విప్పి చూసుకో!' అన్నాడు.

ఇంకాచాలా పనులున్నయ్యని చెప్పి ఆ సాధువు వెళ్ళిపోయాడు. దక్షిణఏమేనా తీసికో మని శాంతమ్మగారు బ్రతిమిలాడింది కాని ఆతడు తనకీ డబ్బుకీ చాలాదూరమని చెప్పి వెళ్ళి పోయాడు.

ఈ తమాషా ఏమిటో చూద్దామని ఆ రోజు ఆఫీసుకి సెలవుపెట్టాడు శాంతమ్మభర్త. సాధువు వెళ్ళి పోగానే అంతవరకు ప్రక్కన దాగివున్న వాడల్లా గుభాల్న బయటికివచ్చి భార్యచేతిలో మూట లాక్కున్నాడు. భర్త చేతిలోంచి మూటను తిరుగాలాక్కుని,

'మనం గంటసేపయినా వుండకపోతే ఎలా?' అని కసురుకుంది.

వీధినపోయేవారంతా కనబడ్డానికిగాను కుర్చీ గుమ్మానికెదురుగ్గా లాక్కుని కూర్చున్నాడు శాంతమ్మ భర్త.

'అక్కడ కూర్చున్నారేం?' అసనిచర్య అర్థంగాక అడిగిందామె.

'ఆవెధవ మళ్ళావచ్చినాలుగుంవదల రూపా యలూ పట్టుక పోకండా చూడ్డానికి!' అన్నాడు.

గంటఅయినతర్వాత ఒక్క నిమిషం సేప యినా ఆలస్యంచేయకుండా శాంతమ్మగారు మూట విప్పిచూసి అలాగే స్తంభానికి జార్లబడి పోయింది! నోటమాటలేదు!

ఆమెభర్త దగ్గరసావచ్చి మూటవేపు తొంగి చూశాడు. ఉత్తచెత్త కాగితమ్ముక్కలు కనపడ్డ వాతనికి!

'ఇదే అనుకుంటూ ఆ వెధవ నీకు కలిగించిన అదృష్టం?' అన్నాడు శాంతమ్మభర్త నవ్వు కొంటూ.

భార్య బుర్ర పైకెత్తి, జేబులోనించి రెండు వందలరూపాయలనోట్లుతీసి, 'పట్టుక వెళ్ళిజాగ్రత్త పెట్టు' అన్నాడు.

జరిగినదంతా భర్త చెప్పేవరకూ శాంతమ్మ గారికేమీ అర్థంకాలేదు.

'దొంగవెధవ! ఏడు రూపాయల్తో వాడి అదృష్టంవాడే చూసుకుందామనుకున్నాడు!'

'వాడు ఏడురూపాయలకోసం మళ్ళా వొస్తాడేమో?'

'ఛస్తేరాడు! ఇక్కణ్ణుంచి పోయిన పావు గంటలోనే జరిగిన మోసం తెలిసికొని వెనక్కి వొస్తే, గుమ్మంలో నన్ను చూసి తోకజాడించి వేశాడు!'

'పాపం! దురదృష్టవంతుడు' అన్నది శాంత మ్మ గారు సానుభూతి పూర్వకంగా.

(ఒక ఆంగ్లరచన చదివాక)




# ప ర మా ణు వు

కె. యస్. శివరావు

(క్రిందటిసంచిక తరువాయి)

## న్యూ క్లి య స్

పరమాణువుయొక్క రాశిఅంతా న్యూక్లియస్‌లో యిమిడివుందని తెలుసుకున్నాం. న్యూక్లియస్ స్వరూపమేమిటి?

న్యూట్రాన్లు, ప్రోటాన్లు పరమాణువులోని మూలకణాలని తెలుసుకున్నాం. విద్యుచ్ఛక్తిలేని, రాశికల్గిన న్యూట్రాన్లు; రాశి, విద్యుచ్ఛక్తి కల్గిన ప్రోటాన్లతో న్యూక్లియస్ నిర్మాణం. సౌకర్య పక్షంలో న్యూక్లియస్‌ను అర్థంచేసుకోవాలంటే రెండురంగుల యిటుకల కట్టుబడికి పోలికగా వుంటుంది.

ధాతువులన్నిట్లో ఉదజని కట్టుబడి అతిసులువైంది. దాని న్యూక్లియస్ వొక్క ప్రోటాను మాత్రం. పరమాణు భారపట్టికలో రెండవది హీలియం. దాని పరమాణు సంఖ్య 2. అంటే విద్యుచ్ఛక్తిగూడా 2— ప్రోటాన్లు రెండున్నవన్నమాట దాని భారం 4. కనుక మిగతా యూనిట్ల భారాన్ని యివ్వటానికి 2 న్యూట్రాన్లు ఉన్నవన్నమాట ప్రతిధాతువుయొక్క పరమాణు సంఖ్య ఎంతో అన్ని ప్రోటాన్లు, దాని భారంలోంచి ప్రోటాన్లసంఖ్య తీసివేస్తే వొచ్చేసంఖ్య న్యూక్లియస్‌లో వున్న న్యూట్రాన్ల సంఖ్యను తెలియజేస్తుంది.

కవలధాతువుల వునికిని అర్థం చేసుకోవటం యిప్పుడు సులభం. ఒకే ధాతువుయొక్క భిన్న స్వరూపాల (ఐసొటోప్స్)లో ప్రోటాన్లసంఖ్య వొకటేగాని న్యూట్రాన్లసంఖ్య మాత్రం వేరు. ఉదాహరణకు: ఉదజని ఐసొటోప్ అతిభారవుదజని (డ్యూటరాన్ Deuteron; Heavy Hydrogen) అంటులో మామూలు ప్రోటాన్ కాక వొక న్యూట్రాన్ వున్నదన్నమాట

మామూలుగా ధాతువుల భిన్నస్వరూపాల్ని రసాయనికంగా వేరుచేయటం సాధ్యం కాదు. కాని ఉదజని, అతిభారవుదజనికి వున్న రాశి తేడా మిగతా ఏధాతువుకూ లేదు. కనుక వుదజని నుండి అతిభారం వుదజనిని వేరుచేయగలిగారు ప్రతి 10,000 పాళ్ళ మామూలు వుదజనిలో 2 పాళ్ళ అతిభారవుదజని వున్నది. విద్యుచ్ఛక్తి నీటిని ఉదజని, ఆమ్లజని వాయువులుగా విడజేస్తుంది. కాని అతిభారవుదజని నీటిలోనే నిల్చిపోతుంది. దానిని శాస్త్రపరిశోధనలకు విరివిగా ఉపయోగిస్తారు.

### ప్రోటాన్ న్యూట్రాన్ల కట్టుబడి:

రసాయనిక మానంలో పైకి పోయినకొద్దీ, ధాతువుల పరమాణువుల్లోవున్న ప్రోటాన్లు, న్యూట్రాన్ల సంఖ్య పెరుగుతుంది. మరియివి విడిపోకుండా ఎలా కట్టుబడి వుంటవి?

1905 లో ఐన్‌స్టీన్ 'రిలెటివిటీ' సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. దాని రీత్యా కాంతి వేగంతో కదలుతున్న పదార్థం శక్తిగా మారుతుంది. కట్టెను కాల్చామనుకోండి. అది నిప్పుగా

మారిపోతుంది. ఇక్కడ రాశి శక్తిగా మారలేదు; ఘన పదార్థమైన కట్టె వాయురూపంలో వున్న పదార్థంగా మారింది. అందులో పుట్టిన వేడి వొక పదార్థరూపం యింకొక రూపంగామారిన స్వరూపం. కాని పరమాణువులోవున్న ఎలక్ట్రాను పూర్తిగా పదార్థస్వరూపం పోగొట్టుకుని, శక్తిగా మారుతుంది. ఒక్క ఎలక్ట్రాను, శక్తిగా మారినప్పు డుత్పన్నమయ్యే శక్తి 5 లక్షల ఎలక్ట్రాను వోల్టులు. ఒక ఎలక్ట్రాను 10 లక్షల వోల్టుల విద్యుత్క్షేత్రంలోను డి ప్రసరిల్లినప్పు డది పొందిన శక్తి 10 లక్షల (మిలియన్) ఎలక్ట్రానువోల్టులు. దీన్ని మెవ్ (MEV-Million ElectronVolts) అంటారు. పరమాణువులోనిశక్తి అపారమైంది. కనుక దాని కొలతకు 'మెవ్' వొకమానంగా తీసుకున్నారు శాస్త్రజ్ఞులు.

డ్యూటరాన్‌లో ఒక ప్రోటాన్, ఒక న్యూట్రాన్ బంధింపబడ్డవి. ప్రోటాన్ రాశి 1.0076 యూనిట్లు, న్యూట్రాన్ 1.0090 యూనిట్లు. ఈ రెండూ కలసిన రాశి 2.0166 యూనిట్లుండాలి. కాని డ్యూట్రాను రాశి 2.0142 మాత్రం. అంటే రాశిలో ఉన్న తేడా ప్రోటాను, న్యూట్రాన్లను బంధించే శక్తిగా మారిందన్నమాట. ఆమారిన శక్తి 2,200,000 ఎలక్ట్రాను వోల్టులు. మళ్లీ ఆ న్యూట్రాను, ప్రోటాన్లను వేరు చెయ్యాలంటే 2,200.000 ఎలక్ట్రాను వోల్టుల శక్తి ని డ్యూట్రానులో పూరించాలి. హీలియంలో వున్న న్యూట్రాను ప్రోటాన్ల రాశి విడిగా లెక్క కడితే 4.0332 యూనిట్లు. కాని హీలియం న్యూక్లియస్ రాశి 4.0027 యూనిట్లు. అంటే అందులోని బంధించేశక్తి 28,000,000 ఎలక్ట్రాను వోల్టులన్నమాట.

న్యూక్లియస్ పరమాణువులో అతి స్వల్ప భాగం. అందువల్ల పదార్థంలోనుండి దూసుకుపోతున్న ఏ కణాలు దానికి తగలవు. పోజిటివ్ విద్యుచ్ఛక్తిపూరితమై, బలమైన విద్యుత్ క్షేత్రంతో చుట్టబడివున్న న్యూక్లియస్ పరిభ్రమిస్తున్న ఎలక్ట్రాన్ మేఘావృతమై వుంటుంది. శక్తిపూరితమైన ఏ కణమైనా పరమాణువులోకి చొరబడిందంటే దానిశక్తి ఎలక్ట్రాను మేఘంలోనే విచ్ఛిన్నమయిపోతుంది. ఎలక్ట్రాను, ప్రోటాను, రెండూ శక్తిపూరితమైన కణాలు కనక అవి పరమాణువునుండి దూసుకునిపోలేవు. కాగా న్యూట్రాను నిర్బలీకరణశక్తి రూపంలో వుంటుంది కనుక, ఎలక్ట్రాను మేఘాన్ని సులభంగా దూసుకుపోగలదు. న్యూక్లియస్‌ను ఢీకొన్నప్పుడు మాత్రం దానివేగం తగ్గుతుంది. దానికి సమమైన పరిమాణంగల న్యూక్లియస్‌కు తగిలినప్పుడు మాత్రమే దానివేగం తగ్గుతుంది (ఉ॥ ఉదజని న్యూక్లియస్). కాని దానికన్న పెద్ద పరిమాణంగల న్యూక్లియస్‌ను తగిలినప్పుడు తప్పుకుని పోగలదు. అందువల్లే న్యూట్రాను మూడు అడుగుల మందంగల సీసపుగోడను అవలీలగా దూసుకునిపోగలదు గాని నీటినిమాత్రం దూసుకుపోలేదు.

రసవాదం :

ఒకధాతు వింకొకధాతువుగా మారాలంటే, వొకలోహం యింకొకలోహంగా మారాలంటే, వాటి న్యూక్లియస్ స్వరూపం మారాలి. రాగిని గాని, వెండినిగాని బంగారుగా మార్చాలంటే: రాగి పరమాణు సంఖ్య 29, బంగారు పరమాణు సంఖ్య 79. అంటే మొదటిదాని న్యూక్లియస్‌లో 29 ప్రోటాన్లున్నవని, రెండవదానిలో 79 ప్రోటాన్లున్నవని. రాగి బంగారుగా మారాలంటే దాని పరమాణు బీజంలో 29 ప్రోటాన్లు 79గా మారాలి. కాని పరమాణువు దాని స్వరూపాన్ని కాపాడుకోటానికి మహత్తరశక్తి కల్గివున్నది. పరమాణు స్వరూపం నిబిడీకృతమైవున్న న్యూక్లియస్‌చుట్టూ అతి దూరంలో, బ్రహ్మాండమైన వేగంతో ఎలక్ట్రాన్లు పరిభ్రమిస్తుంటవి. పరమాణువులోని దాని చక్రాకృతిలో ఎలక్ట్రాను సెకనుకు 1,400 మైళ్లు తిరుగుతుంది. సెకనులో లక్షోవంతు కాలంలో 70 వేలసార్లు తిరుగుతుంది. పరమాణుభేదన కుపయోగించే కణాలీ పరిభ్రమిస్తున్న ఎలక్ట్రాన్లను దూసుకునిపోవచ్చు; కాని మధ్యస్థమైన న్యూక్లియస్‌ను చేరటం అసంభవం. న్యూక్లియస్‌చుట్టూ అతి తీక్షణమైన విముఖత్వశక్తిగల విద్యుత్ క్షేత్రం వున్నట్లు తెలుసుకున్నాం. దూసుకుపోయిన కణం ఆ క్షేత్రంలో లోతుకు వెళ్లిన కొద్దీ ఎక్కువ విముఖత్వశక్తి నెదుర్కొంటుంది. అందువల్లనే బంగారు పరమాణువును చొచ్చిన

ఆల్ఫాకణాలు వచ్చిన దిక్కుకు త్రిప్పికొట్టబడ్డవి. న్యూక్లియస్ స్వరూపాన్ని మార్చటానికి కావలసిన బ్రహ్మాండమయిన శక్తి వేమన్నకు గాని, మధ్యయుగాల తంత్రజ్ఞులకుగాని హస్తగతం కాలేదని; పరుసవేదులు, వేదాంతిశిలలు పని చెయ్యలేవని నిస్సందేహంగా చెప్పవచ్చు—

### రూథర్ ఫర్డ్ పరిశోధన:

1919 లో రూథర్ ఫర్డు మొట్టమొదట యే ఆల్ఫాకణాన్ని వినియోగించి పరమాణువులోని న్యూక్లియస్ స్వరూపాన్ని అర్థంచేసుకున్నాడో, దానితోటే పరమాణుస్వరూపాన్ని మార్చాడు.

క్షీకరణ విసర్జనధాతువులనుండి ఆల్ఫా కిరణాలు ప్రసరితమవుతవని మనకు తెలుసు. రూథర్ ఫర్డొక పరిశోధన చేశాడు ; ఒక మూసిన పెట్టెలో క్షీకరణవిసర్జనా ధాతువొకదానినుంచి, ఆ కిరణాలు బయటకు వచ్చేందుకొక వెండిరేకు తెర అమర్చబడ్డది. కిరణాలు బయల్పడే ప్రదేశంలో వొక జింక్ సల్ఫైడ్ తెర అమర్చబడ్డది.

అటువంటి పెట్టెలో పొడిగావున్న అమ్లజని వాయువును నింపినప్పుడు బయటితెర కణతాడితం కాలేదు. కాని పెట్టెలో అమ్లజని బదులు నత్రజనివాయువును నింపినప్పుడు బయటి తెర మీద మినుకు మినుకు తళుకులు పడ్డవి. దానికొకే వొకకారణం వుండాలి : అది, నత్రజని పరమాణువుల్లోకి ఆల్ఫాకణాలు దూసుకుపోయి న్యూక్లియస్ లోని ప్రోటాన్లను వెలికి నరుముతున్నవి. ఆ బయటకువస్తున్న కణాలను అయస్కాంత క్షేత్రంలో పరీక్షించి ప్రోటాన్లని నిర్ధారణచేశారు. నత్రజనిని న్యూక్లియస్ లో ఒక ప్రోటాన్ను ఆల్ఫాకణం బయటకు తరిమిందంటే నత్రజని పరమాణుసంఖ్య మారిపోయిందన్నమాట. అంటే నత్రజని ధాతువు స్వస్వరూపాన్ని పోగొట్టుకుని మరోధాతువుగా మారిపోయిందన్నమాట.

### ఆల్ఫాకణ ప్రసారం:

ఆల్ఫాకణం నత్రజని పరమాణు న్యూక్లియస్ లో కెలా చొచ్చిందో అర్థంచేసుకోవాలంటే అది అసలు క్షీకరణ విసర్జనా పదార్థం నుండి ఎలా విక్షేపితమవుతుందో అర్థంచేసుకోవాలి. స్వతస్సిద్ధ క్షీకరణ విసర్జనాధాతువులు నలభై వున్నవి. ఇవి ధాతువు లన్నిటిలోకి బరువు వీటన్నిటిలోకి రేడియం బరువైంది. అంటే దాని న్యూక్లియస్ లో ప్రోటాను, న్యూట్రాన్ల సంఖ్య అధికం కావడంచేత బ్రహ్మాండమైన శక్తి నిబిడీకృతమై వుందన్నమాట. రేడియంన్యూక్లియస్ నొక అగ్నిపర్వతానికి పోల్చవచ్చు. అందులో వున్న ప్రోటాన్లు, తుకతుకలాడిపోతుంటవి. ఉండుండి అగ్ని పర్వతం బద్దలవుతుంది. అప్పుడొక ఆల్ఫా కణం—రెండు న్యూట్రాన్లు, రెండు ప్రోటాన్ల సంయోగం—బహిర్గత మవుతుంది. అగ్ని పర్వతం మాడుతున్న శిలాద్రవాన్ని పర్వత శిఖరమునుండి పైకెగజిమ్ముతుంది. కాని ఆల్ఫా కణం న్యూక్లియస్ అగ్నిపర్వతందరినుండి దూసుకుని పోగలదు. న్యూక్లియస్ పర్వతాకారపు ఏటవాలు లోపలికణాల సూచటమేకాక బయటి కణాల దాడినుండి న్యూక్లియస్ను కాపాడుతుంది. న్యూక్లియస్ నుండి ప్రసరిల్లే ఆల్ఫా కణం మధ్యనుండి దూసుకుపోయే శక్తి కలిగి వుండాలి; న్యూక్లియస్ను చొచ్చుకుని పోయేకణం పర్వతశిఖరంనుండి లోనికి చొరాలి.

ప్రసరిల్లే ఆల్ఫాకణపువేగం అది పుట్టిన్న మయ్యే క్షీకరణ విసర్జనా ధాతువుమీద ఆధారపడివుంటుంది. ఆల్ఫాకణాలవేగం వొకొక్కసారి గంటకు 45,000 000మైళ్ళదాకావుంటుంది.

బీటా ప్రసారానికి గల కారణాలు విపులంగా తెలియవు. న్యూక్లియస్ లో ఎలక్ట్రాన్లకు వ్యక్తిగతమైన పునికిలేదు. సిద్ధాంతరీత్యా న్యూక్లియస్ లోని న్యూట్రాన్లు ప్రోటాన్లుగా మారటం కలదు. ఆ మార్పులో ఎలక్ట్రాన్లుఉద్భవిల్లుతవి. న్యూట్రానంటే: పోజిటివ్ శక్తిరూపమైన ప్రోటాను, నెగెటివ్ శక్తి అయినఎలక్ట్రాను సమశక్తివంతంగా వున్నందున నిర్బలీకరణ విద్యుద్రూపమైన న్యూట్రానేర్పడుతుంది. న్యూట్రాన్ ప్రోటానుగా ఎప్పుడైతే మారిందో, ఆ మార్పులో వుద్భవిల్లిన శక్తితో ఎలక్ట్రాను ప్రసారమవుతుంది.

ఆల్ఫాకణాన్ని వదలినప్పుడు వలెనే బీటాకణాన్ని వదలినప్పుడుకూడా పరమాణు వు స్వరూపపు మార్పు పొందుతుంది. ఒక ఆల్ఫాకణం బయటకు వెళ్ళిందంటే, న్యూక్లియస్ కు రెండు పోజిటివ్ యూనిట్ల శక్తి తగ్గిందన్నమాట. పరమాణుసంఖ్యా సోపానంలో అది

రెండు మెట్లు క్రిందకు జారింది. ఉ: రేడియం పరమాణుసంఖ్య 88- భారం 226. అది ఒక ఆల్ఫాకణాన్ని వదలినప్పుడు రాడాన్-పరమాణు సంఖ్య 86- భారం 222 గా మారుతుంది. కాని బీటాకణం బయల్పడినప్పుడు న్యూక్లియస్‌లో ఒక ప్రోటాన్ ఎక్కువవుతుంది. కనుక పరమాణుసంఖ్యా సోపానంలో ఒక మెట్టు పైకి పోతుంది. ఉ· రేడియం B-పర. సం. 82- ప. భారం 214- బీటాకణాన్ని పోగొట్టుకుని రేడియం C- పర. సం. 83- ప. భా. 214 గా మారుతుంది. ఆల్ఫాకణాలవలెనే బీటాకణాలను కూడా ఎప్పుడు క్షీకరణవిసర్జనా పరమాణువులు విసర్జిస్తవో తెలియదు. బీటాకణాల్ని విరివిగా విసర్జించే రేడియం D, 22 సంవత్సరాల్లో సగం శిథిలమవుతుంది; యురేనియం $X_2$ ఒక్క నిమిషంలో సగం శిథిలమవుతుంది.

క్షీకరణవిసర్జనలో ప్రసారితమయ్యే మూడవ రకం గమ్మాకిరణాలు పూర్తిగా శక్తిస్వరూపాలు-కణసంహితాలు కావు. ఆల్ఫా లేక బీటా కిరణాలు ప్రసారితమయినప్పుడల్లా గమ్మా కిరణ ప్రసారం కూడా జరుగుతుంది. ఆల్ఫా, బీటా కిరణాలు బయల్పడినప్పుడేర్పడ్డ కొత్తధాతువులోకి అసలు ధాతువుశక్తి వచ్చినందున, ఆ అధికమైన భాగాన్ని గమ్మాకిరణాలుగా వదులుతుంది.

## న్యూక్లియస్ భేదనం:

ఏ కిరణాలయితే న్యూక్లియస్ నుండి బయలు వెడలుతవో ఆ కిరణాలే దాని భేదన కుపయుక్తమవుతవి. కాని ఆల్ఫాకణభారం ఎక్కువ. విద్యుచ్ఛక్తి కూడా రెండు యూనిట్లు కావటాన్ని ఎక్కువే. అయినా క్షీకరణవిసర్జనా ధాతువులు ప్రకృతిసిద్ధంగాఆల్ఫాకణాల్ని విసర్జిస్తవి కనుక భేదనాపరిశోధనలకు సులభంగా లభిస్తవి.

ఆల్ఫా కణాలకన్న చిన్నవయిన ప్రోటాన్లు (విద్యుచ్ఛక్తి 1, భారం) న్యూక్లియస్ భేదనకుపయుక్తాలు. న్యూక్లియస్ భేదనకు పైరెంటికన్న న్యూట్రాన్ ఉత్తమమైంది. విద్యుచ్ఛక్తి లేనందున న్యూక్లియస్ చుట్టూవున్న విద్యుత్ క్షేత్రాన్ని సులభంగా దూసుకుపోగలదు. కనుక దానికి న్యూక్లియస్ అగ్నిపర్వతశిఖరంనుండి చొచ్చుకుపోవలసిన అగత్యంలేదు. దరినుండి దూసుకపోగలదు. కాని నిర్బలీయ విద్యుత్తుగల న్యూట్రానును న్యూక్లియస్ వేపు విలంబించటం అసాధ్యం.

న్యూక్లియస్ భేదన కుపయుక్తమయ్యే సాధనలన్నిటిలో అతిభార వుదజని (డ్యూటరాన్) వుత్తమోత్తమం. అది ఒక ప్రోటాన్, ఒక న్యూట్రాన్ కలయికవల్ల ఏర్పడ్డది. డ్యూటరాన్ భాగాలు ఆల్ఫాకణాలకన్న ఒదులుగా బంధింపబడి వుంటవి గనుక వాటిని విడిచెయ్యటం సాధ్యం. డ్యూటరాన్‌లో ఒక యూనిట్ విద్యుచ్ఛక్తి వున్నందున దానిని న్యూక్లియస్ పైకి విలంబించటం సుళువు. డ్యూటరాన్‌కు న్యూక్లియస్ అగ్నిపర్వతావరోధకం కనుక, అది న్యూట్రానును న్యూక్లియస్ శిఖరంలోకి వదలి, ప్రోటానును బయట వదలుతుంది.

పరాయికణమయిన న్యూట్రాన్ చొరగానే న్యూక్లియస్‌లో విపరీతమైన సంచలనం కలుగుతుంది. వెంటనే స్వతస్సిద్ధమైన క్షీకరణ విసర్జనా ధాతువువలెనే, ప్రకాశాన్ని ప్రసరిస్తుంది. న్యూక్లియస్‌నుండి వెంటనే డ్యూటరాన్లు, ఆల్ఫాకణాలు, ప్రోటాన్లు, న్యూట్రాన్లు ప్రసారితమవుతవి. సంచలితమైన అధికశక్తి బహిర్గతమయ్యే కణానికి ఆపాదిస్తుంది. కొత్తకణం అంతర్గతమైన తరువాతి న్యూక్లియస్ రూపం, కొత్తకణంమీద, బయటికి విలంబించబడ్డ కణరూపంమీద ఆధారపడి వుంటుంది. ఉదాహరణకి రూథర్‌ఫర్డు చేసిన పరిశోధనలో నత్రజని న్యూక్లియస్ నొక ఆల్ఫాకణం చొచ్చింది,-అంటే పరమాణు సంఖ్యా సోపానంలో రెండు మెట్లుపైకి పోయిందన్నమాట-ఒక ప్రోటానును వదలింది-వొక మెట్టు క్రిందకు దిగింది. అంటే మొత్తంమీద ఒకమెట్టు పైకి పోయిందన్నమాట. ఆమ్లజనిగా మారి నత్రజని పరమాణువు మొదటికన్న మూడుయూనిట్లు పెరిగింది. కొత్తగా ఏర్పడ్డ ఆమ్లజనిభారం 17 అని పరిశోధనలవల్ల తేలింది.

న్యూక్లియస్ న్యూట్రానును అతి సుళువుగా పట్టుకోగలదు కనుక, న్యూక్లియస్ భేదనకు న్యూట్రాను మంచి సాధనం. బెరిల్లియంను ఆల్ఫాకణాల తాకుడుకు గురి చేసినప్పు డది న్యూట్రాన్లను వదలుతుంది. ఆ వెలివడే న్యూట్రాన్లు నిప్పుడు పరమాణు భేదనాసాధనాలుగా ఉపయోగిస్తున్నారు. (ఇంకా వుంది)



# స్త్రీ జగత్తు

## వరకట్నాలెందుకు పోవాలి?

'కట్నాలెలాగ పోతాయి? పెళ్ళికొడుకుల ధర యెలా తగ్గుతుంది? పిల్ల పెళ్ళిజేసేదెలాగ?'— ఇదీ, ఆడపిల్లలు గల నలుగురెక్కడ సమావేశమైనా, సంభాషణలో తప్పని సరిగా వచ్చే విషయం.— (ఏదిలేకున్నా, ఆడపిల్లలేనివాళ్లు అరుదుగా!)

ఒక విధంగాచూస్తే, వరునికి కట్నం, వధువుకు కానుక, పోవలసిన అవసరంలేదు సరిగదా, ఉండడం, ఉచితమేమోననిగూడా తోస్తుంది. కట్నాలంటే బహుమతులని అర్థం. వివాహసమయమంటే, కన్య తలిదండ్రులేకాకుండా, వారియందాదరాభిమానములున్న ముఖ్యులంతా, వారివారిశక్త్యానుసారం వధూవరులకు, కానుకలిచ్చితే, ఆ నూతన దంపతులకు, యిల్లేర్పరచుకొని, గృహస్థాశ్రమధర్మాలు నిర్వహించడము సుకరమవుతుంది. ఆదిలో, యీ ఆలోచనతోనే, ఆ అలవాటు జన్మించి వుంటుంది.

కాని, రానురాను, అన్నిటితోపాటూ, దీనికీ వికృతరూపం వచ్చింది. ప్రస్తుతం, కట్నమన్నదానికి బహూకరణమన్న అర్థమేలేకుండా పోయి, ఆడ బిడ్డను కన్నందుకు, పిల్లను గన్నవాళ్లు, అపరాధం చెల్లించడంగా జరిగిపోతోంది!

ఇది తప్పనీ, దురాచారమనీ, నీచమనీ ప్రతివారూ గర్జిస్తూ, యెలుగెత్తి చాటుతూనే వుంటారు. 'వరశుల్క పిశాచాన్ని' గురించి ప్రతి పత్రికలలోనూ, కథానికలూ, నాటికలూ ప్రచురింపబడుతూనే వుంటాయి. (బ్లాక్ మార్కెట్ మీదలాగే!) కాని, బాహాటంగా, నిర్విఘ్నంగా,ఆ ఆచారం సాగిపోతోంది. సాగిపోవడమేకాదు. పెరిగిపోతోంది! స్త్రీని గురించి, స్త్రీ జీవితవిధానాన్ని గురించి, కొన్ని పురాతనాభిప్రాయాలూ, ఆచారాలూ, యింకా కొన్నాళ్లిలాగే వుంటే, పెళ్ళి చెయ్యడమనేది అశక్యమై, అవశమై, అసలు పెళ్ళి పద్ధతే వద్దనేలాటి తిరుగుబాటు వచ్చేలాగ పెరిగిపోతుంది!

ప్రస్తుత పరిస్థితుల్లో వరదక్షిణ కోరడం, నైజమూ,న్యాయమూగూడాను. కన్యాప్రదానంజేసి, తరించామని తలంచే ఘనులంతా ఆ తప్పు చెల్లించి తీరవలసిందే!—

స్త్రీ గూడా సకలసత్తులూ గలిగిన, మానవ వ్యక్తి యని విస్మరించి- గోదాన భూదానాదులలాగే కన్యాదానము జరిగినన్నాళ్లు, దానముతోపాటు, దక్షిణవుండడమూ సహజమే గాదూ? తిలదానం పట్టినవాడి కెక్కువ దక్షిణలాగే, యీ కన్యాదానము పట్టినవారూ, విశేష దక్షిణ కోరుతున్నారు: అది న్యాయమే! యెవరినో ఒకరిని పట్టుకుని, కీల్చిపిప్పిజేస్తూ,చీడపురుగులాగానేగాని స్వతంత్రంగా తమ బాలిక బ్రతకలేదనే భావంతో,- అవిధంగానే పెంచి,- ఒకనికిస్తానన్నప్పుడు, దానిని ప్రతిగ్రహించి, ఆ భారమంతా ఆ జన్మాంతం వహించవలసినవాడు, కట్నమనండి: compensation అనండి, మరేమనండి, ఖండితంగా యిమ్మని రొక్కించడం తప్పా? ఇంక ఆటుతర్వాత ఎట్టిని యేగానికైన పుట్టింటిమీదఆబాలికకు అధికారములేదే? (మనుపటికన్నా గృహనిర్వాహకత్వపు నేర్పు వెనుకకు బెట్టి చదువుసంగీతాదులకు ప్రాధాన్యమిచ్చి నేర్పిస్తున్నాముగాని, కట్నాలు మాత్రం తగ్గలేదు సరిగదా, హెచ్చిపోతున్నాయి' అని సణుగుతారు, సాదిస్తారు;నిజమేగాని, ఆ విద్యావిశేషాలు నిజజీవితానికి వుపయోగించుకోనిస్తున్నారా? ఎందునాపొందని పద్ధతులలో పిల్లల్ని తయారుచేసి, 'మాకీచుకీచు బొమ్మలనిస్తామన్నా కట్నాలడుగుతారే!' అని గొణిగితే ఏంప్రయోజనం? తమాషాబొమ్మలతో ఆటలాడటం

శ్రీమంతులకుగాని సామాన్యులకెలా సాధ్యమవుతుంది ? (బొమ్మలయినా కొంతనయమే; కాని, యీ అమ్మాయిలతో యెన్ని బాధ్యతలు వహించాలి !) అయినా నాలుగురోజులలో రంగులు పోతాయి. మరలు తిరగవు. శ్రీమంతులకైనా, సామాన్యులకైనా కూడా. సహచారిణినివ్వాలి!

కన్యాదాతలు తప్పు తమయందుంచుకుని, పరులను నిందించి ఫలమేమిటి ? తమ బ్రతుకంత దుర్భరమూ, తమబాలికల బ్రతుకెంతో నీచమూ చేస్తున్నది కన్యల తలిదండ్రులే ! ప్రేమ లేదనను గాని, ఆలోచనలు స్తంభించిపోయి, తమ ఆడబిడ్డ భారమెవరో ఒకరు వహించితేగాని బ్రతకనేరదని పొరబడుతున్నారు. స్త్రీల అభివృద్ధికి పాటుపడి, యెందరో మహనీయులు కూడా 'ముదితల్ నేర్వగరాని విద్యగలదే ! ముద్దార నేర్పించినన్ !' అని నేర్పించడంతో ఆగిపోతున్నారేగాని, ఆనేర్చిన విద్యని నిత్యజీవితాని కుపయోగించుకోనియ్యడమూ, ఆర్థికస్వాతంత్ర్యము గలిగి, వ్యక్తిత్వముతో జీవించనియ్యడమూ, అవమానకరంగానే పరిగణిస్తున్నారు. (జమీందారీలు రద్దయినా రాణీవాసాలు నిలవాలంటున్నారు.) వ్యక్తిస్వాతంత్ర్యం, గౌరవంగా భావింపబడే యీరోజుల్లోకూడా, ఆడుదాని విషయంలోమాత్రం, బానిసపద్ధతులే మర్యాదగా భావిస్తున్నారు.

పదివేలు, అల్లుడికి కట్నమియ్యడానికేనా తెగిస్తున్నారుగాని, కూతురుకి కొడుకుతోపాటు, పదిరూపాయలు వాటా పంచి యియ్యడానికి అంగీకరించలేకుండా వున్నారు. అష్టకష్టములూ పడి కనిపెంచినవారే, అనాలోచితంగా యింత అన్యాయం జేస్తూన్నప్పుడు పరిగ్రహించేవారు అలుసుగా చూడడం అసహజమా ? (ప్రస్తుతమింకేదేశాల్లోనూ యింత అన్యాయంగా లేదు.)

ఇటువంటివి పోవాలంటే, శాసన విధానంలోనూ సంఘ దృక్పథంలోనూకూడా అభివృద్ధికరమైన మార్పులు జరగాలి.

ఎప్పుడేర్పడిందో యెందు కేర్పడిందో తెలియకపోయినా, ఇప్పటి కాలపరిస్థితుల కనువుగాకపోయినా, 'ఇది మా పురాతనధర్మం. ఇది మా ప్రాచీనసంస్కృతి, మేము కదలం' అని కొన్నింటిని పట్టుకుని, వెనుక యుగాలలోనే నిల్చిపోతామనడం అనర్థకం. ఏనాడైనాకూడా, పవనప్రసారంలాగే, ప్రపంచమందన్ని దిక్కుల సంస్కృతీ సభ్యతలూ ఒకదానితో యొకటి మిళితమవుతూనే వుంటాయి. (దూరదృష్టి, దూరశ్రవణ, దూరయానాలు నిత్యకృత్యమైపోతూన్న యీనాడు వేరే చెప్పేదేమిటి?) అలా కలిస్తేనే, అభ్యుదయకరంగా పెరుగుతాయిగాని, తలుపులు మూసిపెట్టితే అనారోగ్యకరమైన గబ్బిలాలవాసన రావడమూ విషక్రిమికీటకాదులు పుట్టటమూ తప్పదు. ప్రపంచమందన్ని దేశాలూ కాలంతో చురుకుగా ముందుకు పోతూవుంటే, 'మేము కదలమనీ, వెనక్కుపోతామనీ' అంటే సాధ్యమూ కాదు; సౌఖ్యమూ లేదు. యుగధర్మాన్ని ఆపడం యెవ్వరికీ వశముగాదు. గిర్రున తిరిగి మళ్ళీ అచ్చటికే చేరుతున్నా, కాలచక్రంతోపాటు చరచరా ముందుకు సాగిపోవలసిందేగాని, ఎదురుపోయి వెనక్కుతిప్ప ప్రయత్నిస్తే పిప్పిగాక మానము!

ఆడది మొదట తండ్రికీ, తరువాత భర్తకీ, అనంతరం పుత్రినికీ చెందిన ఆస్తిగాను, ఆర్థిక స్వాతంత్ర్యములేని అశక్తురాలుగాను, వ్యక్తిత్వంలేని వింత మనిషిగాను, కాలక్షేపం జెయ్యాలిఅనే అభిప్రాయాలు (లేక ఆదర్శాలు) మాసిపోవాలి.

'నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి!' యిత్యాది, మన ధర్మశాస్త్ర వాక్యాలు అధర్మమని మనసా భావించాలి. కొడుకునూ, కూతురున్నూ ఒక్కతీరునే కని పెంచినామన్నమాట, తలితండ్రులు హృదయాలకు గట్టిగా హత్తించుకోవాలి. సహజావకాశాలిచ్చి, సమానంగా దిద్ది తీరిస్తే, యిద్దరుకూడా చక్కగా వర్ధిల్లి, సమానంగానే తమ అవసరాల కాదుకోగలరని తెలుసుకోవాలి. దక్షిణ యిచ్చి, పిల్లకు వరుని తేవడము, తమకూ, తమ బిడ్డలకుకూడా, న్యూనతయని గుర్తించాలి. (దక్షిణిస్తేగాని వదలని వస్తువ, తమ బిడ్డ అనుకోవడం ఘనతా?) కోరిన శక్తులు, హృదయమూ గల బాలికను జడ పదార్థంలాగ, ఒకరు ఇంకొకరికి దానమియ్యడం పాపముగా పరిగణించాలి! (మనస్సులు మొద్దుబారినవి గనుక భరిస్తున్నారుగాని, మానవతుల సున్నితపు హృదయాలకు, అబ్బా! ఆ మాట శూలపుపోటులాగ బాధ - గలిగించదూ?)

ఆడబిడ్డలగన్న తలిదండ్రులంతా, కుమార్తెలను యీదుర్భరావమానము పాలుజేయకుండా,యెదిరి నిలిచి, ఈ దురాచారాన్ని రూపు మాపాలి; 'సమానావకాశాల'ని తీర్మానాలు జేసే, మహిళా సమాజాలీయభిప్రాయాలను ప్రేరేపించాలి; విద్యావివేకములు గలిగి, భావిభారతాభ్యుదయ కారకులయ్యే, యువతీ యువకులు నూతనాదర్శాలను పైకి తేవాలి!

ఏసమస్య పరిష్కారం గావాలన్నా, ముందు ఆర్థిక సమస్య పరిష్కారంగావాలి. ఏది సాధించాలన్నా, ఆత్మబలం, ఆర్థికబలం వుండాలి. కొడుకులతో పాటు కూతుళ్లకూ - ఎవరికనువైన విద్యాబుద్ధులు వారికి జెప్పించీ, ఉద్యోగములు జెయ్యనిచ్చీ, ఆస్తిలో అధికారము గలిగించీ (ఆడదానికిగూడా ఆత్మవుంటుందన్న దసలంగీకరించీ!)ఆత్మగౌరవంతో ఆర్థికస్వాతంత్ర్యముతో, జీవించడం నేర్పినప్పుడు, పుత్రుడి పెళ్ళికన్నా, పుత్రిక పెళ్ళికి అలజడి: పడవలసినవసరమేమంటుంది? న్యాయమార్గాన పోయేటప్పుడు, తప్పు చెల్లించవలసిన నిర్బంధమెలా నిలబడుతుంది? ఇచ్చేవారు లేనప్పుడు, నీరులేని నారులాగ, పెళ్ళికొడుకుల ధరలు పడిపోకయేమవుతాయి? Black-market లో ఎంత ధరకైనా పిల్లకు కొనియ్యవలసిన నిర్జీవ వస్తువుగాడు, పెళ్ళికొడుకు. జీవితం సంపూర్ణమవడానికి స్త్రీ పురుషులిద్దరుగూడా, ఒకరికొకరావశ్యకమే. పద్ధతుల మారితే, కన్యాపాణిగ్రహణార్థియై, వరుడే వస్తాడు. వాలుజూపులతో, ప్రేమమయి అయిన కామిని, తన జీవితమతనితో ఏకం జేసుకుంటుంది. ఆదే సృష్టి సమాజం! వారలాగ యిల్లుఏర్పరచుకొన్నప్పుడు, కలిగినంతలో, కొడుకుకీ, కూతుర్కీగూడా కట్నం కానుక లియ్యవలసిందే. అటువంటి కట్నాలలో తప్పేముంది?

ఆన్యాయ పద్ధతులు పోనన్నాళ్ళు, వికృతపు కట్నాలుమాత్ర మొందుగుపోవాలి!

—వి. కె. మణి

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షికక్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

## చెన్నపురిమీది హక్కులు

ఆంధ్రులు చెన్నపురిమీది హక్కులను శాశ్వతముగా వదలుకోవలసినదని మూర్తిత్రయ కమిటీ సూచించినది. ఇదే వాక్యమును పట్టాభిగారు పదేపదే నొక్కినొక్కి చెప్పుతున్నారు. కాని పరంపరానుగతమైన తమ హక్కులను ఆంధ్రులు యెందుకు వదలుకోవలెనో, అటు కమిటీ నివేదిక కాని, యిటు పట్టాభిగారు కాని శదీకరించి యుండలేదు. సబబయిన కారణములను చూపక ఆంధ్రులు హక్కులను వదలుకొనవలెనని పదే పదే బలవంతము చేయుటకు ప్రజానాయకుల మని చెప్పుకొను పట్టాభికిగాని, నెహ్రూ పండితునికిగాని, సర్దార్ పటేలుకుగాని ఏలాటి అధికారమున్నూ లేదు. అటువంటి అధికారము ఒక్క నియోజకులకే ఉంటుంది.

ఇది యిట్లావుండగా మంత్రి శ్రీ బెజవాడ గోపాలరెడ్డిగారు ఆంధ్రరాష్ట్రమూ, చెన్నపురి ఒకేసారి రావని ఒక పొలికేక వేసినారు. దీన్ని బట్టిచూస్తే శ్రీవారు చెన్నపురిమీద హక్కులను వదలుకునేందుకు సిద్ధంగా వున్నట్లుంది. అసలు చారిత్రికముగా స్థిరపడిన ఆంధ్రుల హక్కులను, నిష్కారణముగా ఒక్కసారిగా వదిలేటందుకు, ప్రజాభిమానమును ఏనాడో కోల్పోయిన ఈ లెజిస్లేటరులకు గాని, మంత్రులకు గాని ఏలాటి హక్కున్నూ లేదు. అథవా వీరు (పదవీ)వ్యామోహములోపడి చెన్నపురిని అన్యాక్రాంతము చేసినట్టయితే, ఒక తండ్రి (స్త్రీ) వ్యామోహములో పడి ఆస్తిని పరహస్తగతము చేస్తే సంతతికి ఎటువంటి హక్కు వుంటుందో ఆంధ్రులకుకూడా అటువంటి హక్కులే వుంటాయి. దుర్వినియోగ పరుపబడిన తండ్రి ఆస్తిని ఏవిధంగా సంతతి రాబట్టుకుంటుందో అదేరీతిని ఆంధ్రులు సత్యాగ్రహమహోద్యమమును నడిపి తమ చెన్నపురిని నిలుపుకొనవలసి వుంటుంది.

మదరాసు　　సూ. సత్యనారాయణ

---

## ఆంధ్ర నాయకుల మౌనం

థార్ కమిటీ నివేదికనాడు వచ్చిన విమర్శలు, ఖండనలు యిప్పుడు రాకపోవడానికి కారణమేమి? థార్ కమిటీ నివేదిక మెరుగులతో అగ్రనాయకులద్వారా వచ్చేసరికి నాయకుల్లో యింత విచిత్రపరివర్తన రాతగునా?

అగ్రనాయకత్రయపదకం వెల్వడి యిన్ని రోజులు గడచిపోయినా ఆంధ్రకాంగ్రెసు నాయకులు శ్రీయుతులు ఆంధ్రకేసరి, ఆచార్యరంగాలు పెదవినైనా కదపకపోవడ మంత అన్యాయమింకొకటి ఉండబోదు. లెజిస్లేచర్ కాంగ్రెస్ పార్టీలో పట్టాభిగారి అనుచరవర్గానిది పైచేయికాబట్టి వారి పదకానికి ప్రక్కతాళం తప్ప వేరు మార్పు వుండబోదు.

ఇదంతా యిలా వుండగా ప్రజాభిప్రాయాన్ని పాటించకనే డాక్టర్ పట్టాభిగారు, ప్రకటనలపై ప్రకటనలు గావిస్తూ, చెన్నపురిని పూర్తిగా

వదలుకొమ్మని గంభీర పదజాలంతో స్టేటుమెంటు యివ్వడం సహించరానిది.

చెన్నపురి ఆంధ్రులదనీ, దానిని విడనాడితే యిక ఆంధ్రరాష్ట్రమే లేదని చెప్పిన ఈ నాయకులు తమ పదవులకు రాజీనామాలిచ్చి 'విశాలాంధ్ర' నిర్మాణానికి వుద్యమాన్ని యెందుకు లేవదీయకూడదు?

చెన్నపురి ఒక్క ఆంధ్రుల సొత్తుగానీ, అరవల సొత్తుగానీ కాదు. ఇది మదరాసు రాష్ట్రంలోని ఆంధ్ర, తమిళ, కేరళ, కర్ణాటకుల ఉమ్మడిసొత్తు. అంతేకాని ఇప్పటి లెజిస్లేచర్ కాంగ్రెస్ పార్టీగానీ, ఆంధ్రా కాంగ్రెస్ గానీ, ఒక్క రాజకీయ సిద్ధాంతంపై ప్రజలకు నాయకత్వం వహిస్తున్నంత మాత్రంచేత, ఆంధ్రరాష్ట్రం యే రాజకీయాలకు గానీ, యే పార్టీకిగాని సంబంధించని ప్రత్యేకోద్యమానికి మేము ప్రజా ప్రతినిధులమని, మా నిర్ణయం ప్రజల నిర్ణయమని చెప్పడానికి వీరికి హక్కు లేదు. చెన్నపురిని వదలుకోవడ మటుంచి, మొట్టమొదట మదరాసును ఉమ్మడినగరంగా చేయాలా, అక్కర్లేదా? అని ప్రజాభిప్రాయాన్ని సేకరించాలి. అప్పుడు ప్రజలు గనుక ఉమ్మడిసొత్తుగా వుండకూడదని అభిప్రాయమిస్తే, అది యెవరికి చెందాలి అనే సమస్యను ఆ తరువాత పరిష్కరించాలి. ఇంతగా ఈ సమస్య, ఒక్క ఆంధ్రులలో, అరవలలో సంబంధించినది కాదు.

పదివేల జనాభాకు ఒకరు ప్రతినిధిగావున్న కాంగ్రెస్ [illegible] తమతమ అభిప్రాయాల్ని తెలియజేసి. ఆతరువాత ఇతర పార్టీల అభిప్రాయాలను తెలుసుకొని, ఈ విషయంలో ఆంధ్రజనులందరూ రాజకీయాలకు ముడిపెట్టకుండా 'ఆంధ్రమహాసభ' జరిపి నిర్ణయించేముందు, నాయకులు మదరాసు రాష్ట్రంలోని అన్ని ఆంధ్ర ప్రాంతాల్లోకూడ సంచరించి ప్రజాభిప్రాయాన్ని సేకరించాలి.

పట్టాభిగారు బళ్లారి జిల్లాలోని ఆదోని, తదితర తాలూకాలు కర్ణాటకరాష్ట్రం యేర్పడిన వెంటనే వాటిని వారి కప్పగించే హామీ నిచ్చారు. ఆంధ్రులు అత్యధికులుగా వుండి ప్రభుత్వంచే ఆంధ్ర ప్రాంతాలుగా పరిగణించబడిన చెంగల్పట్టు సేలంజిల్లాలలోని ఆంధ్రప్రాంతాలగురించి ఒక్క ముక్కకూడా చెప్పలేదు. ఎప్పుడో నాయకుల అవసరానికి యేర్పాటుచేసుకొన్న ఆంధ్ర కాంగ్రెస్ యాజమాన్యాన వున్న ప్రాంతాలనుమాత్రమే ఆంధ్రరాష్ట్రంగా గుర్తించాలనడం పైప్రాంతాల ఆంధ్రులను బలిచేసినట్లే.

ఈ క్లిష్ట సమయంలో ఆంధ్రుల ప్రముఖ పత్రికలు, ప్రముఖనాయకులు (దేశభక్త కొండా వెంకటప్పయ్యపంతులు డాక్టరు లంక సుందరంగార్లు తప్ప) ఆంధ్రమాతకు ద్రోహంచేశారనడం నిర్వివాదం. ఇది ఆంధ్రోద్యమ చరిత్రకే తీరని కళంకం.

చెన్నపురి వుమ్మడి నగరంగా, ప్రస్తుతం మదరాసు రాష్ట్రంలోని ఆంధ్రజిల్లాలేకాక, తమిళనాడులో అక్రమంగా కలిపివేసిన ప్రాంతాలతో ఆంధ్రరాష్ట్రాన్ని నిర్మించడం సముచితం.

కాబట్టి సమగ్ర ఆంధ్రరాష్ట్ర నిర్మాణంగానీ, చెన్నపురి వుమ్మడి సొత్తుగా గానీ అంగీకరించక ఆంధ్రుల కన్నివిధాల అన్యాయం జరిగేపట్లు- జంకు గొంకులు లేక ఆంధ్రమహాసభ వుద్యమాన్ని లేవదీసి, గమ్యస్థానం చేరేవరకు తీవ్ర పోరాటం జరిపించడమే ఆంధ్రమా సంపూర్ణ అభిమతం.

టి. సి. రాజన్

రాయల్ పేట — అధ్యక్షుడు

చిత్తూరు జిల్లా యువజన కాంగ్రెస్

---

## మహా తెలంగాణా

నైజాంగిరీ రద్దుకావలెననీ, సంస్థానాన్ని భాషాప్రయుక్తంగా విడగొట్టి - ప్రక్కనున్న రాష్ట్రాలలో కలిపివేయవలెననీ మొదట సోషలిస్టుపార్టీ (హైదరాబాదు) ప్రకటించినపుడు, చిన్నలు, పెద్దలు అనేకులు ముక్కుమీద వేలు వేసుకున్నారు. 'మీ ఇష్టంవచ్చినట్లు కేకలు వేయండి' అన్న కోరశిగల వ్యాఖ్యానములు బయలుదేరినవి.

క్రమేపీ, ప్రజాభిప్రాయం సోషలిస్టుపార్టీ నినాదములను బలపరిచింది. సంస్థానంలోని అన్నిపక్షాలవారూ-స్టేట్ కాంగ్రెసు నాయకులూ నైజాంగిరీ పోవాలంటున్నారనీ, సంస్థానం

భాషాప్రయుక్తంగా చీలి ప్రక్కనున్న రాష్ట్రాలలో చేరవలెనని అంటున్నారనీ, తెలంగాణం అవిధంగా ఆంధ్రరాష్ట్రంలో చేరగా సికింద్రాబాద్ ముఖ్యపట్టణంగా ఉండవలెనంటున్నారనీ, ఇందుకు స్వామిజీ అమిత అనుకూలంగా ఉన్నారనీ, బూర్గులవారు అంతకుముందే అందుకు సుముఖులనీ శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావుగారికి ఏప్రెల్ 15 వ తేదీన హైదరాబాద్ లో తెలిసినట్లు 'ఇండియన్ రిపబ్లిక్' లో ప్రకటించారు. శుభం. మహా తెలంగాణా వర్ధిల్లుగాక!

విజయవాడ చుండి జగన్నాథం

---

## కృష్ణాజిల్లా కలక్టరుగారి ప్రకటన

రైతులు-ధాన్యాన్ని యిస్తామని, తహాస్సీలు కట్టుటకు పైకము లేక చాలా యిబ్బందిపడుచున్నాము. ప్రభుత్వమువారు నిర్ణయించిన ధర రు 17-3-0 అయితే మిల్లర్లు రు 16-4-0 కు మాత్రమే అడుగుచున్నారని ప్రభుత్వమువారికి పిటీషన్లు పెట్టుకున్నారు.

ఆహారశాఖా మంత్రి డాక్టర్ రాజన్‌గారు అసెంబ్లీలో ప్రశ్నలకు జవాబిస్తూ, మేము ధర నిర్ణయించాము, మీరు ఎట్లాగన్నా అమ్ముకోండి. మాకేమీ సంబంధంలేదన్నారు. తక్కువ ధరకు కొన్నట్లు బుజువుపరిస్తే చర్య తీసుకుంటామన్నారు. అది ఎట్లాగా [illegible] మిల్లర్లు [illegible] ఫారములో రు [illegible] అని [illegible] వ్రాస్తున్నారు గదా [illegible]

చాలామంది రైతుల వద్ద ధాన్యము నిల్వ ఉన్నవని ప్రభుత్వ [illegible] తెలియజేస్తున్నారు. కాని యింతవరకు [illegible] కొని వెళ్ళకపోగా-యీ నెలాఖరులోగా అనుమతి పొందిన ప్రొక్యూరింగుఏజంటుకు యిచ్చివెయ్యాలని శ్రీకృష్ణాజిల్లా కలెక్టరుగారు ప్రకటన చేయడం చాలా శోచనీయం.

ఉత్పత్తి కొనుగోలుదార్ల సహకారసంఘాలకు ధాన్యసేకరణ యిస్తే రైతులకు యిబ్బంది ఉండదని, మిల్లర్లవల్ల ప్రొక్యూరింగు సరిగా జరగటంలేదని - ఆంధ్రరాష్ట్ర రైతు కాంగ్రెసు మొదలు గ్రామకాంగ్రెసు సంఘాలవరకు తీర్మానాలు చేసినా, రైతులు ఆందోళన చేసినా ప్రభుత్వమువారు యింతవరకు శ్రద్ధతీసుకొనలేదు.

రైతులు ధాన్యాన్ని ప్రభుత్వము నిర్ణయించిన రేటుకు యిస్తామంటూంటే- యీ నెలాఖరులోగా ధాన్యంయిస్తే యివ్వండి, లేకపోతే మేము వచ్చామంటే, ధర తగ్గిస్తాము- శిక్షిస్తాము అని కలెక్టరుగారు ప్రకటన చేయటం చాలా ఆశ్చర్యంగా ఉంది.

ప్రొద్దుటూరు. బి వెంకటేశ్వరరెడ్డి
ప్రధానకార్యదర్శి, గ్రామకాంగ్రెసుసంఘం

---

# "నా దైనిక సమస్యలు"

**15-4-49 సంచికలో బహుమానం పొందినవారు: ఎం. రామారావు, కాకినాడ.**

కడచిన ఫిబ్రవరిలో ప్రారంభించిన పై శీర్షిక క్రిందటి సంచికనుండి విరమించబడింది. శీర్షిక నిర్వహణలో పాఠకలోకం యిచ్చిన ప్రోత్సాహానికి సంపాదకుని కృతజ్ఞత.

ఆంధ్రదేశపు సమకాలిక జీవితం ప్రతిబింబింప చేయడమే శీర్షిక ప్రారంభించడంలో సంపాదకుని ఆశయం. నేటి మన వ్యక్తిగత జీవితపు సమస్యల పరిష్కార ప్రయత్నమే రేపటి చరిత్రగా మారుతుంది. వందల కొలదీ యువతీ యువకులు ఉత్సాహంతో తమతమ సమస్యలు పంపారు. కాని దానురాను రచనల్లో చిత్తశుద్ధి, యాథార్థ్యము కొరవడ్డాయి. సమస్యలకోసం సృష్టించుకున్న సమస్యలు, కృత్రిమమైనవి, సమాజానికి ఏ మాత్రమూ నిమిత్తంలేని వ్యక్తిగత పరిణయ సమస్యలు దానితో ఎక్కువయాయి. నిత్యపల్లవ శీలమైన యీ శీర్షిక కృతకంగా మారిపోయింది.

త్వరలోనే యింకొక కొత్త శీర్షిక ప్రారంభించబడుతుంది. అది కాక, నారీజగత్తు, కళాక్షేత్రం మొదలైన శీర్షికలుంటాయి. కళాక్షేత్రశీర్షికక్రింద నాట్యరంగానికి, సినిమా పరిశ్రమకీ ప్రాధాన్యం యివ్వబడుతుంది.

— సంపాదకుడు



# తెలుగు స్వతంత్ర

## విషయసూచిక

సంపుటి 1. సంచిక 12

శుక్రవారం, మే 20, 1949

అజంతా కుడ్యచిత్రం




ప్రణయిని

చిత్రకారుడు: యస్. యస్. ఆలంద్‌కర్.

తెలుగు స్వతంత్ర

సంపుటి-1
సంచిక-42

మే 20, 1949

ప్రచురణ:
ప్రతి శుక్రవారం

# నైతిక విజయం

కార్యసాధనపరంగా పరికిస్తే ప్రయోజనం లవలేశమే వినప్పటికీ, భారత దేశం ఐక్యరాజ్యసమితి జెనరల్ అసెంబ్లీలో తిరిగి రెండవసారి శ్లాఘనీయమైన నైతిక విజయాన్ని సాధించింది. నలభైయేడు వోట్ల మెజారిటీతో, భారత దేశంతో గల వివాదాన్ని పరిష్కరించుకోవలసినదని దక్షిణాఫ్రికాను హెచ్చరిస్తూ సమితి ఒక తీర్మానాన్ని అంగీకరించింది. తీర్మానాన్ని వ్యతిరేకించిన ఏకైక కంఠం ఒక్క దక్షిణాఫ్రికా ప్రతినిధి మిస్టర్ 'ఎరిక్ లో' ది మాత్రమే. సుమారు మూడు సంవత్సరాల క్రితం డిసెంబరు 1946 లో, ఐక్యరాజ్యసమితి యించుమించు ఇదే విధమైన తీర్మానాన్ని ఆమోదించింది. ఇండియా, దక్షిణాఫ్రికా—యీ రెండు దేశాలూ తమ తమ విభేదాలను సామరస్యమార్గంలో పరిష్కారం చేసుకుని, ఏ తత్ఫలితాన్ని సమితికి తెలియచెయ్యమని ఆదేశించిన ఆనాటి సమితి తీర్మానం బలహీనుడి ప్రగల్భాలవలె నిష్ఫలమై విస్మరించబడింది. నేటి తీర్మానంకూడా ఆ విధంగానే రూపుమాసిపోక, కించిత్తయినా సార్థకం అవుతుందనడానికి కేమీ అవకాశంలేదు. చర్చలో పాల్గొంటూ మిస్టర్ ఎరిక్ లో, మానవుడి ప్రాథమికమైన హక్కుల ప్రస్తావన తెచ్చాడు. పై తీర్మానం సమితి ఆమోదించడంతో, తన దేశంలో ప్రజలకి అటువంటి హక్కులేవీ యిప్పుడు లేవనే అపార్థం స్ఫురిస్తుందని అన్నాడు.

ఐక్యరాజ్యసమితి ఛార్టర్ లో, సభ్యులందరూ తీసుకున్న దీక్షాప్రతిజ్ఞలో యీ విధంగా ఉన్నది: "ముందుతరాల సంతతిని యుద్ధప్రమాదంనుండి తప్పించేటందుకు; స్వతస్సిద్ధమైన వ్యక్తి స్వాతంత్ర్యాన్ని, గౌరవాన్ని రక్షించుటకు; స్త్రీ పురుషులమధ్య, చిన్న పెద్ద దేశాల మధ్య పక్షపాతంలేకుండా ప్రవర్తించుటకు; సాంఘికాభ్యుదయానికి దోహదం కల్గించి, పరస్పర సహానభావం పెంపొందింప చెయ్యడానికి...ఐక్యరాజ్యసమితి సభ్యులు పాటుపడతారు." కాని ఆశయ ప్రకటనకూ, ప్రవర్తనకూ మధ్య సహస్రయోజన దీర్ఘమైన అఖాతం నిలిచి ఉంది. బలవంతమైన నాలుగైదు రాజ్యాల రాజకీయవేత్తల చేతుల్లో కీలుబొమ్మగా ఐక్యరాజ్యసమితి పరిణమించిన తర్వాత, ఆ సమావేశాల్లో మాన

వుడి హక్కులగురించిన ప్రస్తావన కృత్రిమంగా వినిపిస్తుంది.



[illegible] హృదయాలలోనూ పరపీడన పరాయత్వమే నిండిన నేడు సమితి చేసే యీ నైతిక ప్రబోధం ఎవరి అంతరాత్మలోనైనా సంచలనం కలిగిస్తుందా? అనేది అనుమానాస్పదం. దక్షిణాఫ్రికాలోని భారతీయులు భారతదేశంవైపు దృష్టి సారించక, తాము ఉన్న దేశపు ప్రభుత్వంపైననే ఆధారపడడం ఉత్తమమని, డాక్టర్ మలాన్ హితోక్తి ఇతరేతర కారణాల ప్రాబల్యం వల్ల ఆయన చేసిన ఉద్బోధ ఒక విషాదసత్యాన్ని బహిర్గతం చేస్తుంది: యీ సమస్య కేవలం దక్షిణాఫ్రికా – భారతదేశాలకు మాత్రమే సంబంధించినది కాదు. యావత్సభ్యతా ప్రపంచమూ భవితవ్యం గురించి ఆత్మశోధన చేసుకోవలసిన సమయమిది

సమితి ఆదేశాన్ని దక్షిణాఫ్రికా పాటిస్తుందనే భ్రమ ఎవరికీ ఉండదు అక్కడి ప్రజానీకం అనుభవిస్తున్న హక్కుల గురించి పరిశోధన సాగించడానికి సమితి ఒక సంఘాన్ని నియమిస్తే, ఆ సంఘాన్ని అసలు దక్షిణాఫ్రికాలో అడుగుపెట్టడానికే అనుమతి పుట్టదు. ఆపైన కర్తవ్యం ఏమీ లేదు ఏ చర్య అవలంబించడానికీ సమితికి అధికారం లేదు, స్తోమత అంతకంటె లేదు ఇది ఎవరికీ తెలియని రహస్యం కాదు. అయినా అర్థవిహీనమైన యీ తతరగం యథారీతిని సాగుతుంది: యీ ప్రపంచపు అన్యాయాలపట్ల సమితి తన నైతికమైన ఆగ్రహాన్ని ప్రకటిస్తుంది. కొందరు సభ్యులు ఆమోదిస్తారు; మరికొందరు ప్రతిఘటిస్తారు ఏకమేవా ద్వితీయం అన్నట్లు, కోటివదులు ధనుష్కోటిలో కలిసెనన్నట్లు, సర్వవిధ సమస్యలూ కేంద్రం దగ్గిర ఆగి ప్రశ్నార్థకంగా నించుంటాయి.

అంతమాత్రాన నిరుత్సాహ పడవలసిన అగత్యంలేదు. మానవచరిత్రలో విజ్ఞానం, నాగరికత పెరిగినంతగా వివేకం, సుహృద్భావం అభివృద్ధి చెందక పోయినా, ఉత్సాహంతో, విశ్వాసంతో ముందడుగు వెయ్యడమే కర్తవ్యం. తప్పకుండా మానవుడు ప్రగతిమార్గాన్నే ప్రయాణిస్తున్నాడు. వివిధమైన నిర్బంధం లేక స్వచ్ఛందంగా ఒకరితో ఒకరు సహకరించి, శాంతి సాధించి, నిశ్చయానందమైన సహజ నిర్మాణమార్గంలోనే మానవులు పరిణామం చెందుతున్నారు. కొన్ని బలీయమైన అవరోధాలు నడుమలో తలెత్తక తప్పదు కాని వాటినే తలుచుకుని, నిస్పృహ చెంది, సమాజం వెనకదారి పట్టదు. అసహనం అసహనాన్నే ప్రేరేపిస్తుంది. మానవుడిలో అంతర్లీనంగా ఉన్న ఉదారత్వాన్నీ, ఔన్నత్యాన్నీ ప్రబోధించడంలోనే అభ్యుదయం యిమిడి ఉంది. ఇది ఒకనాటి కృషితో సాధ్యంకాదు.

# శ్రీ రమణ మహర్షి

భగవాన్ శ్రీ రమణమహర్షి పేరిట ఇంకా భక్తసమాజాలేవీ నెలకొల్పబడలేదు; భజన మందిరాలు నిర్మించబడలేదు. తిరువణ్ణామలైలోని ఆయన ఆశ్రమానికి వివిధప్రాంతాలనుండి దర్శనార్థం జనం వస్తారు: ఏదో తీరని మానసిక వ్యథలతో క్రుంగిపోయేవారు, జీవితపరమార్థం ఏమిటో తెలుసుకో యత్నించేవారు, అశాంతి బాధితులు, జ్ఞానాన్వేషులు-అనేకులు. మహర్షి నుండి వారుపొందే అధునాతనమైన సత్యబోధ ఏమీ లేదు. ఆశ్రమంలోని ప్రశాంతత, ప్రకాశవంతమైన భగవాన్ చిరునవ్వు, హృదయానికి ఒక వింత పరితృప్తి నిస్తాయి. ఇక సమస్యలా? నిగూఢమైన ఆధ్యాత్మిక రహస్యాల అన్వేషణా? ఎవరి చిత్తవృత్తి ననుసరించి, ఆత్మపరిపక్వాన్ననుసరించి, వారివారి సమస్యాపరిష్కారమార్గం ఉంటుంది. సూత్రీకరించిన ఆధ్యాత్మిక ప్రణాళికలేవీ మహర్షి వద్ద సిద్ధంగా లేవు.

గత శనివారం నాడు తిరువణ్ణామలైలో పాతాళేశ్వర దేవాలయ పునర్నిర్మాణానికి ప్రారంభోత్సవం చేస్తూ, గవర్నర్-జనరల్ శ్రీ రాజగోపాలాచారి, నూతనమైన భారతీయ ఆధ్యాత్మికత్వాన్ని శ్రీ రమణమహర్షి ఇతోధికం చేశారని అన్నారు. రాశిచక్రగతుల్లో, రాత్రిందివాల పరిభ్రమణంలో మానవుడు ప్రభవం పొందిననాటినుండీ ఆధ్యాత్మికాన్వేషణ ఉండనే ఉన్నది. సమస్త నాగరికతలకూ అదే ప్రాతిపదిక. అన్వేషణావధి విషయంలో కూడా అనేకత్వం లేదు. మంచి అన్నది పెంచి, మానవహృదయాలలో ప్రేమ పెంపొందింప చెయ్యడం. ఈ మార్గంలో కృషి చెయ్యవలసిన ఆవశ్యకత మానవసమాజంలో నేడున్నంతగా ఇదివరకెన్నడూ లేదేమో ననిపిస్తుంది. నేడు కావలసినది దురవగాహమైన గంభీరతత్త్వబోధ కాదు. ప్రకృతిశక్తుల్ని కైవసం చేసుకుని, అపారమైన యంత్రనాగరికత సృష్టించుకున్నా, నేటి మానవుడు తోటిమానవుని చూసి భయపడుతూనే ఉన్నాడు. తను జీవించలేడు, ఇంకొకర్ని జీవించనివ్వడు. ఈ సమస్య బాహిరం కాదు; ఆంతర్యానిది. ఈ విశాల భూఖండాన్నంతటినీ స్వర్గసీమగా మార్చగల్గిన అవకాశాలుండీకూడా పరిస్థితులిలాగే ఉండడానికి ఏది అవరోధం కల్గిస్తోంది? బాహ్యంగా అనేకమైన సమూహ యత్నాలు, ప్రణాళికలు, నిర్మాణాలు, ఆర్థిక రాజకీయ వైజ్ఞానిక సూత్రాలు-అన్నీ పద్మవ్యూహంగానే పరిణమిస్తున్నయి: విజ్ఞానాన్ని చూసి వివేకం అపహసిస్తోంది.

అందుకే, ఆలనాడు సోక్రటీస్, బుద్ధుడు-నేడు గాంధీ, రమణమహర్షి వంటి మనీషుల ఆవశ్యప్రభవం. వ్యక్తిగతంగా మానవుడు పరిణామం చెందడం ఎంత అవసరమో వారు నిరూపిస్తున్నారు. సమస్తమైన సమస్యల పరిష్కారానికీ ప్రారంభకేంద్రం వ్యక్తిహృదయం. శ్రీరమణమహర్షి ఆ మానవహృదయాన్ని ఉద్దేశించే ప్రబోధిస్తున్నారు. పరిణతాత్ముడైన వ్యక్తి స్వార్థరాహిత్యంతో, విశ్వప్రేమతో ఎటువంటి ఉన్నత శిఖరాలందుకోగలడు? ఆ ప్రయత్నమే ఆధ్యాత్మికాన్వేషణ. ఈ ప్రాతిపదిక నంగీకరించిననాడు, చిత్తశుద్ధితో పరివర్తన సాధించే వ్యక్తుల సంఖ్య క్రమంగా హెచ్చయిననాడు—నేటి మన నాగరికతను ఎదుర్కొంటున్న విషాద సమస్యలు క్రమంగా హరించిపోక తీరదు. అయితే యీ వ్యక్తిగతమైన సాధన వ్యక్తిని సమాజంనుండి వేరు చేస్తుందేమోనన్న భయం అకారణం. నిర్మలహృదయంతో స్వచ్ఛందంగా అందరూ అన్నదమ్ములవలె చేతులు కలపడం నేర్పుతుంది. విశ్వచైతన్యంనుండి వేరు భావం లేని శ్రీరమణమహర్షి అంధకారాన్ని గర్హించడం కంటె ఒక్క చిన్నజ్యోతిని వెలిగించడం మేలని రుజువుచేశారు. సర్వభూతములయందు పరమాత్మనూ, పరమాత్మయందు సర్వభూతములనూ సందర్శించమన్న ఉపనిషత్సందేశానికి భగవాన్ రమణమహర్షి నేటి ప్రతినిధి.

# మార్క్సిజం : సంఘపరిణామసూత్రాలు



మానవుడి బుద్ధిపరిణామంలో తోటి మానవుణ్ణి అధిగమించాలనే ఆశ, అతనికన్నా అధికుడై వుండాలనే ఆశ వ్యక్తి స్వామ్యానికి ఆది కారణమై వుంటుంది. ఆ ఆశ కలగగానే, సృష్టిలో బుద్ధిబలంలో, శరీరబలంలో ఉన్న వైవిధ్యాలు ముందు నాయకత్వానికి, తరవాత స్వామిత్వానికి కారణమై వుంటాయి. ఆనాటికీ యీనాటికీ, తోటిమానవుణ్ణి అధిగమించాలనే ఆశ మానవ స్వభావంలోనుంచి పోలేదు. పోదేమో కూడా! వ్యక్తిస్వామ్యం లేనినాడు శరీరబలాన్నీ, బుద్ధిబలాన్నీ, పాండితీ విశేషాన్నీ, కీర్తినీ ఆర్జించుకుని యితరులను అధిగమించడానికి యీ ఆశ కారణభూత మయింది. ఈ ఆశ లేనినాడు మానవ జాతికి ప్రగతే లేదు. మానవులు యిటుక రాళ్లలాగ ఒకేమాదిరిగా తయారౌతారు. కాని యిది, వ్యక్తిస్వామ్యం అంకురించడంతోనే, తమ స్వామిత్వ పరిమాణాన్ని- అంటే, ఆర్థికమైన విలువను అధికం చేసుకుంటానికి కారణభూత మయిన దుష్టశక్తిగా మారింది.

## వ్యక్తిస్వామ్య ఫలితాలు

అంటే ఉత్పత్తి విధానాలకూ, సాధనాలకూ, వాటిలో మార్పులకూ మార్క్సు ఆరోపించే ప్రాముఖ్యం వాటిననుసరించిన వ్యక్తిస్వామ్యానికి చెందింది. వ్యక్తి స్వామ్య స్థాపనకు కారణం మానవ స్వభావంలోనే వుంది. ఆ స్వభావాన్ని యితర రంగాల్లో వినియోగించుకుని ఆ ఆశను తీర్చుకునే యేర్పాటు లేనినాడు, అది సంఘస్వామ్యనాశనానికీ, వ్యక్తి స్వామ్యస్థాపనకూ దారి తీస్తుంది. ఆ ఆశే నశించిననాడు, ఆర్థికమయిన ప్రయోజనం లేకపోతే వ్యక్తి ఏరంగంలోనూ కృషిచేయడమంటూనే వుండదు.

ఆహారంపండే భూమికి స్వామిత్వం ఏర్పరచుకున్న భూస్వాములు కేవలం కూలీల శ్రమ మీదనే ఆహారోత్పత్తికి ఆధారపడ్డనాడు, సాంఘీయులు వస్త్రోత్పత్తికి నూలువడికే వారిమీదా నేసేవారిమీదా ఆధారపడ్డనాడు - వ్యక్తి స్వామ్యం భయంకరఫలితాలు కలిగించలేదు. కాని కాలక్రమాన ఉత్పత్తి సాధనాల్లో మార్పుతో పదిమంది చేసే పనిని ఒక్కరు చేయడానికి వీలు కలిగింది. అంటే ఒకస్వామికి పదిమందిస్వాముల తాహతు ఏర్పడింది. అందుచేత స్వామిత్వంవల్ల కలిగిన దుష్ఫలితాలను ఉత్పత్తి విధానాలకు మాత్రమే ఆరోపించడం తప్పు.

ఈ సూత్రమే తక్కిన రంగాల్లోనూ అన్వయిస్తుంది. సంఘసంరక్షణకు, దేశసంరక్షణకు కత్తి మాత్రమే ప్రధానమయిననాడు- ఇన్ని సైనికసమస్యలు లేవు. పది లక్షలమంది సైనికులు చేసే పని ఒక యాటంబాంబు చేయగలిగినప్పుడు మానవజాతి భవిష్యత్తు ఊహించడం కష్టం. మానవుడసలే అవసరం లేకుండా చేసే ఉత్పత్తి విధానం, యాటంబాంబుకన్నా ప్రమాదకరమయింది. ఒకటి ఒకక్షణంలో మానవజాతిని నాశనం చేస్తే, రెండవది కృషిలేకపోవడంతో, నిరుద్యోగంతో కొన్ని దశాబ్దాలలో మానవజాతిని నాశనం చేస్తుంది. అందుచేత జీవితావసరములు అందరికీ విరివిగా పుష్కలంగా లభించడానికి వీలైనంతవరకే, ఉత్పత్తి సాధనాల్లో మార్పు సహించదగింది.

సహజంగానే ప్రమాదకరమయిన ఉత్పత్తి సాధనాభివృద్ధి వ్యక్తిస్వామ్యంతో కూడుకున్న సంఘంలో మరీ ప్రమాదకర మౌతుంది. వ్యక్తిస్వామ్యం పోకతప్పదు. ఉత్పత్తి సాధనాల్లో అభివృద్ధి ఏస్థితిలో ఆగాలి అన్నది- దేశకాలపరిస్థితులు, జాతి అవసరములు నిర్ణయించాలి.

## సంఘపరిణామసూత్రాలు

మార్క్సు వ్రాతలు మనకు ఎక్కువగా ఇంగ్లీషు తర్జుమాలవల్లే పరిచితములు. భాషాంతరీకరణంలో ఆయన వ్రాతలు అపార్థం చేసు

ఉంటానికి వీలులేని పక్షంలో ఆయనకు ఆయన అనుయాయులు ఆరోపించే మేధోవికాసాన్ని మనం శంకించవలసి వస్తుంది. అయినా ఆవిషయం గురించి సమగ్రంగా విమర్శించడానికి ముందు, ఆయన నిర్ణయములకు మూలాధారమయిన సాంఘిక పరిణామ సూత్రమును గురించి వివరంగా తెలుసుకోవడం అవసరం.

సాంప్రదాయాల్లోనూ, మాతృభాషలోనూ సామ్యం లేనిచోట ఒక భాషలో ఉన్న దాన్ని మరొక భాషలో చెప్పవలసివచ్చినప్పుడు చాలా అపార్థాలకు తావుంటుంది. ఎందుకంటే కొన్ని పారిభాషిక పదములను అవే అర్థం వచ్చేటట్లుగా మరొక భాషలో చెప్పడం కష్టం.

అటువంటి పారిభాషికపదమే డైలెక్టిక్ అనే మాట కూడా. అల్లాంటిదే 'ఉత్పత్తి' అనేది. వీటికి ప్రసిద్ధార్థములకు అతీతమయిన అర్థాన్ని ఆరోపించని సందర్భంలో మార్క్సిజం అపార్థకమో నిరర్థకమో అయిపోతుంది.

కేవలం వాస్తవికములై, ఇంద్రియానుభూతివల్లా, ప్రయోగాదులవల్లా నిరూపింపదగిన లౌకిక ప్రపంచంలో జరిగే వికృతులకు, ప్రయోగాదులకు అతీతమయిన ఒక సంభావనవల్ల, మార్క్స్ వివరించ దలచినాడు.

మార్క్స్‌కు గురుతుల్యుడైన హెగెల్ భావంనుంచి (idea) వాస్తవికత (reality) ఏర్పడుతుంది అన్నాడు. అంటే కర్రను కర్రగానూ, పామును పాముగానూ అంతఃపూర్వమే మన కేర్పడివున్న భావాలవల్ల మనం గుర్తించుతున్నాము. వాటి వాస్తవికత మన భావనమీద ఆధారపడివుంది. మార్క్స్, అతని అనుచరుడైన ఎంజెల్సు యిది కాదన్నారు: వారు వాస్తవికతవల్ల భావం పుడుతున్నదేగాని, భావంనుంచి వాస్తవికత ఏర్పడడంలేదని వాదించారు. 'మనుష్యులు పుట్టినా పుట్టకపోయినా, వారికి మనస్సూ బుద్ధీ ఉన్నా లేకపోయినా, ప్రాపంచిక సత్యములు, వస్తువులు ఉనికినీ వృద్ధినీ కలిగేవున్నవి. వాటికి ఉనికీ వృద్ధీ వుండడంవల్ల బుద్ధిమంతుడయిన మానవుడు అభిప్రాయాలు ఏర్పరచుకున్నాడు.' అన్నారు. ఇంత యెందుకొచ్చిందంటే—సంఘంలో మార్పులు మానవుడి యిచ్ఛవల్లా, ఆ యిచ్ఛమీద ఆధారపడి ఏర్పడుతున్నవా? లేక ఆ యిచ్ఛవున్నా లేకపోయినా, దానికి అతీతములయిన కారణములచేత, ఆ యిచ్ఛనే నిర్ణయిస్తూ నిరూపిస్తూ జరుగుతున్నవా? అనే మీమాంసవల్ల, మార్క్స్ భావించిన డైలెక్టిక్—భౌతికములయిన సత్యములు- వస్తువులు, మరియు వాటిని మార్చేధర్మములు, వాటి పరిణామాన్ని పాలించే ధర్మములు-బుద్ధికతీతములయినవి అని బోధిస్తుంది. అందుకనే ఆ భాగానికి సంఘపరిణామ సూత్రములు అనే శీర్షిక యివ్వడం జరిగింది.

వీటితోపాటు, మార్క్స్ సిద్ధాంతాలు డార్విన్ అనే జీవశాస్త్రవేత్త ప్రతిపాదించిన పరిణామవాదంమీద కూడా చాలావరకు ఆధారపడ్డవి. వీలైనంతవరకు పరిణామవాదాన్ని మార్క్స్ తన సంఘపరిణామసూత్రాలను సమర్థించుకుంటానికి వినియోగించాడు కూడా. తన వాదానికి వ్యతిరేకంగా వున్నచోట డార్విన్ పొరబడ్డాడు అని తోసేశాడు.

## ప్రకృతిసిద్ధ వైరుధ్యాలు

సంఘపరిణామ సూత్రానుసారంగా ప్రాపంచిక సత్యములు పరిపూర్ణములూ, స్థిరములూ, శాశ్వతములూ,హఠాత్సంభవములూ కావు. కాక పోగా, పూర్వస్థితికీ భవిష్యత్ స్థితికీ సంబంధం కలిగి, నిరంతరం మారుచెందుతూ, మార్పు చెందడానికి ఆవేదనపడుతూ, అవి ఉనికి కలివున్నవి-సుడిగుండంలో పోతున్న జలకణములు లాగ. ఒకదాని ఒరపిడి యింకొకటి అనుభవిస్తూ, ఒకదాన్ని మరొకటి ప్రతిఘటిస్తూ, ప్రతిసంఘర్షణా, మరొకసంఘర్షణకు దారితీస్తూ, అపరిమితమయిన ప్రాపంచిక సంఘర్షణలో ఒక భాగంగా పరిక్రమించి పోతుంది. ఈ పరస్పర సంఘర్షణ, ఆంతరమూ, బాహిరమూ అయిన వైరుధ్యం వాటిమార్పుకూ, ప్రగతికీ కారణం. విరుద్ధ వస్తువులమధ్య వైరుధ్యం ఎంతవున్నదో, అవిచ్ఛేద్యతకూడా అంతగానే వున్నది! అంతర్గతమూ, బహిర్గతమూ అయిన వైరుధ్యం సాంఘిక పరిణామానికి కారణం.

దీనికితోడు ప్రకృతిశాస్త్ర విజ్ఞానాభివృద్ధి శక్తి అనంతమూ, అపారమూ అయినదనీ; అది

రూపాంతరం పొందగలదే గాని, కొత్తది సృష్టించడంగాని, ఉన్నదాన్ని నాశనం చేయడంగాని సాధ్యంకాదనీ నిరూపించింది. ప్రపంచంలో ప్రతి వస్తువు భౌతికస్థితిని—అంటే ఘనపదార్థంగానో, ద్రవపదార్థంగానో, వాయుపదార్థంగానో ఉండే స్థితిని-మార్చుకోగలదే కాని అసలు ప్రకృతిలో ఉనికేలేకుండా పోలేదు. స్థాణువైన శక్తి చలం కావచ్చు. చలమయిన శక్తి స్థాణువు కావచ్చు. ఘన, ద్రవ, వాయుపదార్థములలో ఏదో నిర్ణయించలేని స్థితిలో వస్తువు వుండవచ్చును. నామరూపములులేని అనిర్దిష్ట వస్తువు (Nebula) పరిభ్రమణంలో ప్రకృతి విశేషములన్నీ ఏర్పడ్డవని కాంట్ (Kant) అనేవిజ్ఞాని ప్రతిపాదించాడు. వీటన్నిటివల్ల, ప్రకృతికీ ప్రపంచానికీ అతీతమయిన సృష్టికర్త ఎవరో లేడనీ; ప్రకృతిని ప్రకృతిధర్మాలే శాసిస్తున్నవిగాని మరే శక్తీ లేదనీ అభిప్రాయం వ్యాపించింది.

ప్రకృతిలో పరిణామాలను శాసించే యీ ధర్మాలే మానవసంఘంలో పరిణామాలను శాసిస్తవి. 'నిరంతరమూ ఉత్పత్తిశక్తులు ప్రవృద్ధి చెందుతూనే వున్నవి. సాంఘిక సంబంధములు నశించిపోతూనే వున్నవి. ఇందులో శాశ్వతమయింది ఏదీ లేదు.' అని మార్క్స్ వాదించాడు.

## త్రిగుణాత్మక సిద్ధాంతం

అయితే, ప్రకృతివిశేషాల్లో యీ మార్పు జరిగే విధాన మేమిటి?

ప్రతిదానికీ ప్రకృతీ, వికృతీ, సంస్కృతీ, వున్నవి (Thesis, antithesis and synthesis). ప్రకృతిలో వికృతినీ, వికృతిలో వికృతినీ కలిగించే శక్తీ, వికృతిలో వికృతివల్ల ఉత్తమస్థితిక సంస్కృతిని కలిగించే శక్తీ, వస్తువుల్లోనే ప్రగర్భితమై, చలనహేతువై యిమిడి వున్నవి. ఈ వైరుధ్యమే పరిమాణంలోనూ, స్వభావంలోనూ కూడా మార్పు కలిగిస్తుంది. వైరుధ్యం లేకపోతే మార్పే లేదు. ఈ వైరుధ్యం అంతరించిననాడు జీవితమే అంతరిస్తుంది.

ఈ సంక్లిష్టమైన సిద్ధాంతాన్ని అర్థం చేసుకోడం ఎంత కష్టమో అంతఅవసరం. చెట్టునుండి విత్తు జారి భూమిమీద పడుతుంది. ప్రకృతిలో విత్తుగా వుండేది భూమిమీద పడడం, పడగానే అనేకమార్పులు చెందడం, ఆమార్పులకు మార్పుగా మొక్క లేవడం, ఆమొక్క పెద్దదై ఎన్నో విత్తులను పూర్వస్థితికన్నా అధికమయిన స్థితిలో సృష్టించడం జరుగుతున్నవి. ఆవిధంగా వచ్చిన చెట్టు ఫలించగానే మళ్లీ వికృతిపొంది నశించిపోతోంది, అల్లాగే గ్రుడ్డులో వికృతీ, ఆ వికృతికి వికృతిఫలితంగా పిల్లా కలుగుతున్నవి. అది సృష్టిక్రమానికి మూలం. ఈ ధర్మానుసరణం లోనే వస్తువులు పరిమాణంలోనూ, స్వభావంలోనూ మార్పు చెందుతవి. వికృతి ఒక స్థితిని దాటినప్పుడు వస్తువు పరిమాణంలోనూ, స్వభావంలోనూ మార్పుచెందుతుంది. ఉదాహరణంగా నీరు వెచ్చబెడితే, కొంచెంసేపు వేడిగానే వుంటుంది. కాని అల్లాగే వేడిచేసుకుంటూపోతే ఆవిరి అయి పరిమాణంలోనూ, స్వభావంలోనూ కూడా మార్పు చెందుతుంది. అల్లాగే చలవ చేసుకుంటూపోతే కొంతసేపటికి గడ్డకట్టిపోయి వికృతి చెందుతున్నది. అల్లాగే ధనం ఒక స్థితిని దాటినప్పుడు గాని పెట్టుబడిగా పనికిరాదు.

ఈమూడు సిద్ధాంతాలతో, ప్రతిసంఘంలో పరిణతినీ—వికృతినీ; అన్ని కాలాల్లో, అన్ని దేశాల్లో, అందరు వ్యక్తుల్లో జరిగే మార్పులన్నీ వివరించగలమంటాడు మార్క్స్. ఈ సూత్రాలను మనస్సులో పెట్టుకునే, ఒకఉత్పత్తి విధానం మరొకవిధానాన్నీ, అదిమరొక విధానాన్నీ, ఒక విధానం ఒక రకమయిన సంఘాన్నీ ఎల్లా సృష్టించిందో ఆయన వివరించాడు. హిందూసంఘజీవితానికికర్మసిద్ధాంతంఎల్లాగో, ఆయుర్వేదానికి త్రిదోష సిద్ధాంతం ఎల్లాగో, మార్క్సిజానికి యీ త్రిగుణసిద్ధాంతం అట్లాంటిది.



# జపానుదేశం : 'షింటో' మతం

టి. జగన్మోహనరావు

ఇరవయ్యో శతాబ్దంలో జర్మనీ జపానుదేశాల ప్రజలు ఒక విచిత్రమైన ఆవేశాన్ని ప్రదర్శించారు. జర్మనీవారికి వారి జాతి చాల ఉన్నతమైనదని విశ్వాసం. జపానువారికి మరొక రకమైన నమ్మకం. వారి చక్రవర్తి సాక్షాత్తు భగవత్స్వరూపుడంటారు. అందుచేత చక్రవర్తి రక్షణార్థం ఎట్టి త్యాగానికైనా వెనుదీయరు. ఈ రెండు విశ్వాసాలు అర్థంలేనివి. ఈ యుగంలో ప్రభుత్వాలు ఒక మతాన్ని ఆదరించటంగాని, వేరొక మతాన్ని అణగద్రొక్కటంగాని జరుగకూడదు. రాజకీయాల్లో మతానికి తావు లేకపోవటమే యిందుకు కారణం. కాని ఆ విషయాన్ని ప్రభుత్వాలు గుర్తించనప్పుడు ప్రజలలో మతోన్మాదం ఎక్కువ అవుతుంది.

జపాను ప్రభుత్వంయొక్క ఆదరాన్ని పొందిన మతంపేరు 'షింటో'. ఆ మతాన్ని జపాను వారంతా స్వీకరించాలి. పైకి మాత్రం యితర మతాలు కూడా సహనభావంతోనే చూడబడుతుంటాయి కాని ఆ యితర మతస్థులుకూడా షింటో మతంలోని ప్రధాన ఆచారాల్ని అవలంబించాలి. వారందరు షింటో మతంలోని ప్రధానదేవత అయిన 'మికాడో' యందు విశ్వాసం కలిగివుండాలి.

ఈ షింటో మతానికి ఎనిమిదవ శతాబ్దంలో రచింపబడిన 'కోజికి' అనే గ్రంథం మూలం. ఆగ్రంథం సామాన్యంగా పండితులకు మాత్రమే బోధపడుతుంది. ఎందుచేతనంటే ఆ గ్రంథంలోని భాషకు నేటి జపాను భాషకు ఎంతో భేదం వుంది. 8వ శతాబ్దంలోని ఆంగ్లో-సాక్సను భాషకు నేటి ఆంగ్లభాషకు కూడ అంత తారతమ్యం లేదనవచ్చు. అంతేకాకుండా ఆపుస్తకంలోని కొన్ని భాగాలు మాత్రమే నేటి భాషలోనికి ప్రజల ఉపయోగం కోసం తీసుకొనిరాబడ్డాయి. ఆ గ్రంథంలోని వస్తువు దేవుళ్ల యుద్ధంలాంటి దానితో ప్రారంభమవుతుంది. అనేకమంది అందులో అంతమవుతారు. ఇద్దరు మాత్రమే మిగుల్తారు. ఇజనాగి అను పురుషుడు, ఇజనామి అను స్త్రీ. వీళ్ళిద్దరు ఎక్కువ కాముక ప్రేరేపణ కలవారై ఇతర దేవుళ్లను సృష్టిస్తారు. చివరికి వారిలో అగ్నిదేవుడు, తల్లినే తనమంటలకు ఆహుతి చేస్తాడు. అయినా ఇజనాగి ఒక్కడే సృష్టికారకుడవుతాడు. అతను తన వస్త్రాలను విసర్జించినపుడు అవి సముద్రదేవుడు, భూ దేవుడుగా మారుతాయి. అతని ఎడమకన్నులోంచి సూర్యదేవత, కుడికన్నులోంచి "సుసానో" అనే పేరుతో యింకో దేవుడు కలుగుతారు. దానికి అనేకమైనఅద్భుత సంఘటనలు కలుగుతాయి. సుసానోకు వాటివల్ల గొప్ప ఆధ్యాత్మికానుభవం కలుగుతుంది. ఒకసారి అతను ఎనిమిదితలల రాక్షసిని చంపుతాడు. ఆరాక్షసితోకలో ఒక



'మికాడో'
జపానుచక్రవర్తి—హిరోహిటో

దానియందు కత్తిగూఢంగా వుండటంచేత అతని కత్తి విరిగిపోతుంది. అప్పుడు సుసానో ఆ కత్తిని తన సోదరియైన సూర్యదేవతకిస్తాడు. ఇప్పటికిని ఆ ఖడ్గం టోకియోలోని చక్రవర్తి భవనంలోని ఆలయంలో వుంచబడింది. సూర్యదేవత జపాను ప్రభువులకు పూజనీయమైన మూడు వస్తువులను యిచ్చిందని జపాను ప్రజల విశ్వాసం. అందులో యీ కత్తి ఒకటి. మిగతావి అద్దం, నగ. అందుచేతనే జపాను చక్రవర్తులు భగవంతునితో సమానంగా చూడబడుతారు.

పురాణయుగంలో పృథివీ పాలకులు దేవతాంశవుండేదనుట నిర్వివాదమైన విషయంగా వుండేది. పాశ్చాత్య దేశాలలోకూడ చాలకాలం యీ నమ్మకం వుండేది. ఇంగ్లాండు రాజైన మొదటి జేమ్సు యిందుకు నిదర్శనం. ఆ కాలంలో రాజుల నిరంకుశ పరిపాలనకు అడ్డెవ్వరూ చెప్పకూడదు. రాజు భగవంతుని ప్రతినిధి అవటంచేత తనుచేసిన మంచిచెడ్డలకు ఒక్క భగవంతునికే జవాబు చెప్పాలి.

ప్రస్తుత శతాబ్దంలో వైజ్ఞానికంగా నిరూపింపబడలేని సిద్ధాంతాల విషయమైనా మనుగురించి ఆలోచించేవారు అరుదు. పూర్వకాలపు పురాణాలు స్థిరంగా వుంటాయి. వాటిని సరిచేయటం కష్టం. కాని జపానుదేశం యీ స్వల్పాంతకాలం చక్రవర్తి వంశ సంభూతులైనారని. అట్లు చెయని వారు సంభవించే నిర్భయంకరంగా వుంటాయి. ఒక సారి స్కూలులో ప్రమాదంలో మనస్థుడే చక్రవర్తి ఆలయంలోని కత్తి మొదలైనవి ఎంతవరకు భగవత్ప్రసాదితాలో అని వాదనలను తెలియబరిస్తే ఆ పిసి విశ్వవిద్యాలయంలోంచి అధికారులు తరిమివేశారు. తర్వాత ఇంకా ఎన్నో బాధలు కూడ పెట్టారు. ఇదంతా ఒక విశ్వాసాన్ని ప్రతిపాదనకు లోబడి పరిశీలించుటవలన కలిగిన ఫలితం. షింటో మతంయొక్క ముదురు పరిణామం యీవిధంగావుంది. ఆమతాన్ని అర్థవంతంగా చేయు ప్రయత్నంలో ఎవరైనా భక్తిరాహిత్యంగా (షింటో మతస్థుల దృష్టిలో) కనబడితే వారి జీవితానికి భద్రతవుండదు. షింటో మతం అంత మూఢవిశ్వాసాన్ని కలిగిస్తుంది. ఒకప్పుడు బ్రిటనులోకూడ యిటువంటి అభిమానావేశం వుండేది. జాతీయగీతాన్ని పాడుతున్నప్పుడు ఎవరైనా కొంచెం వంగి నిలుచుంటే వాళ్లకు దేహశుద్ధిచేసే రాజభక్తి కలవారు వుండేవారు.

మార్గరెట్ యంగ్ అను నతడు జపాను ప్రజలనుగూర్చి చక్కని గ్రంథం ఒకటి వ్రాసాడు. అందులో అతడు వారి స్వభావాన్ని అందంగా చిత్రిస్తాడు. జపాను వారిలో మంగోలియనుల లక్షణాలున్నాయి. అమానుషమైన క్రూరత్వం కనిపిస్తుంది. పచ్చి నెత్తురుత్రాగే స్వభావం. అది ఆజాతి చరిత్రలో అనాదినుండి వుంది. పశ్చిమదేశాల నాగరకత అంటే వారికి అసూయ కూడ. ఈ అసూయే వారి ఉగ్రతమమైన జాతీయతత్వానికి, దేశభక్తికి కారణం. వారి అధిపతి మామూలు నాయకుడు కాక భగవత్స్వరూపుడే అవటం యీ రకం దేశభక్తికి కారణం. జపాను అధికారవర్గం నాజీ తత్వానికి చెందినవారు.

17 వ శతాబ్దంలో జపానుదేశం మిగతా ప్రపంచంతో సంబంధంలేకుండా వుండేది. ఆ కాలంలో క్రైస్తవుల్ని ముఖ్యంగా జెసూయిట్ తెగవారిని దేశంలోంచి వెళ్ళగొట్టారు. ఇతర దేశస్థులు రావటానికి వీలుండేది కాదు. ఈ స్థితిలోనే 19 వ శతాబ్దంలోకూడ చాలకాలం వరకు జపాను వుంది. అప్పుడు దేశం అన్నిరకాల అంతఃకలహాలతో నిండివుండేది. పగ సాధించటం ధర్మయుక్తమైన పనిగానే వుండేది. జపాను సాహిత్యం అంతా కక్షలు, ప్రతికక్షలు, శిరచ్ఛేదనాలు మున్నగు కథావస్తువుగల గ్రంథాలతో వుండేది. జపానుదేశం పేరు చెప్పితే 'హరకిరి' అనుమాట జ్ఞప్తికివస్తుంది. సౌమ్యమైన నడవడి తక్కువ. కఠిన హృదయులకు ఆ దేశంలో శిరచ్ఛేదన ఎంతో ముచ్చటైన ఆటగా వుండేది. వారు చేసేపనులు మన దేశంలో పిండారీలు, థగ్గులు ఒనర్చిన దారుణకృత్యాలను మించినవి. ఈ రకంగా మానవత్వాన్నే కోలుపోయారు జపాను ప్రజలు. ఒకవిధంగా చూస్తే దీనంతటికి కారణం కనిపించకపోదు. సాధారణంగా మనుష్యులకు పనిపాటలు లేకపోతే వారు బందిపోటుతనమే ప్రధాన ఉద్యోగంగా పరిగణిస్తారు. ఈరకం సమస్య అమెరికా ఇంగ్లాండులలో లేకపోలేదు ఈ బందిపోటు ప్రజలకు

అసామాన్యమైన మానసిక ధార్ఢ్యం వుంటుంది. వీరికి తమ సంఘాలయెడల అభిమానం కృతజ్ఞత అపారం. ఒకవేళ ప్రభుత్వ అధికారులు వీరిని పట్టుకొనినా, వారి ఆచోకీ తెలిసే ప్రశ్నలకు సమాధానం యివ్వరు. ఎన్ని బాధలైనా ఓరుస్తారు. కాని రహస్యాలను బయటపెట్టరు.

19 వ శతాబ్దం రెండవభాగంలో ప్రజలు కట్టుకున్న గోడలు పడిపోయినాయి. ప్రపంచం యొక్క దృష్టి యీ చిన్నద్వీపాలపై పడింది. రక్తపాతంతోను, హారకిరితోను నిండిన జపాను మరొక అసాయకరమైన ప్రపంచం తనచుట్టూ వుందని తెలిసికొంది. గర్వోన్మత్తులైన జమీందారులు వారి అనుచరులు తమ అసమర్థతను ఒక్కసారిగా తెలిసికొన గలిగారు. అంతవరకు వారొక అంధకార జీవితంలో మునిగి వుండగా ప్రపంచంలో యితర భాగాలు అధికంగా అభివృద్ధి చెందాయి. వారప్పుడొక సంగతిని గ్రహించగలిగారు. ప్రపంచంతోపాటు వారుకూడ అధునాతన పద్దతులను అవగాహనం చేసుకోవాలి. అలా కాని యెడల ఆసియాఖండంలోని దేశాలమాదిరే పశ్చిమదేశాలకు తలఒగ్గి వుండాలి. అందుకోసం పాశ్చాత్యుల నైపుణ్యాన్ని, వారియంత్రాలను వాడేపద్దతిని, ఉత్పత్తి విధానాన్ని త్వరితంగా నేర్చుకోవాలి. మొదట్లో క్రైస్తవ మతావలంబనం కూడ లాభదాయకమేమో అనిపించింది. ఆ మతాన్ని ప్రభుత్వమతంగా చేయాలనే ఉద్దేశం కలిగింది. ఆఖరికి ఎంతో కష్టంమీద షింటో మతం పునరుద్ధరింప బడింది. దైవాంశ సంభూతుడైన మికాడో చక్రవర్తి ఆధ్వర్యం క్రింద అరాజకంగావున్న దేశంలో ఐకమత్యం చేకూరింది.

పాశ్చాత్య జీవితవిధానపు గాలి సోకినప్పటి నుంచి జపానులో నూతనశకం ప్రారంభ మయింది. నేటి జపానుయొక్క పునాదులు 1850 ప్రాంతంలో కట్టబడ్డాయి. క్రమంగా దేశం ప్రాచ్యప్రపంచంలో ప్రధానస్థానాన్ని సంపాదించింది. మరొక విషయం జపానుకు సహాయకారి అయింది. 19 వ శతాబ్దంలో రష్యా అంటే బ్రిటనుకు కొంత అసూయగాను కొంత భయంగాను వుండేది. ఒకవైపున మధ్యధరా సముద్రంలోనికి నల్లసముద్రం ద్వారా మార్గాన్ని సంపాదించటంకోసం రష్యా టర్కీతో యుద్ధం చేస్తూండేది. ఇంకొకవైపున ఆఫ్ఘనిస్తాను దేశపు సరిహద్దుననే ఆసియా భాగపు రష్యా వుండటంచేత, ఆ రెండుదేశాల మధ్య సంప్రతింపులు బ్రిటనుకు అనుమానంగా వుండేవి. బ్రిటిషు పాలకవర్గంవారికి యిదొక వ్యాధిగా పరిణమించింది. ఈ ఆందోళనసే 'రష్యా ఫోబియా' అంటారు. దీని ఫలితంగా రష్యా ప్రతికక్షులైనవారికి అనేకవిధాల బ్రిటిషు ప్రభుత్వం సహాయం చేస్తుండేది. ఇరవయ్యో శతాబ్దంలో లెక్కపెట్టవలసిన దేశాలలో ఒకటిగా తయారైనది జపాను. 1904-5 రష్యా-జపాను యుద్ధంలో ఆసియాదేశం ఒకటి ఐరోపా ఖండంయొక్క ప్రజ్ఞ, ప్రతిష్ఠలను నాశనం చేసింది. 1914-18 యుద్ధంలో రష్యా ఓటమి పూర్తయింది. ఈ జయంతో క్రైస్తవ మతాన్ని అవలంబించాలనే ప్రయత్నం పూర్తిగా అంతరించింది. స్వదేశీయమైన షింటో మతం యొక్క విశిష్టత ఎక్కువయింది. అది జపాను దేశానికి ఏకైక మతం అయింది. కొంతకాలం వరకు పాశ్చాత్యవిజ్ఞానం, నవ్యభావాలు జపానును చుట్టుముట్టాయి. ఆధునిక ఆదర్శాలను అందరు చర్చించేవారు. కాని ఎంతో త్వరలోనే యీ నూతన భావాలకు జపానులో చోటు లేకపోయింది. ఒక్కసారి విశ్వవిద్యాలయాలనుండి 'రాడికల్' తత్వాన్ని తుడిచేసారు అధికారులు. ఆ తత్వాన్ని పోషిస్తుండే వ్యక్తులు కొందరి హత్యతో వారి పని పూర్తయింది. జాతీయ అహంకారం జపానుప్రజల ప్రియమైన ఆవేశం అయింది.

ప్రపంచంతో సంబంధం లేని రోజుల్లో జపాను ఆర్థికంగా చెప్పుకోదగ్గ స్థితిలో లేదు. యంత్రోత్పత్తిని ప్రారంభించినప్పటినుంచి ప్రపంచ పారిశ్రామిక దేశములలో ముఖ్యమైన వాటిలో ఒకటిగా తయారయింది. జపాను ఆర్థిక సౌభాగ్యం ముఖ్యంగా లాంకషైరుకు దెబ్బ. పారిశ్రామిక ఉత్పత్తి ఖర్చులు జపానులో చాల తక్కువ. అక్కడ కూలీ వాళ్ల వేతనములు పశ్చిమదేశాలలోని వేతనాలతో పోల్చిచూస్తే, జపానులోని కూలీజనంయొక్క హీనస్థితి విస్పష్టమవుతుంది. యంత్రాగారాలు; పెట్టుబడి

ధనం మొదలైనవి కొద్దిమంది గనికుల ఆధీనంలో వుండడంచేత స్వేచ్ఛా వాతావరణం వుండేది కాదు. ఈ విధంగా ఆర్థిక సంపద "జైబాట్సు" అనే పెట్టుబడిదారుల సంఘములలో కేంద్రీకరింపబడి వుండేది. కార్మిక సంఘాలను ప్రభుత్వం బహిష్కరించేది కార్మికులను బలవంతంగా పని చేయించేది. ఉత్పత్తి అధికమైంది. తక్కువ ధరలతో యితరదేశాలలో అమ్మగల శక్తి కలుగుటచే బ్రిటను మున్నగు దేశములకు జపానుపై అయిష్టం ఏర్పడింది.

యుద్ధానంతరం జపాను ప్రజలలో నూతన మానసిక ప్రవృత్తిని కలగచేయాల్సి వుంది. షింటోమతం ప్రజల్ని అంధులుగా చేసింది. ఆమత్తులోంచి వారిని మేల్కొలపాలి. వారు అసలు మానవజీవితాని కేవిధమైన విలువ నిస్తున్నట్లు కనిపించదు. ఈ అమానుషత్వాన్ని పూర్తిగ నిర్మూలంచేసే మార్గాన్ని వారికి సూచించాలి. యుద్ధ సమయంలో పరాక్రమానికి హద్దులు లేవు, న్యాయాన్యాయ వివక్షతలేదు. కాని శాంతి సమయంలో పరాక్రమానికి ఎంతో అర్థం వుంది. దాన్ని సాధించటం కష్టం. జపాను ప్రజలు మొదటిరకపు ధీరత్వాని కెంత ప్రసిద్ధిచెందారో, రెండవదాని కంతదూరంగా వున్నారు. వారిలో అద్వితీయమైన శక్తి సామర్థ్యాలున్నాయి. వాటిని సద్వినియోగం చేయటం వారికి నేర్పాలి.

ప్రస్తుతం జపాను, అమెరికా మిలిటరీ అధికారులక్రింద వున్నది. దేశంలో ప్రజా ప్రభుత్వాన్ని నెలకొల్పటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఆర్థికసంస్కరణ తీసుకొనిరాబడింది. జైబాట్సు సంస్థలను బ్రద్దలుకొట్టారు అధికారులు-కార్మికసంఘాలను నెలకొల్పారు. జపాను దేశపు కార్మికుల బత్తెములు జీవిత సౌభాగ్యానికి పోషకంగా వుండాలని ఇతర పారిశ్రామిక దేశాలనుండి అలజడి కలుగుతోంది. అప్పుడు జపానుదేశం తక్కువధరలమీద యితరదేశాలతో పోటీచేయలేను. రాజకీయంగాను, ఆర్థికంగాను అనేక విప్లవాలను తీసికొనిరావచ్చు. కాని మానసిక విప్లవం సులభ సాధ్యంకాదు.

# పరస్పర సహకారం వినా, ప్రపంచ దుర్భిక్షం తప్పదు

ప్రపంచ ఆహారసమస్య తీవ్రరూపం పొందటానికీ, బెర్లినులో జరిగిన సంఘటనలకు, యాటంబాంబుపుట్టుకకు, జీవితాదర్శాలలో ఏర్పడిన పరస్పర వైరుధ్యాలకు సంబంధం ఏమీలేదు. కాకపోతే, యీ సంఘటనల పరిణామం, మానవ సంఘం తన బుద్ధికుశలతనంతటినీ వినియోగించినా ఆపరానంత ప్రమాదకరమైనదేమో అనిమాత్రం సందేహించవలసి వస్తోంది. నానాటికి దిగనాసిలుతున్న భూమిసారం ఒకవైపు, క్షణక్షణానికి పెరిగిపోతున్న జనసంఖ్య మరొకవైపు, ప్రపంచ ఆహారసమస్యను క్లిష్టతరంచేస్తున్నాయి. యుద్ధం ఒకవిధంగా యీ సమస్యకు పరిష్కారం కల్పిస్తుందేమో అనుకోవచ్చు—కానీ అది నిజం కాదు. ఎందుచేతనంటే- యుద్ధంవలన క్లిష్టమైన ఆహారసమస్య క్లిష్టతరం అవుతుందే కానీ, పరిష్కారం ఎంతమాత్రం కాదు, సంఘంలో ఆహారోత్పత్తికి అత్యంతావశ్యకులైన యౌవనవంతులు వేలాదిగా మరణిస్తారు లేదా వికలాంగులవుతారు.

క్రిందటి పది సంవత్సరాలలోనూ, ఆరు సంవత్సరాలపాటు ఒక పెద్ద మారణహోమం జరిగినప్పటికీ, ప్రపంచజనాభాలో 150 మిలియన్ల అభివృద్ధి వుంది. అందులో 12 మిలియన్లమంది యూరప్‌లోనే పుట్టారు. 1939 నాటినుంచీ నేటివరకు ప్రపంచజనాభాలో నూటికి ఎనిమిది పాళ్ళు అభివృద్ధిఅయితే, ప్రపంచ ఆహారోత్పత్తిలో నూటికి ఏడువంతులు తరుగు ఏర్పడింది.

ఆహార ధాన్యాలపంటలో ఏర్పడిన యీ కొరతకు యుద్ధంకూడా కొంతవరకు కారణభూతమయింది. ఇతర దేశాలు ఎంత ప్రమా

ణంలో తనకు ఆహారవస్తువులను పంపగలిగేవో, అంటే ప్రమాణంలో ఆ హా ర ధా న్యా ల ను ఉత్పత్తి చేసుకోగలిగిన ఐరోపాఖండం లోనే, ముఖ్యంగా ఆహారోత్పత్తిలో తరుగు ఏర్పడింది. యుద్ధాత్పూర్వం 61 మిలియను టన్నుల గోధుమ, రై ధాన్యాలను ఉత్పత్తి చేసుకో గలిగిన యూరోపు యుద్ధానంతరం (1947లో) 36 మిలియను టన్నులను మాత్రమే పండించ గలిగింది. ఆసియాఖండంలో వరి పంట లోనూ కొరత ఏర్పడినప్పటికీ, యూరపు ఖండంలో ఏర్పడినంత శోచనీయమైన స్థితి రా లే దు. యుద్ధానికి పూర్వమైనా ప్రపంచ జనాభాకు చాలినంత ఆహారం పండేదా?—ప్రపంచ జనా భాలో మూడింట రెండుపాళ్లు అర్థాకలితో వుండే వారనీ, జనాభా సంఖ్యలో సగానికి సగం, చాలినంత ఆహారం లేక పలువిధాలైన రోగాలకు గురియై అల్పాయుష్షు బ్రతుకులు బ్రతికేవారనీ, అంచనా వేయబడటం మనకు తెలిసిన విషయమే. ఈ విధంగా 'కర్మఫలం అనుభవిస్తున్నా'రని ఎంచ బడిన ఆకలిపీడిత ప్రజానీకమే యీనాడు తమ నాస్థితికి పారదోలిన శక్తుల నెదిరించి పోరాడ నిశ్చయించారు. తమన్ని వారణను మించిన ఆద ర్శం యింకోటి లేదు.

రాబోయే పాతిక సంవత్సరాల వ్యవధి లోనూ, (అంచనా వేయబడిన అభివృద్ధితో పాటు) ప్రపంచజనులలో ప్రతి ఒక్కరికీ, రోజు ఒక్కంటికి కనీసం 26,000 కాలరీల ఆహా రాన్ని మనం యీయగలిగితే, మన ఆహా రోత్పత్తి నూటికి నూటపది పాళ్లు అభివృద్ధిఅయి వుంటుంది. ప్రస్తుతం నాలుగు వేల మిలియనుల ఎకరాలు మాత్రం సాగుబడిలో వున్నాయి. వీటి వలన 2250, మిలియన్ల జనాభాకి మాత్రం చాలినంత ఆహారం పొందవచ్చు. అంటే-ఒకరికి సగటున చాలినంత ఆహారాన్ని యీయటానికి రెండున్నర ఎకరాలభూమి కావలసివుంటే, ఇప్పుడు అందుబాటులో వున్న భూమినిబట్టి ఎకరానికి యిద్దరు చొప్పున బ్రతకవలసి వస్తోంది.

భూమి సారం నానాటికీ క్షీణించిపోవటం మనలను తీవ్రంగా భయపెట్టే సమస్య. మొదటి ప్రపంచ సంగ్రామానంతరం భూమి, నిరంతరం పంటలు పండి, కోల్పోయిన బలాన్ని తిరిగి పొందటానికిగాను ఏవిధమైన శ్రద్ధా తీసుకో బడని కారణంచేత యీ సమస్య మరీ గడ్డు సమస్య అయింది. రూజువెల్టు స్థాపించిన శాస్త్ర జ్ఞులసంఘం కృషిఫలితంగా భూసారంలో ఏర్పడు తున్న నష్టాన్ని కొంతవరకు అరికట్టారు కాని, అంతటితో చాలలేదు.

మానవుడు కసాయివానికంటే హీనంగా భూసారాన్ని కొల్లగొట్టాడు. ముందు ఆలోచన లేక నరికివేసిన 'ప్రయరీ' అడవులు, విడవకుండా భూమిని యింకా యింకా లోతుగా దున్నటం- వీటివల్ల, అతిసారవంతమైన 'ప్రయరీ' భూములు కూడా నిస్సారమైనాయి. అక్కడ వృక్షజాతి అభివృద్ధి అయ్యేందుకు అవకాశమే లేకుండాపోయింది. తత్ఫలితంగా, అక్కడ కురి సిన వర్షం, నీటినిపీల్చే చెట్లవేళ్ళు లేని కారణం చేత, పగులుగా ఎంతో సారవంతమైన మట్టినంత టిని రాసులలో ఒకచోటినుంచి మరోచోటికి తీసుకుపోయి పోగులు పోస్తోంది. లేదా క్రిమికీట కాగులతో నిండిన యీ ఒండ్రు వరదనీటితో కొట్టుకొనిపోయి నిక్షేపాలను తుడిచిపెట్టుతోంది. పంటలకు అనుకూలించే భూమి పైభాగం ఒక అంగుళం పెరగటానికి, ప్రకృతిశక్తులకు 300 మొదలు వెయ్యి సంవత్సరాలకాలం పట్టుతుంది. ఆవిధంగా అమెరికాలో ఎనిమిది వేల సంవత్స రాల ప్రకృతి కృషిఫలితాన్ని కొద్దివందల సంవత్సరాల మానవుల కృషి ధ్వంసంచేసింది.

చైనాలో యీ విధమైన విధ్వంసనకాండ శతాబ్దాలుగా సాగుతోంది. 300 మిలియన్ల యెకరాల సాగుబడినేలను యెల్లోనది కడిగి వేసింది. 700 మిలియన్ల యెకరాల భూమి సేద్యానికి అనువైనదై వుండగా, చైనాలో 200 మిలియన్ల యెకరాలను మాత్రం వారు అతి ప్రాచీన వ్యవసాయ విధానాలలో సాగుచేస్తు న్నారు. మిగిలిన 500 మిలియన్ల యెకరాలు కూడా, చైనాదేశస్థులు, ఆధునిక వ్యవసాయ సాధనాల నుపయోగించేపక్షంలో సస్యశ్యామలం చేసుకోవచ్చు. ఇక భారతదేశం విషయం— అసలువున్న నలభై కోట్ల జనాభాకు ప్రతి సంవ త్సరం ఒకకోటి చొప్పున అభివృద్ధి అవుతూనే వుంది. భూవైశాల్యం పది లక్షల చదరపు మైళ్లు మాత్రమే. ఇంత తక్కువగావున్న భూ

వైశాల్యంమీద అంత పెద్ద జనాభా ఆధారపడ వలసివచ్చిందంటేనే, భారతీయుల నిత్యజీవితం ఎంతశోభావంతంగా వుంటుందో అర్థమవుతుంది. దీనికితోడు మనదేశంలో సాంప్రదాయసిద్ధంగా వున్న భూమిహక్కు సిద్ధాంతాలు మతాచారాలు కూడా మన ఆహారసమస్యను మరింత కంటకావృతం చేశాయి. పట్టణాలలోని పరిశ్రమలమూలంగా పల్లెల్లో కొనసాగింపవలసిన కుటీర పరిశ్రమలు సహితం కొరగాకుండాపోయినాయి.

ఆఫ్రికాలోకూడా, అతి కష్టంమీద సాగుబడిక్రిందకు తేబడిన భూమిమీదికి తెగుళ్ళుపారి క్రమంగా ఆ ప్రాంతం అంతా అడవులమయమైపోతోంది. ఆ దేశంలో ముఠా యుద్ధాలు తగ్గిపోవటంతో, దేశవాసులకు భార్యలు దొరకటం కష్టమైపోయింది. భార్యలు కావలసిన యువకులంతా వేలాది పశువులను కాస్తున్నారు. ఆ పశువులనిచ్చే, వారు తమ భార్యలను కొనుక్కొంటారు! భార్యలకోసం పెంచే యీ పశువుల కోసం, వారు సేద్యంమాని, పచ్చికనే పెంచి ప్రాకులాడుతున్నారు.

ఇరవయ్యో శతాబ్దం అంతమయ్యేలోగా, ప్రపంచజనసంఖ్య యింకా మూడువేల మిలియన్లు పెరగటంతథ్యం. ఇంకా ఎక్కువ కావచ్చునేమో కూడా; ఎందుచేతనంటే—అనేకరకాలైన బాలారిష్టాలకు దివ్యమైన ఔషధాలు శాస్త్రజ్ఞులు తయారుచేస్తున్నారు.

స్కాండినేవియా దేశంలోవున్న తోడేళ్లకు ఒక వింతప్రకృతివుంది. కొన్నిఏళ్ల కొకసారి అవి తమ సంఖ్యను విపరీతంగా పెంచుకొంటాయి. ఆహారం అలభ్యమౌతుంది; అందుమీదట వాటిలో వాటికే చచ్చిపోవాలనే కోరిక పుట్టుతుంది. గుంపులు గుంపులుగా బయలుదేరి కట్టలుకట్టుకు సముద్రంలోపడి చచ్చిపోతాయి. మామూలుగా బ్రతికే పురుగులు వున్నట్లుండి ఒక్కసారిగా, ఒక ముసురుపట్టిననాటిరాత్రి, రెక్కలువచ్చి వుసిళ్లుగా మారి, దీపాలచుట్టూ మూసిరి, మరునాటి వుదయానికి చచ్చిపడివుండటం మనం చూస్తున్నదే. ఈమాదిరి ప్రకృతులు, మరి మానవులలో లేవు కదా! ఇంచుమించు అదే సిద్ధాంతాన్ని అనుసరించే మంగోలులు పరాయిరాజ్యాలలోకి ప్రవేశించచూచారు. మొన్న మొన్న హిట్లరు కూడా యిదే సిద్ధాంతాన్ని అనుసరించి యితర రాజ్యాలను ఆక్రమించ ప్రయత్నించేడు. ఈనాడు ప్రపంచమంతటా ఆవరించివున్న నిస్సహాయ నిస్పృహాభావాలకు మూలకారణం క్షుద్బాధయే!

ఇప్పటికిప్పుడే 10 కోట్లమంది జనాభాను అధికంగా ఆహారం సేకరించవలసిన బాధ్యత మనపై పడివుంది. పైన వుదహరించిన స్థితిగతులు రోజు రోజుకు భయంకర రూపాలు దాల్చి మనలను వ్యాకుల పరుస్తున్నాయి. ఎడారుల వ్యాప్తిని అరికట్టవచ్చు; భూమి సారాన్ని రసాయనికమైన ఎరువుల వలన అభివృద్ధి చేసుకోవచ్చు; [illegible]గా పడివున్న ఎకరాలభూములను కొంత మరమ్మతు చేసి పంటలు పండించటానికి అనువైనవిగా తయారు చేసుకోవచ్చు; టన్నులకొలది ఆహారధాన్యాలను నాశనం చేసే తెగుళ్లను ఆపుచేయవచ్చు; బలవర్ధకములైన ధాన్యాలనే నాటి, భూమి సారాన్ని కూడా యింతోదికంగా పెంచవచ్చు; భూమాతను హృదయ పూర్వకంగా ప్రేమించి. ఆమె చల్లని ఒడిలో మనమంతా నిశ్చింతగా బ్రతకవచ్చు—కానీ. యిది సాధ్య పడాలంటే—ప్రపంచ దేశాలన్నింటి మధ్య అరమరికలులేని పవిత్రమైన ఏక కుటుంబ భావం పాదుకోవాలి.

భారతదేశానికి ఎరువులు, ప్రాజెక్టులు ఎన్నో అవసరం అని ఆగకుండా చెప్పుకున్నా, అందుకు గాను తయారు చేయబడిన పథకాలలో ఒక్కటీ కార్యరూపంలోకి రాలేదు. ట్రూమన్ గ్రీసులో సైనిక చర్యలకోసం వెచ్చించిన ధనంలో దశాంశం వ్యవసాయానికై వెచ్చించి వున్నట్లయితే, శల్యావశిష్టమైన గ్రీసుదేశం సస్యశ్యామల మయ్యేది. మధ్యప్రాచ్యంలో యితర వుపయోగాల కోసం కొనబడిన నలభై వేల తుపాకుల ధరకు, నలభై వేల ట్రాక్టర్లు లభ్యమయ్యేవి.

ప్రపంచంలో అన్నిమూలలా, క్షుద్బాధా నివారణావశ్యకత ప్రతి ఒకరి నిత్యజీవితంలోనూ అనివార్యంగా కనిపిస్తున్నది. సామాన్యుడికి కావలసినది తగినంత ఆహారం. అతను చేసే అన్ని విధాల కృషీ అందుకొరకే.

# నివురుచాటు నిప్పు

"హితశ్రీ"

మా రామేశానికి ఏ లలితకళ లోనూ- ప్రావీణ్యం సంగతి దేవుడెరుగు- కనీసం ప్రవేశం అయినా లేకపోవడం నాకు చాలా బాధాకరంగా ఉంది. చాలాసార్లు అతడితో ఈ విషయం ముచ్చటించాను. నవ్వేసి ఊరుకునేవాడు. చూస్తే వాడికి తన తక్కువతనాన్ని గురించి గొప్ప అభిప్రాయం ఉన్నట్టుంది. నిజానికి వాడు ఏ లలితకళలోనైనా ప్రకాశించగలగడం అసంభవం అని నాకూ గట్టినమ్మకం ఉంది. ఆ మోటుశరీరమూ వాడూ—ఆకారానికీ, కళకీ సంబంధం ఏమిటి అని మీరడగవచ్చు నిజమే ననుకోండి. అయినా ఇటువంటివాడిని చూసి ఏ లలితకళ ప్రేమిస్తుంది? ఏమైనా వాడిమీద నాకు ఏర్పడిన స్నేహవాత్సల్య భావాల ప్రభావం అధికమై, వాడిని ఎలాగైనా ఒక చిన్న కళాకారునిగా తయారుచేయాలనే నా సంకల్పం రోజురోజుకూ గాఢతరం కాసాగింది.

బల్లమీద కాళ్ళని పారేసి అలవోకగా చేతిలోఉన్న పుస్తకాన్ని చదవకుండా చూస్తూ రామేశానికీ-కళకీ పరస్పర సుహృద్భావం, సానుభూతీ ఎలా సంప్రాప్తమౌగలవో ఆలోచిస్తున్నాను. రపీమని దెబ్బపడ్డది వీపుమీద. అదిరిపడి చూశాను. మోటుమనిషి - వీడికా కళాదేవి కటాక్షం!

'ఏమిట్రా, ఎప్పుడూ దీర్ఘాలోచనా, నువ్వూ'

'నీ గురించే. ఇంత మోటుమనిషికి కళ ఎలా అబ్బుతుందా అని.'

'పోనిద్దూ'

'అలాకాదు నువ్వు తప్పకుండా అభ్యాసం చేయాలి.'

ఏమిటీ తద్దినం అన్నట్టు చూశాడు.

'బొమ్మలు గీస్తావా?'

'నువ్వు గీస్తున్నావుగా చాల్లే.'

'పోనీ, కథలు వ్రాయడం నేర్చుకుంటావుట్రా?'

'నీ మొహంలే' అన్నట్టుగా నవ్వాడు. ఆనక విసుగ్గా బావురు కప్పలా నోరు తెరచి భూనభోంతరాళాలు బ్రద్దలయేటట్టు సున్నితంగా నవ్వడం తప్ప ఎరగని వీడినా కళాదేవి కాంక్షించేది! వీడి నింకా వదలివేయడం శ్రేయస్కరం.

'ఏమిటోయ్. తెగ నవ్వుతున్నారు!' ఉలిక్కిపడి చూశాను. ప్రసాద్.

'కాసిని మంచినీళ్ళివ్వరా బాబూ'

చతికిలబడ్డాడు-ఆఖరిసారి దమ్ము గట్టిగా పీల్చి పారేశాడు. గాలి ఇంజన్‌లా పొగ వదుల్తూ. ఇచ్చాను. ఒక్క గుక్కలో ఖాళీచేసి ఆ గాజు గ్లాసువైపు విచిత్రంగా చూశాడు.

'ఏం, దాన్ని కావాలా?'

'ఊఁ - ఒరే, రావ్రా -' నావైపు చూశాడు

'మనం చేసే ప్రతీ పని లోనూ, మనం ఆడే ప్రతీ మాటలోను కళాకారులకీ, ఇతరులకీ ఉండే వ్యత్యాసం కనిపిస్తూనే ఉంటుంది.' ఏమీ అర్థంకాక తల పంకించాను.

'కళాకారుడు చేసే ప్రతిచేష్టలో, అది ఎంత చిన్నవిషయం అయినా సరే, కళలో అతడికి గల అభిరుచి ప్రతిభా గోచరిస్తూనే ఉంటాయి. ఏమంటావ్?'

చెప్పేదేమీ లేక మళ్ళీ తల ఆడించాను నిలువుగా.

'ఉదాహరణకి ఈ గాజుగ్లాసు తీసుకో. వొట్టి సాదా గ్లాసు. పావుపాను బరువు తప్ప దీంట్లో ప్రత్యేకత ఏమీ లేదు. దీని సొంతదారుడుకూడా సాదామనిషే అయి ఉండాలి. లేకపోతే దీనిని కొని ఉండడం సంభవించదు—' ఒక గొప్ప సత్యాన్ని కనిపెట్టి బోధించేవాడులా గంభీరంగా ముఖం పెట్టాడు.

'నీ సూత్రం అందరికీ వర్తించక పోవచ్చు.'

'సర్వ సామాన్యంగా వర్తించి తీరాలి.'

'వ్యక్తి ఆర్థిక పరిస్థితులూ, శ్రద్ధాసక్తులూ నీ సూత్రానికి అడ్డు సవాళ్లు కావటానికి వీల్లేదా?'

'కొంతవరకు. కాని సాధ్యమైనంతగా ప్రతి విషయంలో కళాకారుడు సామాన్యుడినుంచి తనని వేరు పరచుకుంటూనే ఉంటాడు. ఇంత ఎందుకు - నీ విషయంలో సరిగా చెప్పా వింటావా, లేదా?' వస్తున్న నవ్వు ఆపుకుని రామేశం వైపు చూశాను. చిన్నగా నవ్వాడు. చిన్నగా అంటే గది నాలుగు గోడలు మాత్రమే ప్రతిధ్వనించేలా అని మీరు అర్థం చేసుకోవలసి ఉంటుంది. విజయవంతంగా ప్రసాద్ కూడా నవ్వాడు.

'స్పష్టంగా చెపుతున్నాను. ఏమీ అనుకోవు అని నాకు తెలుసులే. పౌరాణిక యుగంనాటి ఈ పాటలూ, గది మధ్యన ఈ కుంటి బల్లా, చిందర వందరగా పారేసిన పుస్తకాలూ, ఆమూల కూజా, ప్రక్కనే ఏపురూ, బిడులాంటి ఆ దోడ్డీ, గాలికి ఎగురుతూ సంచారం చేస్తున్న అందమైన ముఖచిత్రంగల ఆ కవరు పేజీ— ఇవన్నీ చూస్తే ఈ ఇంట్లో నివసించే మానవుడికీ, కళాకళ గల శత్రుత్వం ఏ జన్మానికీ తీరేది కాదని తోచక మానదు. నడుస్తున్నప్పుడు ముక్కుకు సూటిగానే గాని చుట్టు ప్రక్కల సుందర దృశ్యాల కోసం ఎప్పుడైనా వెతికావా?—ఇదా రామేశం గాడు—వీడు నీకు ఎంతమాత్రం తీసిపోడు—'

ఒక్కసారిగా నక్కలు పకపకలాడేలా నవ్వాడు రామేశం. వాడు నవ్వాడేగాని నాకు మాత్రం కించిత్తు కించగానే ఉంది. రామేశం ఎదట నేనిలా తక్కువ చేయబడడం ఏమీ బావుండలేదు. బయటికి కనపడకపోతే మని షిలో విలువ ఏమీలేనట్టు ప్రసాద్ తీర్మానిం చడం హాస్యాస్పదంగా ఉంది.

'కానియ్యి, భాయీ. నీ థియరీ చాలా అద్భుతంగా ఉంది. నన్ను గురించి ఇంకేమైనా చెపుదూ.'

ఉత్సాహంలో రామేశం మాటల్లోని వ్యం గ్యం గ్రహించలేదు ప్రసాద్.

'చెప్పేందు కేముంది? శతఘ్ని మోతలాంటి నీ స్వరం, ఉరుముగర్జనంలాంటి నీ నవ్వూ కళా కన్యకు భోజనాల మెరకు తరిమేశక్తి గలవి. ఇదా నీ ఆకారం కళాకన్యకి ఓ ముళ్లకంచె సదృశం- చాలా ?'

'చిత్తం.'

రామేశం విషయంలో ప్రసాద్ చెప్పిన ముక్కల్లో ఏ ఒక్క అక్షరమూ అత్యుక్తికి ఆస్కారం కలిగించలేదనడం నిస్సందేహం అను కున్నాను. నే నిలా ఆలోచిస్తూ ఉండగా ఓచిన్న తమాషా జరిగింది. రామేశం తన పక్కన ఉన్న అలమారు తలుపులు తెరిచి యిలా అన్నాడు:

'భాయీ, ఘోరంగా అడుసులో కాలు వేశావు! అలమారులోని ఈ వింతని వీక్షించు.'

అదిరిపడ్డాడు ప్రసాద్. కారణం- అలమా రులో నీటిరాగుల శివుడు తాండవం చేస్తు న్నాడు కాగితంపైన. పక్కన 'రావు' అనే ఎర్రటి రెండక్షరాలు చూసి వాడి కళ్ళు గిరగిర తిరిగి ఉండాలి.

'హరి పిడుగా, ఇన్నాళ్ళు నంబీ చెప్పావు కాదేం' అన్నాడు హీనస్వరంతో ప్రసాద్. నా మనసు లోలోపల గర్వించగా చేయి మీసం ఉండవలిసిన ప్రదేశాన్ని తడిమింది—

'వస్తానర్రా,అలా బందరురోడ్డువైపు వెళ్ళవల సినపని ఉంది' అంటూ రామేశం కదిలేరథంలా నిష్క్రమించాడు.

ప్రసాద్, నేనూ పార్కు చేరుకున్నాం, అలాఅలా తిరిగి.హాయిగా వినిపిస్తున్నాయి గాల్లో భావగీతాలు. తిరిగిన బడలిక అంతా తీరేలాగ వింటూన్నాము. ఇంతలో రేడియో ఘోషిం చింది...

'—ఉభయకుశలోపరి-గతవారం ఈ కేంద్రం నుండి ప్రసారం చేయబడ్డ 'ప్రవీణులు' అనే నాటిక అత్యుత్తమంగా ఉందని పలువురు శ్రో తలు తమ అభిప్రాయం ప్రకటించారు. రచయిత నామం తెలుపవలసినదని పెక్కుమంది శ్రోతలు వ్రాసిన లేఖలు చేరినాయి. ఆ నాటిక రచయిత శ్రీ దాగిన రామేశంగారు.'

జాగ్రదావస్థలోనే ఉన్నానని శరీరాన్ని గిల్లి తెలుసుకొన్నాను. ప్రసాద్ వైపు చూశాను. సిమెంటు బెంచీకి జేరగిలబడి, అబద్ధాలుచెప్పే విద్యార్థివైపు మేష్టారిలాగా, లౌడ్‌స్పీకర్ వైపు చూస్తున్నాడు వాడు తీక్షణంగా.

# శాంతిగీత

ఆధారం : రొమే రోలా　　　　　　　　　　రచన : రమణారెడ్డి

శాంతీ, వందన మో దేవీ,
ప్రశాంతీ, వందన మో యమ్మా!

లోతుగుండె నుండి దీర్ఘ చింతనుండి
సకల ద్వేషదుర్భావాధోలోకమందునుండి
నీకే దేవీ శాంతీ
ఈనా వినమిత లలిత చలిత గీతాప్రపూతాంజలి !

నరమారణ దుష్క్రియా సంరంభము
లధమ యుద్ధసన్నద్ధ క్రుద్ధదూష్యము
లీరాణువల గళోద్భూత
దుష్ప్రలాప మృగకలాప విషకంఠస్వరఘోష
ముంచలేదు దీనిని.
సమరథమాథమాకీల దడపుట్టించెడు సవ్వడి
తో, బధిరులయిన మానవులకు చెవులకు
రసాయనము నీ గీతిక నాలాపించెదను.

నిశ్చలముగ నిలిచి నే నవలోకించువాడను :
కాదిది లయసమయపు విశృంఖల విపుల ప్రబలవారి;
సామాన్యము కాదు, పూర్వ మెపుడు లేదు, కానే యిది నీరు ?
ఘడియఘడియ కెదుగుదలయె కానీ యిది తరుగదు,
ఎగసిమిట్టి లంఘించుచు వేళ్ళకుదుపునూదిరి, మహోమూర్ఛగామి,

ఇది సెత్తుటివరద, అవు నిది క్రొన్నెత్తురు.
పసిది మిసిమివీడనిది, పచ్చిది, అకాలజనితము;
చూడజూడ దీనిజాడ లెచటికో గొనిపోవును.
ఏమిటేమి టాతరంగ ఫేనపు పెన్మ్రట్టడి
లో తన్నుకొనెడు నయ్యది ?
ఏదేని మనోహర సుకుమార కుసుమగాత్రి యెయొ ?
వికల శకల ప్రాయమ యయి
రూపరి కసవాడిన యూరోపుఖండ మూర్తియొ ?
నిశ్చలముగ నిలిచి నే నాకర్షించువాడను;
నరహృదయ మణిమందిరాంతర్గతాత్మజ్యోతిని
కలచెదు నది, కటుసుడి మొరటు వేడిగాడ్పు యూర్పు.

## 2

ఏకాకిగదా వీడని యేలా సందియ మోసిచేల,
తెలియనివాడను, వలదిదివిను, సదా విశ్వాసపాత్రుడను నే గాదా?
ఉచ్చస్వరమున కుయ్యో మొఱ్ఱోయని కేకలిడువాడను!
ఈ రుధిరశాఖికా సంకుల సంగమ దుర్మత
సంరంభ పంకిలమయినట్టి చోట నుండను;
మానవకుమారుని సుకుమారుని అమాయికుని కండలొలిచి పాల్గొనను;

అందరికిని సోదరుడను, మిమ్మందర ప్రేమించెదను,
మర్త్యులార, అత్యంతము హ్రస్వమయిన యీ దిన
మాత్రపు నిడివి జీవితమును చేజేతులార దోచెదు

నశాశ్వతులార
వ్యర్థభావులార,

మీ రాశించెడి కీర్తియు నస్థిర మర్రా, యిది
దీపికాంచల చంచల మర్రా, యీ క్షణ
భంగురాల కెగువగ జనియించును గావుత,
నాయీ వ్యథాశీర్ణ జీర్ణహృదయక్షేత్రమం నునుండి,
పవిత్రమైన దివ్యమైన సిలువ మీదుగ
లభించెడు నొక యాలివు మొక్క:

రెమ్మల లేబాటల సూర్యప్రభ నిలుచును,
కొమ్మల నునుగుబురుల తూర్యరవము సెలగును,
శుకము పికము బుల్బులి సికాదాయు పిచ్చుక
రవము శుభము కూర్చెడు అందరికిని నిత్యము;
ఈ కుసుమితఫలిత లలిత యాలివు భూజము
వెలుగు చూపు గావుత!
చలువ నొసగు గావుత!

గంభీరవదన విలసిత శాంతీ

ఎంతకష్ట మెంతభార మెంతదిగులు కుంపటిగా మందునో నీ గుండెల?
తరంగ భుజంగ జృంభణమ్మునుండి
తరంగ కురంగ శీఘ్రగమనమ్మునుండి
తరంగ తురంగ జవసత్త్వమ్ములనుండి సముద్ర సంగీతస్వరము నేర్పరించెదు!
పరస్పరము ప్రతిఘటించు ప్రత్యర్థుల త్రాసుమీద నిక్కచ్చి తూకముమీదను
శాంతి మతాలయమును నిర్మించెదు!

ప్రాణదాత మార్తాండుని రక్తము జ్వాలాముఖాగా దిక్కుల కెగజిమ్మ
రోజాకిటికీ వినిర్మించుకొందువు!

దిగంతాన లేలెడు మహావిహంగమపతి యొకరుండు
పక్షమ్ముల మధ్య, పక్షమ్ము బలమ్ము క్రిందట

పెను పచ్చిక బయళులకు రక్షణ నొసంగును;
కానీ నీవో, ఓ యూపెవిహంగమ, నీ యెగిరెడు నప్పుడు
వర్తమాన భూత భవిష్యత్తుల రక్షింపుచుపహో !
కాలత్రయ బాలుని యదిమి కౌగిలింతువు.

★

ఖేదమునకు మోదమునకు ఓసియో కడగొట్టు చెల్లీ !
ఖేద మోదములకంటెయూ ఓసియో తెలివెక్కువదానా !
నీ యాకడ ఖేదము నీ యాకడ మోదము ;
ఖేద మోదసోదరులకు చెరియొక్క చేతినొసగి నీవు నడుమ నిలుతువు.
రెండునదులు కలిపెడు మంచినీటికాల్వవు.
ఇరువురునలగడలనడుము చదలునీడ
ప్రతిఫలించు మంచినీటి కాల్వవుకద !

★

దేవదూతవు నీవు—
అద్దరికి నిద్దరికిని యటునిటు పయనించెడు పూరపిచుకమాదిరి
యిరుదరుల నొకటిజేతువు !
పఠియింతువు సాదరముగ :
"విద్వేకుడు. మోదము మరలివచ్చు"
నటంచు ఒకకొంద రభాగ్యులకు ;
మరికొంద రహంకారవిజృంభితమూర్ఖు లంధుల కజ్ఞానులకు
"మోదము నశించున్నది - తస్మాత్ జాగ్రత"
యనియు హెచ్చరింతువు ·
మిసి మించెడు గుండ్రటి మెత్తటి చేతుల
లలితమ్ముగ చేర్తు వెడకు పాల్మరిగిన పాపల ;
తోటవంటి నీయుంరోజనిధిని జేరి
పాలపంటితో కొరికెడు పాపల గని నవ్వెదు ;
ఒకరినొకరు వెదకుచునే యొకరినొకరు తరిమెడి
మూర్ఖుల చేతులు మనసును వెనమాడ్తువు ;
తలతిరిగెడు కోడెల పొగరు నణంతువు ;
పోగులంగా యాసులంగా దుర్మోహములంగా
శక్తిని వృథ చేయనీక
పృథ్వీగర్భము వెకలించను మరల్తువు ;
లోతు పొడుగు చాళ్ళంగా విత్తులు మొలకెత్తుచు.

★

బాహాబాహియుద్ధమున అలసిసొలసిమరలిన రణమల్లుల నాహ్వానించెడువారికి
అతివిశ్వసనీయమైన సహచారిణివి నీవు ;
జేతలా పరాజితులా యిరువురకూ అరమరికలులేక నిష్పక్షపాతముగా నీసమాదరమున
తిరిగపాలిచ్చు సమాదరణ నీది.

ఓ సుహాసినీ నాదేవీ శాంతీ !
పావురాల కళ్ళవంటి మెత్తటి నల్లటి నీకనుగోనల యేలనే కన్నీళ్ళు
వేసవిసాయంత్రపు టింద్రచాపము ప్రతిఫలించు కన్నుల ?
స్థావరజంగమ భేదము మాని
బంగారు చేతివేళ్ళతో తడిసినపొలాలవీపులు నిమిరెదవు !
పడినఫలాల నెదనుచేర్చి ముడుతలు తొలగింతువు !
పెనుగాడ్పు, వడదెబ్బలు చెట్లకు చేసిన క్షతముల ప్రక్షాళింతువు !
నీ శీతల స్పర్శలతో మా విచారముల నిదురపుత్తువు !
విచారములు, విచారగ్రస్తులయిన మానవులు అశాశ్వతులు
నీవొకతెవు నిత్యము నివసింతువు !

★

సోదరులారా రండి యేకంకండి !
మీరున్నా, నాలోని విరుద్ధశక్తులారా, ఒకటికండి !
చేతులు చేతులు కలిపించండి, బారులుగా తీరండి !
చేతులుచేతులు కలించండి, ఒక్కుమ్మడి చిందులువేయండి !
నిదానంగా పోదాం ముందుకు నిశ్చింతగా నెమ్మదిగా
కాలం వెన్నంటి తరుమడం లేదు, మనపక్షానే వున్నది.

యుగయుగాల యీకెలు రెమ్మలతో
నా శాంతికులాయం నేసికుంటున్నది.
శిఖరాలలో గూడుచేసే యీగను నేను.

తుపాను బ్రద్దలవుతుంది, వర్ష
మేకధారగా పడుతుంది, నాగేటి
చాళ్ళుండా కొనక మునిగిపోతుంది.
కాని గంభీర స్వప్నపిమ్మట
ఈ చిన్ని పాటపాడు నిరవరోధంగా
గీతం పునరాలాపిస్తాను.

పొగజారిన తూర్పున, నిర్జనం
చేయబడిన నేలమీద, నలుగు
రాశ్వికుల గేలపు దూరం దూరం
నుండి వినిపిస్తూనే వున్నది ; పిడుగు
దాడి అట్లా హఠాత్తుగ.
శ్రవణపుట బద్దలయే భూతంగా, విన్నాం.

శిరసెత్తుతాను. తిరిగి పాట పాడుతాను :
చిన్నది—కానయితే
మొండిది !

ఫ్రెంచి ప్రపంచ సాహిత్యం మపాసాం

# సత్యలోకం

ప్రేమించాను...ఎంతో యిదిగా ప్రేమించాను.

ఇంతకీ ఎందుకు ఒకడు ప్రేమిస్తాడు? .. ఎందుకు ప్రేమిస్తాడు? ..ప్రపంచంలో ఒకే ఒక వ్యక్తిని ప్రేమిస్తూ, మనస్సులో ఒకే కోర్కెను కలిగి ఉంటూ, ఒకే ఒక నామాన్నే ఉచ్చరిస్తూ ...ఉండడం ఎంత ముచ్చటైన విషయం!

మా కథ అంతా సవిస్తరంగా చెపుతా .. నే నామెను కలుసుకున్నాను. తొలిచూపుల్లోనే నా మనస్సు ఆమెపై లగ్నమైంది. అంతే- ఒక సంవత్సరంపాటు, ఆమె మాట జవదాటకుండా... ఆమె బాహు బంధనంలో — ఆమె కౌగిట్లో సుఖంగా కాలం గడిపాను. నేను మృతిపొందేనో, జీవించే వున్నానో .. అదిపగలో, రాత్రో ..ఊహు ...ఆ ఆలోచనలకే తావొసగక ..సుఖంగా కాలం గడిపాను.

తర్వాత ఆమె మృతిచెందింది. ఎలా? నాకు తెలియదు. ఏ విషయం కూడా నాకు తెలీదు. కాని—ఒక రోజు వర్షంలో అపరిమితంగా తడిసి, ఇంటికి వచ్చింది. మర్నాడు కొద్దిగా దగ్గు ప్రారంభమైంది. ఒక వారం రోజులపాటు అలా దగ్గుతూనేవుంది. క్రమేపీ మంచం పట్టింది. ఇంకేమిటి జరిగిందో సరిగ్గా చెప్పలేను. కాని— డాక్టర్లు వచ్చారు ... వెళ్ళారు ... మందులు తెచ్చారు ... కొందరు ఆమెచే బలవంతంగా త్రాగించారు...ఆమె చేతులు చాల వేడిగా వున్నాయి. ఫాలభాగం కాలిపోతోంది. ఉజ్వలంగావున్నా కూడా చాలా విచారాన్ని సూచిస్తున్నది నయనద్వయం. నే నామెను పలకరించినపుడామె ప్రత్యుత్తరమిచ్చింది. అది జ్ఞాపకం వుంది కాని—ఏమిటి మాట్లాడామూ అన్నదే అగమ్యం. ప్రతీవిషయం మరచాను ... ప్రతీ వివరం మరచిపోయాను. ఆమె చనిపోయింది. ఆమె బరువైన నిట్టూర్పు జ్ఞప్తి వుంది. నర్సు లాభంలేదన్నట్లు సూచించిన రీతి జ్ఞప్తి వుంది. అంతే—

అంతకుమించి ఒక్క విషయమైనా పొద్దు తెలీదు జ్ఞాపకమే లేదు .. మీ ఆవిడా ?' అని ఒక పూజారి అనడం. ఆ మాట్లాడే తీరు ఆమెను కళంకం అపాదించేటట్లుగా వుంది. కష్టం అనిపించింది. మరో అతను చాలా హృదయమిచ్చి మాట్లాడాడు. ఆమె గురించి మాట్లాడుతున్నంతసేపూ అశ్రుపూరితనయనాలమాయి, అంతే- ఆ తర్వాత కొంతకాలం ఆమె ప్రసక్తే లేదు.

ఆమె అంత్యక్రియల గురించి ప్రశ్నించారు కొందరు. నా కేమీ జ్ఞప్తి లేదు—శవపేటిక, వివరాలు చెప్పారు. చాలకష్టం అనిపించింది.

ఆమెను పూడ్చిపెట్టారు ... స్నేహితులంతా వచ్చారు. ఆ ఘట్టాన్ని చూడలేక పారిపోయాను నేను. తిరిగి తిరిగి ఏరాత్రికో యింటికి వచ్చి మర్నాడు ఉదయమే ప్రయాణం చేయ సంకల్పించాను.

నిన్ననే తిరుగ పారిస్ వచ్చాను. మళ్ళీ నా గది, పరికరాలు, పరుపు, ప్రేమకలాపాలు జ్ఞప్తికి తెచ్చే ప్రతీవస్తువూ చూసేసరికి తిరుగ క్రొత్తగా కొంతకాలం మరచిన విషాదం మొదలైంది. కిటికీలోంచి క్రిందికి దూకుదామా అన్నంత ఉద్వేగం కల్గింది. గదిలో వుండలేకపోయాను.

శాశ్వతంగా ఆమె వుంటుందని, మా ప్రేమ చిర స్థాయిగా నిలచిపోతుందనే ఆశ నిరాశగామించి ఆమె వెళ్ళిపోయింది. ఉండలేకపోయాను. గదిలో వుండలేకపోయాను. టార్చీ తీసుకొని వెళ్ళిపోతూండే సరికి-ఎదురుగుండా ఒక పెద్ద అద్దం ఎదురైంది. ఆమె తన టాయిలెట్ సరి చూసుకుందుకై వుంచిన అద్దం. కష్టం అనిపించింది, అంతే.

ఆ అద్దం ముందాగాను. అన్నిసార్లు ఆ అద్దంలో ప్రతిబింబించిన ఆమె లేకపోయేసరికి-శరీరం వణకసాగింది. కేంద్రీకరించి చూచాను... అద్దాన్ని ముట్టుకున్నాను-చల్లగావుంది...ఏవేవో భావాలు కలిగాయి...గదిలో వుండలేకపోయాను.

సమాధులకు వెళ్లాను...తెలియకుండానే స్మశాన స్థలానికి వెళ్ళాను...ఆమె గోరీ కన్పించింది. పాలరాతి సిలువ: దానిమీద ఇలావుంది:

'ఆమె ప్రేమించింది ... ప్రేమించబడింది. మృతి నొందింది...'

జీర్ణించిపోయి అలాగేపడివుంది. ఎంతబాధాకరమైన విషయం ... నేలమీద పడుకొని వెక్కి వెక్కి యేడ్చాను ... చాలసేపు చైతన్యహీనుడనై అలాపడివున్నా. చీకట్లు అలముకుంటున్నాయి... అలా ఆరాత్రి అంతా అక్కడే గడపివేద్దామనుకున్నా—కాని— పంపివేస్తారు. అక్కడ వుండడానికి వీల్లేదు—ఏం చెయ్యడం?

రాత్రి అంతా మృత్యునగరంలోనే తిరిగాను. నడిచాను...నడిచాను ..ఎంతచిన్న పట్టణం అనిపించింది. చనిపోయినవాళ్లు, ఉంటున్న వాళ్ళకంటే ఎంత హెచ్చో అనుకున్నా ..

ఎంతకాలం అని జీవిస్తాం. ఎప్పటికో అప్పటికంతా మృతినొందవలసిందే-మట్టిలో పుడతాం, మట్టిలో కలుస్తాం...అంతే—తత్వం...

అక్కడ ఒకమూల పురాతనస్థలంలో వున్న సిలువలు శిథిలమయ్యాయి ... బహుశా క్రొత్తవాళ్ల పేర్లు మార్చవచ్చు - కావచ్చు...అదంతా చక్కని చెట్లతో శోభావంతంగా, మానవ మాంసంపై బ్రతుకుతూ — చక్కగావుంది...

ఒక్కణ్ణే ..నేను ఒక్కణ్ణే వున్నాను. ఆ మృతసమూహంలో నేనొక్కణ్ణే. దిట్టంగా పెరిగిన చెట్టునొకదాన్ని ఎక్కాను ... అలా కొంతసేపు వున్నాను...

చీకట్లు కారు చీకట్లు అవుతున్నాయి— అలా నడుస్తున్నాను...చాలసేపు నడిచాను. తిరగ ఆమె గోరీ కన్పించలేదు. చేతులు చాపి నడుస్తూ...గోరీలను తట్టుతూ వెదుకుతున్నాను. ...కన్పించలేదు...గుడ్డివాడు బాట కెనుక్కునే టట్టేవుంది నా సంగతి కూడా...రాళ్లు, రప్పలు ...సిలువలు...వాడిన పూలగుత్తులు.— చేతులతో అక్షరాలు చదువుతూ—ఆ పేర్లు అర్థం చేసుకున్నా— ఏమిరాత్రి! కాళరాత్రి!! ఆమెను తిరిగి చూడలేను.

వెన్నెలలేదు. గోరీలమధ్య, సన్ననిబాట గుండా నడుస్తున్నా—భయం వేసింది అమితంగా— గోరీలు...గోరీలు...అబ్బ! గోరీలు తప్ప మరొకటి లేక...ముందు, వెనుక, ప్రక్క. ఎక్కడ చూచినా గోరీలే—ఒక దానిమీద కూర్చుండి పోయాను, నడవలేక... మోకాలుకూడా నొప్పి పెట్టుతున్నాయి— నా గుండెలు కొట్టుకుంటున్నాయి- జోరుగా కూడ...హృదయ గాభరా పడ్డా...ఏదో ధ్వని ...నా [illegible]లోంచా? అబ్బే...కాదు... ఆ మనుష్యకళేబరాలతో నింపబడిన ఆభూమిలోంచా? ఏమో! చుట్టూ చూశాను... ఎంతసేపు అక్కడ వున్నానో చెప్పలేను...భయం నన్ను ఆవేశించింది...చలిలో గడ్డకట్టినట్టు అనుకున్నా. మరణం ధ్రువం అనుకున్నా...ఎలుగెత్తి పిలువవదలచాను. కాని—

ఇంతలో-కూర్చున్న చలువరాతి ముక్క కదల నారంభించింది...నిజంగా కదులుతూనే వుంది. అది మీదకు లేస్తున్నట్టుగాకూడా ఫీలవసాగాను. పక్కన రీపైకి వెళ్లాను...చూశా, జాగ్రత్తగా పరిశీలించి చూశా, నిజంగా రాయి లేస్తు నేవుంది. మృతనొందిన మనిషి కన్పించింది. నగ్నంగా ఉంది. అస్థిపంజరం. కాళరాత్రి ఐనా ఆ రాతిపలకమీద పేరు, వివరాలు చదవగలిగాను. ఇలావుంది:

'51 సంవత్సరాలప్పుడు: జాకన్ మృతి నొందాడు. కుటుంబాన్ని అమితంగాప్రేమించాడు. గౌరవనీయుడు. నెమ్మదస్తుడు... ఉదారుడు.'

ఆ మృతినొందినవాడుకూడా చదవసాగాడు. ఒక సూదిరాయి తీసికొని ఆ అక్షరాలన్నీ చెరిపి వేశాడు. కన్నుల గుంటలలోంచి నిదానంగా పరీక్షించి-ఉజ్వలమైన కాంతితో ప్రకాశించే అక్షరాలతో-ఇలా వ్రాశాడు.

'51 సంవత్సరాల లప్పుడు మృతి నొందాడు ఈ జాకస్...బహు క్రూరుడు. డబ్బుకై తండ్రిని చంపాడు, భార్యను కష్టాలపాలు చేశాడు. పిల్లలని అమితంగా శిక్షించేవాడు. ఇరుగుపొరుగు వాళ్ళని అన్యాయం చేశాడు ... దొంగతనం చేసే వాడు...నీచంగా చనిపోయాడు...'

వ్రాయడం పూర్తిగావించి, చలనంలేకుండా నిలబడిపోయాడు ..చుట్టూ కలయచూసేసరికి, అన్ని గోరీలూ విడేయి...మృతినొందినవాళ్లంతా లేచారు—వాళ్ళవాళ్ళ రాళ్ళమీదనున్న అక్షరాలన్నీ తుడిచారు. యథార్థం వ్రాశారు ... అందరూ చుట్టుపక్కలవాళ్ళను బాధ పెట్టిన వాళ్లే- అన్యాయవంతులు ... దగుల్బాజీలు ... దొంగలు...హంతకులు ... క్రూరులు...ఒక్క సారే అంతా నిజం వ్రాయ సుద్యుక్తులయారు.... బ్రతికున్నప్పుడు దాచబడిన యథార్థవివరాలన్నీ ఒక్కసారి వెలువడ్డాయి ... ఆశ్చర్యంవేసింది. భయానికి బదులు—అంతే—

బహుశా ఆమెకూడా ఏదో వ్రాసివుండాలి అనుకున్నా...భయంలేకుండా సగం తెరవబడి వున్న గోరీలమధ్యనుంచి పరుగెత్తాను....వెంటనే ఆమెగోరీ పోల్చుకున్నా ... ఆమె ముఖాన్నయినా చూడకుండా—ఆ చలువరాతి పలక చూడసాగాను.

అంతక్రితమే దానిమీద 'ఆమె ప్రేమించింది....ప్రేమింపబడింది... మృతినొందింది...' అని చదివాను...కాని—

ఇప్పుడు ఇలా చూశాను :

'ఒకరోజు తన ప్రియుణ్ణి అన్యాయం చేయ సాకగ్నించి, వర్షంలో వెళ్ళినందుకు ఫలితంగా దగ్గుపట్టుకొని మృతినొందింది.'

మరునాడు వుదయం నన్ను ఆ స్మశానంలో అచేతనంగా పడివుండడం వాళ్లు చూశారట.

(ఇంగ్లీషునుండి అనువాదం : 'సజగ్నాథ్')

# చిత్రపటావిష్క్రియ చిత్రాలు

ఈరంకి వెంకటరావు

ఈ రోజుల్లో చిత్రపటావిష్కరణ ఒకటి మహాజోరుగా, వేలంవెర్రిగా జరుగుతోంది. ఈ నాయకుడు ఒక వినాయకుడి చిత్రపటం ఆవిష్కరిస్తే, ఆ వినాయకుడు యీ నాయకుడి చిత్రపటం ఆవిష్కరించటం. కావలసిన విషయాలేవీ బాగా అలవాటు పడకపోయినా, యిలాటివి మహాచప్పున అలవాటుపడి ఒకటే వెర్రికింద పట్టుకు కూచుంటాయి.

పూర్వం చచ్చిపోయినవాళ్ళ చిత్రపటాలే ఆవిష్కరించేవారేమో అనుకున్నా. కాని ఆ జాడ్యం బతికున్నవాళ్ళదాకా కూడా పట్టేసింది. అవునుమరీ,అదీమంచిదే. చచ్చిపోయాక ఎవరేనా తమ చిత్రపటం ఆవిష్కరించారో లేదో చూడొచ్చారా ఏమిటీ. వారు బ్రతికున్నప్పుడే ఓ యిరవై చిత్రపటాలు కనీసం యిరవై చోట్ల ఆవిష్కరించిపారేసి అదేపనిగా పొగిడేస్తే, వీరు చచ్చిపోయే లోపున వీరి చిత్రపటాలు కూడా అధమపక్షం ఓ డజను బహిరంగపరిచేసి, బహిరంగంగా నాలుగుకోతలు కోసేసి కళ్ళు మూసుకుంటారు. ఆ ఋణంకాస్తా యీ జన్మలోనే తీరిపోతుంది.

మొత్తానికి ఏమయితేనేంగాని పట్టాభిగారు చెప్పినట్టు- స్వరాజ్యం వచ్చాక చిత్రపటాలు గీసేవారు. పూలమాలలు కట్టేవారు బాగుపడ్డారు. పూర్వం ఎవరేనా చాలా గొప్పవాడైతే ఆయన శిలావిగ్రహం ఎక్కడో నాల్గురోడ్లమధ్యా నిలబెట్టేవారు; దానిక్రింద ఆయనపేరు, చేసిన గొప్పపన్లూ రాసేసేవారు, తీరిపోయేది. ఇప్పుడు

కూడా అలాచేస్తే రోడ్లు యిరుకయిపోతాయనో, శిలావిగ్రహాలు చాలా ఖరీదనో ఆవిధానం మార్చి చిత్రపటావిష్కరణ అంటూ మొదలెట్టారు. ఇదీ సూక్ష్మంలో మోక్షం. పెద్దపెద్ద భవనాల్లో గోడలన్నీ చిత్రపటాలతో నిండిపోతే అప్పటిమాట ఆలోచించుకోవచ్చు.

ఈ చిత్రపటావిష్కరణ మహోత్సవానికి మూడు విషయాలు ముఖ్యం. 1. ఆవిష్కరింపబడే మహాపురుషుడి చిత్రపటం- ఆయన చచ్చిపోయినావారే, బతికుంటే మరీమంచిది. 2. ఆవిష్కరించే పెద్దిమనిషి- ఆయన దేశంలో ఏదో విధంగా పేరుతెచ్చుకుని ఉండాలి; ఈ ఆవిష్కరణ మహోత్సవం ఏదైనా సంస్థకుగాని, కాలేజీకిగాని చెందినదైతే ఆవిష్కరించే ఆయన ఆ సంస్థలోగాని, కాలేజీలోగాని ఓవిధంగా పెద్దవాడై యుండాలి. 3. ఆవిష్కరణ సమయంలో నోరు వెళ్ళబెట్టి, ఆ కోతలన్నీ వినేశ్రోతలు. ఇవన్నీవుంటే చిత్రపటావిష్కరణ మహాశోభాయమానంగా జరుగుతుంది.

అయితే యీ చిత్రపటావిష్కరణ సాధించేదేమన్నావుందా అంటే ఏమీలేదు. ఏ బ్లాకు మార్కెట్ వర్తకుడైనా ఏదన్నా ఒక నిధికి బాగా విరాళా లిచ్చాడంటే, ఆ విరాళాలు పుచ్చుకుందుకు వచ్చే ఆయన ఆ వర్తకుడి చిత్రపటం ఒకటి నిరభ్యాంతరంగా ఆవిష్కరించి,ఎన్నో సంవత్సరాలనుంచి మహా ఎరుగున్నట్టుగానూ, ఆ వర్తకుడుగారు పుట్టిన దగ్గర్నుంచీ విరాళాలు యివ్వటమే పనిపెట్టుకున్నట్టుగాను చెప్పి చక్కాపోతాడు.

లేకపోతే ఒకగ్రామంలోవున్న కొంతమంది స్థానికులు వాళ్ళ వూళ్ళో అజ్ఞాతంగా పడివున్న ఒకఫోటోనాయకుడిగారి ఫోటో మరో వూరినుంచి యింకో పెద్దవినాయకుడిగార్ని రప్పించి ఆయన చేత ఆవిష్కరింప చెయ్యడం. ఒక్కొక్కప్పుడు ఇద్దరు నాయకులకు మనస్పర్థలుగా వుంటే, అందులో ఒకాయనచేత యింకొకాయన చిత్రపటాన్ని బహిరంగపరిస్తే — మనస్సులో ఎంతక్రోధమున్నా, అసూయవున్నా వేదికమీద మాత్రం ఆయనమహాఅభిమానం దొలుచుకు పోతున్నట్టు మాట్లాడటం. దీనివల్ల నేమిటంటే నాయకులచేత వేదిక నెక్కించి వచ్చి అబద్ధాలు పలికించటం. మళ్ళీ వేదిక దిగగానే ఆ నాయకులిద్దరూ ఎప్పుడూ ఎడమొగం పెడమొగం పెట్టడం. ఇంకా యీ చిత్రపటా విష్కరణలో విశేషమేమంటే ఆంధ్రుడిచేత ఒక అరవ వినాయకుడి చిత్రపటాన్ని ఆవిష్కరింప చేయించడం. దీనివల్ల యీ ఆంధ్రుడికి యిష్టంలేకపోయినా ఆఅరవాయన్ని పొగడక తప్పదు.

అసలు అన్నిటికన్నా ముఖ్యమేమిటంటే యీ చిత్రపటావిష్కరణకర్మకాండమొదట్లోనే ఒక అసందర్భం వుంది.అ దేమిటంటే సభాసదులం చిత్రపటం ఆవిష్కరింపబడే ఆయన మొహం ఎప్పుడూ చూడనట్టూ, ఆయనగురించి విననట్టూ, ఆయన పూర్వం ఏ శతాబ్దంలోనివాడులాగానో అనుకోవటం, ఆయన చిత్రం సభాసదులకు కనబడకుండా మూసివెయ్యడం, ఆయన గురించి అనేకమాటలు చెప్పాక, ఆ తెరచాటు తొలగింపడం, ఎంత అసందర్భంగా వుంటుందో ఆలోచించండి. చిన్నపిల్లలు ఆడుకొనే ఆటలాగ వుందదూ? ఒకసారి ఒక రైతు యీ చిత్రపటావిష్కరణ కర్మకే వచ్చి అక్కడేదో మహావింత జరుగుతుం దనుకొన్నాడు. తీరా తెర తీసినాక ఏముంది- అది అతను అనేకసార్లు చూసిన ముఖమే. అతను అంతసభలోనూ అకస్మాత్తుగా అనేశాడు—"ఓస్సి యీడేనట్రా, మనవూళ్లో సత్తేగ్రం చేసిండు- ఆడేనా". అదుగో అలాగే వుంటుంది యీ రోజుల్లో చిత్రపటా విష్కరణ.

ఈ చిత్రపటా విష్కరణమీద ఒక చిన్న హాస్యం కూడా వుంది. అదేమిటంటే ఒకాయన ఒక చిత్రపటాన్ని ఆవిష్కరించబోతూ, సభనుద్దేశించి "సోదరులారా నేనీ చిత్రాన్ని బహిష్కరిస్తున్నాను" అన్నాడట. ఇలాగ యీ మధ్య ఒక ఊరిలో జరిగిందికూడాను.

కాబట్టి యీ చిత్రపటావిష్కరణ పిచ్చి మనవాళ్లు త్వరగా వదలించుకుని కాలం వృథా చెయ్యకుండా అంతకంటె యింకో మంచిపని చేస్తే బాగుంటుంది. చిత్రపటం ఆవిష్కరించేవాడి ప్రాణాలుతియ్యటం తప్ప మరోపనిగాదు. ఇది సందర్భశుద్ధి లేనిదీ, అనవసరమైనదీ కూడాను. మన పెద్దలంతా యీ చిత్రపటావిష్కరణ తతంగం నెత్తిమీద పెట్టుకోకుండా వుంటే వాళ్లు ఒక మంచిపని చేసినట్టే.




దివాన్ బహదూర్ నరసింగనాయనింగారు చదువుకుంటున్న పుస్తకం పైకెత్తి, ఓసారి కిటికీవైపు చెవిఒగ్గేరు; ఏదో చప్పుడు గలాటాలా వినిపిస్తుంటే. ఎవరో మేడమెట్లు ఎక్కుతున్నారు; అడుగుల చప్పుడు సుబ్బన్నని చెపుతూనే వుంది. దుఃఖం, భయం కలిసిన ముఖంతో లోపలికి వస్తూ——

'బాబుగారూ!' అన్నాడు సుబ్బన్న.

'అంత తొందర, అల్లరి చేస్తూ రాకపోతే ఏం పుట్టి మునిగింది' ఉరిమేడు నరసింగనాయని.

'మన కుక్క జానీని రాజుగారు కాల్చి చంపేసేరండి.'

'కాల్చే?' గంతేసినట్టు లేచేడు. ముఖం ఎఱ్రబడింది. 'కాల్చిచంపేరా? ఏం, ఎక్కడ వుంది?'

'దెబ్బతో చచ్చిపోయిందండి' సుబ్బన్న తడబడ్డాడు. ఆ మాటల్లో ద్వేషం ఉన్నా, పైకే భావం ఆగలేదు. 'జానీని మన చివరి పొలం గట్టున చూచేనండి, రాజావారు పక్షుల వేటకని బయలుదేరేరు. రెండుమూడుసార్లు తుపాకీ గుళ్ల శబ్దం కూడా విన్నాను.'

పళ్ళు కొరుక్కున్నాడు నాయని. ప్రియంగా నాల్గుసంవత్సరాలనుండి జానీని పెంచేడు. దాని మృతి దుఃఖం కల్గించి, కళ్ళకు నీళ్ళు చిమ్మేయి; క్షణికం. 'చంపేడూ ..దీనికి వాణ్ణే చంపేస్తా' జోళ్ళలో కాళ్లుపెట్టి మెట్లవైపు నడిచేడు నాయని.

'దెబ్బతీసి తీరాలండి.'

'జానీ ఎక్కడవుంది సుబ్బన్నా?'

'చివరి పొలంగట్టున ... ఈపాటికి చచ్చే వుంటుందండి, పాపం జానీ...'

సుబ్బన్నకి తెలుసు. తన యజమానికి జానీ అంటే ఎంత ప్రేమో. ఆ నల్లరంగు జూలులో, ముఖంమీద తెల్లమచ్చతో ఎంత అందంగా, హుషారుగా ఉండేదో. యజమానికి ఆక్షణంలో జానీ వెనుకటి మంచిరోజులన్నీ జ్ఞాపకం వస్తున్నాయని పూర్తిచెయ్యకుండా ఆగిపోయేడు.

'సుబ్బన్నా! నా తుపాకీ తెచ్చిపెట్టు' నెమ్మదిగా నాయని అన్నాడు. సుబ్బన్న ఉలిక్కిపడ్డాడు. అయినా ఆయనముఖంలో వున్న నిశ్చయత, బాధ చూస్తుంటే ఏంచేస్తాడో తెలిసి భయపడ్డాడు.

'తుపాకీ?'

'ఊ...తుపాకీ అని చెప్పలేదూ' సుబ్బన్న నిలుచునే ఉన్నాడు; సందిగ్ధంలో. నాయని మాట్లాడకనే, లోపలికి వెళ్ళి తుపాకీ స్వయంగా తెచ్చుకుని మెట్లు దిగేడు.

సుబ్బన్న ఖంగారు పడ్డాడు. 'ప్రభువు వారు, తుపాకీ ఎందుకండి? తమచేతి బెత్తాం తీసుకు వస్తా, కుక్కనికొట్టినట్టుకొట్టి పరాభవం చేయించండి, తుపాకీ ఎందుకు.'

నాయని వినే లేదు.

'జానీని కాల్చేడు. దానికి ప్రతిఫలం ఇప్పుడు పుచ్చుకుంటాడు. రాజా ఎక్కడ వున్నాడు? కాలవగట్టునే ఉంటాడా?'

సమాధానం వినకుండానే నాయని వెళ్ళిపోయేడు. సుబ్బన్న భయంతో వణికిపోయి మెట్లమీదనే చతికిలబడ్డాడు. దూరంగా కంది చేల్లోనుండి యజమాని బూట్సుల చప్పుడు వినిపించింది. ఆయన కాలవగట్టుకు వెళ్ళినట్టు అనింది. అక్కడే చివరి పొలంవుంది; అదే రాజాగారి ఎస్టేటుకు, తమ పొలంకు సరిహద్దు. తనులేచివెళ్ళి రాజాగారితో వచ్చే ఆపదని గురించి చెప్పదామనుకున్నాడు. దాంతో ఆయనను, తన యజమానినికూడా రక్షించినవాడు అవుతాడనుకున్నాడు... అయినా అది చేతులు దాటినట్టే వున్న....

ఆ చేలగట్టునపడి, కాలవచేరుకుని పైకి క్రిందకి చూచి వచ్చేసరికి అరగంట అయ్యింది. దాంతో ఏ ఉద్వేగంతో నాయని బయల్దేరేడో, అది చాలవరకూ తగ్గింది. తగ్గినా తన కుక్కని చంపినందుకు ప్రతీకారం తీర్చుకోవాలన్న నిశ్చయం సడలలేదు.

అరగంటకు ముందుగా రాజావారు కనిపించి వుంటే, తుపాకీతో కాల్చేసి వుండును. అది నాయనికి తెలుసు. దాంతో, అకాలంగా ఉద్భవించే ఉద్వేగాలను తను ఎల్లా చంపుకోలేకుండా కానిస అయివుండేవాడో! అసలు జీవితంలో, ఇటువంటి ఉద్వేగాలు ఎలాగ క్రూరతరంగా పరిణమించేవో కూడా గుర్తుకు వచ్చింది.

మొన్నటి యుద్ధంలోకి వెళ్ళినపుడు, నిరంతరంగా వినపడే తుపాకీ మోతలు, చావులు ఆక్రందనాలు మర్చిపోలేదు. వాటి పరిణామం నరాలమీద పడ లేదు. యుద్ధంలో బిరుదులు పొంది, ఉద్యోగస్థాయిదాల్లో ఉండి, పరిస్థితులకు అనుగుణంగా ఉండే నియమాలుఉన్నా, కొన్ని క్షణాలు తన ఉద్వేగాలు అదుపాజ్ఞల్లో ఉండకుండానే ఉంటున్నాయి.

చివర పొలంగట్టున జానీని చూచేడు. రక్తం మడుగులో,దీనంగా అరచి చచ్చిపడివుంది.కొన్ని గంటలక్రితం, జీవంతో వున్నది. ఇప్పుడు నిశ్చేష్టంగా కట్టెలా ఉంది. జానీని జీవితంలో ఎక్కువగా ప్రేమించేడు. ప్రియంగా, సాత్వికంగా ఉన్న దానిజీవితం అంతంఅయి, తన జీవితంలోని ఓసుఖం దొంగిలింపబడింది; క్రూరంగా వేరు చేయబడింది.

రాజావారి ఆ మొద్దు ముఖం; ఆ ఏనుగంత మనిషినీ ద్వేషింపేటట్టు చేసేది. ఇంకా ఏం చేయించేదో! కాని ఆయన ఈ పొలిమేరలు వదలడంతో బ్రతికిపోయాడు అనుకున్నాడు. క్షణకాలం రాజాకూడా చేసిన పనికి పశ్చాత్తాప పడే వుంటాడనుకున్నాడు.

తిరగడంలో, రాజా మేడదగ్గరకి వచ్చాడు. ఓ వందగజాల దూరంలో, ఆకుపచ్చ రంగుతో అది క్రూరంగా నుంచుని, పండిన పంటల్ని కైమా చేస్తానన్నట్టు వుంది. నాయనికి అక్కడికి వెళ్ళి, ముఖాముఖి మాట్లాడుదామా అన్న కోర్కె కలిగింది. అది సరియైన నిర్ణయం కావడంలేదు. వెళితే, పీటితో ఏవో కొన్ని మాటలు, తర్వాత కొట్టుకోవడం, సమాప్తి అవుతుందని తెలుసు. అది ఏవిధంగా ఉపాయకారో తెలియటం లేదు. రాజా ఏ విధంగా తన్ని గాయపరచాడో, అతన్ని అల్లాగే గాయపరచాలి. అతను బాధపడుతూ, నరకంలో జీవితాంతం మరచిపోకుండా ఉండేటట్లు చెయ్యాలి.

వెనక్కుతిరిగేడు; ద్వేషం, జుగుప్స కలిగాయి. ఇదివరకు జానీ వచ్చి, కోళ్ళని, బాతుల్ని, అల్లరి చేస్తోందని రాజా చెప్పేడు. తాను పట్టించుకోలేదు. చిన్న చిన్న వాటికొరకు, జానీనే చంపేటంతగా తయారయ్యే ఆ మనిషి ప్రవృత్తి అర్థం కావటం లేదు. విజ్ఞానం తెలియని జంతువుని చంపడంలోఉన్న మూర్ఖతత్వం, అనూహ్యంగా ఉంది. జీవహింస చేసేవాళ్ళమీద ప్రభుత్వం ఏ విధమైన అంకుశ ఉంచలేదు కాబోలు. జంతువుల్ని క్రూరంగా గొలుసుల్తోకట్టి, హింసించి, వాటి స్వాతంత్ర్యాన్ని అరికట్టడం ఎంత నీచమో వాళ్ళు ఊహించరు కాబోలు అనుకున్నాడు.

తన పొలాల్లోకి వచ్చేటప్పటికి సుబ్బన్న ఎదురు పడ్డాడు. యజమాని ముఖంలో ఏమైనా చూడగలనేమో అనుకున్నాడు; కాని నిరాశ చెందాడు.

'రాజా కన్పించనే లేదు' నెమ్మదిగా అన్నాడు నాయని. సుబ్బన్న తేలికపడి, నిట్టూర్పు విడిచాడు. యజమానిలో ఉద్వేగం తగ్గినందుకు వెంకటేశ్వరుడికి దణ్ణం పెట్టుకుని సంతోషించేడు.

'వాడు పట్టి మూర్ఖుడండి, పిరికిపంద.'

నవ్వాడు నాయని...

సంధ్య చీకట్లలో పొలాల గట్టున నడచి, ఇల్లు చేరాడు.

'వెర్రి కోపంలో మనుష్యులకు ఒళ్లే తెలియదండి. వాడికి ఇప్పుడు తెలిసి పశ్చాత్తాప పడుతూ వుంటాడండి. వాడి బ్రతుకే అంత...అల్లా జీవిస్తాడు.'

'వాడి దృష్టిలో జానీ బ్రతకడం మంచిది కాదు కాబోలు'

ఇద్దరూ మౌనంగా అడుగులు వేసేరు చేలల్లోంచి.

ఆ రాత్రి నాయని ఆరుబయటే కూర్చుని, వచ్చి పొయ్యే చిన్న చిన్న మబ్బుల్ని, మిణుకు మనే నక్షత్రాల్నిచూస్తూ, తోటల్లోనుండి వచ్చే కీచురాయి శబ్దాన్నివింటూ వున్నాడు. సాధారణంగా రోజూ రాత్రి పది గంటలు కాక పూర్వమే నిద్రపోయేవాడు - ఈ రాత్రి పదకొండు దాటింది. నిద్ర రానట్టే వుంది.

రోజూ రాత్రిళ్ళల్లో జానీ పాదాలదగ్గరగా కూర్చుంటే దాని తల, ఒళ్ళు దువ్వి, ఒకటి రెండు సార్లు ముద్దెట్టుకునే వాడు. దాని పక్కా వరండాలో తన ప్రక్క వేయించే వాడు. ఈ రాత్రి సుబ్బన్న వెయ్యనేలేదు. రోజూ దాన్ని నిద్రపుచ్చే అలవాటు పోలేదు. ఆతని జీవితంలో సుఖాంగా మిగిలిపోయింది ఈ ఒక్క జోలపాటే; అదికూడా విధి లాక్కుంది. జానీ ఇప్పుడు ఆ కాలువకు ప్రక్కగానే, జీవితాంత సమాధి కట్టుకుని ఉంది.

డాబా చివరకి లేచి వెళ్ళేడు. ఒంపులు తిరిగి కాలువ నిశ్చింతగా ప్రవహిస్తోంది. తూర్పు దిక్కున వర్షం వచ్చేట్లుగా వుంది-నల్ల మేఘాలు పరిగెడుతున్నై. వాటినిచూస్తుంటే ఇంత ప్రపంచంలో ఎంత భీకరమైన ఒంటరితనంలో తాను ఉన్నాడో అతనికి తట్టింది. మొట్టమొదటగా కొడుకు; తర్వాత భార్య, ఇప్పుడు జానీ వెళ్ళిపోయారు-నిర్దయగా.

రాజావారిని చాలాకాలంనుండి చూస్తూనే వున్నాడు. జమీన్‌దారీ ఫాయిదాలో చేసే దురాగతాలు, పైకి చెప్పే లేని కబుర్లు వారిని ద్వేషించేటట్టే చేసేయి. జ్ఞాపకం ఉన్నంతలో రాజా ఒక్కరికి సహాయం చేసినట్టు, హింసించకుండా వదలినట్టు వినలేదు. అప్పుడప్పుడు నౌకర్లు ఆయన తప్పత్రాగి పెళ్ళాన్ని కొట్టేవాడని, అందుకే ఆవిడ వదిలి పారిపోయిందని వినేవాడు. కాని ఆంతవరకూ విన్నవి నిజమా అన్నది కనుక్కోలేదు.

నిజంగా ఆలోచిస్తేరాజా ఇంట్లో ఎల్లావున్నా అది తనకు అక్కరలేని విషయమే. పెళ్ళాన్ని కొట్టడం, నౌకర్లని తిట్టడం - ఎవరి స్వగృహ విషయాలలో వారికి స్వాతంత్ర్యం ఉంది. ఇప్పుడో, నిజంగా రాజా చర్యలన్నీ కావలసి వచ్చాయ్:జానీనిచంపడంతో వాటితో అవసరం ఎక్కువ అయింది. ఇంకోవ్యక్తే జానీనిచంపి వుంటే ఈసరికి క్షమాపణ చెప్పుకునేవాడే. కాని రాజాకి మాత్రం అది చిట్టాలోలేని కాతా. కాతాలోకి వచ్చినా, మాట్లాడకుండా త్రాగి నిద్రపోతో వుంటాడు, ఇది భావనే.

రోజూ రాత్రి పుచ్చుకునేటట్టే, ఓగ్లాస్ బీర్ త్రాంగేందుకు దిగేడు. అలమారులోనుండి సీసా తీసి త్రాగేడు. వెనక్కువస్తున్నపుడు టేబిల్ మీద ఉత్తరం కనుపించింది. సాధారణంగా ఎక్కడ పెదతారో అక్కడే అది వుంది. బహుశః ఏ నౌకరో తెచ్చి, ఈసమయంలో లేపటానికి భయపడి, అక్కడ పెట్టి వుంటాడు అనుకున్నాడు. కవరు తిరగతీసి చూచేడు. దానిమీద ముద్ర గాని, బిళ్ళలుకాని లేనేలేవు. చింపేడు.

'శ్రీ నాయనిగారికి—

మీ జానీవచ్చి,నా కోళ్ళను, బాతుల్ని చెదరకొట్టి అల్లరిచెయ్యడం గురించి ఇదివరలో చాలా సార్లు మిమ్మల్ని హెచ్చరించాను. కాని మీరు విననేలేదు. పైగా 'అంతగా ఉండలేకపోతే, నీ ఆస్తిని అమ్మేసి ఇంకోచోటికి లేచి పొ'మ్మని కబురు పంపేరు. ఇవ్వాళ మీ జానీ అల్లరి చేస్తుంటే నేను తుపాకీతో కాల్చేను. ఈ సందర్భంలో ఒక్కముక్క చెప్పాలి. మీకు ఇంకోకుక్కని తీసుకురావలన్న ఉద్దేశ్యమే ఉంటే, దాన్ని అదుపాజ్ఞల్లో పెట్టుకోవడం నేర్చుకోండి; లేనియెడల దానినికూడా నిర్దాక్షిణ్యంగా చంపడానికి నేను వెనుదీయను. పైగా ఓ తుపాకీ పుచ్చుకుని నా కొరకు వెతకడం ప్రారంభించారట గా! అల్లాంటివార్త మరోకసారి నాకు తెలిసిందా- నేను పోలీసులకు రిపోర్టు చేయవలసి వుంటుంది.

గ్రహించవలెను,

.........'

రాజావారిప్రవృత్తికి అనుగుణంగానే, కొంటె గీతల సంతకంతో ఆఖరు అయ్యింది. నాయనికి ఒళ్ళు సలసలా ఉడికింది. ఉత్తరాన్ని అక్కడే ఉంచి, డ్రాయరుతీసి, సాధారణంగా ఉపయోగించుకునే రివాల్వరు తీసి, జోళ్ళు వేసుకుని బయటకు వచ్చాడు.

కొద్దిక్షణాల్లో పొలాలకి అడ్డుపడ్డాడు. ఆతని ముఖం రక్తం కళ్ళచూడాలనే పట్టుదల.



తోనే ఓగుసుకుపోయింది. దారిలో చెట్లను తప్పించుకుంటూ, రాజావారి మేడదగ్గరకు బయలుదేరేడు. కాలవగట్టుకు వచ్చేసరికి ఎత్తుగా ఉన్న జానీ గోరీ కన్పించింది. నాయని క్షణం ఆగి—

'జానీ! మళ్ళీ రాజా జీవితంలో ఇంకో పక్కని కాల్చడు. దేవుడు రక్షించుగాక' నెమ్మదిగా అని, గట్టులు దాటేడు. అతనికళ్లకు ఆ కరడుకట్టిన పాషాణహృదయపు రాజాయే కన్పించేడు.

జానీఅన్నది ఆ క్షణంలో భావనలో చేసేడు- ఇక అది క్రియలో జరగాలి; అంతే!

* * *

నాయనిని అప్పుడప్పుడు ఆవరించే ఉద్వేగమే ఇప్పుడూ ఆవరించింది, నడిపించింది. ఇది వరకు కొంతకాలం ఉండి తర్వాత తగ్గిపోయేది. ఈ క్షణంలో అది చావకుండానే గమ్యస్థానం చేర్చింది. రహస్యంగా, నీడల్లో నడుస్తూ, రాజాఇంటివార నుంచుని, ఏకిటికీ తీసివుందా అని పైకి చూచాడు.

రాజావారి ఉత్తరం చదివినప్పటినుంచీ ప్రతీకారవాంఛ ఎక్కువ అయ్యింది. జీవహింస అన్నది రాజాకి వ్యసనమే అయ్యింది. అటువంటివాడిని రూపనామాలు లేకుండా అంతం చెయ్యడం తప్పులేదని తట్టింది. ఒక్క క్షమార్పణ కబురు నిజంగా అతన్ని రక్షించేదే. అలా కాకుండా ఉత్తరం తలతిక్కగా వ్రాయడంతో, మృత్యువుని పిలిచినట్టే అయ్యింది. నాయనికి తెలుసు, రాజా ఏగదిలో పడుకుంటాడో. ఇక చింపుకునే నిశ్శబ్దంలో, రాజా తలలోకిగుండుని వదలడమే ఉంది—

నాయనికి తెలుసు తను రాజాని ఖూనీ చేయబోతున్నాడని. అది నిర్ణయించుకొనే వచ్చాడు. దీనివల్ల, పోలీసులు, విచారణ, మృత్యుదండన, ఒకటితర్వాత ఒకటి తనను ఆవరిస్తాయి. ఈ నవ్య ప్రపంచపు నటిని చూస్తే నవ్వువచ్చింది. అదంతా ఓ మానవనిర్ణయం. దేవుని పేరుచెప్పి వాక్కుపుచ్చుకున్నట్టుగా వుంది.

'జానీని చంపినందుకే! అతన్ని చంపి. బహుశః అతనికి తెలియకుండానే, ఆ కిటికీలోనుండి దిగి, పొలాల్లోంచే ఇంటికి వెళ్ళిపోవాలి. బూట్సుల ఆనవాళ్ళు పడకుండా, కంకరదారి మీద వెళ్లి, పిస్తోలు కాలవలో పడవేస్తే ఎవరూ అనుమానించరు...' కిటికీని తెరిచేడు. లోపల చూచేడు. నెమ్మదిగా లోపలప్రవేశించేడు. రాజా ఏగదిలో వుంటాడో, ఆ గదివైపే నడచేడు; పిస్తోలు చేతిలో పట్టుకుని. సావిట్లోవున్న దీపం తగ్గించేవుంది. ఎదురుగా సలుపులోనుంచి రాజా గది కనుపిస్తోంది. జోళ్లువిప్పేసి మూలకి నెట్టేడు.

గదిలోకి వెళ్లేడు. తోటవైపు వున్న కిటికీ బార్లావుంది. నెమ్మదిగా, అడుగుల్లో అడుగులువేస్తూ, పక్కదగ్గరగా వెళ్లేడు. బూర్నీసు కప్పిన ఆనవాలు ఎదురుగావుంది. తల ఎటువైపు వుందో, అన్న మీమాంసలో, నెమ్మదిగా, నెమ్మదిగా చెయ్యిపెట్టేడు. బూర్నీసు గుచ్చుకుంటోంది. 'ఓవేళ రాజా లేచినా, వెంటనే'

చేతిలో పిస్తోలు వుంచుంది....... అంగుళం, అంగుళం చెయ్యిజరిపేడు... చీకట్లో ... రాజా ఆకారాన్ని వెతుక్కుంటూ ... ... పక్క ఖాళీగా వుంది! ఆశ్చర్యపడ్డాడు. తనకేమీ తెలియటంలేదు.

గది చుట్టూరా తొందరగా చూచేడు. రాజా తను రావడంచూచి, ఏమూలైనా దాగున్నాడేమో అనుకున్నాడు.... ఒక్కొక్కటే. వ్రాసుకునే బల్ల, పుస్తకాల బీరువా, బట్టల పెట్టెలు, కోట్లస్టాండు, కుర్చీ...అన్నీ వెతికాడు....రాజా లేనేలేడు! 'పైకి పారిపోయేడా?' పారిపోవడమే జరిగితే చూచివుండేవాడే మరి—

పక్క వేడిగానేవుంది. అప్పుడే మనిషి పడుకుని లేచినట్టుగా—కొద్దిక్షణాల క్రితమే వెళ్ళివుండాలి.

ఎదురుగా కిటికీ తెరచివుంది? ఎందుకు తెరవబడాలి? నాయనికి పాలుపోలేదు. కిటికీ దగ్గరగా వెళ్లి క్రిందకి చూచాడు. క్రిందనే ఓ మనిషి, ఆకారం కుప్పకూలినట్టుగా రాళ్ళమీద వుంది. 'రాజా?' నోట్లోనే అణగిపోయేయి మాటలు.

పిస్తోలు లోపల పెట్టుకునే, ప్రక్కగా వున్న నీటిగొట్టంమీదుగా క్రిందికి దిగేడు. ఆ ఆకారం వైపు వంగేడు. అది రాజాదే! తలక్రిందుగా, రక్తంమడుగులో, వికృతంగా పడివున్నాడు. అది నాయనిని భయంలో ముంచింది.

చచ్చిపోయాడా? నెమ్మదిగా చెయ్యిచొక్కా లోపలకి త్రోసిచూస్తే గుండె ఆగిపోయింది. ఆ క్షణంలో తెలియకపోయినా, ఆ కళ్ళల్లోని రక్తం, తడిసిన ఒళ్ళు... చచ్చేడు అన్నందుకు, మేం సాక్ష్యం అని క్రూరంగా చెప్పాయి.

నాయనిని భయం ఆవరించింది. ఏమనిషైతే చంపదలచుకున్నాడో, అతడే, క్రూరంగా చచ్చివుండిపోయేడు. మృత్యువు అన్నది ఇంత భీకరంగా వుంటుంది అంటే దేవుడు ఇచ్చిన జీవాన్ని చంపుటకు ఇంకో తోటిజీవికి అధికారం ఎక్కడవుందో అనిపించింది.

సుబ్బన్న 'వాడిబ్రతుకే అంత...అల్లాగే జీవిస్తాడు' అన్నవాక్యం జ్ఞాపకం వచ్చింది. ఈ చావులో కూడా ఆ విషపుముఖంలో శాంతత వుందన్నట్టే తట్టింది. సుబ్బన్న ముక్కల్లో అర్థం? తను అతన్ని చంపడానికే వచ్చేడు. ఇప్పుడు—

నాయని భయంతో పరిగెత్తేడు. తోటదగ్గరకు వచ్చేసరికి జోళ్లు జ్ఞాపకంవచ్చేయి. నెమ్మదిగా తిరిగి వెళ్లి జోళ్ళు తొడుక్కున్నాడు. కిటికీ ఇదివరకు చూచిన స్థితిలోనే అనుమానం కలగకుండా ఉంచి తోటకు అడ్డపడ్డాడు. కాలవగట్టుకి వచ్చేసరికి పరుగే.

ఓ వందగజాల్లో ఇల్లు వుందనగానే, ఎదురుగా వస్తూన్న వెంకన్నకు డీకొన్నాడు... వెంకన్న నాయనిం జూచి 'చాలా రాత్రి అయ్యిందే', అని పలకరించి వెళ్లేడు; ప్రక్కవూరు సినీమా నుండి వస్తూ.

ఈ వెంకన్నని కలియడం దురదృష్టం అనుకుని తిట్టుకుని, ఏదో జవాబు గొణిగేడు. కాని, అతనే రేపు ఆ రాత్రివేళ చూచేను అని సాక్ష్యం ఇస్తే, బుకాయించెయ్యగలను అన్న ధైర్యంవుంది. నిజంగా వెంకన్న గుర్తించేడా? ఎప్పుడూ పలకరించనైనా లేదే! అనుమానంతో గుమ్మం తలుపుకి తల కొట్టుకొన్నాడు. ఖంగారుగా పడకగదికి వచ్చి, బ్రాందీ సీసా నోటికి ఎత్తేడు.

రాత్రంతా-రాజా ఎల్లా చనిపోయాడు? తనే రాజాని కిటికీలోనుండి క్రిందకు తోసేనని అనుమానపడతారా? ఆలోచనలు—వేగుచుక్క పొడిచేవరకూ ఆలోచనలే.

* * *

రెండు రాత్రులు గడిచేయి. అవి కాళరాత్రులే అయ్యేయి నాయనికి. మానసిక ఆందోళనలో, ప్రతీచిన్న విషయమూ భయపెట్టింది. ఆ నలుబది



ఎనిమిది ఘంటల్లో ముదుసలి చిహ్నాలు అతన్ని ఆవరించేయి.

సుబ్బన్నని ప్రశ్నలు వెయ్యాలనుకున్నాడు. ఏం జరిగింది? ఏ మనుకుంటున్నారు? అని. సుబ్బన్న దగ్గరికి వచ్చినపుడు చూచే చూపుల పదునుకు ఆగలేకపోతున్నాడు. హృదయంలోప లికి గుచ్చేట్టు చూస్తాడు సుబ్బన్న.

ఆ రెండోరోజు సాయంత్రమే, పక్కలు వేస్తున్న సుబ్బన్నను, శ్రద్ధలేనట్టుగా, కూడా లాఘవంగా—

'రాజావారి విషయం ఏమైంది? ఏమైనా విన్నావా?'

'వెంకన్న చెప్పేడండి.' తెల్లబోయేడు నాయని. సుబ్బన్న తనవైపు మూడకుండావుండా లని వెనక్కు తిరిగేడు.

'ఆ రాత్రివేళ మిమ్మల్ని కంది చేలదగ్గర చూచేనన్నడండి.'

'నన్నా! పొరపడ్డాడేమో! అసాయంత్రం అసలు నేను ఇల్లువదలందే. నాలానే ఉండే ఇంకొకళ్ళని ఎవరినైనా చూచేడేమో!' ఆగేడు. తనలోవుండే ఖంగారు తనకి తలవంపు చేస్తోంది. ఎంత అదరా బాదరా పడుతున్నాడో తట్టింది.

'అనవసరమైన గాలివార్తలు పుట్టించవద్దని వెంకన్నతో చెప్పు. లేకపోతే నేనే వెంకన్నని-'

'అందరితోటి అప్పుడే చెప్పేసేడండి'

ఉద్వేగంను కుక్కుకోలేక బాధపడ్డాడు. జీవితంలో మొట్టమొదటిసారి యుద్ధంలోకి వెళ్ళ వలసినసమయం జ్ఞాపకం వచ్చింది. ఆరోజు ఆరాటం చిమ్మింది ఇప్పుడూ.

'స్కూలుచుట్టూరా వున్న వాళ్ళందరూ ఎరు గుదురు. హెడ్ కాన్‌స్టేబిల్ గురవయ్యకూ తెలుసు. పైగా సర్కిల్, డి. యస్. పి ఇవ్వాళ కారులో వస్తారుటండి'

'రాజా ఎల్లా చచ్చేడో వీళ్ళకు అనుమానం లేదా!'

'నేను వినలేదండి'

'అయితే జానీనిగురించి రాజాకి మనకి ఉండే దెబ్బలాట వాళ్ళకు తెలుసా?'

'నన్ను ఎవరూ ఏం అడగలేదండి ఇంత వరకూ'

'అయితే నువ్వు అడిగినా చెప్పకేం. వింటే నన్నుకూడా అందులో కలుపుతారు' యూదా లాఘవంగా అనాలంటే రాలేదు.

తెల్లబోయేడు సుబ్బన్న. 'ఇంతవరకూ అబద్ధం చెప్పలేదండి. దేవుడు శిక్షిస్తాడండి. అడి గితే చెప్పకుండా ఎల్లా వుంటాను'

కుర్చీలోనుండి లేచి, నాయని చిరాకుగా ఇటూ అటూ పచారుచేసేడు. సుబ్బన్న తత్వం భీకరంగా ఉచ్చులు వేస్తున్నట్టువుంది. 'అయితే నేను రాజాని ఖూనీచేసేనని నువ్వు నమ్ము తున్నావా?'

అచేతనంగా ఉండి, నెమ్మదిగా 'మీరు ఏం చెప్పలేదే' అన్నాడు సుబ్బన్న.

'నేనుచెయ్యలేదు. విన్నావా సుబ్బన్నా. నాకు తెలియదు. నేను నిజంగా అతన్ని చంపా లనే అక్కడకి వెళ్ళే; ఉత్తరంచూచిన తర్వాత. కాని చచ్చే అక్కడ అతను ఉన్నాడు. కిటికీ క్రిందుగా. సుబ్బన్నా, నన్ను నమ్ముతావా?'

హృదయం తేలిక పడినట్టు అయ్యింది సుబ్బ న్నకి. 'మీరు ఎప్పుడూ నాతో అబద్ధం చెప్ప లేదు. నేను నమ్ముతా. మొట్టమొదట అనుకునా-'

తలూపేడు నాయని.

'చంపడం అన్నది ఎంత క్రూరంగా శిక్షి స్తుందో మీరుచూచేరా! మీదుర్మార్గానికి శిక్ష అనుభవించేరుకా.'

'శిక్షా!'

'మీమనస్సు మిమ్మల్ని కాల్చేయలేదూ? అదే!'

'సుబ్బన్నా! ఎవరైనా ప్రశ్నిస్తే చెప్పకూ- జానీసంగతి, నేనువెళ్ళడం అదీని. ఇంతకంటె చిన్నచిన్న విషయాలకే మనుష్యుల్ని ప్రభుత్వం ఉరితీసింది.అయినా నేను ఖూనీ చెయ్యనేలేదు.'

సుబ్బన్న వెళ్ళడం నాయనికి కొద్దితేలిక నిచ్చింది. అతను చెప్పిన శిక్ష సమంజసంగానే ఉంది. తను ఓవిధంగా దోషే! మానసికంగా రాజాని ఖూనీ చేసేడు. అయినా అది క్రియలో లోపించింది. దీనికి ప్రభుత్వంన్ను శిక్షిస్తుందా?

వాళ్లు తను రాజాగదిలోకి వెళ్లేనని గుర్తి స్తారా? తనకి ఉరిశిక్ష విధిస్తారా! సుబ్బన్న చెప్పకుండా ఉంటాడా! సందేహాలు

పిచ్చివానిగా చేసేయి. ఆ రాత్రి నిద్రరానే లేదు. ఊహాల్లో జరిగిన కాలంలో విన్న, శిక్షింపబడిన, ఖూనీలు, వాటి పరిణామాలు జ్ఞాపకం వచ్చేయి.

తెల్లవారుజామునే కన్ను మాగన్ను అయ్యింది. ఉలిక్కిపడి క్రింద చప్పుడు విని లేచేడు. కలలో తనకి నల్ల గుడ్డలు కట్టినట్టు, ఉరి త్రాడు తగిలించినట్టు కలలు గన్నాడు.

* * *

మేడ మెట్లు ఎక్కుతున్నాడు. సుబ్బన్న తలుపు దగ్గరగా వచ్చి,'బాబుగారూ! డి.యస్.పి. సుదర్శన్ వచ్చేరండి' అన్నాడు.

జరగవలసిందే జరిగిందన్న మాట. లేచేడు ఉలిక్కిపడి. 'సావిట్లో కూర్చోపెట్టు'హృదయ స్పందనం ఎక్కువై మాట తడబడింది. తను ఎంత క్రూరంగా ఇరుక్కున్నాడో!

చొక్కా తొడుక్కుని, మెట్లు దిగుతూ క్రిందికి చూచేడు. కొంజాలో పోలీసులు నుంచుని మాట్లాడు కుంటున్నారు. శరీరం వణకింది. ఓసారి గదంతా ఆఖరుసారి అన్నట్టు చూచుకుని దిగేడు.

నమస్కారాలు అయిన తర్వాత, ఎర్రగా, పొడుగ్గా ఉండే డ్రస్సులో వున్న అధికారి సుదర్శన్ 'నేను, మీ పొరుగు రాజావారి మృతి సంబంధంలో వచ్చేను.'

తలూపేడు నాయని.

'మీరిద్దరూ స్నేహితు లనుకుంటాను'

'అంత ఎక్కువగా కాదు. ఆయన తెలుసును'

'ఆఖరు సారిగా ఆయన్ని ఎప్పుడు మీరు చూసేరు?'

'ఆయన్నా- ఓ పక్షం దినాలక్రితం అను కుంటా'

'అయితే మీ యిద్దరికీ ఎక్కువ జోస్తీ లేదా?

నాయనకి అబద్ధాల్లో పెదిమి వణకింది. దాన్ని నొక్కిపట్టినా కదులుతున్నట్టే ఉంది. 'ఆయనకి నేను ఎప్పుడూ స్నేహితుణ్ణి కానండి. ఎప్పుడు ఆతనితో స్నేహం కలుపుకోవాలని నాకు ఉండేదికాదు. ఒక్కటి- ఆయన నాకు పడోసీ అంతే!'

సుదర్శన్ నవ్వేడు. నాయనికి గుండెలు బేజా రయ్యేయి.

'అయితే ఆ చనిపోయే రోజున రాజావారు మీకు ఉత్తరం వ్రాసేరు నిజమేనా?'

ఉలిక్కిపడ్డాడు నాయని. ఎవరో ఉత్తరం తీసుకువచ్చినవారు చెప్పివుంటా రనుకున్నాడు.

'జౌను. అది, అదైనా చిన్న ఉత్తరం. నిజం చెప్పాలంటే చాలా చిన్నదే.'

సుదర్శన్ తలూపుతూ 'దాన్ని మీరు చింపేసేరా?'

'ఔను' ఈ ప్రశ్న వెయ్యడానికి ఎక్కడ చిల్లు వెతుకుతున్నాడో అర్థంకాలేదు నాయనికి. ఆశ్చర్యం కల్గింది.

'రాజావారు మీ కుక్కని చంపినట్టున్నారు. దానికి మీరు చాలా ద్వేషించినారు కాబోలు'

కళ్ళుప్పగించే 'ఉ' అన్నాడు. లోపల్లోపల సుబ్బన్న రహస్యం వెల్లడి చెయ్యకుండా ఉన్నాడా? దేవుడు తనకి ఆ విషయంలో సహాయం చెయ్యాలని ప్రార్థించేడు.

జేబులోనుండి కాగితం ఒకటి తీసి మడత విప్పుతూ 'చూచేరా నాయనింగారు' ఆ ఉత్త రానికి నకలు ఇది. అద్దు కాగితంమీద ఉంది' చూపించేడు.

అది చూచి నాయని ఏదైనా చెప్పా లను కున్నాడు. ముఖంలో రక్తం తెల్లబడిపోయి మాట్లాడలేక భయంలో చిన్నశబ్దం మాత్రం చేశాడు. సుదర్శన్ నవ్వేడు. ఇది 'ఇంకా ఈతనికి ఎంత తెలుసు ' అన్న ఆందోళన కల్గించి, నాయ నిని అచేతనుణ్ణి చేసింది.

'నాయనింగారూ! మీరు ఒక్క ప్రశ్నకి సమాధానం చెప్పాలి. ఒక్కటే నన్ను అర్థం గాని ఆశ్చర్యంలో ముంచుతోంది. దానికి మీరు చెప్పగల రనుకుంటున్నా. అయితే మీరు ఆరాత్రి రాజావారి గదిలో ఏంచేసేరో చెప్ప తారా?' సుదర్శన్ కళ్లు నాయని కళ్ళని గ్రుచ్చి నట్టు చూచేయి.

. 'అది పచ్చిఅబద్ధం, క్రూరమైన అనుమానం. నే నెప్పుడూ రాజావారి ఇంటి-' నాయని నిలదొక్కుకో లేకపోయేడు.

'అయితే నాయనింగారు, మీరు మర్చి పోయారేమో! ఆ సాయంత్రం మీ తుపాకీతో కాలవగట్టువరకూ వెళ్ళేరు. అది ఆయన వ్రాసిన ఉత్తరమే సాక్ష్యం చెప్తోంది.

పైగా మా సుబ్బన్న రాజావారికి అపాయం గురించి చెప్పడానికి అక్కడకి వచ్చేడని వాళ్ళ నౌకరు చెప్పేడు'

నాయని చేతులు అచేతనంగా పీకమీదకు వెళ్ళేయి. పచ్చి వెలక్కాయ పడ్డట్టు అయింది. ఊపిరి తీసుకోడానికి భయం అయి, ఒళ్ళంతా చెమటలు పోసేయి.

'ఆ సాయంత్రం రాజావారి ఉత్తరం మీకు వచ్చింది. తర్వాత మీరు మీ ఇల్లు వదిలేరు. పొలాలకి అడ్డు పడి, రాజావారి ఇంటికి వచ్చి, కిటికీలోనుండి లోపలికి ప్రవేశించేరు. మీజోళ్ళ ఆనవాళ్ళు ఉండనే ఉన్నాయి. గుమ్మం దగ్గరే జోళ్ళను విడిచి, పడక గదిలోకి వెళ్ళేరు. లోపలికి వెళ్ళేటప్పుడే మీరు తలుపుమీద గట్టిగా గీచేరు. అది మీ రివాల్వరుతో అయి వుంటుంది. సీటి గొట్టంమీద, పక్క దుప్పటిమీద, ఎరద చేతి ముద్దరలు అంటేయి. పైగా రాజావారి చొక్కామీద కూడాను.

'ఆయన పక్కమీద లేడు. పక్క ఖాళీగానే ఉంది. కిటికీలోనుండి ఇదివరకే క్రిందపడి వున్నాడు. నేను భగవంతుని సాక్షిగా చెపుతున్నా' కుర్చీలోనుండి లేచి గట్టిగా అరిచేడు.

'ఖంగారు పడకండి. నెమ్మది. రాజావారు పక్కమీద ఉండగానే మీరు గుండెల్ని చూచేరనటంలేదు. ఆయన ఎల్లా చచ్చేరో మాకు తెలుసు.'

'మీకు తెలుసా!' నిజంగా అది ఓ పెద్ద పొలికేకే.

ఆ కిటికీ పరిసరాలుగల ఫోటోని తీస్తూ 'చూచేరు, గోడకు అంటించిన రంగుకాగితం ముక్కల లోపమే మమ్మల్ని కారణం గ్రహించేట్లు చేసింది. వాళ్ళనౌకరు చెప్పేడు- అప్పుడప్పుడు రాజావారు ఊపిరి తీసుకునే విషయంలో బాధపడేవారని. చూచేరా, ఆచిన్న చిన్న రక్తపు చుక్కలు అవి ముక్కులోనుండి పడ్డవే. ఊపిరితీయడం కష్టం అయ్యింది కనుకనే. పక్కనుండి లేచి, కిటికీ తెరచేరు; గాలి వస్తుందని. పైగా ఆరాత్రి ఎక్కువగా త్రాగి ఉన్నారేమో తూలడంవల్ల క్రింద పడిపోయేరు.'

'అయితే, నన్ను అనుమానించటం లేదు అన్న మాట' నాయనిమాటలు, కాళ్లుచేతులు కట్టి వదలినవాడి కదలికలాగే, ఒక్కుమ్మడి వచ్చేయి.

'మిమ్మల్నా- ఖూనీకా- లేదు. అయినామీరు నిజం చెప్పండి. మనం అందరంకూడా-'

'నిజంగా నేను అతన్ని' గొంతులోనుండి వచ్చింది.

'చంపాలనే వెళ్లేరు' సుదర్శన్ అందించేడు. నాయని తలూపి, కుర్చీకి అనుకుపోయేడు.

'శ్రమకి కృతజ్ఞత. దాన్నిగురించి మీరు ఇక వినరు-చెప్పి,మననం చేసుకోకండి. నా అభిప్రాయంలో ఖూనీచెయ్యాలన్న అభిప్రాయమే చాలు, చేసిననంత ఫలమూ ఇస్తుంది. నిజంగా మిమ్మల్నిచూస్తే, మీరెంత బాధపడ్డారో తెలుస్తోంది.' సుదర్శన్ సెలవుపుచ్చుకుని వెళ్లేడు.

కుర్చీలో 'వెంకటేశ్వరస్వామి! నమస్కారాలు' అంటూనే కుప్పకూలిపోయేడు, దివాన్ బహదర్ నరసింగ నాయనింగారు.

(కోబాల్డునెట్ వ్రాసినకథ ఆధారం)

# క్రైస్తవ మిషనరీల కార్యకలాపం

బి. కన్యాదార

[ఏప్రిల్ 22, 'తెలుగు స్వతంత్ర'లో మిషనరీలను గురించి అపోహలను కలిగించే వ్యాసం ఉంది. తెలిసినవారెవ్వరూ అలాంటి హితోక్తులకు చెవియొగ్గరు. కాని తెలియనివారు కొంతమంది ఉండవచ్చు. అట్టివారి విషయమయ్యే ఈ విమర్శన, ఈ సమాధానం. దీనిలో ఎక్కడైనా ఏమైనా వ్యంగ్యంగా కన్పట్టితే అది రచయిత్రిని పరిహాసించుటకుగాదు; పాఠకులు భోగట్టాతో అలసిపోకుండా ఉండుటకే —రచయిత]

'మత మేదయినా ఆర్థికవ్యవస్థ చక్కబడాలి' అని రచయిత్రి ఉద్ఘాటిస్తున్నది. అంటే ఆమె ఆర్థికవ్యవస్థకే ప్రాముఖ్యాన్నిస్తున్నది. మతంతో ఆమె కేలాటి ప్రమేయంలేదు. ఆర్థికవ్యవస్థ చక్కబడితే చాలు, మత మేదయినా తనకేం పట్టదు. అట్లని రచయిత్రి మరుక్షణంలో మత ప్రమేయం తీసికోడమెందుకు? మత ప్రచారకులు ఆర్థికవ్యవస్థను చక్కపరుస్తుంటే ఆమె సంతోషించవలసిందేగా! అట్లుగాక మిషనరీలపై దుమ్మెత్తిపోయడ మెందుకు? తానో'ప్రక్క విదేశీయులు'మిషనరీలకు అమితంగా ధనసహాయం చేస్తున్నారని, దాన్ని మతాంతరీకరణానికై ఉపయోగిస్తున్నారని చెప్తూ మరుక్షణంలో ఆర్థికంగా సహాయం చేస్తామని మోసగిస్తున్నారనడ మెందుకు? తన వాక్యాలలోనే అంతర్వైరుధ్యాలు పెట్టుకొని మిషనరీలను దూరడమెందుకు? మనవారలు ఎలక్షన్లలో డబ్బిచ్చి ఓటుకొన్నట్టు, డబ్బిచ్చి మతాంతరులనుచేస్తే నేనూ ఖండిస్తాను- కాని తమ మత సారాంశాన్ని బోధిస్తూ- అజ్ఞానంలో మ్రగ్గిపోతున్న వారికి విద్యాదానంచేస్తూ, అనారోగ్య పరిస్థితులలో ఉన్న వారికి వైద్యసహాయం చేస్తుంటే మనమెందుకు అడ్డుపడాలి? ఎన్ని విద్యాసంస్థలు, ఆస్పత్రులు మతప్రచార ప్రసక్తి లేకయే నడుపబడుటలేదు? గ్రామములలో నిమ్నజాతులమధ్య, పట్టణాలలో అదేవిధంగా మిషనరీలు విద్యా వైద్యచర్యలను జరుపుతున్నారంటే ముఖ్యంగా అవి సాంఘికాభ్యుదయానికే. నిర్బంధంగా మతాంతరులను చేస్తున్నారను అభియోగానికి నా ప్రత్యుత్తరమిది: కేథలిక్కులు ఎవరినిగాని ఆరుమాసములలో మతాంతరులను చెయ్యరు. అలాంటి తొందరపాటు, మతాంతరీకరణ లాభంలేదని వారికి తెలుసు. కొందరి విషయంలో మూడుసంవత్సరములవరకు పరీక్షాకాల ముంటుంది. ఈ పరీక్షా సమయంలో నిజంగా మతంలో చేరవలయునని ఆశ ఉన్నదని చూపితేనే మతంలో చేరగలరు. జ్ఞానస్నానమను మతగర్మచే వారిని మతంలో చేర్చుకొనెదరు. కేథలిక్కుల మత చట్టప్రకారం (Canon Law) 'ఎవరయితే తమ స్వంత బుద్ధితో, నిండు హృదయంతో జ్ఞానస్నానమివ్వమని అడిగెదరో అట్టివారికే జ్ఞానస్నానమివ్వవలెను; లేనియెడల అయ్యది నిష్ప్రయోజనం, నిరర్థకం. అతడు కేథలిక్కు కాడు' (ఆర్టికుల 7‡5-2/2). మతాంతరీకరణ అంటే నవఖాళీ అపహరణాలు, తూర్పు పంజాబు బలత్కారాలు జ్ఞప్తికి వస్తాయిగాని చట్టబద్ధమైన మతాంతరీకరణ జ్ఞప్తికిరాదు. అసలు ఆర్థికంగా మనం ఒకరి భక్తివిశ్వాసాలు స్థిరంగా కొనివేయగలమా! ఆర్థిక సహాయం పొందిన తరువాత తిరిగి తమ పూర్వమతానికి పోరా! ఎన్నాళ్లు మిషనరీలు ఆర్థికపు ఒత్తుడుగట్టలు పెట్టగలరు?

మతవిశ్వాసమే ఒకరిని స్థిరంగా మతంలో ఉంచగలదు. అసలు సామాన్య ప్రజల విశ్వాసాలను సులభంగా మార్చివేయగలమా! హిందూ మతాన్ని, సంస్కృతిని, సాహిత్యాన్ని, మంచి చెడ్డ సాంప్రదాయాలను ఇన్నాళ్లు కాపాడింది ఎవరు? పట్టణవాసులా! గ్రామస్థులయొక్క, బీదలయొక్క, విశ్వాసపు కూకటివేళ్లు మన దృష్టికి అందవు. వారు పచ్చి సనాతనులు. మహాత్ముడన్నట్లు ఏలాటి హింసవల్లనైన దేన్నీ స్థిరంగా సాధించలేము. అది నాశనానికే దారితీస్తుంది. నిర్బంధంగా ఏనాడూ ఒకరిని మతాంతరులను స్థిరంగా చెయ్యలేము. స్వేచ్ఛవల్ల, స్వాతంత్ర్యంవల్లనే దేనికైనా సుస్థిరత, శుభం. ఈ సందర్భంలో రాజ్యాంగపరిషత్తు సభ్యుల అభిప్రాయమేమిటో కొద్దిగా తెలుసుకుందాం. పండిట్ లక్ష్మీకాంత మైత్రా మతావలంబన, మత ప్రచారం అనే సూత్రం చర్చసందర్భంలో ఇలా అన్నారు. 'మతావలంబన, మత ప్రచారమూ ప్రాథమిక సత్యాలుగా పరిగణించబడకపోతే, భారతదేశం ఆధ్యాత్మిక సంపదను కోల్పోవలసివస్తుంది. క్రైస్తవులు ఇతరుల మతం మార్చడానికి ప్రయత్నించారని విమర్శలు చెయ్యబడినందుకు నేను చాలా విచారిస్తున్నాను. దీనిని మనం విశ్వసించడమంటే క్రైస్తవులందరికీ అన్యాయం చేయడమని నా అభిప్రాయం. మనదేశంలోకల్లా ఎవరికీ కష్టం కలిగించకుండా క్షమతోవని తాము పోయే నిరపాయకర ప్రవర్తకులు క్రైస్తవులే. విద్యాసంస్థల నిమిత్తమేమి, ఇతరవిధాల ప్రజల సముద్ధరణ నిమిత్తమేమి యేటా వారు కొన్ని కోట్ల రూపాయలను ఖర్చుపెడుతున్నారు. నిజంగా వారు ప్రజల మతం మార్చడానికే ఈ డబ్బును వ్యయంచేసి ఉన్నట్లయితే, ఇప్పటివరకే కొన్ని లక్షల క్రైస్తవులు మాత్రమే కారు. ఎన్నో కోట్ల మంది క్రైస్తవులు మనదేశంలో వుండేవారని చెప్పవచ్చు. (చర్చ- డిసెంబరు 6, గా. ఆంధ్రప్రభ, డిసెంబరు -.)

ఆ దినమే టి. టి. కృష్ణమాచారి మాట్లాడుతూ చర్చలో ఇలా అన్నారు: పధ్నాలుగు సంవత్సరాలకు పైగా నేను క్రైస్తవమత సంస్థలలో విద్యాభ్యాసం చేశాను. నా మతం మార్చడానికి ఎవరూ ప్రయత్నించలేదు.'

క్రైస్తవులు మతప్రచారం చేయవలయునని క్రీస్తు చెప్పాడు. తన మతాన్ని ఒక దేశానికి, ఒక జాతికి, ఒక కులానికి, ఒక వృత్తికి అని నియమించలేదు. బైబిల్లో 'మీరు భూమండల మాద్యంతంపోయి సకలజాతి జనులకు నా దివ్యసందేశాన్ని వినిపించుడు. విశ్వసించేవాడు రక్షణ పొందును. విశ్వసించనివానికి దండన విధించబడును' అని ఉన్నది (మార్కు 16-15, 16). ఈ వాక్యాలనే సుశీలగారు ఈ విధంగా వ్రాశారు: 'ఆయనను నమ్మినవారికి పరలోక రాజ్యప్రాప్తి - లేనియెడల నరకంలో త్రోయబడతారట.' ఆమె ఆగ్రహానికి అంతు లేకపోయింది. కాని ఆ పదాల అర్థమేమిటి? మన పూర్వులందరు నరకానికి పోయినట్లే! అంతకంటే వేరే అజ్ఞాన ప్రచారం మరియొకటిలేదు. ఎవరైనకాని క్రీస్తుమతమున్నదని తెలిసికొని, ఆ మతం సత్యమతమని తన సత్యాన్వేషణవల్ల కనుగొనిన అట్టివాడు తప్పక క్రైస్తవుడు కావలె. అంటే మనకు తెలిసిన సత్యాన్ని మనం అనుసరించవలె. మనం ఒకదాన్ని సత్యమని మన అన్వేషణవల్ల తెలిసికొని దాన్ని అనుసరించకపోయిన అది సత్యద్రోహం కాదా! ఎవరైన క్రీస్తు దైవమని నమ్మతాడా (చర్చిలవల్ల, మరి అనేక కారణాలవల్ల), అతడు క్రీస్తుయొక్క బోధలను నమ్మవలె. ధర్మాలను అనుసరించవలె. ఇట్లు తన అంతరాత్మ చెప్పినవన్నిటిని తూలద్రోసి, తనకు ప్రియము గలదాన్ని, సుఖకమైనదాన్ని అనుసరించిన అట్టివానికే దండన. కాని క్రైస్తవమతం తెలియక, తెలిసియు తమ మతంవల్లనే విముక్తియున్నదని విశ్వసించి ఆ మతధర్మాలను, తమ మనోసాక్షియొక్క న్యాయమైన, జ్ఞానవంతమైన నైతికప్రేరేపణలను, ఆదేశాలను అనుసరించిన అట్టివారికి తప్పక ముక్తిగలదు. పి. సుశీలగారు ఇట్టి బోధనకు ఏలాటినిరసన తెలుపుదనుకుంటారు. విద్యాధికుడైన ప్రతివాడు తన మతాన్ని గురించి కొద్దిగా ఆలోచించవలె. ఏ మతమైతే మానవస్వభావానికి విరుద్ధంగా తన నైతికధర్మాలను ఆజ్ఞాపిస్తుందో అది దైవమతం కాదని వెంటనే తెలుసుకొనవచ్చు. అట్లు పరీక్షచేసికొనే బాధ్యత మనపైన కలదు'

సాంప్రదాయాలపై మనకు భక్తి ఉండవలసిందే కాని అప్పుడప్పుడు కొంచెం పరీక్షచేస్తే లాభం ఉంటుంది. ఈవిధంగా వ్రాయుటవల్ల నేను ఏ మతాన్ని గౌరవించడంలేదు. ఇతర మతాలను న్యూనతపరచడంలేదు. నేను అడిగేది ఒక్కటే. మనమతాన్ని ఇతరుల మతాన్ని రెంటిని పరీక్ష చేయవలె. ఇతరుల మతంయొక్క విశ్వాసాలు గాని, ధర్మాలుకాని మనకు మన మతంకంటె ఎక్కువ తృప్తినివ్వకపోతే మన మతంలోనే స్థిరంగా ఉండిపోవాలి. కాని పరమత విశ్వాసాలను, మతాన్ని నిందించకూడదు. సహనాన్ని చూపవలె. ఇట్టి సహనం ఒక్క మత సంబంధం గానేకాదు, భావవిషయాలలో కూడ ఉండవలె.

'స్వర్గనరకాల భయం ప్రజల్లో కల్పించి దీని ద్వారా చాల చోట్ల మతం మారుస్తున్నారు. అమాయక ప్రజలు దీనిని నమ్ముతున్నారు!' ఆవిడకు నాటిలో నమ్మకం లేదా? ఆమె అజ్ఞేయతావాదినూ (Agnostic) లేక పూర్ణ భౌతికవాదియా (Materialist)? ఆమె స్వేచ్ఛకు, స్వాతంత్ర్యానికి మనమందరం గర్వించాలి. కాని అట్టి నూతన సిద్ధాంతము ఎంతవుంది భారతీయులకు (వారు హిందువులు గాని, మహమ్మదీయులు గాని, క్రైస్తవులు గాని) రుచిస్తోందో తెలియదు. ఆమె సిద్ధాంతానికి శ్రుతి, స్మృతుల ఆధారమున్నదేమో! సాంప్రదాయికమైన ఆధ్యాత్మిక భారతమును ప్రేమించనివారు విశాలభారత భూఖండాన్ని ప్రేమించి విగ్రహ ఆరాధకులు కావలసిందే!

'ప్రతి సంవత్సరంకంటే ఈ సంవత్సరం బ్రిటిష్ అమెరికా సామ్రాజ్యవాదులు తమ దాహం తీర్చుకోడానికి, మతం ముసుగులో మిషనరీల నెక్కువ చేసుకొని భారతదేశానికి విపరీతంగా డబ్బు ఖర్చుచేసి మిషనరీలను దిగుమతి చేయుచున్నారు. దీని ఫలితంగానే దేశం మొత్తంమీద భారీఎత్తున ప్రచారం జరుగుతోంది.'

(1) మన దేశమునకు ఎంతమంది బ్రిటిష్, అమెరికా శత్రువులు మిషనరీలు అనే బురఖాతో ఓడలనుంచి, విమానాలనుంచి, పారచ్యూటల నుంచి దిగారు? లెక్కలున్నాయా? నిషిద్ధ సాహిత్యం, ప్రమాదకర కరపత్రాలు ఏమైనా దొరికాయా! పదిమంది కలసి రహస్య సమావేశాలు జరిపి అడవులలో కుట్రలు జరుపుతున్నారా?

(2) రెండు సామ్రాజ్య దేశాలు ఏనాడూ ఒక దేశంలో శాంతంగా మనలేవు. అది చరిత్రకు విరుద్ధం. పోర్చుగీసు, డచ్చి, స్పెయిను, ఫ్రెంచి, బ్రిటిషు సామ్రాజ్యాల చరిత్ర దాన్ని తెలుపుతుంది. నేడు బ్రిటన్, అమెరికాలు తమ సామ్రాజ్య స్థాపనకు ఇండియాలో మిషనరీల ద్వారా కృషి శాంతంగా చేస్తున్నారనడం ఒక వింత. సామ్రాజ్య ప్రచారం ఉంటే తన్నులాట ఉండాలి.

(3) విపరీతంగా ఖర్చుచేస్తున్నారు! ఇది ఏ బడ్జెటులో ఉంది? ఆ శాఖ పేరేమి? దానికి మంత్రిగాని, కార్యదర్శిగాని ఎవరు? రేషను కొట్టైతినే బ్రిటను విపరీతంగా డబ్బు ఖర్చు పెడుతున్నదట!

(4) సుశీలగారి దృష్టిలో మిషనరీలందరు అమెరికా, బ్రిటనులనుండి వచ్చినవారే. ఆమె అక్కడే పొరపడింది. మనదేశంలో ఇటలీ, ఫ్రాన్సు, పోర్చుగల్, స్పెయిన్, హాలండు, బెల్జియం, యుగోస్లావియా, కెనడా, ఐర్లండ్, స్విట్జర్‌లెండ్, జర్మనీ, ఇన్ని దేశాలనుండి మిషనరీలున్నారు. మొన్నటిప్రపంచయుద్ధంలో శాంతిభద్రతలకై జర్మనీ,ఇటలీమిషనరీలను ఇండియాలో ఇన్‌టర్న్ చేసేరన్న సంగతి గుర్తుందా? మిషనరీలలో అమెరికన్, బ్రిటిష్ మిషనరీలు బహుస్వల్పం. ఒక మైనారిటీవర్గం. మనవారికి మిషనరీలనగానే విదేశీయులనుగురించి తలాపుపోతుంది. స్వదేశమిషనరీలు, గురువులులేరా? వారిసంఖ్య విదేశీయులకంటె అత్యధికమని పి. సుశీలగారికి తెలియదేమో!మిషనరీ కార్యక్రమం ఈ నాటిదికాదు. అమెరికా,బ్రిటనులు పుట్టకముందే ఈ కార్యక్రమం మనదేశంలో ఉంది. మొదటి మిషనరీలు యూరోపియనులుగారు; ఆసియావాస్తవ్యులు; పాలస్తీనాదేశస్థులు. మిషనరీలను అమెరికా బ్రిటన్‌లతో జోడించడం చోద్యం.

(5)అమెరికా, యూరపుఖండపు రాజ్యాలు నేడు లౌకికరాజ్యాంగాన్ని కలిగియుండలేదా! అటువంటప్పుడు వారికి మతంతో ఏం పని? అంతేకాదు.ఆ ప్రభుత్వాలు ఆధ్యాత్మికపు నమ్మ

కాలం కలిగియున్నట్లయితే, లక్ష్యశుద్ధి, సాధన శుద్ధి అన్నది గమనించినట్లయితే నేడీ స్థితికి వచ్చియుండవు.

'మిషనరీలు మోసగించి ప్రజలను విదేశీయుల దాసులుగా చేసుకుంటున్నారు'. అంటే మతం ద్వారా క్రైస్తవులు పర ప్రభుత్వానికి దాసులౌతున్నారని భావం. విద్యాధికులైన క్రైస్తవులు,పదవులలో ఉన్న వారు, స్వాతంత్ర్య పిపాస గల గ్రామస్థులు, నిమ్న జాతులు వీరందరు కొన్ని రాజకీయవర్గాలవలె తమ దేశాన్ని పరదేశానికి అప్పగిస్తున్నారు. దేశ ద్రోహం చేస్తున్నారు; వీరు పంచమాంగ దళాలు. ఇదే సుశీలగారి ఆరోపణ.

సుశీలగారు కలలుకంటూ ఉలిక్కి పడడమా లేక వాస్తవిక స్వరూపాన్ని తెలిసికొని భయపడడమా! పటేలు మహాశయుడు ఇండియా స్వాతంత్ర్యాన్ని వెయికండ్లతో కాపాడుతున్నాడు. సుశీలగారు వృథాగా తమ శక్తిని ఇట్లాంటి వాటిలో వ్యర్థంచేయక నిర్మాణాత్మకమైన దేశ సేవలో ఎక్కువగా ఉపయోగిస్తే దేశం అభివృద్ధి చెందుతుంది.

చరిత్ర తిరగవేస్తే క్రైస్తవుల దేశభక్తి బయట పడుతుంది. స్పెయిను బ్రిటనుపై నౌకా దండయాత్ర చేసినప్పుడు బ్రిటనులోని కేథలిక్కులు తమ ప్రొటెస్టెంటు రాణి చుట్టూ నిలబడి పోరాడలేదా (అందులో స్పెయిను క్యాథలిక్కు దేశం)? ఐర్లండు (కేథలిక్కు దేశం) మూడు వందల సంవత్సరాలు బ్రిటనుతో పోరాడి మొన్న రిపబ్లిక్ కాలేదా? నిజమైన క్రైస్తవుడు తన మతాన్ని,తన దేశాన్ని పూర్ణంగా ప్రేమిస్తాడు. తన దేశాన్ని ప్రేమించి దానికై తన ప్రాణాన్ని ఇవ్వవలయునని క్రైస్తవులు బోధిస్తారు. నా దేశానికి ద్రోహం చెయ్యమని ఎవరైనా నన్ను అడిగితే-నా ప్రభుత్వం అనుజ్ఞ ఇచ్చేటట్టయితే, నైతిక సూత్రాలు అనుమతి తెలిపేటట్టయితే- ఒక్క వేటున నరికివేస్తాను. మిషనరీలు ఇండియాలో ముప్పై, నలభై సంవత్సరాలు పనిచేసి ఇచ్చటనే చనిపోయెదరు. వారికి ఇండియా దత్తదేశం. అప్పుడప్పుడు తమ బంధువులను చూచుటకు ఇంటికి పోయినప్పటికి అచ్చట కొన్ని నెలలకంటె ఎక్కువ ఉండరు. ఇంటివద్ద అంతా వారికి నూతనంగా వుంటుంది. మరల తమ దత్తదేశానికి వచ్చినప్పుడుగాని వారికి మనశ్శాంతి ఉండదు. ఇది కల్పనకాదు. ఊహకాదు.ఏసామ్రాజ్యవాదులు వారికి స్మారక చిహ్నాలుకట్టలేదు.అట్టిస్మారక చిహ్నాలకై వారు రాలేదు. వారికి లభించేది ఏమిటి? ఒక చిన్న ప్రార్థన ఆత్మశాంతికై. కాని వారి త్యాగం, మానవసేవ, సత్యమని నమ్మినదాన్ని ప్రచారంచేసిన సుగుణం వారివెంట వెళ్లను. ఇదే మిషనరీలు ఇంతకాలంచేసిన ద్రోహాచర్య! నేడు చేస్తున్నది.

పి. సుశీలగారి మతప్రసక్తిని ఆమె వ్యాసంలో నుంచి వేరుచేసిన ఇక మిగిలేది ఆమె ఆర్థిక ఆవేదన. నిమ్నజాతులయొక్క, మరి తక్కిన బీదలయొక్క దుస్థితిని గుర్తించినందులకెంతయో హర్షించవలసిందామెను. స్త్రీలకు కార్యశూరత్వమంచే ఆపేక్ష. అందువల్ల సుశీలగారు ఓ ప్రక్క ప్రభుత్వాన్ని అర్థిస్తూ, మరో ప్రక్క వ్యక్తిగతంగా నిర్మాణాత్మక కృషిని అవలంబించుమని మనం నమ్మట కెంతయో ఆస్కారమున్నది. అట్టి కార్య క్రమంలో నా సానుభూతి తప్పక ఉన్నది. పేదల సేవకయ్యే నేనూ నాజీవితాన్ని అంకితం చేసుకున్నాను.

మన మతంవీడి కొందరు పరమత ఆలింగనాన్ని చేసినప్పుడు ఆ క్షణంలో మనం ఆగ్రహావేశులమవుతాం. అది సహజం.ఇతరుల భావస్వాతంత్ర్యాన్ని మనమెందుకు తూలనాడవలె? ఒకరాజకీయవర్గాన్నుంచి మరియొక వర్గంలోచేరితే దాన్నిగురించి మరి ఏమైన ఆక్రోశిస్తామా! ఎన్నైన నీతులు చెప్పవచ్చు. కాని సమయం వచ్చినప్పుడు వాటిని ఆచరణలో పెట్టడం దుస్సాధం. అట్లు ఆచరణలో పెట్టువారే ధీరులు; నిజంగా తమ మృగ స్వభావాన్ని జయించినవాడు; సంకుచిత దృష్టినుండి తప్పించుకొని విశాల దృక్పథాన్ని అలవరచుకున్నవారు. నేడు మనకు అత్యావసరమైంది విషయాత్మక (Objective) నిర్ధారణ. అట్టి దృక్పథంలోనే నవ్యభారత పురోభివృద్ధి ఉన్నది.

కథానిక

# గాడిదపిల్ల కోమలం

కొడవటిగంటి కుటుంబరావు

సీతాం పదేళ్ల ముండ. దానికొక్క తాత తప్ప ఇంకెవరూ లేరు. రెండేళ్లనుంచీ అది శేషగిరి గారింట్లోనే ఉంటూ, ఏదో దానికి చేతనైన పనులు చేస్తున్నది.

శేషమ్మగారన్నట్టు, "పాపం, అర్భకం ముండ! ఏదో దిక్కు లేనిదని ఇంట్లో ఉంచుకున్నాం గాని అది పని చేసే దేమిటి? మేం చేయించుకునే దేమిటి?"

ఇందులో అబద్ధం ఏమీ లేదు. పొద్దునా సాయంకాలమూ, ఇల్లూడవటమూ, దొడ్డి వూడవడమూ, నీళ్లు చల్లడమూ, ముగ్గెయ్యటమూ, ఇంటికి కావలసిన నాలుగుచాగలు తోడటమూ, నాలుగు బట్టలూ సబ్బుపెట్టి ఉతకటమూ, నాలుగు చెంబులూ తోమి పెట్టటమూ, రెండు పూటలా నాలుగు అంట గిన్నెలూ, కంచాలూ తోమటమూ, అయ్యగారి వెంట బజారుపోయి కూరలూ, వెచ్చాలూ పట్టుకు రావడమూ తప్పిస్తే దానికి పనే లేదు. బరువైన ఇంటి పనులన్నీ శేషమ్మగారే చేసుకుంటుంది—అన్నం వండడమంటే, తినటమంటే, నీళ్లు పోసుకోవడమంటే, జడ వేసుకోవడమంటే, పూలు పెట్టుకోవడమంటే...

సీతాం రోజల్లా చేసేదేముందీ? ఏమీ లేదు. అందుచేత అది అబ్బాయిని చూసుకుంటూ ఉంటుంది. శేషమ్మగారన్నట్టు, "ఆముండ పాపాయిని చక్కగా చూసుకుంటుంది. వాణ్ణి అయిదు నిమిషాలపాటు నేనుకూడా పట్టుకోలేను. అది గంటలు గంటలు ఆడిస్తుంది. నా చేతిలోనుంచి దాని చేతిలోకి అట్టా దూకుతాడా, దాని దగ్గిర్నుంచి రమ్మంటే తల అడ్డంగా తిప్పేస్తాడు. అది పనిమీదనుండి ఒక్కక్షణం కనిపించకపోయిందా 'తీతా' అని ఇల్లెగిరిపొయ్యేట్టు శోక లేస్తాడు."

సీతాంమీద పాపాయి అపేక్ష ఎందాకా వచ్చిందంటే, వాడు చూస్తుండగా దాన్ని ఎవరూ గట్టిగా కోప్పట్టానికి లేదు. బావురుమని ఏడ్చేస్తాడు.

"లేదు, నాన్నా! అమ్మగారు నన్ను కోపం పళ్ళా!" అని అది భరవసా ఇస్తేగాని ఏడుపు మానడు.

ఇందువల్ల చిక్కేమిటొస్తున్నదంటే అయ్యగారుగాని అమ్మగారుగాని దానికి సరి అయిన శిక్షణ యిచ్చి బాగు చెయ్యటానికి లేకుండా ఉంది. అది వస్తుతహా మంచిముండే ననుకోండి. కాని పెద్దపుటక పుట్టకపోవటంవల్లా పసిముండ కావటంవల్లా పని చేసే పద్ధతులూ అవీ సరిగా తెలీవు. ఆ మాటని నెత్తిన ఒక మొట్టికాయ వేద్దామన్నా, చీపురుకట్ట వీపుమీద తిరగేద్దామన్నా లేదు-పాపాయి ఊరుకోడు!

జీతమూ భత్యమూ లేకుండా, ఇంతకూడు మాత్రం పడేసి, నోరూ వాయీ లేని అమాయిక ముండను నిత్యసేవకు నియోగించిన తృప్తి అమ్మగారికి లేకుండాపోయె—గట్టిగా దాన్ని కొట్టటానికీ తిట్టటానికీ లేని కారణంచేత.

ఇది శేషమ్మగారికి పెద్దపరీక్షే. ఎందుచేతనంటే తేళ్ళు వస్తే కొండి కత్తిరించి వాటితో శేషమ్మకు, నల్లుల్ని జాగర్తగా పట్టుకుని వీధిలో పారేసివచ్చే శేషమ్మకు, సీతాం మొహం చూస్తేనే ఒక్కొక్కసారి గొంతుపిసికి చంపి పారెయ్యాలన్నంత కోపం వస్తుంది. అది పని చేసి అలిసిపోయినట్టు కనిపించినా, తను పిలవగానే, ఎంతదూరాన ఉన్నాసరే, వెంటనే ప్రత్యక్షం కాకపోయినా, తన మనస్సులో ఉండి మాటలద్వారా బయటికిరాని ఉద్దేశాలు అది గ్రహించలేకపోయినా, దాని ఒళ్ళుగాని బట్టలుగాని శుభ్రంగా లేకపోయినా అమ్మగారికి ఛిట్టు

వచ్చేస్తుంది. సీతాంకు బియ్యే పాసయిన వాళ్ళ తెలివితేటలూ, ఋషీశ్వరుల కుండే అణిమాద్యష్ట సిద్ధులూ, కలెక్టరుగారి పిల్లకుండే పరిశుభ్రతా, ఇతరుల మనస్సు కనిపెట్టటంలో ఉత్తమకథకుల కుండే భావనాశక్తీ ఉంటే, శేషమ్మగారికి సంపూర్ణమైన ఆనందం కలుగును. ఇన్నీ ఉంటే సీతాం జీతమూ, భత్యమూ లేక శేషమ్మకు పొద్దస్తమానాలూ ఊడిగం చెయ్యదేమో కనక, శేషమ్మగారి జీవితం దుఃఖభాజనం అయేటట్టు ధాత లిఖించాడని మనం భావించుకోవాలి.

* * *

'అబ్బాయి ఏడీ?' అన్నాడు శేషగిరి.

శేషగిరి గారికి చాలా పనులు. ఆయన శరీరానికి అట్టే పనిలేకపోయినా మనస్సుకు కించిత్తయినా విశ్రాంతిలేదు. చదువుకున్నవాడూ, ఇంత కలవాడూ, ఇంకా అంత గడిస్తున్నవాడూ కనక ఆయన మనస్సు ఉన్న జీవితంతో తృప్తి పడదు.

'ఇక లక్ష రూపాయిలు ఎట్లా సంపాదించటం? ఎన్నికలు జరిగేపక్షంలో కాంగ్రెసు వాళ్ళతో పోటీచేసి మనం శాసనసభకు నిలబడితే ఎట్లాఉంటుంది? మంత్రి అయే ఛాన్సు ఏమన్నా ఉంటుందా? సుమారైన మంత్రి చాటుగా అజ్ఞాయీపున ఎంత సంపాదించుకో వచ్చు? సీతారామమ్మ దగ్గిర పడుకుంటే ఎట్లా ఉంటుంది? ఆవిడమొగుడితో తప్ప ఇంకెవ్వరితోనూ పోకుండా ఉందా? నా పెళ్లాం చచ్చిపోతే ఈసారన్నా మంచి ఏపైన మనిషి దొరుకుతుందా పెళ్ళాంగా? ఈ కమ్యూనిస్టుల్ని కాంగ్రెసువాళ్లు చంపేస్తారా, లేదా? చైనాలోలాగ వీళ్లుకూడా గెలవటం మొదలుపెడితే రష్యాలోలాగ మనవంటి వాళ్ళను కాల్చి పారేసి ఆస్తులు లాక్కుంటారో ఏమిటో! పాపాయికి నా పోలిక కొంచెమన్నా రాలేదేం? నా పెళ్లాం కేసి ఎవరు చూస్తారులే!'

ఇటువంటి ఘనమైన విషయాలను గురించి శేషగిరిగారి బుర్ర తీవ్రంగా ఆలోచిస్తూ ఉంటుంది. మధ్యమధ్య, 'పాపాయి'ని గురించి ఆసక్తి ప్రదర్శిస్తూఉంటే తన పెళ్ళాం సంతోషిస్తుందని ఆయన విశ్వాసం. అందుకని వేలు కుట్టినట్టుగా 'పాపాయి ఏడీ?' అని అడిగాడు గాని, శేషమ్మ చచ్చిపోతే ఆవిడ వెంట 'పాపాయి' కూడా పోయినా ఆయనకు అభ్యంతరంలేదు. పెళ్ళామూ, పిల్లలూ అనేవి ప్రతిబంధకాలనే దృఢవిశ్వాసం గల తాత్వికుడు శేషగిరి.

'సీతాం ఆడిస్తున్నది కామాలు' అన్నది శేషమ్మ.

శేషమ్మ ఈ మాట అంటున్నదో లేదో పాపాయి కెవ్వన అర్చాడు. 'అమ్మో!' అని కేక పెడుతూ సీతాం గొంతుకూడా వినిపించింది.

'అయ్యో, హాయ్యో! చంపేసిందండీ చంటి వెధవనీ!...ఏం చేశావే, తప్పుడు ముండా! పలకవేమే? పోయి చూడండి కాస్త!...ఎంత గుక్కపట్టాడే నా తండ్రీ!' అంటూ రొమ్ములు బాదుకుంటూ శేషమ్మ వరండాలోకి వచ్చిపడింది. ఆవిడ వెనకాలే శేషగిరికూడా రొప్పుతూ వచ్చాడు.

పాపాయి నేలమీద నుంచుని సీతాంకేసి చూస్తూ పెద్దపెట్టున ఏడుస్తున్నాడు. జలలాగా ఊరుకొచ్చే కంటినీళ్ళలో వాడి కళ్లు కూడా కనిపించలేదు. శేషమ్మ పక్షివాలినట్టు వాడిమీద వాలి పైకెత్తుకుని వాడివొళ్ళంతా ఆదరాబాదరా పరీక్షించసాగింది. వాడింకా పెద్దగుక్కపట్టాడు.

'ఏంచేశావే వాణ్ణి? బెల్లంకొట్టినరాయల్లే మాట్లాడవేం? చంపేస్తా నేమనుకున్నావో, కూచిముండా!' అని శేషమ్మ గొంతు ఎలుగరాచుకు పోయేటట్టు అరిచింది.

సీతాం తప్పు చేసినదానల్లే బాధమొహం పెట్టి, 'ఏంలేదులెండమ్మగారూ! భరవాలేదులెండీ!' అన్నది.

భరవాలేదనే మాట దాని నోటినుంచి వచ్చేటప్పటికి శేషమ్మ అగ్గి అయిపోయి, పళ్లు గట్టిగా బిగబట్టి దాని నెత్తిన ఫెడీఫెడీ అదుస్తూ, 'ఫరవాలేదు-అంటావా-తప్పుడు-ముండా! పిల్లవాణ్ణి-చంపేసి-అంటావా-అంటావా?' అని బుసలు కొట్టసాగింది.

పాపాయి ఇంకా పెద్ద శ్రుతికి వెళ్ళాడు.

'వాడికీ చెయ్యో కాలో విరిగి ఉంటుంది! వాణ్ణిదించు ముందు!' అన్నాడు శేషగిరి.

'చెయ్యో కాలూ విరుస్తుందికూడానూ! తిన్న తిండంతా ఏమవుతుంది? కూడులేని ముండను

దగ్గిరికి తీస్తే కళ్లు నెత్తికిరావూ? ఈ వెధవా సరే, దానికోసం ఏడేడుస్తాడు! అజ్ఞానపు వెధవ!' అన్నది శేషమ్మ.

ఎంత వెదికినా పిల్లాడి వొంటిమీద కొంచె మైనా గాయం కనిపించలేదు.

శేషమ్మ కొట్టిన దెబ్బలకు సీతాం పైకి చప్పుడుకాకుండా నిశ్శబ్దంగా మళ్ళీ మళ్ళీ ఏడుస్తున్నది.

పాపాయి దానికేసి చెయ్యిచూపి ఇంకా గుక్కపట్టి ఏడుస్తూనేఉన్నాడు. శేషమ్మ వాణ్ణి ఇంకా కీలూకీలూ పరీక్షిస్తూనేఉంది.

ఇంతలో శేషగిరి చిన్న కేక పెట్టాడు.

నేలమీద, సీతాం ఎడమపాదం చుట్టూ నెత్తురుమడుగు. దాని పాదమంతా నెత్తురు. ఎడమ మోకాలికి రెండంగుళాలు కిందిగా నాలు గంగుళాలమేర పరికిణీ చిరిగిపోయింది. అదంతా రక్తంమరకలు.

'ఆ నెత్తురేమిటే ?' అన్నాడు శేషగిరి.

'ఏంలేదు, అయ్యగారూ ? మేకు గీసుకుంది తలుపుమేకు' అన్నది సీతాం ఎక్కిళ్ళతో.

'అన్నీ వాట్టిదే !' అన్నది శేషమ్మ. ఈ మాట ఆవిడ దేనికన్నదో మనం సరిగా ఊహించ లేం. ఆ సమయంలో, ఆ పరిస్థితిలో సీతాం ఏమన్నా యజమానురాలైన శేషమ్మ విశ్వసించ రాదని ఒక సాంఘికసూత్రం ఉండవచ్చు. లేదా. తన ఇంటి తలుపుకు ఒక మేకున్నదని, అది ఎవరి కన్నా గాయాలు చేస్తుందనీ ఒప్పుకోవటం ఆవి డకు ఇష్టంలేకపోయి ఉండొచ్చు.

అయితే నిజం—నిక్కమాలినది—దాగదు గనక సీతాం చెప్పినమాట నిజమని తేలిపోయింది.

'నీ అజాగర్తమండా! మొద్దంటి పరికిణీ ఇస్తే అది కాస్తా చించుకున్నావా?' అన్నది శేషమ్మ, కాస్తయినా కోపంలేకుండా, సీతాంమీద జాలి ఉట్టిపడేలాగ.

ఆవిడకి నవ్వుకూడా వచ్చింది.

'ఈ భాగ్యానికి ఎంత అడావుడి చేస్తివే!' అన్న దావిడ. తాను ఎంతో నిబ్బరంగా



ఉన్నట్టూ, అడావుడంతా సీతామే చేసినట్టూ శేషమ్మగారు మనస్ఫూర్తిగా విశ్వసించింది.

తలుచుకున్న కొద్దీ ఆవిడకింకా నవ్వొచ్చింది.

'ఓసి పిచ్చికుంకా! దానికి గాయమయిందనీ వీడింతసేపూ ఏడుస్తా! చూశారా?'

'దాని గాయం సంగతేమిటి?' అన్నాడు శేషగిరి.

'ఆ, తడిగుడ్డ కట్టేస్తే అదే పోతుంది.'

* * *

అవును, ఆ ఇంటో సీతాంమీద ప్రేమఉండి, దానిబాధ సహించలేనివాడు పాపాయి ఒకడే. కాని ఈ సీతాం ఎల్లకాలం ఇక్కడ ఉండదు.

ఇవాళ కోమలంగా ఉన్న ఈ గాడిదపిల్ల క్రమంగా పెరిగి తల్లి లాగానూ, తండ్రి లాగానూ ఓండ్రపెట్టటమూ, వెనక కాళ్ళతో తన్నటమూ నేరవకపోదు.

# కొందరు వర్గనాయకుల ప్రకటనలు

తాడిమళ్ల జగన్నాధరావు

ప్రపంచంలో గొప్పవాళ్లు మూడు తరహాలుగా ఉంటారు. మొదటిరకం జన్మతః గొప్ప వాళ్లు. రెండోరకం కష్టించి ఘనతను, గొప్పతనాన్ని సంపాదించుకుంటారు. ఈ రకపు పెద్ద మనుష్యులు తమ నిర్విరామ కృషివల్ల, స్వార్థ రహిత సేవవల్ల గొప్ప కీర్తిని ఆర్జించుకుంటారు. మొదటి తరగతికి చెందిన వ్యక్తులకు ఉదాహరణగా జవహర్‌లాల్ నెహ్రూను పరిగణించవచ్చు. పేరు ప్రఖ్యాతులు గడించిన మోతీలాల్ వంశంలో జన్మించి, తన కృషివల్ల తనూ అంతటివాడయ్యాడు. రెండో తరగతికి తలమానికమైన ఉదాహరణగా గాంధీజీని పేర్కొనవచ్చును. మిగిలిన మూడోరకం - ఈ జాతికి పెద్దరికం బలవంతాన అంటకట్టబడుతుంది. వీరికి నిష్కళంక సేవ అలవాటులేదు. స్వార్థ రాహిత్యం ముందే సున్న. ఈజాతివారు ఆమాంతంగా సింహాసనం ఎక్కి కూర్చుంటారు. ఇలాటి గొప్పతనం ఆట్టే కాలం నిలువదు. వీళ్ళకు గొప్పతనం దేనివల్ల వస్తోంది అన్న ప్రశ్నకు సమాధానం చెప్పడం కష్టం. పూర్వజన్మలమీద నమ్మకంఉంటే దీనికి వారి పూర్వజన్మ సుకృతమే కారణం అని ఒక్కమాటలో చెప్పి ఊరుకోవచ్చును. సంఘానికి అసలైన మేలు, అభ్యున్నతి కలుగజేసేది మొదటి రెండురకాల మనుష్యులే. వారి స్వార్థరహితసేవ సదా వాంఛనీయం, వారి అనుపమజీవితం ఎప్పుడూ ఆదర్శప్రాయమే. దేశాభివృద్ధికి, ఉచ్ఛస్థితికి కారకులు వారే. ఇక వచ్చే చిక్కంతా మూడోతరహా మనుష్యులవల్లే.

వ్యక్తుల మాటలుకూడా వారి తరహాలుగానే వెలువడతాయి. నిజానికి వ్యక్తులు వెల్లడించే భావాలే వారికి సంఘంలో సముచితస్థానాన్ని చేకూర్చుతాయి. కొన్ని అవకతవక, అరిష్టదాయక ప్రకటనలవల్ల తాత్కాలికమైన గొప్పతనాన్ని, అధికార్యాన్ని పొందినా అది చాలా కాలం నిలువదు. అలాటి ప్రకటనలు చేసే వ్యక్తులను గొప్పవారిగా, సంఘ సేవకులుగా పరిగణించడం కష్టం. వ్యక్తులు సామాన్య వ్యవహారాలలో సహితం సజావుగా వ్యవహరించాలి, సౌమ్యంగా మాట్లాడాలి. ఈ బాధ్యత ఆవ్యక్తి అధికుడైనకొద్దీ అధికతరంగా పెరుగుతూ వస్తుంది. ఎంతబాధ్యతగల వ్యక్తి అయితే అంతబాధ్యతగా వర్తించాలి, మాట్లాడాలి. నాయకత్వం, అధికారం, పెద్దరికం గల వ్యక్తులు తాము మాట్లాడే ప్రతిమాట తూచి ఉపయోగించాలి. వారి ప్రతి ఒక్కమాటలోను అనేకకోట్ల ప్రజల ప్రాణ, ధనాలుంటాయి. వారి ప్రకటనలు బాధ్యతారహితమైనవిగా, వివేకశూన్యమైనవిగా ఉంటే ప్రజలలో అట్టి ప్రకటనలకు విలువ ఉండదు.

'నేనీనాడు హరిజనులను శాంతపరచకపోతే వారు సవర్ణ హిందువులపై దాడి జరిపేవారే. ఈ నాడు ఇక్కడ ఒక పెద్ద మతకలహం జరిగి ఉండేది'—అని మాజీ మంత్రి కూర్మయ్యగారు తాము మంత్రిగా ఉన్నప్పుడే గోదావరి స్టేషనులో రాజమండ్రి ప్రజలు తమను అగౌరవ పరచగా ప్రకటించారు. ఆ నాటి ప్రజల ప్రవర్తనకు, సవర్ణ- హరిజన కలహాలకు ముడిపెట్టబోవడం ఉచితం కాదు. నిజానికి ఆనాడు జరిగిన సంఘటన మతానికి సంబంధించినదే కాదు, దానిలో వర్గవైషమ్యాల ప్రసక్తే లేదు. ప్రకాశంగారిపై గల ప్రేమాతిశయాన్ని అణచుకోలేక ఆ నాడు ప్రజలు అల్లా ప్రవర్తించారు. మిగతా మంత్రుల విషయంలో కూడ ప్రజలు ఆరోజుల్లో అట్లే ప్రవర్తించారు. అదే స్టేషనులో ప్రజలు అంతకు కొన్నిరోజుల ముందు శ్రీ కళావారు వచ్చినప్పుడు కూడ అల్లాగే ప్రవర్తించారు. బెజవాడ స్టేషనులో

రాజన్ గారిపట్ల, మరికొన్ని పట్టణాలలో ఇతర మంత్రులపట్ల గూడ ప్రజలు ఆ దినాల్లో ప్రదర్శనాలు జరిపారు. కాబట్టి కూర్మయ్యగారు కేవలం హరిజనుడనే కారణంచేతనే ప్రజలు అల్లా ప్రవర్తించలేదు. ఆ విధంగా ఆనాడు ఆ ప్రకటన చెయ్యడం అప్పట్లో ఆస్మశాంతికై ఆ మంత్రికి ఉపయోగించవచ్చును, కాని అలాటి ప్రకటన లసలు వాస్తవమును మాత్రం కప్పలేవు.

అదే మాజీమంత్రి ఇటీవలనే మరో ప్రకటన చేశారు. 'నేను మంత్రిగా ఉన్నకాలంలో నాకు ఒక్క కాంగ్రెసుకమిటీ కూడ ఒక్క సన్మానపత్రాన్నైనా ఇవ్వలేదు. కాని సవర్ణ హిందూమంత్రులు పర్యటిస్తున్నపుడు మాత్రం అనేక సన్మానపత్రాలు ఇవ్వబడ్డాయి. కాబట్టి హరిజనులు ఎన్నికలలో బాగా పోటీచేసి కాంగ్రెసు సంస్థలో చాలా స్థానాలు ఆక్రమించుకోవాలి'- అని శ్రీ కూర్మయ్యగారు ప్రకటించారు. హరిజనులు ఉన్నతపదవుల నాక్రమించకూడదనిగాని, వారు అధికస్థానాల్ని పొందకూడదని గాని ఎవ్వరూ అనలేరు. నిజానికి ఈ నాడు కాంగ్రెసు ప్రభుత్వాలు హరిజనుల విషయంలో అనేక ప్రత్యేక శ్రద్ధలు తీసికొంటున్నాయి. హరిజనులు ఇంకా అభివృద్ధిపొందవలసిందే. అందరి వాంఛ అదే. కాని ఈ విషయానికి సన్మాన పత్రాలకు సంబంధంలేదు. సన్మాన పత్రాలు కులాల్ని బట్టి ఇవ్వబడవు. అవి వ్యక్తుల అర్హతలను బట్టి ఇవ్వబడతాయి. సంస్థలు తమకు ప్రీతిపాత్రుడు అయిన వ్యక్తికే సన్మాన పత్రాలు ఇస్తాయి. నాకు సన్మాన పత్రాలు ఇయ్యండి అని అడగవలసిన విషయంకాదు; నే సాధించిన విజయాలు అంటూ శాసనసభలో ఘనంగా చాటుకున్న ఈ మంత్రి పుంగవుడు మంత్రిహోదాలో పర్యటిస్తున్నపుడు అనేక సన్మానాలు చెయ్యవలసిందే!అందుకనే కాబోలు అందరికంటె అధికంగా ప్రభుత్వవ్యయంమీద ప్రయాణాలు సాగించారు. సన్మాన పత్రాల సందర్భంలో సవర్ణ హిందువుల ప్రసక్తి తెచ్చి తద్వారా హరిజనులలో పలుకుబడి సంపాదించుకో బూనడం శోచనీయం. ఈ విధమైన ప్రకటనలతో ప్రజలను, ముఖ్యంగా అమాయికులైన హరిజనుల్ని, ఆకట్టుకొన చూడడం విచారకరమైన విషయం. అమాయిక ప్రజల హృదయాల్లో ఇలాటి ప్రకటనలు ఎలాటి భావాల్ని రేకెత్తిస్తాయో ప్రకటనకు ముందు కొంచెం యోచించుకోవాలి. హరిజనోద్ధరణకు మార్గం ప్రకటనలు కాదు, నిరాడంబరసేవ; సన్మాన పత్రాలు వాంఛించడం సేవానిరతికి చిహ్నం కాదు.

బాధ్యతా రహితంగా మాట్లాడిన ముస్లింలీగు నాయకుల మాటలు ఎన్ని మతకలహాలకు దారితీశాయో అందరికీ తెలిసిన విషయమే. ఒకప్రకటన చేస్తున్నపుడు ఒకవర్గాన్ని రెచ్చగొట్టడం గాని, మరొక వర్గంపై నిందలు మోపడం కాని కూడదు. అల్లా ఒకవర్గాన్ని పొగడికాని. మరొక వర్గాని దూషించి గాని గౌరవం, అధికారం, గొప్పతనం పొందాలని చూడడం నిష్ఫలం. అట్టి ప్రకటనలద్వారా తాత్కాలికమైన ఆధిక్యాన్ని మాత్రమే ఒకవర్గంలో పొందవచ్చును. కాని ప్రజలు యోచనాపరులు—ప్రకటనలలోని నిజానిజాలను తెలుసుకోగలరు. వాటిలోని అంతరార్థాలు బయటపడి తీరుతాయి. అప్పుడు అట్టి ప్రకటనలు చేసినవ్యక్తి తాను పొందిన తాత్కాలిక గౌరవానికి కొన్నింతలు అగౌరవము పొందవలసివస్తుంది. కాబట్టి పదవులలో వున్నవారు ముఖ్యంగా వర్గప్రసక్తి లేని నిష్పాక్షిక ప్రకటనలు చేయడం ఉత్తమం. అట్టి ప్రకటనలే శాశ్వతగౌరవాన్ని కలుగజేస్తాయి.

ఇతని నతఁ డీడ్చు వేఱొక్కఁ డతని నీడ్చు
నంద ఱందఱు నీడ్చుకయ్యంబె జగతి
అందఱు స్వతంత్ర రాజు లూహములయందు
బానిసలకంటె బానిసల్ పనులయందు.—పానుగంటి

# చిత్రలిపి సమస్యా పరిష్కారము

మల్లంపల్లి సోమశేఖరశర్మ

అగమ్యమూ దురవబోధమూ అయిన ఈజిప్టు దేశపు ప్రాచీన చిత్రలిపిని విడదీయడానికి రోజెట్టా శిల బయలుపడిన నాటినుంచే ప్రయత్నం జరుగుటకు కారణం దానిమీది శాసనం పురాతనపు ఈజిప్టు దేశభాషలోను, గ్రీకు భాషలోను ఉండడమే. గ్రీకుభాష విద్వాంసులకు పరిచితమయినది. రెండు భాషలలోని శాసనమూ ఒకటే విషయానికి సంబంధించినదై ఉంటుందనీ, ప్రాయికముగా అవి రెండూ ఒకదాని కొకటి అనువాదాలే అయివుండవచ్చుననీ ఊహించి విద్వాంసులు పరిచితమయిన గ్రీకుశాసనము సాయముతో అపరిచితమయిన ఈజిప్షను శాసనమును విడదీయను పూనుకొన్నారు. రెండు శాసనములూ ఒకటే విషయానికి సంబంధించినవి కాకపోతే ఒకటే రాతిమీద ఎందు కుండాలి? ఈ దృష్టితో ఆ రోజెట్టా శిలను పరికించడం చేతనే అది బయలుపడిననాటినుంచీ ఈజిప్టుదేశ ప్రాచీన చిత్రలిపిని విడదీయడానికి గట్టి ప్రయత్నం జరిగింది.

ఈజిప్టుభాషాశాసనం హీరాగ్లిఫిక్ వ్రాతలోను అంటే చిత్రలిపిలోను, డెమోటిక్ వ్రాతలోను అంటే సామాన్యజనులు వ్రాసే వ్రాతలోను ఉంది. ముందుగా డెమోటిక్ వ్రాతలోని శాసనాన్ని సాధించడానికి ప్రయత్నించారు. 1802లోనే అరబ్బీభాషా పారంగతుడయిన ఫ్రాన్సు దేశీయుడు సిల్వెస్టర్ డి సాసీ (Silvester de Sacy), పారిస్ నగరంలోని స్వీడను దేశపు రాయబారివర్గానికి చెందిన స్వీడను దేశీయుడు జే. డి. ఆకర్‌బ్లాడ్ అనే వారిద్దరూ డెమోటిక్ శాసనం విడదీయడానికి కంకణం కట్టారు. డెమోటిక్ వ్రాత అంతా వంకరటింకర గీతలు. చూడడానికి అది అరబ్బీ లిపిలాగ ఉంటుంది. అందువల్ల అది అక్షరలిపే అయివుంటుందని సాసీ భావించాడు. ఆయనకూ ఆకర్‌బ్లాడుకూ గ్రీకుశాసనంలో టాలెమీ (దీనిని వ్రాయటం ప్టాలెమీ అని వ్రాస్తారు; ఉచ్చరించేటప్పుడు ప్ పలకదు - Ptolemy), బెరెనికె (Berenike), అర్సినో (Arsinoe)ల వంటి పేర్లు కనిపించినవి. ఇవి డెమోటిక్ వ్రాత శాసనంలో ఎంతెంత దూరాన ఏయే స్థలాలలో రావడానికి వీలున్నదో అంచనావేసి పరిశీలించి చూశారు. ఈవిధంగా కేవలం అంచనావల్లనే అవి రాదగ్గ స్థలాలు గుర్తించి నిర్ణయించి మొత్తంమీద ఆ పేర్లకు సరియైన డెమోటిక్ వ్రాత సంకేతాలను గుర్తించారు. ఆ పేర్లలో కొన్ని ఒక్కచోటనే కాక మరి యితర స్థలాలలోకూడా వస్తవి. వీని ననుసరించి తాము కనిపెట్టిన ఆ వ్రాత సంకేతాలు సరియైనవి అవునో కాదో పరిశీలించి చూసి ఆ పండితులు ఋజువు చేసుకొన్నారు. ఆ పేర్లలోని సంకేతాల వంటివి ఎక్కడెక్కడ వస్తవో చూసి వాటిని గుర్తించి, వాటికి తగ్గ అక్షరపు విలువ లిచ్చి, ఆ సంకేతాలు ఏయే అక్షరాలుగా పలుకునని నిర్ణయించుకొన్నారు. వీటిని అక్షరాలుగా ఉచ్చరించి మొత్తంమీద సాసీ, ఆకర్‌బ్లాడులు డెమోటిక్ శాసనం విడదీశారు. వీరి ఉభయులలో ఆకర్‌బ్లాడ్ గట్టి కృషి చేసి ఒక డెమోటిక్ లిపి అక్షరమాల తయారుచేశాడు! కాని వీటిలో పదాలకు సంకేతాలకు మార్చి ఆయన ఇచ్చిన అక్షరపు విలువలు, అంటే ప[illegible] మాత్రమే సరిపోయినవనీ ఒప్పులనీ, మిగిలినవి తప్పులనీ తరువాత పరిశోధనవల్ల తేలింది. ఎట్లయితేనేమి డెమోటిక్ వ్రాత శాసనం కొంత కాకపోతే కొంతయినా విడింది. ఎంతమాత్రమూ విడనిదల్లా హీరాగ్లిఫిక్ (చిత్రలిపి) శాసనం.

చిత్రలిపి శాసనాన్ని విడదీయడానికి ఈ కాలంలోనే మరికొందరు పూనుకొన్నారు. వారిలో ముఖ్యంగా చెప్పవలసినవా రిద్దరు: ఒకడు ఇంగ్లాండు దేశీయుడయిన థామస్ యంగ్ (Thomas Young 1773-1829); రెండవవాడు ఫ్రాన్సుదేశీయుడయిన జే. ఎఫ్. షాంపొలాఁ (Jean Francois Champollion, 1790-1832). వీరు ఉభయులూ

చాలా శాస్త్రములు చదివినవారు; లాటిన్, గ్రీకులు మాత్రమే కాకుండా హిబ్రు (యూదుల భాష), అరబ్బీ (అరబ్బుల భాష), చాల్డి (చాల్డియాదేశ భాష), సిరియక్ (సిరియాదేశ భాష), కాప్టిక్ మొదలైన అనేక భాషలు నేర్చినవారు. షాంపోలాఁ ఎథియోపియా దేశభాషలోకూడా పారంగతుడు. ఉభయులూ పేదరికంలోనుంచి పైకి వచ్చినవారే. అంతకు చాలాకాలానికి పూర్వమే అబ్బె బర్తెలెమీ (Abbe Berthelemy) జోర్గన్ జోగా (Jorgen Zoega)లు ఉపజ్ఞతో చిత్రలిపి శాసనంలోని గళ్ళలో (Cartouches) వ్రాసినవి ప్రాయికంగా రాజనామములయి వుండ వచ్చునని ఊహ చేశారని యిదివరకే చెప్పాను. చిత్రలిపి పరిష్కారంకోసం చేసిన ప్రయత్నాలలో పరిశోధకుల కుపకరించిన తొట్టతొలుకటి సాధనం ఈ యూహ. దీనిని పురస్కరించుకొని యంగ్, షాంపోలాఁలు తమ కృషి సాగించారు.

థామస్ యంగ్ ఆయూహను పురస్కరించుకొని గ్రీకుశాసనంలో వచ్చిన టాలెమీ వంటి రాజనామాలు గళ్ళలో దొరకునేమో అని పరిశీలించాడు చివరి కతడు టాలెమీ అనే రాజనామం ఒక దీర్ఘచతురస్రపు గడిలోనుంచి తీయగలిగినాడు; ఆ పేరును ఆధారంచేసుకొని ఏయే బొమ్మలు ఏయే అక్షరాలకు సంకేతాలో నిర్ణయించడానికి పూనుకొన్నాడు. ఈ విధంగానే ఫైలే అనే నగరంలోని శాసన స్తంభంమీది చిత్రలిపి శాసనంలోనుంచి ఒక గడిలో ఉన్న క్లియోపాత్రా అనేపేరును విడగీశారు పరిశోధకులు దీనిని విడదీసింది యంగ్ అని కొందరు, మిస్టర్ బంకెస్ (Mr Bankes) అని కొందరు, షాంపోలాఁ అని మరికొందరు - ఇట్లా భిన్నాభిప్రాయులయియున్నారు 1819 నాటికి థామస్ యంగ్ తాను గళ్ళలోనుంచి విడదీసిన పేర్లను అనుసరించి, ఆ పేర్లలోని ఏయే బొమ్మ ఏయే అక్షరంగా పలుకదగునో, ఏయే అక్షరానికి సంకేతమో విమర్శచేసి కేటాయించి వ్రాసుకొని తుదకు చిత్రలిపి అక్షరాల పట్టిక ఒకటి తయారు చేశాడు కాని ఇతడు ఆ చిత్ర సంకేతాల కిచ్చిన ధ్వని విలువలు చాలావరకు తప్పులని



క్లియోపాత్రా
(ఈజిప్టుదేశపు మహారాజ్ఞి)

తరువాతి పరిశోధనలవల్ల తేలిపడింది. యంగ్ ఆయా సంకేతాల కిచ్చిన ధ్వని విలువలను, అంటే ఆయా సంకేతాలు ఫలాన రీతిగా పలుకునన్న ధ్వనులతో ఇతర శాసనపాఠం విడదీయు

బోతే ఏమీ కుదరలేదు. అత డా సంకేతాలు ఏ యక్షరాలుగా పలుకుత వనుకొన్నాడో ఆ యక్షరాలుగా చదివితే ఒక్క కాప్టిక్ మాటయినా అతనికి ఆ చిత్రశాసనంలో దొరకలేదు. అతడు చేసిన అంతటి కృషిలోను ఆరు చిత్రసంకేతాల కిచ్చిన అక్షర ధ్వనులుమాత్రమే ఒప్పులనీ మిగిలినవన్నీ తప్పులనీ తరువాతికాలపు పరిశోధనవల్ల చివరికి తేలింది.

షాంపొలాం కూడా యంగ్‌లాగే అసామాన్య ప్రజ్ఞావంతుడు. చిన్ననాటినుంచీ ఈజిప్టు దేశగాథలు వినడంవల్ల ఇతడు ఈజిప్టు దేశ చరిత్ర అంటే చెవి కోసుకునేవాడు. పదమూడేళ్లు నిండకపూర్వమే ఇతడు హీబ్రు, ఎథియోపియన్, కాప్టిక్, అరబ్బీ మొదలైన భాషలలో పారంగతుడయినాడట. ఈజిప్టు దేశపు చిత్రలిపి సమస్యను గురించిన సమాచారం పదేళ్ళనాడే ఇతని చెవిని పడిందట. దానిని ఎట్లయినా సాధించాలని అతని కుతూహలం. గ్రీకు, లాటిన్, కాప్టిక్ భాషలలో ఈజిప్టును గురించి వ్రాసిందంతా బాగా చదివాడు. సిల్వెస్టర్ డి సాసీతో ఇతనికి చిన్నతనంలోనే పరిచయం. పద్దెనిమిది సంవత్సరాల ప్రాయంలోనే మైత్రి కలిసింది. ఈ ఫలితంగా చిత్రలిపి సాధించాలనే ఇతని ఉబలాటం ఇమ్మడీ ముమ్మడీ అయి పరిష్కారానికి కంకణం కట్టాడు; కాని పరిశోధకుడంటే పరమ ధనుడికే. యాచకుడనే యాచకుడికీ పొత్తు ఎక్కడో కాని కదా. షాంపొలాం చిత్రలిపి పరిష్కారానికి పని చేస్తున్నాడని తెలిసి సాసీ అతని సోదరుడితో చెప్పి అతనిని ఆ కృషినుంచి విరమింపజేయడానికి ప్రయత్నించాడట! 1812లో గ్రెనోబిల్ విశ్వవిద్యాలయంలో ప్రాచీన చరిత్ర బోధించే ఆచార్యుడయినప్పటినుంచీ ఈ చిత్రలిపి పరిష్కారంకోసం షాంపొలాం గట్టి ప్రయత్నించేశాడు. నెపోలియనుతో కూడా ఈజిప్టు వెళ్ళిన ఫ్రెంచి విద్వాంసులు ప్రకటించిన నివేదికలలోని విషయాలను, శాసన ప్రతిబింబాలను సూక్ష్మంగా చదివి పరిశీలించి పరీక్షించాడు. ఈజిప్షను చిత్రలిపిలోని ప్రతీ చిన్న శాసనపు ముక్క బాగా పరిశోధించి ఆ చిత్రలిపి సంకేతాల పరిచయం అధికంగా చేసుకొన్నాడు. గ్రీకుభాషలో అక్షరాలతో వ్రాసిన ఈజిప్షను రాజుల రాణుల పేరులు చిత్రలిపిలో అక్షరాత్మక సంకేతాలలోనే ఉండాలనే నిర్ణయానికి వచ్చాడతడు; 1818 నాటికి డెమోటిక్, హిరాగ్లిఫిక్ అక్షరాలలో ఏ దేది దేనికి దేనికి సరిపోతుందో సమానమో తెలుసుకొన్నాడు; 1821 నుంచి అతను చేసిన కృషి ఫలించింది; 1822లో ఒక్కొక్క సంకేతం, ఒక్కొక్క బొమ్మ ఏ యక్షరానికి సమానమో, ఏ సంకేతానికి ఏ యక్షరపు విలువ ఇవ్వాలో - ఆ సంకేతాల నన్నిటినీ వరసగలివారీగా విమర్శతో విడదీసి బొమ్మల అక్షరాల ఒక పెద్ద పట్టికను ప్రకటించాడు. చివరికి మొదట ఊహించినట్టే రోజెట్టా శిలమీది మూడు లిపులలోని శాసన విషయమూ ఒకటే అని తేలింది. షాంపొలాం చేసిన కృషివల్ల హిరాగ్లిఫిక్ వ్రాతలో ఉన్న కడుప్రాచీనములయిన శాసనాలు విడదీయడానికి కీలకం దొరికింది: దానితో పిరమిడ్లు, పురాతన భవనాలు, ఈజిప్షను దేవాలయాలు, సమాధులు - అన్నీ శతశతాబ్దాలు మూగవ్రతం పాటిస్తూవచ్చినవి మూగినోముకు ఉద్యాపన చేసుకుని తమ కథలను తామే స్పష్టంగా వర్ణించి చెప్పడం ఆరంభించినవి. నైలునదీతీరస్థములయిన కట్టడాలను గొంతుక విడివడి, అవి మనిషి సభ్యత పొందిన పిదప, తొట్టతొలుతటినాళ్ళ అత్యద్భుత అభ్యుదయకథను ముక్తకంఠంతో చెప్పగలిగినవి. ఈజిప్టాలజీ, అంటే ఈజిప్టుదేశ పురాతత్వ శాస్త్రమంతా షాంపొలాం చేసిన కృషిమీదనే ఆధారపడి ఉంది.

ఈజిప్షను లిపిరకాలుకూడా షాంపొలానే పరిష్కారం చేశాడు. హిరాగ్లిఫిక్ వ్రాతను గబగబా తొందర తొందరగా వ్రాయడానికి వీలు లేదు. అందువల్ల వ్రాతపుస్తకాలు, దేవాలయ పూజావ్యవహార పత్రాలు వ్రాయడానికి ఇంకోలిపి ఉంది. దీని ఇంగ్లీషుపేరు హైరేటిక్ వ్రాత (Hieratic writing). ఇదేమీ కొత్తలిపి కాదు. దేవాలయాలలోని ముసద్దీ వ్రాయసకాండ్ర, మతాచార్యుల చేతులలో తొందర తొందరగా గబగబా వ్రాయడంలో హిరాగ్లిఫిక్ (చిత్రలిపి) వ్రాత పొందినమార్పు ఇది; తొందరగా వ్రాయడానికి అనువుగా ఉండే

టుట్టు బొమ్మలలిపిలో కాలక్రమాన కలిగిన మార్పు; అంటే హైరేటిక్ వ్రాత బొమ్మల వ్రాత పరిణామమే, దాని సంకేతాల సంగ్రహీకరణం (an abbreviation of the Hiero-



హిరాగ్లిఫిక్ శాసనపాఠము



పైదాని హైరేటిక్ వ్రాత పాఠము

glyphic signs). ఇక డెమోటిక్ వ్రాత కూడా హైరేటిక్ వ్రాతలోనుంచి వచ్చినదే, కాలాంతరమున అది పొందిన పరిణామమే అని నిరూపించాడు షాంపొలాం; అనగా ఈజిప్టు దేశంలోని హిరాగ్లిఫిక్, హైరేటిక్, డెమోటిక్ వ్రాతలు క్రమంగా ఒకదానినుంచి ఒకటి పొందిన పరిణామములే, పరస్పరమూ అవి ఒక దాని కొకటి వికృతులే అని ఋజువయింది. దీని కొకవిధంగా బోధపడేటందుకు సాదృశ్యం చెప్పాలంటే మన భారతదేశపు లిపులనే తీసుకో వచ్చును. అశోకచక్రవర్తి శాసనాలలోని లిపిని బ్రాహ్మీలిపి అంటారు. ఈ బ్రాహ్మీలిపి అక్షరాలే కాలక్రమాన గుప్తవంశపు రాజులనాటికి మార్పు చెంది నాగరి అక్షరాలుగా పరిణమించినవి. ఆ గుప్తవంశంవారి నాటి ఉత్తర హిందూస్థానపు నాగరలిపే శతాబ్దుల తరబడి మార్పులు చెంది నేటి గుజరాతి, మరాటీ లిపులుగా పరిణామం చెందింది. ఈవిధంగా మన దేశంలో బ్రాహ్మీలిపి పొందిన పరిణామం ఎటువంటిదో అటువంటిదే ఈజిప్టుదేశపు ప్రాచీన చిత్రలిపి – హిరాగ్లిఫిక్ వ్రాత పొందిన పరిణామమూను. హిరాగ్లిస్ అనేది ఒక వస్తువు బొమ్మ (వస్తు చిత్రము). ఆ వస్తువు అచేతనం (ప్రాణం లేనిది) కావచ్చును, సచేతనం (ప్రాణం గలది) కావచ్చును.

షాంపొలాం ఈ వ్రాతను విడదీయడానికి ఆధారమైనవి రెండు పేరులు: 1. టాలెమీ అనే రాజు పేరు. ఇది నిజంగా తోలెమీ అని ఉచ్చరించాలి; 2. క్లియోపాత్రా అనే రాణి పేరు. ఈరెండు పేర్లూ రెండు వేరువేరు శాసనాలలో గళ్లలో దొరికినవే. టాలెమీ అన్నది చిత్ర లిపిలో ప్తోల్మిస్ అని వ్రాస్తారు. ప్తో లోని ప్ పలకగు. ఈ పేరులోని సంకేతాలు ఏడు: ప్, త్, ఓ, ల్, మ్, ఇ, స్. ఈ విధంగానే క్లియోపాత్రా అనే పేరులో తొమ్మిది సంకేతాలున్నవి. అవి ఏవంటే క్, ల్, ఇ, ఓ. ప్, ఆ, త్, ర్, ఆ. దీని ననుసరించి ఈ సంకేతాలు ధ్వన్యాత్మకములని తెలిసింది. ఈ విధంగా షాం

గడిలోని అక్షరములు

క్ ల్ ఇ ఓ ప్ ఆ త్ ర్ ఆ ?



పైవిడిగుర్తు స్త్రీనామమును దెలుపుటకు పేరు చివర వాడుట ఆచారము

పొలాం తాను తీయగలిగిన అక్షర సంకేతాలను ఇతర శాసన ప్రతిబింబాలలో వచ్చిన టాలెమీ, సీజర్ల పేర్లు అన్నిటికి వర్తింపజేసి పరిశోధించాడు. అతను ఈ రీతిని సంతత కృషి చేసి ఒకదాని తరవాత ఒకటిగా 79 గళ్ళలోని పేర్లు విడదీశాడు. ఇట్లా విడదీసి ఏ చిత్రసంకేతం ఏవిధంగా పలకాలో, దేనికి ఏయక్షరపు విలువ ఇవ్వాలో నిర్ణయించి హిరాగ్లిఫిక్ అక్షరమాల తయారుచేశాడు. అయితే ఎన్ని విడదీయగలిగినా అతను విడదీసిన

ఎన్ని గళ్ళలోని గ్రీకు, రోమను చక్రవర్తుల పేర్లే. ఈజిప్టుదేశాన్ని ఆదిమకాలంలో పాలించిన రాజులకాలంలోని వ్రాతలో కూడా ఈ సంకేతాలకు ఈ ధ్వనులే అని ఎట్లా ఋజువు చేయడం? చివరి కదీ సాధించాడు అతను.

షాంపొలా గ్రీకుల కాలానికి పూర్వపు దేవాలయంమీది చిత్రశాసనంలోని గళ్ళ ప్రతిబింబాలు రెండు సంపాదించాడు. వీటిలో ఒకదానిమీద రోజెట్టా శిలలో టోల్మెస్ పేరులోని చివరి అక్షరసంకేతమే పేరుచివర ఉండడం చూసి దానిని స్ స్ అని చదివాడు. మొదట ఒక సున్న, దానిమధ్య ఒక చుక్క ఉన్న అక్షరం రవికి (సూర్యుడికి) సంకేతం. మన దేశంలోని దానశాసన శిలలమీద కూడా చేసిన దానం ఆచంద్రార్కంగా ఉండాలనే భావానికి సూచనగా, శాసనశిలమీద ఎగువను ఇటువంటిదే సూర్యసంకేతాన్నీ చంద్రసంకేతాన్నీ చెక్కడం ఆచారం. గ్రీకు, కాప్టికు శాసనాలవల్ల అది 'ర' కు (రవికి) సంకేతమని తెలిసింది. ఇందువల్ల మొదటి చిత్రంలోని మూడక్షరాల మాటలో మొదటి (ర), చివరి అక్షరములు (స్ స్) తెలిసినవి. ఇక మధ్యసంకేతము దేనికి గుర్తు? రోజెట్టాశిలలో ఇట్టి సంకేతమే కనిపించింది. దాని తరువాత కూడా దీనిలోలాగే 'స్' వచ్చింది. అక్కడ దానికి సరిసమానమయిన పదానికి (గ్రీకు) 'పుట్టిన దినము' అన్న అర్థం సరిపోతుంది. దీని ననుసరించి ఈ సంకేతం అక్షరానికి గుర్తు కాదని. అంటే అక్షరాత్మకం కాదని తీర్మానించాడు. ఈ భావానికి సరిపోయిన కాప్టిక్ పదం ఒకటి అతనికి స్ఫురణకువచ్చింది. దానికి కనడము. పుట్టడము, సంజననము, లేదా శిశువు, బిడ్డ (mas - మస్) అని అర్థం. దానినక్కడ ఉంచి చూడగా 'రమ్సెస్స' అని ఒక మాట ఏర్పడింది. ఈ 'రమ్సెస్స' అనే పేరు ప్రాచీన ఈజిప్టుకు సంబంధించిన గ్రీకు గ్రంథాలలోని 'రమెస్సెస్' (Ramesses) అనే పేరుకు చేరికగా కనిపించి, చివరికి ఆ రెండు పేర్లు ఒకటే అని తేలింది. అతడు ఆ పేరు ఈ విధంగా విడదీయడమే కాదు, దానికి అర్థం కూడా చెప్పాడు. కాప్టిక్ భాషలో 'రమ్సెస్స' అంటే 'ర కన్న వాడు', అనగా 'ర బిడ్డ' (Child of Ra) అని అర్థం. ఈ పద్ధతిని రెండవ గదిలోని పేరుకు అన్వయించి చూశాడు. రెండవ గదిలోని మొదటిది 'ర' సంకేతం కాదు. అది ఇబిస్ (Ibis) - కొంగవంటి పక్షి. ప్రాచీన ఈజిప్టు దేశీయులు దానిని భక్తితో పూజించే వారు. మిగిలిన సంకేతాలు మొదటి గడిలో ఉన్నటువంటివే. ఇబిస్ అనేది థాత్ (Thoth) అనే దేవునికి సంకేత మని గ్రీకుల వ్రాతలవల్ల తెలుస్తుంది. కాగా, రెండవ గడిలోని పేరు 'థాత్ మ్సెస్స' అని ఏర్పడింది. దానికి కాప్టిక్ భాష ననుసరించి 'థాత్ కన్న బిడ్డ' అని అర్థం (Child of Thoth). ఈజిప్టు

హీరాగ్లిఫిక్ వ్రాత



నిలువుగా వ్రాసినది



అడ్డముగా వ్రాసినది



కుడినుంచి ఎడమవైపుకు వ్రాసే విధము



ఎడమనుంచి కుడివైపుకు వ్రాసే విధము

దేశపు పెరాలలో (Pharaohs) థత్ మోసిస్ అనే ప్రభు వొకడున్నాడు. ఈ జిప్షను రాజుల భవనాలమీది వ్రాత టాలెమీ, క్లియోపాత్రాల పేర్లలోలాగ కేవలం అక్షరాత్మకం కాదనీ, అంతవరకు చాలామంది చాలా కాలంనుంచి ఊహిస్తూవచ్చినట్టు కేవలం సాంకేతికం కాదనీ గ్రహించాడు. ఏదయినా వ్రాయవలసి వచ్చినప్పుడు ఒకటే కాలంలో ప్రాచీన ఈజిప్టుదేశీయులు మూడు రకాలయిన గుర్తులు వాడేవారు: (1) వస్తుచిత్రసంకేతాలు. ఎట్టివంటే. ఒక బింబం వ్రాసి దానిలో మధ్య చుక్క ఇస్తే అది 'ర' కు (రవికి) గుర్తు; కొంగవంటి ఇబిస్‌పక్షి 'థాత్' (దాన ?) అనే దేవునికి సంకేతం; (2) శబ్దసంకేతములు (Phonetic symbols). వీటిలో కొన్ని 'మ్స' వలె వర్ణాత్మకములు (Syllabic); (3) అక్షర సంకేతములు 'స్' వంటివి. ఈవిధంగా ఒకే శాసనంలో, ఒకే వాక్యంలో, చివరికి ఒకటే మాటలోకూడా చిత్రాత్మకములు, సంజ్ఞాత్మకములు, ధ్వన్యాత్మకములు అయిన సంకేతాలను ప్రాచీన ఈజిప్టుదేశీయులు వాడేవారని, ఈ రీతిని హిరాగ్లిఫిక్ వ్రాత చాలా చిక్కయినదనీ షాంపోలాం గ్రహించాడు. ఈ విషయం గ్రహించకపోవడం వల్లనే థామస్ యంగ్ అంతటి కృషిచేసీ, కొన్ని అక్షరసంకేతాలను కనిపెట్టీ కూడా హిరాగ్లిఫిక్ వ్రాతసమస్యను తృప్తికరంగా పరిష్కరింపలేకపోయినాడు.

షాంపోలాం కాప్టిక్ వ్యాకరణం, కాప్టిక్ శబ్దజాలం బాగావచ్చును. వీటిసాయంతో తన ప్రజ్ఞా, ప్రతిభా వినియోగించి హిరాగ్లిఫిక్ వ్రాతను విడగీసి ఒక వాక్యంలోని పరస్పర పదసంబంధం వివరించి ఒక నిర్ణీతమయిన సక్రమపద్ధతిని హిరాగ్లిఫిక్ శాసనాలు చదివాడు. అతడు ప్రాచీన ఈజిప్టుభాషకు ఒక వ్యాకరణమూ, ఒక నిఘంటువూ రచించాడు. ఇంకా ఎంతో చేయాలని ఆశతో ఉండగానే 1832 వ సంవత్సరంలో మృత్యువు అతన్ని తన్నుకుపోయింది. అతను వ్రాసిన వ్యాకరణాన్నీ, నిఘంటువునూ సాయంచేసుకొని అనేకులు తరువాత హిరాగ్లిఫిక్ శాసనాలు విడగీశారు. ఎంత అద్భుతమైనది షాంపోలాం కృషి! హిరాగ్లిఫిక్ శాసనాలు విడగీసినందువల్ల ఈజిప్టు సంస్కృతి సభ్యతలను గురించి తెలియవచ్చిన విశేషాలు మరోమాటు.



శ్రీ రాజగోపాలాచారి తిరువన్నామలైలో పాతాళేశ్వరాలయంవద్ద ప్రసాదం అందుకుంటున్న దృశ్యం.

# జనవాక్యం




సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షిక క్రింద ప్రచురిత మవుతాయి. లేఖలు స్పష్టంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

## నైజాం: బ్లాకుమార్కెట్టు

హైదరాబాదు సంస్థానంలో బ్లాకు మార్కెట్టు విపరీతమైపోతూంది. ఒక వైపు కరువు రాక్షసికి కొందరు బలి పోతుంటే, యింకొక వైపు, బెంగాల్ కరువు రోజుల్లో బెంగాలులో స్టాకు చేసినట్లు, అపరిమితమైన ధరలకు ఆహారధాన్యాలను కొని స్టాకు చేస్తున్నారు —పెట్టుబడిదార్లు. ఇలాంటి దొంగ నిల్వలను బయటికి తీయడానికి ప్రభుత్వం ప్రయత్నించినట్లే లేదు. చేసిన ప్రయత్నం ప్రకటనలతో సరిపోయింది. కార్య రూపంలో మిగిలింది సున్న.

బీదర్ జిల్లాలలో విపరీతమైన కరువు పరిస్థితి యిప్పటికే ఉంది. గడవవలసిన రోజులు చాలా ఉన్నై. మిగతా జిల్లాలు, ముఖ్యంగా వరంగల్ నల్లగొండజిల్లాలకూ యిది తప్పనట్లే ఉంది.

అసలే రజాకార్ల మూలంగా వ్యవసాయం తక్కువ; వర్షాలు సరిగ్గా లేకపోవడం; పండిన కాస్తంలో కమ్యూనిస్టులు తగలపెట్టిన పెద్ద మొత్తాలు పోగా మిగిలిందే చాలా కొంచెం. ఆ కొంచెం ఈ జిల్లాలకు చాలడమే కష్టంగా ఉంటే, వేలకొలది పల్లాలకు పర్మిట్లు యిస్తున్నారు - నైజాం ఆఫీసర్లు.

'పేనుకు పెత్తనమిస్తే ఏమౌతుందిమరి ?' వకే, బీదర్‌లో మన సోదరులు ఆకలికి అలమటిస్తున్నారు, వారికైనా తిండి దొరుకుతుంది కదా అని సంతృప్తిపడదామంటే యిక్కడనే అపరిమితమైన ధరలకు (కంట్రోలు ధరకు రెట్టింపు) పెట్టికొని, అక్కడ కంట్రోలు ధరకు అమ్ముతున్నారంటే నమ్మవచ్చా ?

రేషనింగు చాలా కొద్దిప్రాంతాల్లో అమలులో ఉంది. ఉన్నచోట్ల కూడా సరిగ్గా అమలు జరగటంలేదు. కొద్దిగా పెద్దగ్రామాల్లో నైజాం ప్రభుత్వంరోజుల్లో పెట్టిన కార్పొరేషన్ చౌక దుకాణాలు కూడా సరిగ్గా నడవటంలేదు. కోటా చాలాతక్కువ. అందులో సగం బ్లాకుమార్కెట్టు. ఇంక ప్రజలకు ఎంతవరకు అందుతుంది ? ఈ విధంగా కరువు నాపటానికి కరువు తెచ్చే పద్ధతులూ, బ్లాకుమార్కెట్ అరికట్టేబదులు వృద్ధి చేసే ప్రణాళికలూ తయారుచేసి ప్రభుత్వం ప్రజలకు ఆహారం సప్లయిచెయ్యగలదా ?

కరువు నాప తలచుకుంటే, బ్లాకుమార్కెట్లో ఉన్న వేలకొద్ది పల్లాలు వెంటనే ప్రభుత్వం స్వాధీనపర్చుకొని, చట్టవిరుద్ధంగా స్టాకు చేసిన వారిని కఠినంగా శిక్షించాలి. అప్పటిదాకా బ్లాకుమార్కెటు అణగదు.

గార్ల          డి. రంగ-

## తూర్పు పాకిస్తాన్ చర్య

భారత జాతీయ త్రివర్ణ పతాకతోగూడిన ప్రతీ ఒక్క చిత్రాన్ని నిషేధించడానికి తూర్పు పాకిస్తాను ఫిలిం సెన్సారు బోర్డు నిర్ణయించింది. అయితే యీ చర్యను ఖండిస్తూ, మన ప్రజానాయక ప్రభుత్వం పాకిస్తాన్ ప్రభుత్వానికి తెలియపర్చకపోవుట శోచనీయమైన విషయం.

వ్యాఘ్రేశ్వరం      సుసర్ల బలరామమూర్తి

# తెలుగు స్వతంత్ర
# విషయసూచిక

సంపుటి 1. సంచిక 43

శుక్రవారం, మే 27, 1949





కుమారి [illegible] ఇటీవల ఢిల్లీలోని సౌతిండియా క్లబ్ వారి వార్షికోత్సవంలో "భంగీ యువతి" నృత్యం చేసి ప్రేక్షకుల అభినందనము లందుకొన్నది.

# తెలుగు స్వతంత్ర

సంపుటి-1 సంచిక-43 | మే 27, 1949 | ప్రచురణః ప్రతి శుక్రవారం


## గ్రామ పంచాయతీలు

సార్థకమైన స్వాతంత్ర్యం పల్లెపట్టుల సౌభాగ్యంలో ప్రతిఫలించాలని ప్రముఖ రాజకీయనాయకులంతా అంగీకరిస్తారు; గ్రామపునర్నిర్మాణానికి అవలంబించవలసిన మార్గాల విషయంలో మాత్రం పరస్పర విరుద్ధమైన అభిప్రాయ ప్రకటన నాయకులకు పరిపాటి అయింది. గ్రామీణజీవనాన్ని చక్కజేసి, పల్లెటి సౌభాగ్యం పెంపొందింప చెయ్యడానికి మద్రాసు ప్రభుత్వం తయారుచేసిన బిల్లులోని ఆశయాలను వివరిస్తూ, స్థానిక స్వపరిపాలనాశాఖ మంత్రి శ్రీ కల్లూరి చంద్రమౌళి గారు గత ఆదివారంనాడు మద్రాసు రేడియో కేంద్రంనుండి ప్రసంగించారు. బిల్లు శాసనసభ ఆమోదం పొంది చట్టంగా మారిననాడు కలగబోయే సాధక బాధకాలను గురించి ప్రజానీకం నిశితంగా ఆలోచించి, తమ అభిప్రాయాలను ప్రభుత్వానికి తెలియచెయ్యడం ఎంతైనా అవసరం. బిల్లు ప్రకారం అయిదువందల జనాభా ఉన్న ప్రతిగ్రామానికీ ఒక పంచాయతీ బోర్డు ఉంటుంది. వయోజన-వోటింగుహక్కు ప్రకారం శాసనసభకు ఓటు చెయ్యడానికి హక్కుగల్గి, ఆ గ్రామానికి చెందిన ప్రతివ్యక్తికీ పంచాయతీని ఎన్నుకునే ఓటుహక్కు ఉంటుంది. ప్రస్తుతం అమలులో ఉన్న పంచాయతీలవలె కాక, కొత్తగా ఏర్పడబోయేవాటికి ఎక్కువ అధికారం ఉంటుంది. గ్రామపరిపాలనకు సంబంధించిన యించుమించు అన్ని విషయాలలోనూ పంచాయతీదే సర్వాధికారం. పంచాయతీ వసూలుచేసే పన్నులుకాక, రాష్ట్రప్రభుత్వం నుండి కొంత గ్రాంటు లభిస్తుంది. అధ్యక్షుని ఎన్నిక సభ్యులద్వారా జరగదు: ప్రాథమికమైన ఓటర్లే అధ్యక్షుని స్వతంత్రంగా ఎన్నుకుంటారు. పంచాయతీ ఆమోదించిన తీర్మానాలను అతడు అమలులో పెడతాడు ఒకవేళ అధ్యక్షుడికీ సభ్యులకూ ఏ సమస్యపైన అయినా అభిప్రాయభేదం కలిగితే, అందువిషయమైన తుదితీర్పు రాష్ట్రప్రభుత్వానిది.

పంచాయతీ అధ్యక్షుని ప్రజలే స్వతంత్రంగా ఎన్నుకుంటే, పంచాయతీ పరిపాలనలో వర్గవిభేదాలకి తావుండదని ప్రభుత్వాభిప్రాయం కావచ్చు. నేడు ప్రతిపల్లెటూరులోనూ పలుకుబడిగల వ్యక్తుల ప్రాబల్యం ఆధారంగా అక్కడిజనం వర్గాలుగా చీలి, స్పర్థలు పెంపొందించుకుంటూ, గ్రామజీవనాన్నే దుస్సహం చేయడం పరిపాటి అయింది. సాధారణంగా యీ చీలికలు ఏవైనా ఆదర్శాలను పురస్కరించుకుని ఏర్పడి

నవి కావు. కుటుంబ వైషమ్యాలూ, పట్టుదలలూ- వీటి మూలంగా కక్షలు జనించి వృద్ధిపొందుతాయి. తత్ఫలితం గానే ప్రస్తుతపు పంచాయతీ బోర్డుల చరిత్ర శోచనీయంగా పరిణమించింది. అందువల్ల పంచాయతీలకు అధికత రాధికారాలను సంక్రమింప చెయ్యడం విషయంలో దేశంలో నేడు భిన్నాభి ప్రాయాలున్నాయి. ప్రజాస్వామిక విధానంలో యింకా ఎక్కువ శిక్షణ అల వరచుకుని దేశం అభివృద్ధి చెందితేగాని స్థానిక పరిపాలన పూర్తిగా పంచాయతీలకే వదలి వేయడం అసమంజసమని కొందరి వాదన. కాని, సరియైన ప్రజాస్వామిక మార్గంలో గ్రామజీవనం వికసించాలంటే, పంచాయతీలకు ఎక్కువ బాధ్యతలు వదలి వెయ్యడమే మార్గమని కొందరి భావన. బాధ్యతలు హెచ్చయిననాడే శిక్షణ అలవడుతుంది. అటువంటి శిక్షణనుండే క్రమమైన ప్రజాస్వామిక దృక్పథం ఉదయించి ప్రజానీకం స్వపరిపాలనలో తర్ఫీదు పొందుతుంది.

స్వాతంత్ర్యం పొందిన తరువాత దేశం ఎదుర్కున్న అనేక క్లిష్టసమస్యలో ఒకటి - అని ప్రభుత్వ శాఖల్లోనూ పరిపాలనా దక్షత కల్గిన నిపుణుల కొరత. ప్రజాస్వామిక మనేది క్రమపరిణామం చెందవలసిన జీవన విధానం; లక్షల కొలదీ గ్రామాలలో, అకస్మాత్తుగా,పరిణతి చెందిన రూపంలో దానిని ఒకేనాడు ప్రవేశపెట్టగల్గడం సులభంకాదు. నిరక్షరాస్యత, మూఢవిశ్వాలు, పేదరికం నిబిడీకృతం అయివున్న నేటి పల్లెపటులలో, సంపూర్ణాధికారం గల స్వపరిపాలన ఎంతో మెంకువతో ప్రవేశపెట్ట వలసిఉంటుంది ఇంతకాలమూ పరిపాలనాధికారం ఒకేచోట కేంద్రీకృతం అయి పల్లెటూళ్ళ పునర్నిర్మాణం విస్మరింపబడిన మాట నిజం. గ్రామ పరిపాలనకు సంబంధించిన ప్రతి స్వల్ప విషయానికీ ఎక్కడో సుదూరంలోఉన్న పరిపాలనాయంత్రంపై ఆధారపడడం కాక, యిక ముందు గ్రామ భవితవ్యాన్ని తామే నిర్ణయించుకునే అధికారం స్థానికప్రజకు ఉండితీరాలి. ఈ సందర్భంలో భిన్నాభి ప్రాయాలకు తావులేదు. రాజ్యాంగ పరిషత్తు యీ సూత్రాన్ని అంగీకరించి, రాజ్యాంగ నిర్మాణంలోనే పంచాయతీల అధికారాల్ని గురించి ఒక నిబంధన పొందుపరచింది. స్థానికమైన వ్యవహారాలలో పంచాయతీ అధికారం కలిగి వుండడం సహజం. క్లిష్టతరమైన నేటి ఆర్థికవిధానంలో భూస్వామ్యం, వ్యవసాయవిధానం, ఆహారోత్పత్తి సరఫరాలు, మొదలైనవి యావద్భారత సమస్యలు కాని, స్థానికమైనవి కావు. అందువల్ల రాష్ట్రప్రభుత్వమే పై విషయాలలో ప్రణాళికలు ఏర్పరచవలసి ఉంటుంది. కొత్తరితిని పంచాయతీలు ప్రతిగ్రామంలో స్థాపించడానికి రాష్ట్రప్రభుత్వం బడ్జెటులో కొంతధనం కేటాయించకతీరదు. విశేష ధనవ్యయప్రయాసల ఫలితంగా జనించబోయే యీ పంచాయతీలు ప్రజానీకానికి నిజమైన సేవ చేయగల్గే మార్గాల్లో ప్రభుత్వం వాటిని నడిపించవలసిన అగత్యం ఎంతైనాఉంది.

# బర్మాలో అశాంతి: పొరుగుదేశాల కర్తవ్యం

రావు

సర్వస్వతంత్ర బర్మా అవతరించి సుమారు రెండు సంవత్సరాలు మాత్రమే అయింది. స్వతంత్ర ప్రతిపత్తి పొందినప్పటి నుండీ బర్మా ప్రభుత్వం అనేక బాధలను అనుభవించ వలసి వచ్చింది. స్వాతంత్ర్య ప్రాప్తికి తొలిబలిగా స్వాతంత్ర సంపాదకుడైన ఆంగ్‌సాన్‌ను, అతనితోటి మరికొందరు మంత్రులను కోల్పోవలసి వచ్చింది. ఆంగ్‌సాన్ ఆయన అనుచర మంత్రులు ఘోరంగా వధింపబడ్డారు. ఆ దుఃఖావేశాన్ని దిగమ్రింగుకొని థాకిన్‌నూ బర్మా పరిపాలన నిర్వహణకు పూనుకున్నాడు. రాజకీయంగా పరాయిదేశపు ప్రాబల్యం పోయిందన్న మాటే గాని బర్మాలోని పరిస్థితులు మటుకు సర్దుబాటు కాలేదు. స్వాతంత్ర్య సంపాదన ప్రథమదినాల్లో పరిపాలనా నిర్వహణంలో అనేకకష్టాలుంటాయి. దేశ ఆర్థికవ్యవస్థ నంతా పునర్నిర్మించుకొని దేశాన్ని స్వయంసమృద్ధం చేసికోవలసియుంది. దేశానికి ఆర్థిక స్తోమత చేకూరకముందే ప్రజల ఆర్థిక దుస్థితిని అదనుగా కొని పరిపాలనా యంత్రాన్ని తమ హస్తగతం చేసుకోడానికి వివిధ పార్టీలవారు పన్నాగాలు పన్నడం శోచనీయమైన విషయం. బర్మాప్రజల దారిద్ర్యాన్ని తొలగించడానికి ప్రభుత్వం పూనుకోవడానికిముందే కొన్నివర్గాలవారు అశాంతిని రేపడానికి పూనుకున్నారు. ఆదేసమయంలో కరెన్‌లు కూడ ప్రత్యేక రాష్ట్రవాంఛతో ప్రభుత్వంపై కత్తికట్టారు. అశాంతి వాతావరణ పరిస్థితులలో అధికారం హస్తగతం చేసికోవడానికి ప్రయత్నించే కొన్ని కమ్యూనిస్టు ప్రాబల్యంగల మతాలను ఈ సావకాశం గొప్పగా వినియోగపడింది. తెల్లకట్టీ దళాలవారుగూడ కరెన్‌లతో సూటిగా ప్రభుత్వంపై దాడిచెయ్యడం మొదలుపెట్టారు. కరెన్‌లను తృప్తిపరచడానికి ప్రధాని థాకిన్ నూ అనేకమెట్లు దిగివచ్చి వారితో రాజీ చేసికోడానికి ప్రయత్నించాడు. కాని అతని ఆశలు నేటికిగూడ ఫలించలేదు. ప్రత్యేక రాష్ట్రాన్ని ఇస్తామన్నా కరెన్‌లు మిగతా మతాలవారి ఆసరా చూచుకొని బిర్ర బిగిసి కూర్చున్నారు. కరెన్‌లకు బ్రిటిష్ టోరీల మద్దతుగూడ ఉందని వదంతి. ద్వితీయప్రపంచ సంగ్రామకాలంలో వీరు మిత్రరాజ్యాలకు సాయం చేసినందులకుగాను ఈ వర్గాలవారు కరెన్‌లపై సానుభూతి, అభిమానం చూపిస్తున్నారు. నేటివరకు ప్రభుత్వం కరెన్‌లతోటి, తెల్లకట్టీ దళాలవారితోటి యుద్ధం చేస్తూనే ఉంది. వీటన్నింటికీతోడు అరకాన్ ప్రాంతమందలిముస్లింలుగూడ విప్లవాన్ని లేవదీయజూస్తున్నారు. బర్మా ప్రభుత్వానికిది గోరుచుట్టుమీది రోకటి పోటులాగుంది. అరకాన్ ముస్లింలకు బర్మా దేశీయులకు సంబంధంలేదనీ, 18వ శతాబ్దం చివరి భాగంలో బర్మా దేశీయులచేతిలో ఓడిపోయే వరకు అరకాన్ రాజులు స్వతంత్రంగా ఉండేవారనీ, పిమ్మట 50 ఏండ్లకు అరకాన్‌ను, దిగువ బర్మాను జయించిన బ్రిటిష్‌వాళ్లు తమకు బర్మీయులతో కృత్రిమ సంబంధాన్ని ఏర్పరచారనీ వీరి వాదం. కాబట్టి వారు అరకానుకు స్వపరిపాలన కోరుతున్నారు. తూర్పు పాకిస్తాన్‌తో కలసిపోయే హ[illegible]కూడా తమకుందని వీరు వాదిస్తున్నారు. వీరితో రాజీ పడడానికి బర్మా ప్రభుత్వం శాంతి [illegible]మాలు పంపుతోంది.

ఈవిధంగా, ఏ సుముహూర్తాన్ని బర్మా స్వాతంత్ర్యాన్ని పొందిందో కాని అప్పట్నుంచి అనేక చిక్కులు కలుగుతున్నాయి. ప్రసిద్ధనాయకుల ఘోరహత్య, కమ్యూనిస్టు, దాని అనుబంధ మతాల ధిక్కరణ, కరెన్‌ల విప్లవం, అరకాన్ ముస్లిముల తిరుగుబాటు ఒకదాని వెంబడి ఒకటి దాపురించాయి. ఈసమస్య లన్నిటితోటి తన ఆర్థిక పరిస్థితిని చక్కబరచుకోడానికి వ్యవధి చిక్కడంలేదు. వీటన్నింటికి తోడు బర్మా, చైనా సరిహద్దును గూర్చికూడ బర్మా ప్రత్యేక

శ్రద్ధ వహించవలసివుంది. ఈ సరిహద్దు రక్షణ విషయమై బర్మా ప్రభుత్వము, చైనా యునైటెడ్ రాష్ట్రపాలకులు సంయుక్తరక్షణకు ఒప్పందాన్ని చేసికొన్నారని వింటున్నాం.

ఇతరదేశాల సాయంలేనిదే తనదేశపు విప్లవాలను ఎదుర్కోడం అసాధ్యమని బర్మా ప్రధాని కామన్వెల్తు రాజ్యాల సాయం అపేక్షించాడు. కామన్వెల్తు ప్రధానుల సమావేశానికి ముందు, ఇండియా, పాకిస్తాను ప్రభుత్వాలతో థాకిన్ నూ సంప్రదింపులు జరిపాడు. ఆ సంప్రదింపుల దృష్ట్యా లండన్‌లో భారత,సింహళ, బ్రిటిష్ ప్రధానుల మధ్య సంప్రదింపులు జరిగాయి. ఆయాదేశాలవారు బర్మాకు సహాయం చెయ్యడానికి అంగీకరించారు. అప్పుడే ఆయా దేశాల రాయబారులు, బర్మాప్రభుత్వం మధ్య సంప్రదింపులు జరిగాయి. బర్మాప్రధాని బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చలు జరిపేనిమిత్తం మే 28వ తారీకున బయల్దేరి లండన్ ప్రయాణం చెయ్యడానికి కూడా నిర్ణయించుకున్నాడు.

ప్రత్యేకం ఇండియాకు బర్మా అంటే అధిక శ్రద్ధ ఉంటుంది. దానికి భౌగోళిక, చారిత్రిక, ఆర్థిక, రాజకీయ కారణాలున్నాయి. 1935వ చట్టం అమల్లోకి వచ్చేవరకు ఇండియా బర్మాలు కలసే ఉండేవి. ఒకేప్రభుత్వం రెండింటి వ్యవహారాలు చూచేది. బర్మీయులు బౌద్ధులు. బుద్ధుని జన్మస్థలం మన ఇండియాయే. అనేక మంది భారతీయులు జీవనభృతికై బర్మాలో స్థిరనివాసా లేర్పరచుకొన్నారు. నేడు భారతీయులు సుమారు ఎనిమిది లక్షలవరకు బర్మాలో ఉన్నారు. భారతీయుల క్షేమదృష్ట్యా నైనా ఇండియా బర్మాపరిస్థితులను శ్రద్ధతో గమనించవలసివుంది.

బర్మాలో శాంతిభద్రతలు నెలకొల్పడానికి ఆర్థికంగా, సైనికంగా, ఆయుధాల రూపంగా బర్మా ప్రభుత్వానికి సహాయం చెయ్యడానికి ఆలోచనలు జరుగుతాయని బ్రిటిష్‌మంత్రి బెవిన్ ప్రకటించాడు. "బర్మాలోగల ఎనిమిది లక్షల భారతీయుల విషయం మనం గమనించాలి. బర్మా శాంతిభద్రతలు మనకు వాంఛనీయం. థాకిన్ నూ ప్రభుత్వమే శాంతిభద్రతలు చేకూర్చగలదు అని నా విశ్వాసం. బర్మా వ్యవహారాలలో సైనికంగా చిక్కుకోవడం మన అభీష్టం కాదు. బర్మాలో జోక్యం కలిగించు కోకుండా కేవలం మిత్రరాజ్యానికి చేయగల సహాయమే మనం చేస్తాం" అని పండిత నెహ్రూ ప్రకటించాడు. సైనికంగా చిక్కుకోడం మన అభిమతం కాదన్న నెహ్రూ వాక్యాలు, సైనికంగా సాయంచేస్తాం అన్న బెవిన్ వాక్యాలతో సరిపడడంలేదు. ఏది ఏమైనను బర్మా అంతరంగిక వ్యవహారాలలో జోక్యం కలిగించు కోకుండానే బర్మాకు సాయం చేయవలసివుంది. తన అంతరంగికపరిస్థితులను ఎదుర్కొనేవిధి పూర్తిగా బర్మాప్రభుత్వానికే వదలాలి. ఆర్థిక సహాయమే కాకుండా బ్రిటన్, పాకిస్తానులు బర్మాకు మాట సాయంకూడ చెయ్యవచ్చును. బ్రిటిష్ టోరీలు కరెన్‌లను రెచ్చగొట్టే ప్రకటనలు చెయ్యకుండా, కరెన్‌లు శాంతియుతంగా బర్మా ప్రభుత్వంతో రాజీ పడే మార్గాన్ని సూచించాలి. అటులనే పాకిస్తాన్ ప్రభుత్వం అరకాన్ ముస్లిములు బర్మా ప్రభుత్వంతో సమాధాన పడేటట్లు చూడాలి. ఈ సందర్భంలో వెనుక ఆస్ట్రేలియా విదేశాంగ మంత్రి చెప్పిన మాటలుకూడ కొంత పరిగణింపవలసివుంది. బర్మాప్రభుత్వానికి, దానిపై విప్లవం సాగిస్తున్నపార్టీలకు మధ్యవర్తిత్వం నెరపడానికి ప్రయత్నించాలి. ఇట్టి సూచననే ఇటీవల జే సి. టుల్లూ, ఆగ్నేయాసియా యుద్ధకాలపు సేనాని కూడ సూచించాడు. రంగూన్ పరిసర ప్రాంతాల్లో తప్ప తదితర ప్రాంతాల్లో బర్మా ప్రభుత్వానికి పలుకుబడి లేదని అతని వాదన. బర్మాలో శాంతి చేకూరడానికి రౌండుటేబిల్ సమావేశాన్ని ఏర్పాటు చెయ్యవలసినదిగా అతను సూచించాడు. కాని మధ్యవర్తిత్వంగాని రౌండు టేబిల్ సమావేశాలు గాని బర్మాలో రేకెత్తిన విప్లవజ్వాలలను చల్లార్చగలవని ఆశించలేము. కాబట్టి నెహ్రూ పండితుడు సూచించినట్లు బర్మా అంతరంగిక వ్యవహారాల్లో కల్పించుకోకుండా, సైనికమైన చిక్కుల్లో పడకుండా, ఆపదలో ఉన్న తోటిమిత్రదేశానికి సాయపడినట్లే కామన్వెల్తు దేశాలు బర్మాకు సహాయపడవలసివుంది.

# ప్రజ - ప్రభుత

యం. ఆర్. కృష్ణ

మద్రాసు మంత్రివర్గమును సువిశాలము చేయుటకు ఈ మధ్యన వర్గ రాజకీయ నాయకులు చేసిన ప్రయత్నాలు భగ్నమయ్యాయి. ఎడతెగని సంప్రదింపులు జరుపుతూ, శరీరాలు గగుర్పొడిచే ఉన్నతభావాలు విరివిగా ప్రకటించారు. దీనివలన ప్రజలు యథార్థాన్ని సులువుగా గ్రహించారు. శ్రీ కుమారస్వామి రాజాగారి యెన్నికపట్ల ప్రజలు ఆదినుంచీ తమ అసంతృప్తిని ప్రకటిస్తూనే వున్నారు. వారు రాష్ట్రప్రజల యిక్కట్లను నిర్మూలించలేని దుర్బలులని మంత్రివర్గ సభ్యుల పేర్లు ప్రకటించిననాడే వ్యక్తమైనది. ఇక మిగిలినవి వారు ఆశువుగా సెలవిచ్చిన అపురూప ఆదర్శాలు. వారు రాష్ట్రప్రజల హృదయాలను మారగొనడానికి చేసిన మహోపన్యాసాలు, భగ్నమైన ప్రగాహ్యావనూలను మాత్రనే లేదు. రెండుసంవత్సరాల వింతపరిపాలనతో, అసమర్థ ప్రభుత్వంతో, తమ సర్వస్వాన్నీ కోల్పోయిన పీడిత ప్రజానీకానికి శైత్యోపచారములు ఎట్లా పనికివస్తాయి? శ్రీ రాజావారు వారికి ప్రధానపదవిని అందిచ్చిన రెడ్డిగారు వశానే చక్కని యుక్తులతో, రైతులోలుకు వచనాలు యెడతెగకుండా విసురుతో, విపరీత సేనారతిని ప్రకటించుటతో రాష్ట్రప్రజలను మధ్య పెట్టచూశారనుటలో అతిశయోక్తి ఏమీవుండదు.

శ్రీరాజాగారు తామేమో శుద్ధ ప్రజాసేవాభిలాషులమని, తాము మంత్రివర్గాన్ని సువిశాలం చేయుటతో వర్గ రాజకీయాలను అధిగమించి అంతరింపజేస్తామనీ ప్రకటించారు. అసలు ముఠారాజకీయాల వరప్రసాదులే తామని గుర్తెరింగి, తమకాపదవి నిచ్చిన మహాదాతకు ద్రోహంచేయ సాహసిస్తామంటే నమ్మేటంత అమాయికులుగారీ ప్రజాకోటి!

శ్రీ రాజావారు మంత్రివర్గమును సువిశాలము చేయుటతో వర్గరాజకీయాలు అంతరిస్తాయని ప్రకటిస్తూ, డా. సుబ్బరాయను, ప్రకాశం ప్రభృతులను తమ వర్గాలనుంచి యిరువురు వ్యక్తుల నంపవలసినదిగా కోరినారు. కాని ఈ అర్థంలేని పద్ధతి ననుసరించే దెవరు? 15 వోట్ల మెజారిటీతో గెలిచిన కారణాన తాము మంత్రివర్గనిర్మాతకాగలిగినారు. కాని ఈపదవికోసం శ్రీ రాజాగారు తమ స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, ఆత్మవిశ్వాసం కూడా త్యాగం చేయవలసివచ్చి చేశారు. శ్రీ రాజావారు ఆదిలోనే సెలవిచ్చినట్లు, వారికి అర్హతకన్న, అదృష్టమే కారణమై ఈ పదవి దొరికింది. వారు దీనిని మహాప్రసాదంగా స్వీకరించారు. ప్రధాని కాకపూర్వం శ్రీరాజావారు కూడ ఒక సాధారణ శాసనసభ్యులే. ప్రజలమధ్యన తిరిగినవారే. ఇప్పుడు తిరిగి తాము వరించుకొన్న ఏడుగురి మంత్రుల పరిపాలనవల్ల తాము కూడా, ఇతర పౌరులవలె బాధపడినవారే.

ప్రకాశంగారు సమర్పించిన మెమోరాండముపై తామొక ప్రకటనచేస్తూ తాము వర్గ రాజకీయాల నెప్పుడూ గుర్తించబోమనీ, అలా గుర్తిస్తే నూతనవర్గము ఉత్పత్తి కాకమానదని సెలవిచ్చారు. తాము ఇప్పటివరకూ మంత్రివర్గ నిర్మాణంలో అవలంబించింది ముఠా రాజకీయాలే. తమ యెన్నికకు కూడ కారణమైంది ముఠా రాజకీయాలే. ముఠారాజకీయాలను అంతరింపచేయవలెనను ఆందోళనే తమకు తిన్నగా, నిజముగావుంటే తాము మంత్రివర్గ నిర్మాణంలో ప్రజాభిమతాన్ని పాటించి వుండవలసింది. కాని లోపభూయిష్ఠమైన మార్గాన్ని ఆయన కోరి అవలంబించారు. వర్గ రాజకీయాలను ఇనుమడింపజేసే కార్యకలాపాన్ని పైనవేసుకొన్నారు. ప్రకాశంగారు మంత్రులపై చేసిన ఆరోపణల నిజానిజాలతో తమకు ప్రసక్తి లేదన్నారు. కాని ఆయన సాధారణ శాసన సభ్యులుగా రాష్ట్రంలో వుండి, దుష్పరిపాలన అనుభవించి, నిజా నిజాలను గ్రహించి వుండి, తమకు ఆ విషయంలో ప్రమేయమే లేదనీ, తామెన్నుకొన్న మంత్రులు చాలా యోగ్యులనీ ప్రకటిస్తే ప్రజానీకం ఆశ్చర్యపడక మానదు. మొదటే తాము శ్రీ నాడారు చేతిలో

కీలు బొమ్మయనీ, ఆయన ఆజ్ఞలు మినహా యేమీచేయలేమనీ సెలవిచ్చి వుంటే ప్రజలు తమ సత్యసంధతనేనా మెచ్చుకొనేవారు. కాని ఆయన చల్లని మాటలతో మభ్యపెట్ట పూనుకొన్నారు. ఆ పద్ధతినే కొనసాగిస్తున్నారు.

వెనుకటి రెడ్డియారువలెనే తామూకూడా విచిత్ర ప్రకటనలు చేయడం మొదలుపెట్టారు. మంత్రి సత్తము లెవరైనప్పటికీ, ఆంధ్రరాష్ట్ర విషయం ఏమైనప్పటికీ, చెన్నపట్టణం చెయ్యిజారినప్పటికీ ప్రజలకు యే విధమైన సంబంధంలేదని, ఈ విషయాలలో కల్పించుకొనే వారల్లా ఒక్క రాజకీయవేత్తలేననీ ఆయన ప్రకటించారు. ఈ ప్రకటన చాలా విచిత్రంగా ఉన్నది. తమ రాష్ట్రం, తమ ప్రభుత్వం, తమ హక్కులు ప్రజలు యెప్పుడూ కాచుకొంటూనే వుంటారు. వోటిచ్చి సువ్వరి పాలనను కొనితెచ్చుకోలేరు. బ్రిటిష్ బానిసత్వములోని మూగ ప్రజలు కారు నేటి రాష్ట్ర ప్రజలు. వారిని అర్థంచేసుకొనే ప్రతినిధులు కరువయ్యారు. శ్రీరాజాగారు చెప్పినట్లు ప్రజలు కోరేది సుప్రభుత్వమే. అలక్ష్యసాధనకు అవసరమైన కార్యకలాపంతో ప్రజలకు సంబంధము లేదనడం అసమంజసము.

మంత్రులను వేసేనాటిలో ఈమంత్రిని వెయ్యమని, ఆ మంత్రిని వద్దని చెప్పడానికి ప్రకాశంగారెవరని ప్రశ్నించారు ప్రధాని. ఈ ప్రశ్న అర్థశూన్యమైన ప్రశ్న. ప్రజానాయకుడైన ప్రకాశం పౌరుడి హక్కులను కోల్పోలేదని ప్రధాని గుర్తించాలి. తమ బాగోగులు చూచుకొనవలసిన వారు ప్రజలు. ప్రజాభిమతానికి విరుద్ధంగా జరుగుచున్న చర్యలను ఖండించవలసిన వారు ప్రజానాయకులు. ఈ విషయాన్ని ప్రస్తుతానికే కాకుండాఆయన యెల్లప్పుడూ గుర్తుంచుకోవాలి.

ప్రకాశంగారు సమర్పించిన మెమోరాండంపై తనరిమార్కులు శ్రీరాజాగారు ప్రజలకు ప్రకటించి తీరాలి. ఇదిరహస్యంగా వుంచవలసిన పని భీతిలేని వ్యక్తికి యెన్నడూ లేదు. తానేమైన రిమార్కులు వ్రాయదలచుకుంటే అవి ప్రజలకు తెలిసి వారి అభిప్రాయాన్ని మన్నించవలసిన బాధ్యత ప్రధానిమీద పూర్తిగా వుంది.

కాంగ్రెసు అధిష్ఠాన వర్గంకూడ మూతా రాజకీయాలకు లోబడి, తమ సేవానిరతినీ, పవిత్రతను యేనాడో కోల్పోయారన్న విషయం ప్రజలకు విశదమే. కాని సంస్థను రక్షించవలసిన గురుతర బాధ్యత వహిస్తున్న కాంగ్రెసు అధిష్ఠానవర్గం, ఇప్పటికే క్షీణిస్తున్న సంస్థ భావిని దృష్టిలో ఉంచుకొని, ప్రజాభిప్రాయాన్ని పాటించి, ప్రకాశంగారి విజ్ఞప్తిపై ఉచితమైన చర్యను తీసుకొన వలసిన అవసరం వుంది. కాంగ్రెసు హైకమాండు అన్యమనస్కంగా ఈవిషయంలో ప్రవర్తిస్తే కాంగ్రెసు పతనం తప్పదు. అరాచకము తాండవించక మానదు.

ఇక-వర్గరాజకీయాల నంతం చేయవలెనని ఉబలాటపడి, యెక్కడలేని ఆందోళనా అనవసరంగా చెందుతున్న రాష్ట్రప్రధాని కొకవిజ్ఞప్తి. శ్రీ రాజాగారు ప్రస్తుత మంత్రివర్గంతో సహా వెంటనే రాజీనామానిచ్చి, వర్గరాజకీయ నిర్మూలనకు మార్గాన్ని సుగమంచెయ్యాలి. వారు నియమించిన మంత్రులలో ప్రజానురాగంగల వారొక్కరూలేరు. ఇటువంటి మంత్రులను వేసుకొన్న వారు కూడ ప్రజాహృదయాన్ని చూరగొనడానికి అవకాశాలు మృగ్యం. వెంటనే రాజీనామా నిస్తే ప్రజాసేవాభిలాష వ్యక్తమవుతుంది.

ప్రస్తుతం నూతనమంత్రులను నియమించవలసిన అవసరంలేదని, ఇంకొక యిద్దరిని తృప్తిపరచడానికే తామిస్తామన్నామనీ ప్రకటించారు ప్రధాని. అనవసరంగా ప్రజావిశ్వాసం వ్యర్థపరచడానికి తమకధికార మెవరిచ్చారో తెలియజెప్పాలి. అవసరమైన మంత్రుల నియామకం కోసము ఇంతరాద్ధాంతమేల జరగవలసి వచ్చెనో దురూహం! దీనివిషయంలో కాంగ్రెసు హైకమాండు ప్రధానివద్దనుంచి సంజాయిషీ తీసుకోవాలి.

ప్రస్తుతం రాష్ట్రాన్ని ఆవరించివున్న ఈ అసమర్థ ప్రభుత్వాంధకారంనుంచి ప్రజలను రక్షించవలసిన బాధ్యత కాంగ్రెసు హైకమాండుపై వున్నది. వెంటనే ఈ అసమర్థ పరిపాలనకు స్వస్తివాక్యం పలికి, సత్వర సుప్రభుత్వ నిర్మాణానికి ప్రజలూ, పెద్దలూ కూడి పూనుకోవాలి.

# ‘ఇంకా ఎన్నాళ్లు, ఈ పరీక్షలు?’

తాడిమళ్ల జగన్నాధరావు

సిపాయీల తిరుగుబాటు జరగడంతో బ్రిటిష్ ప్రభుత్వం మేలుకుంది. ఇండియాపై శాశ్వతాధికారాన్ని చెలాయించడానికి ఇండియనులను భాషా సంస్కృతులద్వారా వశపరచుకోవాలని తలపెట్టింది. అందుచేత పాశ్చాత్య నాగరికత, సాంప్రదాయాలు, విద్య భారతీయులమీద రుద్దింది. సిపాయీల తిరుగుబాటు జరిగిన వెన్వెంటనే విశ్వవిద్యాలయాలు, ఉన్నత న్యాయస్థానాలు స్థాపితమయాయి. ఇంగ్లీషు విద్య నేర్చినవారికే ఉద్యోగా లివ్వడం ప్రారంభించడంతో, ఉద్యోగాపేక్ష కొద్దీ అనేకులు విశ్వవిద్యాలయాల్లో చేరారు. ఆ విద్యతో పాటు దానికి అనుగుణంగా పరీక్షా పద్ధతికూడ ప్రవేశ పెట్టబడింది. అది లగాయితు విద్యార్థులు పరీక్షలలో ఉత్తీర్ణత పొందడమే తమ ఆశయంగా పెట్టుకొని విశ్వవిద్యాలయాల్లో చేరుతున్నారు.

‘భారతీయ విద్యార్థులు ఏదోవిధంగా పరీక్షల్లో ఉత్తీర్ణత పొందడాన్నే దృష్టిలో పెట్టుకున్నారు. పరీక్షలలో సఫలత పొందడానికి ఎటువంటి కృత్రిమ మార్గం అనుసరించడానికైనా వారు జంకటంలేదు. క్రమశిక్షణ ఈ విధానంతో నాశన మయింది.’ అంటూ ప్రధాని నెహ్రూ లండన్‌లో ఉపన్యసించాడు. సర్దార్ పటేలు హైదరాబాదు సందర్శించినప్పుడు, అందుకు గౌరవ సూచకంగా తాము పరీక్షలలో అపజయం పొందినా ఉత్తీర్ణులుగానే పరిగణింపబడాలని కొందరు విద్యార్థులు ఆందోళన చెయ్యడం శోచనీయమే. పరీక్షల ప్రశ్నపత్రాలు ఇటీవల అధికంగా వెల్లడి అవుతున్నాయి. గతసంవత్సరం స్కూలుఫైనల్ పరీక్షాపత్రాలన్నీ బహిరంగమయాయి. ఈ సంవత్సరం మద్రాసు విశ్వవిద్యాలయంలో అనేక ప్రశ్న పత్రాలు తెలిసిపోయాయి. ఒక్క మనరాజధానిలోనే గాదు, అనేక ఇతరప్రాంతాల్లో కూడా పరీక్షా పత్రాలు వెల్లడి అయ్యాయి. లక్నో వీధుల్లో పరీక్షా పత్రాలు అమ్మబడ్డాయి. పరీక్షా పత్రాలవిషయంలోనే కాక పరీక్షాసమయాల్లో కూడ అనేక అక్రమ మార్గాలు అనుసరింప బడుతున్నాయి. పరీక్షా భవనంలో పరిశీలకులుగా నియమింపబడిన అనేకమంది ఉపాధ్యాయుల పరిస్థితి చాలా క్లిష్టంగా ఉంటోంది. వారిని విద్యార్థులు బెదరిస్తున్నారు. అనేక పరీక్షలు పోలీసుల సహాయంతో నడుప బడుతున్నాయి. నవఖాలీలో ఇతరులు పరీక్షాస్థాన సమీపానికి రాకూడదని 144 వ సెక్షను కూడ ప్రయోగింప బడింది. పరీక్షానంతరం గూడ విద్యార్థులు అనేక అక్రమ మార్గాలను అవలంబిస్తున్నారు.

మార్కులు సంపాదించడానికి జవాబు పత్రాలను దిద్దేవారిని వివిధమార్గాల ఆశ్రయిస్తున్నారు. పరీక్షా ఫలితాల ప్రకటనానంతరం, ఉత్తీర్ణులుకాని కొందరు విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకోవడం కూడ చూస్తున్నాం. ఈ విధంగా పరీక్షల ముందు, పరీక్షలలోను, తరవాత అనేక అఘాయిత్యాలు జరుగుతున్నాయి.

దీనికి ముఖ్యకారణాలు రెండు: ఒకటి-ప్రస్తుత పరీక్షా విధానంలోని లోటు; రెండవది-ఏ ఉద్యోగానికైనా పరీక్షలలో ఉత్తీర్ణతనే ప్రాతిపదికగా పెట్టడం. పరీక్షలలో ఉత్తీర్ణత పొందడం విద్యార్థులకు జీవిత సమస్యగా పరిణమించింది. విద్యార్థి భావిజీవితమంతా తన పరీక్షా ఫలితాన్ని బట్టే ఉంటుంది. ప్రస్తుత పరీక్షా విధానంలో ఉన్న లోటుకు మూల కారణం ప్రస్తుత విద్యా విధానం. ‘అసలు లోటంతా విద్యావిధానంలోనే ఉంది. దాన్ని బట్టే పరీక్షా విధానంగూడ నిర్ణయింపబడి ఉంది. కాబట్టి విద్యార్థులు ప్రస్తుత పరీక్షా విధానంపై కత్తి కడితే లాభంలేదు; వారు ప్రస్తుతవిద్యావిధానం మారాలని వాదించాలి. ఇట్టి విద్యావిధానం ఉన్నంతకాలం డిటెన్షన్ పద్ధతికూడ ఉండక తప్పదు’ అని డాక్టర్ పట్టాభిగారు డిటెన్షన్ పద్ధతిని నిరసిస్తూ సమ్మెచేసిన విద్యార్థులకు సమాధానం చెప్పారు.

పట్టాభిగారు చెప్పినట్లు ప్రస్తుత విద్యా విధానంలోనే పెద్దలోటుం దన్న విషయం నిర్వివాదాంశం. వాస్తవికపరిస్థితులకు అనుగుణంగా దాన్ని సవరించ వలసిందే. ప్రస్తుత విశ్వ విద్యాలయాలు విద్యార్థులను గుమాస్తాలుగా తయారు చేసే ఉత్పత్తి కేంద్రాలుగా పనిచేస్తున్నాయి. తెలివి తేటలు. విజ్ఞానం సంపాదించాలని చదువుచున్న వారు బహుస్వల్పం. చదువంతా ఉద్యోగపుటాశతోటే. ఏదిచదివినా అదృష్టితోటే. ఒకవిషయం ముఖ్యమైనదా, కాదా అనే విషయం పరీక్ష పత్రాల దృష్ట్యా నిర్ణయింప బడుతుంది. నేడు వ్యవసాయ కళాశాలల్లో చదువుతున్న విద్యార్థులలో ఎందరు విద్యానంతరం వ్యవసాయం చెయ్యాలనే ఆశయంతో చదువుతున్నారు? నిజంగా జీవితంలో వ్యవసాయం చేసుకొని జీవించడం వారి ఆశయం కాదు. ఇలాగే యితరతరగతులలోకూడ ఉద్యోగసంపాదనే విద్యాభ్యాసానికి లక్ష్యం. ఆఖరికి ఈవిధమైన విద్యాధికులు నానాటికి అధికమయి, తద్వారా నిరుద్యోగ సమస్య ఏర్పడుతోంది. ఇట్టి పరిస్థితులలో కర్తవ్యం ఏమిటి? ఇట్టి విద్యావిధానం కొనసాగవలసిందేనా? ఈ విద్యావిధానం ఉన్నంతకాలం ఇట్టి పరీక్షావిధానమే ఉండవలసిందేనా? భావి జీవిత నిర్ణయానికి పరీక్షాయోగ్యతలే గీటురాయిగా పనిచెయ్యాలా? ఒకడు కష్టించి రెండు సంవత్సరాలలో ఆర్జించిన జ్ఞానం, తెలివితేటలు రెండుగంటలు జరిగే పరీక్షలో నిర్ణయింపవలసిందేనా? అనారోగ్య కారణాలచేతగాని లేక తదితర కారణాలచేతగాని ఆ రెండుగంటల కాలంలో విద్యార్థి సరిగా పరీక్షలో వ్రాయలేకపోతే అతని భావి జీవితం నాశనం కావలసిందేనా? కొన్ని ప్రశ్నలు మాత్రమే ఊహించి, వాటినే వల్లెవేసి, అదృష్టవశాత్తు పరీక్షలో వాటినే ప్రశ్న పత్రాలలో పొంది జవాబు వ్రాసిన విద్యార్థి యావత్తు పాఠ్యగ్రంథాన్ని పఠించిన విద్యార్థికంటె పరీక్షలో ఉత్తముడుగా పరిగణింప బడవలసిందేనా?—ఈప్రశ్న లన్నిటికీ జవాబు చెప్పడం సులభసాధ్యమైన విషయమైనా వాటిపరిష్కారానికి తగిన ఉపాయంమటుకు కష్టమైనది. వ్యవసాయ కళాశాలలో పెద్దపెద్ద డిగ్రీలు పొందిన వ్యక్తికన్న ఒక సామాన్య రైతు సమయోచితంగా వర్తించవచ్చును. పెద్ద ఇంజనీరింగు డిగ్రీలు సంపాదించిన వ్యక్తికన్న ఒక మామూలు కూలీ కొన్ని సందర్భాల్లో విశేషజ్ఞానాన్ని కనబరచవచ్చును. డొమెస్టిక్ సైన్సులో పెద్దపెద్ద పట్టాలను పొందిన స్త్రీకన్న ఒక సామాన్య గృహిణి గృహకృత్యాలను అధికమైన తెలివితేటలతో నిర్వహింపవచ్చును. నేటి పత్రికా నిర్వాహకులలో జర్నలిజం కోర్సులు ఏమీ చదువనివారు అనేకులు లేరా? వారు కేవలం జర్నలిజం తరగతులు చదువని కారణంగా పత్రికా నిర్వహణ కుంటుపడిపోయిందా? కాబట్టి ఉద్యోగాలకు విశ్వవిద్యాలయపు డిగ్రీలనే ప్రమాణాలుగా స్వీకరించవలసిన అవసరంలేదు. కొందరికి తాత్కాలిక ఉద్యోగాల నివ్వవచ్చు. ఆ ఉద్యోగ కాలపరిమితిలో వారి పనినిబట్టి వారిని శాశ్వతోద్యోగులుగా నియమింపవచ్చును. మరి కొందరిని ఆయా ఉద్యోగాలకు అవసరమైన ప్రశ్నలువేసి వాటికి వారిచ్చిన సమాధానాలను బట్టి ఉద్యోగాల్లో వెయ్యవచ్చును.

పెద్దపెద్ద వ్యాపారస్థులంతా డిగ్రీదారులు కాదు. కాబట్టి కొన్నితరహాల ఉద్యోగాలకు కేవలం యూనివర్సిటీడిగ్రీల ప్రసక్తి తగ్గించడంతో పరీక్షల ప్రాధాన్యం కొంత తగ్గుతుంది. ప్రస్తుత విద్యావిధానంలో పరివర్తన జరిగేలోగా పరీక్షా విధానాలను మార్చడానికి కూడ కొన్ని పద్ధతులు సూచింపబడుతున్నాయి. ఏ వారంలో బోధించిన బోధనావిషయాలపై ఆ వారాంతంలోనే పరీక్ష జరిపి అందులో అర్హతపొందినవారికే పైవారపు పాఠాలు నేర్చుకోడానికి అర్హులుగా చెయ్యాలని కొందరు సూచిస్తున్నారు. అవసరమనితోస్తే ఈ కాలపరిమితిని పక్షానికి గూడ పొడిగించవచ్చును. ఈపద్ధతి ప్రస్తుత పరీక్షా విధానాలలోట్లు కొన్ని తొలగించవచ్చును. కాని అట్టిఏర్పాటు జరిగితే విద్యార్థి పూర్తిగా ఉపాధ్యాయుని చేతులలో ఉండవలసి వస్తుంది. పరీక్షకులు తమ వ్యక్తిగత ద్వేషాలను పురస్కరించుకొని కొందరు విద్యార్థుల్ని ఉత్తీర్ణులు కాకుండ చేయవచ్చును.

ప్రస్తుతం విద్యార్థి తన పరీక్ష చదువులలో అంతగా ఆసక్తి చూపించకపోడానికి ఆ తరగతి అంటే ఆవిద్యార్థికి అభిమానం లేకపోవడం ఒక కారణం. ఉదాహరణకు ఇంటర్మీడియేట్‌లో ఉత్తీర్ణులైన అనేక విద్యార్థులు ఏదో ఒక సాంకేతిక కళాశాలలో ప్రవేశించాలని కోరుకుంటారు. కాని అట్టి కళాశాలలలో స్థానాలు తక్కువగా ఉండటంవల్ల, ఉన్న కొద్ది స్థానాల్ని అర్హతలను బట్టికాక కులాలనుబట్టి ప్రత్యేకించడంచేత, సాంకేతిక కళాశాలలలో స్థానాలు లభించడంలేదు. దానితో వారు బలవంతపు బ్రాహ్మణార్థంగా ఏ బి. ఏ. తరగతిలోనో, ఇష్టంలేని యింకేదో తరగతిలోనో చేరడం సంభవిస్తోంది. నూతనంగా చేరిన తరగతిలో ఆసక్తిలేకపోవడంతో, విద్యాబోధనయందు శ్రద్ధలేక, పరీక్షాసమయాల్లో వక్రమార్గావలంబనంతో ఉత్తీర్ణులు కావాలని చూస్తున్నారు. కాబట్టి టెక్నికల్ కళాశాలలను ఎక్కువగా పెంచితే ఈవిధమైన లోటు సద్దుబాటవుతుంది. ప్రతివిద్యార్థికి తన అభిరుచినిబట్టి విద్యాభ్యాసం పొందే అవకాశం కల్పించాలి.

# ఎన్ జీ ఓల ఉద్యోగ పరిస్థితులు

పెనుమాక రామచంద్రరావు

నాన్ గెజిటెడ్ ఆఫీసర్ల సమ్మె ముగిసి దాదాపు ఒకటిన్నర సంవత్సరమయింది. చరిత్రాత్మకమైన ఆ సమ్మెమీద అనేక మంది తమతమ అభిప్రాయాలను—సమ్మెకు అనుకూలంగాను, ప్రతికూలంగాను - యిచ్చారు. వారి వారి అభిప్రాయాలెలావున్నా ప్రభుత్వోద్యోగుల కోరిక లెవరూ అన్యాయమని త్రోసిపుచ్చలేరు. ఈ విషయంలో మాత్రం ప్రజానీకమంతా ఏకాభిప్రాయంతో ఉన్నారని ధైర్యంగా చెప్పవచ్చు. యుద్ధంవల్ల ధర లపరిమితంగా పెరగడం, ప్రజల దైనికావసరాలయిన వస్తువులు అందుబాటులో లేకపోవడంవల్ల ప్రజ లనేక బాధలు పడ్డారు - యింకా పడుతున్నారు. ముఖ్యంగా కొద్ది జీతాలు తీసికొంటున్న ప్రభుత్వోద్యోగుల పరిస్థితులు దుర్భరంగా ఉన్నవి. ప్రభుత్వమెంతో దయతో యిస్తున్న రక రకాలయిన, కొద్ది కొద్ది అలవెన్సులు ఏవిధంగానూ ఉపయోగకరంగా లేవు. ఇలాటి పరిస్థితుల్లో, ఎంతో కాలంగా పెట్టుకున్న మొరలన్నీ విఫలమై పోవడంతో, వారు సమ్మెకుపక్రమించక తప్పింది కాదు. సుమారు ఏడుదినాలవరకు జరిగిన ఈ సమ్మెను జయప్రదంకాకుండా చేయడంకోసం ప్రభుత్వమెన్నో ఉపాయాలు పన్ని, కొంత వరకు కృతకృత్యురాలయింది కూడ.

సమ్మెఫలితంగా, అనేకమంది తాత్కాలికోద్యోగులు (9, a, candidates) నిరుద్యోగులయారు. (వీరిలో చాలమంది దాదాపు నాలుగయిదు సంవత్సరాలనుండి చేస్తున్నవారు.) వీరి సంఖ్య రాష్ట్రం మొత్తంమీద దాదాపు ఇరవైవేల వరకూ ఉండవచ్చు. వీరంతా ఉద్యోగాలు పోయినప్పటినుంచి పడరానిపాట్లు పడుతున్నారు. నిరుద్యోగసమస్యనెదుర్కొనటానికి ప్రభుత్వం చేసే ప్రయత్నాలన్నీ నిరుత్సాహకరంగా ఉన్నాయి. ఉద్యోగాలిచ్చే అధికారం ఆఫీసర్లనుండి పోయి, ఇండియా ప్రభుత్వంవారు ఏర్పాటుచేసిన ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజివారి చేతిలోకొచ్చింది. అయినా వారి ఆఫీసులో ఫైళ్లు పెరుగుతున్నాయి కాని, ఉద్యోగాలు మాత్రం బహుకొద్దిమందికి మాత్రమే దొరుకుతున్నాయి.

పోతే, సమ్మెలో బయటికి వెళ్ళగొట్టబడకుండా, యింకా ఉద్యోగాలు చేస్తున్నవారి విషయం కూడ అంత తృప్తికరంగా లేదు. సమ్మెఫలితంగా, ప్రభుత్వోద్యోగుల జీతాల్లో రెండురకాల అభివృద్ధి వచ్చింది. ఒకటి నాలుగు రూపాయల యింక్రిమెంటు, రెండవది ఆరురూపాయలది. ప్రభుత్వమే ఉద్దేశంతో యిచ్చిందో, యీ చిన్నమొత్తాలు ప్రభుత్వోద్యోగుల కే

విధంగానూ చాల వసేది నిర్వివాదాంశం. కారణమేమంటే, ఆ నాలుగు రూపాయలు వీరి చేతులలోకి రాకపూర్వమే, వీరి ఖర్చులు, రెండు రెట్లయినాయి.

మచ్చుకి గుంటూరులాంటి పట్టణంలో వున్న గుమాస్తాని తీసుకోండి. గుంటూరులో వున్న లోయర్ డివిజన్ గుమస్తాకు నెలకి, అన్ని అలవెన్సులు కలిసి, డెబ్భైమూడు రూపాయలు వుడతాయి. ఈ డెబ్భైమూడులోను అతను నెలదినాలు నెట్టాలన్నమాట. ఖర్చుల్లో మొదటి ఖర్చు యింటిఅద్దె. గుంటూరులో అద్దెలు మహా విపరీతం. (గుంటూరులో మాత్రమే కాదు, అన్నిఊళ్ళలోనూ అలాగేవున్నవి.) కనీసం పదిహేను రూపాయలన్నా పెట్టకపోతే రెండు గదుల భాగం దొరకదు. డెబ్భైమూడు రూపాయల్లోను పదిహేను రూపాయలు యింటి బాడుగక్రింద పోతే, మిగిలిన యాభైయెనిమిది రూపాయలతోనూ సంసారం గడపడం ఎంతకష్టమో సులభంగా అర్థమౌతుంది. భార్యాభర్తలేగల సంసారమయినా, యీ రూ 58 లతోనూ నెల రోజులు గడవడం చాలాయిబ్బందిగావుంటే, ఇక ఒకరిద్దరు పిల్లలుగల వారి దశ వర్ణనాతీతం. సగటున రూపాయకి మానెడు బియ్యం (ప్రత్యేక పరిస్థితుల్లో అంతకంటే తక్కువకూడ) కొని, ఏ విధంగా కాపురంచేయాలో అర్థం కాక ప్రభుత్వోద్యోగులంతా పిచ్చెత్తి పోతున్నారు. (ఈ పిచ్చి బయటికి కనబడదు లెండి. పెండ్లాం బిడ్డల సమక్షంలో మాత్రం బయటికి వస్తూంటుంది). ఇక- వందరూపాయలు, అంతకంటే పైన- అంటే, నూటపాతిక రూపాయలదాకా వచ్చే అప్పర్ డివిజన్ గుమాస్తాలు అరుదుగా వుంటారు. ఎందువల్లనంటే, అప్పర్ డివిజన్‌కి వచ్చేటప్పటికి కనీసం నలభై సంవత్సరాలయినా నిండతాయి. పైగా వీరికి తప్పకుండా పిల్లలుంటారు. మగపిల్లలకు చదువులు, ఆడపిల్లలకు పెండ్లిండ్లు ఈ నూటపాతిక రూపాయల జీతగాళ్ళకైనా ఎంత కఠినసమస్యో కొంచెమాలోచిస్తే తెలుస్తుంది. నిరక్షరాస్యతను నిర్మూలనం చేయడానికి కంకణం కట్టకున్న ప్రభుత్వం హైస్కూల్, కాలేజీల జీతాలుకూడ పెంచింది. ఈ స్వల్పజీతాలతో పెద్ద చదువులు చదివించలేక అనేకులు తమ పిల్లలను స్కూలు ఫైనలుతోనే మాన్పిస్తున్నారు. ఎన్ని తెలివితేటలున్నా, ఎంత అభివృద్ధిలోకి రావడానికి అవకాశమున్నా, డబ్బు లేకపోవడంవల్ల, వీరి గతి అధోగతి అవుతున్నది. ఇక ఆడపిల్లలకి పెండ్లిండ్లు చేయాలంటే, ప్రభుత్వం యిన్‌ఫ్లేషన్ ప్రమాదం ఎదుర్కొనటానికి చేస్తున్న ప్రయత్నమంతైనా చేయకపోతే, పెండ్లి కాదని గట్టిగా చెప్పవచ్చు. పోనీ, ఉన్న దేమైనా తెగనమ్ముకొని ఉన్నవారు చేస్తే, ఇక ఏమీలేనివారి గతేమిటి? మనదేశంలో ఎక్కువ మంది ఏమీలేనివారని మాత్రం మరువవద్దు. ఇలాంటి పరిస్థితుల్లో ఆడపిల్లలకు పెండ్లిండ్లెలా అవుతాయి, పెండ్లిండ్లు చేయక ఎంతకాలమని యింట్లో పెట్టుకొని ఉండగలరు? పోనీ చదువులు చెప్పిస్తారంటే, మగపిల్లలకే చెప్పించలేరే ఆడపిల్లలకుకూడ ఎక్కడచెప్పిస్తారు? ఈడొచ్చిన ఆడపిల్లలను పెండ్లిచేయకుండా యింట్లో అట్టే పెట్టుకొంటే కలిగేబాధ, ఆడపిల్లలు గల తలితండ్రులందరికీ విదితమే.

పైపరిస్థితులన్నీ పర్యావలోకిస్తే, ప్రభుత్వోద్యోగులు ఎంతెంత అవస్థలపాలవుతున్నారో, ప్రతి వారికీ అర్థమవుతుంది. ఈ మధ్యనే సెక్రటేరియట్ ఉద్యోగుల సమావేశంలో మాట్లాడుతూ, మంత్రి శ్రీ గోపాలరెడ్డిగారు- 'ప్రభుత్వాలు మారినా, ప్రభుత్వోద్యోగులు మారరు; ఏప్రభుత్వమున్నా, ఉద్యోగులంతా విశ్వాసంతో పని చేయా' లన్నారు. కాని కాలేకడుపులతో, చలించే మనస్సులతో ఎంత కాలం విశ్వాసంతో పనిచేయగలరని శ్రీ రెడ్డిగారు అనుకున్నారో మాత్రం దురూహ్యంగా ఉంది.

మంత్రులు, తమ జీతాలు వెయ్యిరూపాయలకు పెంచుకోవడంలో గల ఆవశ్యకత, తమ ఉద్యోగుల జీతాలపెంపకంలో గుర్తించలేక పోవడం- కేవలం ప్రభుత్వోద్యోగుల దురదృష్టం. దేశనాయకులై వుండి, దరిద్రనారాయణ సేవ చేస్తున్నామని ఉపన్యాసాలిచ్చే ఈ జాతీయనాయకులు ప్రజల్లో ఒక ముఖ్యభాగమైన ప్రభుత్వోద్యోగుల దీనాలాపాలు పట్టించుకోకపోవడం నిజంగా శోచనీయం.

# మార్క్సిజమ్ : త్రిక సిద్ధాంతం

వైజ్ఞానిక యుగారంభంతో శాస్త్రదృష్టితో ప్రకృతిని పరిశీలించడం అధికమయింది. దృశ్యములయిన విషయాలను పరిశీలించి ప్రాపంచిక సంఘటనలను వివరించడానికి, కేవలం ఊహాత్మకములయిన సిద్ధాంతాలను మేధావులు అన్నికాలాలలోనూ ప్రతిపాదించారు. అందులో మార్క్స్- సంఘం, దాని సృష్టి, సాంఘీయుల పరస్పరసంబంధాలూ సంఘంలో కలిగే మార్పులూ, వీటన్నింటినీ వివరించడానికి తన త్రిక సిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు.

ఇతరశక్తులు పని చేయనినాడు, కేవలం శాంతిమయమయిన జీవితం తప్ప ఇతర ఆశయములు సాంఘీయులకు లేనినాడు, జీవితావసరములు కేవలం కనిష్ఠములుగా ఉన్ననాడు సంఘస్వరూపం సంఘ స్వామ్యంగానే వుండేది. ఆదిలోవున్న ఆ సంఘ స్వామ్యంనుంచి వ్యక్తి స్వామ్యం ఆరంభం అయింది. అలాగే, అనిర్దిష్టమయిన వస్తుపరిభ్రమణంనుంచి అనేకసహస్రశతాబ్దాలలో నేటి ప్రకృతి తయారయింది. సంఘస్వామ్యంపోయి వ్యక్తిస్వామ్యం రావడానికయినా, అనిర్దిష్టమయిన వస్తువు తన పరిభ్రమణంలో ప్రస్తుతస్థితిని పొందడానికయినా ఏదో శక్తి కారణమై వుండాలి. ఆ శక్తి వస్తువుకు యితరమై లేదనీ, ఉండగా వుండగా స్వరూప స్వభావాలలో మారిపోయే గుణం వస్తు గర్భంలోనే వుందనీ మార్క్స్ ప్రతిపాదించాడు. వస్తు గర్భంలో యీ గుణం ఎందువల్ల వున్నదో, ఎవరు కల్పించారో ఆయన వివరించలేదు. ప్రకృతి పరిణామంలో అది ఏర్పడివుంది. ప్రకృతికి యీ పరిణామగుణం మాత్రం ఎవరు కల్పించారు? ఆ ప్రశ్న తప్పకుండా ఉదయిస్తుంది. దానికి జవాబు సంతృప్తికరంగా కనపడదు. మారిపోయిన వస్తువు మళ్ళీ మారిపోడంలో, పరిమాణంలోనూ, స్వభావంలోనూకూడా పూర్వస్థితికన్నా ఉత్తమస్థితిని పొందిన నూతన వస్తువు వస్తుంది. డార్విన్ పరిణామవాదం తన సిద్ధాంతాన్ని బలపరుస్తున్నదని మార్క్స్‌వాదం. కాని డార్విన్ జీవజాతుల పరిణామాన్ని వివరించినంతవరకే, అది మార్క్స్‌సిద్ధాంతాన్ని బలపరుస్తుంది. మార్క్స్‌సిద్ధాంతం ప్రకారం మార్పుకు కారణం వస్తు గర్భంలో వుండే మారే గుణం. ఆ గుణం ప్రకోపించడానికి కారణం ఉత్పత్తి విధానాల్లో మార్పు. డార్విన్ ప్రకారం, జీవజాతుల పరిణామానికి కారణం- ఉనికికై పెనగులాటలో, ఉత్తములు మిగులుతూరావడం. ఉత్పత్తి అయ్యే జీవితావసరములు వున్న అందరికీ చాలవు. అందుకని జీవితంలో పోటీ, దానితో సంఘర్షణ యేర్పడతవి. ఆ సంఘర్షణలో జీవులు నూతనశక్తుల్నీ, నూతనస్వరూపాల్నీ పొంది నూతనజాతిగా పరిణమిస్తాయి. డార్విన్ సిద్ధాంతం ఒకవిధంగా వ్యక్తిస్వామ్యాన్ని బలపరుస్తుంది. కాని సంఘస్వామ్యాన్ని బలపరచదు. పోటీ, పోరూ లేని సంఘస్వామ్య జీవితంనుంచి, ఉనికికోసం పోరాటంలో, వ్యక్తి స్వామ్యం రావడం; అంసులో యోగ్యతములూ, ఆస్తిపరులూ, బుద్ధిమంతులూ, అధికారులూ కావడం జరిగింది.



కాని 'ఉనికికోసం సంఘర్షణ, ఉత్తములకు విజయం' అనేది జంతువులకు అన్వయిస్తుందిగాని, మానవులకు అన్వయించదు. జంతువులు ప్రకృతిలోవున్న ఆహారంతో, సౌకర్యాలతో తృప్తిపడతవి. మానవుడు ప్రకృతిని స్వాధీనంచేసుకుని, తన యిష్టంవచ్చినట్లుగా జీవితావసరములను సృష్టించుకుంటున్నాడు. అందుచేత యీ భాగంలో డార్విన్ పొరబడ్డాడని మార్క్స్, ఎంజెల్సు తోసేశారు.

ఏమయినా యీ త్రికసిద్ధాంతం చాలా అమోఘమయింది. కుశ్నాకలులేకుండా విశ్వసిస్తే, జీవితంలో అన్నింటినీ వివరించడానికి అది సమర్థమయింది. కాని ప్రకృతిలో వికృతీ, వికృతిలో వికృతివల్ల సంస్కృతీ కలగడానికి కారణం ఉత్పత్తివిధానాల్లో మార్పు అనడంలో యీ సిద్ధాంతాన్ని మానవసంఘానికి పరిమితం చేయడం అవుతోంది. అప్పుడయినా అది

సంఘంలోని మార్పులు నిస్సందేహంగా వివరించ లేదు. అనాదీయమైన సంఘస్వామ్యంయుండి, ఉత్పత్తివిధానంలో మార్పుల ఫలితంగా ఫ్యూడలిజం, కేపిటలిజం, యిన్నీ యేర్పడ్డవనుకుందాం ఇప్పుడున్న ఉత్పత్తి విధానమయిన కేపిటలిజంలో ఉన్న శక్తుల వల్లనే అది వికృతిపొంది సోషలిజానికి దారితీస్తుంది అనుకుందాం. కాని సోషలిజం విషయంలోనూ యీ సిద్ధాంతం అన్వయించాలిగదా! సోషలిజం అయింతరవాత సోషలిజంలోనూ వికృతీ, వికృతికి వికృతీ కలిగి, మరో నూతనసంఘం, ఉత్పత్తి విధానం వస్తుందనీ, దానిని త్రిక సిద్ధాంతం విశ్వసించేవారు అంగీకరించాలి. కాని మార్క్స్ మానవసంఘానికి అత్యంతపరిమావధి సోషలిజం. దాని తరవాత అది మార్పు చెందదని అంటాడు. ఇది కొంతవరకు స్వవచన వ్యాఘాతంగా కనిపిస్తుంది. తన సిద్ధాంతాన్ని గురించి మార్క్స్ ఏమనుకున్నా, అది సోషలిజంలోనూ మార్పులు తెస్తుంది అనే మనం వూహించవలసివస్తుంది.

నిర్గుణమైన, చైతన్యంలేని ప్రకృతిశక్తిని, ఏదో శక్తి ఆదిలో చైతన్యం కలిగించి, సగుణాత్మకమయిన వస్తుప్రపంచంగా మార్చివుండాలి. న్యూటన్ పండితుడి సిద్ధాంతాల ననుసరించి, ప్రతి వస్తువూ తన మార్పుతో ప్రతి యితర వస్తువులోనూ మార్పు కలిగించి, నిరంతరాయంగా ప్రకృతిలో మార్పులను కలిగిస్తూ వుండాలి.

అంటే, కర్మహీనమయిన అచేతన ప్రకృతిలో ఏదో శక్తి ఆదికర్మ,ఆదిచలనం కలిగించివుండాలి. ఆశక్తి బ్రహ్మమని వూహించుకుంటే, ప్రపంచంలో జరిగే ప్రతీది అనేకులు మనోవ్యాపారముల ద్వారా చేతనాచేతన ప్రపంచంలో కలిగించే చలనానికీ, కర్మకీ, ప్రతికర్మ ఫలితమని ఊహించుకోడం సులభం. నిశ్చేతన వస్తువులో చైతన్యం కలిగించేగుణం బ్రహ్మని వుండి వుండాలి. ఒకమాటు ఆ గుణమున్న శక్తిని వూహించుకుంటే, సృష్టిక్రమాన్నంతటినీ వూహించుకోవచ్చు. న్యూటన్ పండితుడి సూత్రాల్లో రెండవ దానిలో - నిశ్చలంగానో, సమవేగంతో నిడుపు రేఖలంలో సంభవించేదిగనో ఉంటూ, వ్యక్తులను తరతరంగా ప్రవర్తింపజేసే ఆ శక్తి- బ్రహ్మస్వరూపం. ఆవిధంగా మొదటి మార్పు చెందిన వస్తువు ప్రకృతిలో ప్రతి యితర వస్తువులోనూ మార్పులు తెచ్చి వుంటుంది.

మార్క్స్ త్రిక సిద్ధాంతం- వికృతికి వికృతి వల్ల సంస్కృతి ఏర్పడిందని బోధిస్తుంది. అప్పుడు ఆది వికృతి వస్తుస్వభావం కాదనీ, ఏదో అనూహ్యమయిన శక్తిచే ప్రేరేపితమనీ ఊహించుకుంటే, న్యూటన్ పండితుడి సిద్ధాంతానికీ, కర్మసిద్ధాంతానికీ, మార్క్స్ సిద్ధాంతానికీ చక్కని ఏకత ఏర్పడుతుంది. ఆది వికృతికి కారణమేమిటో వివరించినంతవరకు ఆ సిద్ధాంతం లోపభూయిష్ఠంగానే వుంటుంది. ఉత్పత్తి విధానం వ్యక్తుల కర్మఫలితం, అందులో మార్పు వారి కర్మలో మార్పుకు ఫలితం. అందుచేత ఉత్పత్తి కర్మేతరమయింది కాదు.

ఇతర దేశాల్లో ఉత్పత్తివిధానాలు చాలా మార్పు చెందినవి. అందుచేత వాటికి ఫలితంగా కేపిటలిజం ఏర్పడిం దనవచ్చును. మన దేశంలో మొన్న మొన్నటివరకూ ఉత్పత్తి విధానాలు మార్పు చెందనేలేదు. కర్మాగారాలు, యంత్రయుగం ఆరంభమయి రెండు శతాబ్దాలుకూడా కాలేదు. అయినా వ్యక్తిస్వామ్యం మనదేశంలో వుంది. ఉత్పత్తి విధానాల్లో మార్పు సంఘంలో మార్పులకు కారణమంటే, అది మన దేశపరిస్థితులకు ఏమి మాత్రమూ అన్వయించదు.

మార్క్స్ చేసిన ప్రతి నిర్ణయమూ ఆయన త్రిగుణాత్మక సిద్ధాంతమును జీవిత పరిస్థితులకు అన్వయించగా ఏర్పడిందే. అందువల్ల ఆ సిద్ధాంతంలో లోటు గ్రహిస్తే ఆయన నిర్ణయాల్లో లోట్లు తేలిపోతవి.

బుద్ధిహీనులు, మృగప్రాయులయిన మానవులు బుద్ధిమంతులు కావడం,సంఘస్వామ్యం ఏర్పడ్డం, వైవిధ్యాన్ని- విభేదాన్ని పొందడం, నాయకత్వాన్ని- స్వామిత్వాన్నీ యేర్పరచుకోడం, అందువల్ల కష్టాలు గ్రహించి సంఘ స్వామ్యాన్ని యేర్పరచుకోడం- యివన్నీ మార్క్స్ త్రికసిద్ధాంతాన్నిబట్టి వివరించవచ్చు. అమోఘమైన ఆ సిద్ధాంతాన్ని, కేవలం మానవజీవితంలో ఒక భాగమయిన ఉత్పత్తివిధానాలతో లంకె పెట్టి దాని ఆధ్యాత్మికస్వభావాన్ని పాడుచేశారు.

ప్రకృతిశాస్త్రంలో వివరించబడిన శక్తీ- దానిని పరిపాలించే ధర్మములు చూస్తే, భగవచ్ఛక్తికీ దానికీ చాలా సామ్యం ఉన్నట్లు తోస్తుంది. అదీ మార్పులు పొందుతుంది. దాన్ని కొత్తగా సృష్టించడానికి వీలులేదు. ఉన్న దాన్ని నాశనంచేయడానికి వీలులేదు. బ్రహ్మస్వరూపమూ, భగవచ్ఛక్తీ కూడా అటువంటివే! భగవంతుణ్ణి గజేంద్రమోక్షంలో గజేంద్రుడు చక్కగా సంభావించాడు. అచేతనమయిన దాంట్లో చైతన్యం కలిగించడం, స్తబ్ధమయిన దానిని సంచలితం చేయడం, అనంతమయిన విశ్వకర్మ పరిభ్రమణానికి ప్రారంభం చెయ్యడం భగవచ్ఛక్తికి లక్షణములు అనుకుంటే, మార్క్స్ సంభావించిన ప్రకృతి ఆశక్తి ఒకటేననుకుంటే, మార్క్సు సిద్ధాంతం కర్మసిద్ధాంతంలాగే, ప్రకృతిశాస్త్ర సిద్ధాంతాల్లాగే- జీవితరహస్యాలన్నింటినీ వివరించగలుగుతుంది.

మార్క్సు చారిత్రికసంభావన వైజ్ఞానికమయిందని ఆయన అనుయాయులు అంటారు. విజ్ఞానానికి పునాది న్యూటన్ పండితుడి సిద్ధాంతాలు. శక్తిసంభావనా, దానితో సమన్వయం లేనంతవరకు అది వైజ్ఞానికం కాలేదు.

అంతవరకు ఆ మార్క్సును ఒక నిర్లోపుడయిన దైవంగానూ, ఆయన విశ్వాసాలను యథార్థంగా మతవిశ్వాసాలలాగనూ విశ్వసించి, వాటిని ఆధారంచేసుకుని మాత్రమే సంఘాన్ని మారుస్తామనే వారికి భారత ప్రజానీకంహృదయంలో తావులేదు, ఉండదు. భారత ప్రజ ఊహను ఆకర్షించడానికీ, నూతనపంథాలో నడిపించడానికీ వారి ఆధ్యాత్మిక విశ్వాసాలకు ఒక నూతన స్వరూపం ఇవ్వడం అవసరం. సంఘస్వామ్య సంభావనకు మార్క్సు అభిప్రాయాలూ, సిద్ధాంతాలూ సహాయకారులు కావచ్చునేమో కాని-ఏకైక ఆధారములు కావడానికి వీలులేదు.

# న్యాయం తప్పుటలు

'రాఘవ'

వేసవికాలం - మామిడికాయల అన్వేషణార్థం తోటల్లోకి బయలుదేరాం, మామూలుగానే ఆనాటి సాయంకాలంకూడా. దొంగతనానికి మాత్రం కాదు, దొరకడానికే. ఒకటి రెండు కాయల చొప్పున డబ్బిచ్చి కొనుక్కొంటాం.

మేం వెళ్ళిన తోటలో ఒక బోడి పుట్ట ఉంది. లోపల రెండు బారల పొడుగున ఒక నల్ల త్రాచు పడగ విప్పి ఆడుతూంది చల్లగాలికి.

'పాముర! నూతులో' అన్నాడు సత్యనారాయణ.

'ఏదీ' అంటూ తొంగి చూశాను, ఆతుర్దాగా భయవిభ్రమాలతో.

'ఓస్! ఇదేనా. చూడండి. రాయి పుచ్చుకుని దెబ్బకి దానిని షైసలు చేస్తా' నంటూ, నేను వద్దని ఎంతచెప్పినా వినకుండా, దాన్ని గురిచూచి కొట్టాడు వీరభద్రయ్య.

'అమ్మయ్యో, ఎంతపని చేశాడు! ఆ రాయి దానికి చావు తీసుకరాకపోతే—' అనుకుంటూ లోపలకు చూశాను. ఆ రాయి దానికసలు తగలే లేదు! అది మా ముగ్గురిని ఒకసారి చూచి కలుగులో దూరింది.

మేము మామిడికాయ లేవో కొనుకున్నామే గాని నాకు వాటి మీద దృష్టే లేదు. ఆ పాము పగ పట్టుతుంది, మమ్మల్ని కరుస్తుంది. ముగ్గుర్ని కరుస్తుందో లేక అతణ్ణే కరుస్తుందో అన్న ఆలోచనతో, అదెక్కడ వెంబడిస్తూందోనని వెనక్కి వెనక్కి చూచుకుంటూ నడుస్తున్నాను. నడుస్తున్నా నన్న మాటేగాని వాళ్ళతోటి కులాసాగా మాట్లాడ లేకపోతున్నాను. నాలోని భయాన్ని గుర్తించి - 'ఈయన ఉట్టి పిఱికి రా సత్యనారాయణా.' అని భద్రం వెక్కిరిస్తూన్నా, ఎలాగేనా ఇల్లు చేరితే చచ్చి బ్రతికిన

వాళ్లలో లెక్క అనుకుంటూ, పాము గాని వెంబడిస్తుందేమో -చూసుకుంటూ। వెడుతున్నాను.

అనుకున్నంతా జరిగింది! పాము వందగజాల దూరంలో మా వేపే వస్తూండడం కనిపించింది. 'వీరభద్రయ్యాయ్! చంపేశావయ్యా - అదిగో పాము, మనల్ని కరిచేస్తుంది - ఏం పని చేశావు... ఇప్పు డెలాగా?' నోట మాటే పెగల్లేదు. మొత్తాని కెలాగో అన్నాను.

పాము ఎంతసేపట్లో వస్తుంది - మొదట నా వేపే, అదేం కర్మమోగాని!

'ఆఁ! ఆఁ! కరవకు! కరవకు! నేను కాదు నిన్ను కొట్టింది - అదుగో వీరభద్రయ్యా' ఎలాగో ధైర్యంచేసి అనగలిగాను.

త్రాచు వీరభద్రయ్య వేపు తిరిగింది.

'నేను కాదు ! నేను కాదు ! అతడే నిన్ను కొట్టింది. అబద్ధం అంటున్నాడు. అతణ్ణే కరు' అని వీరభద్రయ్య.

'ఆరి వీడి తస్సాదియ్యా! ఇన్నాళ్ళూ వీడి స్నేహం చేస్తే వీడు నా ప్రాణానికే ఎసరు పెడుతున్నాడే' అనుకుంటూ, 'సర్పరాజమా! ధర్మ మాలోచించు - నేను కాదు నిన్ను కొట్టింది. కావలిస్తే సత్యన్నారాయణ నడుగు' భయంతో అన్నాను.

'ఏమో బాబు! నాకు తెలియదు' - తన సంకుచితత్వాన్ని బయటపెట్టాడు సత్యన్నారాయణ.

పాము గంభీరంగా అంది: 'తోటమాలి దగ్గరకు పదండి. అతడు నిజం చెపుతాడు ఎవరుకొట్టిందీ.' చస్తామా అనుకుంటూ వాడుమొగా లేసుకుని బయలుదేరాం. తోటమాలి భద్రయ్యే కొట్టాడని చెప్పాడు. 'అమ్మయ్య' అనుకుంటూ గుండెల మీద చెయ్యి వేసుకున్నాను. మళ్ళీ నాన్నని, ఇంటిని, అందరిని చూడొచ్చునని నిర్ణయించుకున్నాను.

వీరభద్రయ్య-'దుష్టజంతువును శిక్షించవచ్చు. ప్రాణరక్షణార్థం ఏం చేసినా తప్పులేదు. నీలాటివి మమ్మల్ని చంపుతాయి. అందుకనే నీకు శిక్ష విధిద్దా మనుకొన్నాను. కావలిస్తే కోర్టులో ఫిర్యాదు చేసుకో. వా రొప్పుకుంటే కరవొచ్చు' అని యుక్తిగా తప్పించుకున్నాడు- వీడి యుక్తి పాడుగాను !

నా మీద అన్యాయంగా నేరం మోపినందుకు నేనొక దావా, తన్ను కొట్టినందుకు పామో దావా పడేశాము కోర్టులో — పాముకి నేను, నాకు పాము సాక్ష్యం.

మొదట పాము కేసు విచారణ— భద్రయ్య డబ్బుతో తనవేపు తీర్పు చెప్పించుకున్నాడు. పాము ఏమీ హానిచేయక పోయినా చేస్తుందనే భయంతో దాన్ని చంప ప్రయత్నించవచ్చుట ! పాము ఓడి పోయింది. వీరభద్రయ్య పరువునష్టాని కని పాము నెత్తిమీద మణి పుచ్చుకున్నాడు.

నా దావాలో కోర్టు న్యాయంగా నాకే గెలుపు చెప్పింది. నేను మణిని కోరాను, జరిమానాక్రింద. విధిలేక యిచ్చాడు భద్రయ్య.

పాము తన ఓటమికి బుర్ర నేలనేసి కొట్టుకు చచ్చింది. మేమంతా పెదమొగాలతో ఇంటికి బయలుదేరాం. రైలు దిగి ఇంటికి వచ్చే త్రోవలో పుంత ఒకటి వుంది.

ఉడుకుమోత్తనంతో తక్కిన యిద్దరూ కూడబలుకుకొని, నా చేతిలో మణి లాక్కుని, నన్ను చితక తన్నారు—

రాష్ట్రనిర్మితికి కీలకం :

# సవరణ కోరుతున్న ఒడంబడిక

కంభంపాటి సత్యనారాయణ

విశాలాంధ్ర నిర్మాణంలో ప్రధాన భాగాలు మూడు: 1. సర్కారు జిల్లాలు (కోస్తా ప్రాంతం) 2. రాయలసీమ 3. తెలంగాణా. ఇవి గాకుండా సరిహద్దులలో తమిళనాడు, మైసూరు, బస్తరు, ఒరిస్సాలనుంచి ఆంధ్రంలో చేర్చవలసిన ప్రాంతంకూడా ఉన్నది.

సరిహద్దు సమస్యల నిర్ణయాన్ని సరిహద్దు కమిషనుకు వదలివేసి వెంటనే సర్కారు-రాయలసీమ జిల్లాలతో కూడిన ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరిగితే, మన రాష్ట్ర స్వరూపం ఏర్పడి, విశాలాంధ్రకు పునాది అవుతుంది. నైజాం సంస్థానాన్ని రద్దుచేసి సంస్థానంలోని వివిధ భాషా ప్రాంతాలను పక్కనేవున్న వివిధ భాషా రాష్ట్రాలలో చేర్చాలనే ఆందోళన బలవత్తరమయిన కొలదీ తెలంగాణా జిల్లాలుకూడా ఆంధ్రరాష్ట్రంలో కలవక తప్పదు. అప్పుడే మూడుకోట్ల ఆంధ్రులూ ఐక్యం అవుతారు.

మద్రాసునగర సమస్యను సరిహద్దు కమిషనుకు వదలివేసివెంటనే పదకొండు రాయలసీమ-సర్కారు జిల్లాలతో కూడిన ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరగాలనే గట్టి అభిప్రాయం బాధ్యతగల ఆంధ్రవర్గాలలో బలపడుతోంది. కాని దీనితో పాటు రాయలసీమ- సర్కార్ల సమస్యకూడా ముందుకువచ్చింది.

రాయలసీమ, సర్కారు జిల్లాలలో నివసించే వారందరూ ఆంధ్రులే అయినప్పటికీ, ఆంధ్ర రాష్ట్రనిర్మాణం అందరికీ అవసరమైనప్పటికీ, అటువంటి ప్రధాన సమస్యమీదగూడా ఈనాటి వరకూ రాయలసీమ-సర్కార్ల నాయకులమధ్య పూర్తిగా ఏకీభావం లేదు.

ఆంధ్రులందరి అభివృద్ధికొరకు ఆంధ్రరాష్ట్ర నిర్మాణం అవసరం. కాని ఆంధ్రనాయకులలో మాత్రం చీలికలు ఈమధ్య మరీ ఎక్కువైనాయి. రాష్ట్రసమస్యకు సంబంధించినంతవరకు, ఆంధ్ర నాయకులలో- ప్రభుత్వాధికారం ఉన్న వారికి, ప్రభుత్వ అధికారం లేనివారికి మధ్యగల భేదాలకంటె, రాయలసీమ-సర్కార్ల నాయకుల మధ్యగల భేదాలే ప్రాధాన్యం వహిస్తున్నాయి. ఈ విభేదాలు మనరాష్ట్రవాంఛయొక్క బలహీనత. ఈ బలహీనతను పోగొట్టుకున్నప్పుడే మన రాష్ట్రవాంఛకు నూతనవికాసం వస్తుంది.

నాయకుల మధ్య విభేదాలు ఎంతవరకూ వెళ్ళినవంటే, రాయలసీమలో కొంతమంది 'మాకూ ఆంధ్రరాష్ట్రానికి సంబంధం లేదు. మేము వేరే రాష్ట్రంగా ఉండాలి. మా రాయలసీమ ప్రజలకు కోస్తాజిల్లాల ప్రజలకు ఏమీ పోలికలు లేవు. భాష, విజ్ఞానం, సంస్కృతి అన్నిటిలో మాకు భేదాలు ఉన్నాయి' అంటూ ఒక వాదన లేవదీశారు. 1947 రాయలసీమ మహాసభలోని ఉపన్యాసాలు విన్నవారికి ఈ విషయం తెలుసు. నెల్లూరు జిల్లాను గూడా కలిపి చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి ప్రాంతమంతా వేరే ఒక రాజ్యంగా ఏర్పడాలని సూచించే 'రెడ్డిరాజ్యపటం' మహాసభలో ప్రదర్శించబడింది.

కాని రాష్ట్రకాంగ్రెసు నాయకులలో నీలం సంజీరెడ్డి మొదలైనవారు పై వాదనను ఎదుర్కొన్నారు. ఆంధ్రరాష్ట్రావశ్యకతను తిరిగి జ్ఞాపకంచేశారు. రాయలసీమకూడా ఆంధ్రరాష్ట్రంలో భాగమే అనే సత్యానికి కట్టుబడి నిలబడ్డారు. కాని రాష్ట్రనిర్మాణం వెంటనే జరగాలని చెప్పే శ్రీ నీలం సంజీవరెడ్డి మొదలైన రాయలసీమ కాంగ్రెసునాయకులకు, సర్కారుజిల్లాల ఆంధ్రనాయకులకు నేటి వరకూ రాష్ట్రసమస్యమీద పూర్తియైన అంగీకారంకుదరలేదు. 1947, 48 సంవత్సరాల్లో

ఇద్దరిమధ్య సంప్రతింపులు విఫలమగుట యిందుకు తార్కాణం.

ఆర్థికంగా వైజ్ఞానికంగా, వెనుకబడి ఉన్న రాయలసీమ ప్రజల తరఫున రాయలసీమ నాయకులు కొన్ని హామీలు కోరుతారు. ఆ హామీలకు అంగీకరించినపుడే ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని బలపరుస్తామంటారు. ఒక్కమాటలో చెప్పాలంటే-1937 లో జరిగిన శ్రీబాగ్ ఒడంబడికను పూర్తిగా అమలు చేయమంటారు.

## శ్రీబాగ్ ఒడంబడిక

రాయలసీమ - సర్కారు జిల్లాల నాయకులు కలిసి 1937 నవంబరు 16 వ తేదీన మద్రాసులో ఈ ఒడంబడికను చేసుకున్నారు. తరువాత ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీకూడా దీన్ని బలపరిచింది. ఆ ఒడంబడికలోని ప్రధాన అంశాలు ఇవి :

1. ఆంధ్ర విశ్వవిద్యాలయ కేంద్రాలు ఒకటి అనంతపురంలోనూ, రెండవది వాల్తేరులోనూ ఉండాలి. ఆంధ్ర విజ్ఞాన కేంద్రాలను ఇలా పంచడంవల్ల ఆంధ్రులందరి సాంఘిక వైజ్ఞానిక సంఘీభావం పెంపొందించబడుతుంది. ఇది కాకుండా వివిధ ప్రాంతాలలో, ఆ బోధించబడే విషయాలను బట్టి కళాశాలలు స్థాపించాలి.

2. రాయలసీమ, నెల్లూరు జిల్లాల వ్యావసాయిక, ఆర్థిక పరిస్థితులు కోస్తా జిల్లాలతో సమానస్థాయికి తీసుకరాగలందులకై నీటి పారుదల స్కీముల విషయంలోనూ, ప్రధానమైన, కొత్త ప్రాజెక్టుల విషయంలోనూ పది సంవత్సరాల వరకూ రాయలసీమ నెల్లూరు ప్రాంతాలకు ముందు స్థానం ఇవ్వాలి.

3. శాసనసభకు స్థానాల విషయంలో జిల్లాలవారీగా సమాన ప్రాతినిధ్యం ఇవ్వాలి.

4. ఏ ఒక్క కేంద్రానికీ ప్రాముఖ్యం అంతారాకుండా విశ్వవిద్యాలయం, ప్రభుత్వ కేంద్రం, హైకోర్టు వివిధప్రదేశాలలో ఉండాలి. విశ్వవిద్యాలయం ప్రస్తుతం ఉన్న కేంద్రం (వాల్తేరు)లో ఉన్నప్పటికీ, హైకోర్టు, ప్రభుత్వ కేంద్రాలలో ఏదో ఒకటి రాయలసీమలోనూ, రెండవది కోస్తా జిల్లాలలోనూ ఏర్పాటుచేయాలి. ఈ రెండింటిలో ఏది ఎక్కడ ఉండాలనే విషయాన్ని నిర్ణయించే హక్కు రాయలసీమకు ఉండాలి.

ఇవీ శ్రీబాగ్ ఒడంబడికలోని ప్రధాన అంశాలు. 1937 నాటి నాయకులు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణ ఆశయం ముందు పెట్టుకుని చేసుకున్న ఒడంబడిక అది. ప్రధాన విషయం-ఆర్థికంగా, వైజ్ఞానికంగా వెనుకబడియున్న రాయలసీమ అభివృద్ధికి హామీలు ఇవ్వటమే కాని 1937 తరువాత పద్రెండు సంవత్సరాలు గడచినయి. ఆంధ్రరాష్ట్రం ఏర్పడలేదు. ఈ పుష్కరంలో చరిత్ర చాలా నడిచింది.

కాని 1937 లో జరిగిన శ్రీబాగ్ ఒడంబడిక అలాగే ఉండవలసిందేనా? వెనుకపడి వున్న ప్రాంతాల అభివృద్ధినే ముందు గుర్తుపెట్టుకుని ఈ మధ్యకాలంలో వచ్చిన అనుభవాన్ని, జరిగిన దేశప్రపంచరాజకీయ పరివర్తనాలను అన్వయించి శ్రీబాగ్ ఒడంబడికను మార్పు చేయవలసిన అవసరం లేదా? ఉన్నది. ప్రజాభ్యుదయమే ప్రధానంగా ఉన్నప్పుడు అటువంటి మార్పులు సాధ్యపడతాయి.

1. విశ్వవిద్యాలయం, విద్యాసౌకర్యాలు:— రెండు విశ్వవిద్యాలయ కేంద్రాల విషయం ఆలోచించే ముందు, గడచిన పద్దెనిమిది సంవత్సరాల్లో మనఒక్కవిశ్వవిద్యాలయ కేంద్రం ఆంధ్రరాష్ట్రంలో ఒకమూలన వాల్తేరులో ఉండటం వల్ల ఎంతవరకు ఉపయోగపడిందో ఆలోచించవలసి ఉంది. ఆంధ్రప్రజలందరికి అందుబాటులో ఉండే విశ్వవిద్యాలయ కేంద్రం ఒకటి ఉన్నా చాలు. ప్రస్తుత కేంద్రం వాల్తేరులో ఉండటం వల్ల రాయలసీమ వారికేగాక ఇతరులకుకూడా ఎంతగా వినియోగపడాలో అంతగా వినియోగపడటంలేదు. ఈ సమస్యను పూర్తిగా తిరిగి చర్చించవలసిన అవసరం ఆంధ్రప్రజలను అందరినీ బాధిస్తోంది. వాల్తేరులో సముద్ర ప్రాంతాన నావికాశిక్షణ మొదలైన ప్రత్యేక విషయాలకు సంబంధించిన కళాశాలలు ఉన్నప్పటికీ, ఇతర సాధారణ విద్యాశిక్షణలో కూడిన విశ్వవిద్యాలయ కేంద్రాన్ని ఆంధ్ర ప్రజలందరికి అందుబాటులో ఉండే విజయవాడ ప్రాంతానికి తీసుకురావలసిన అవసరం ఉంది. వాల్తేరులో విశ్వవిద్యాలయం ఉండటంవల్ల, అదియాయిరవై

సంవత్సరాల్లో ఆంధ్రుల విజ్ఞాన కేంద్రంగా తయారయిందని ఎవరు చెప్పగలరు? విద్యాశిక్షణ కేవలం ప్రత్యేకమైన కోర్సులలో విద్య పొందే విద్యార్థులకే గాక, వయోజనులకు కూడా వర్తింపచేయాలని పరిగణింపబడుతున్న ఈనాడు, విశ్వవిద్యాలయ కేంద్రం ఆంధ్ర ప్రజానీకం అందరికీ అందుబాటులో ఉండాలి. విశ్వవిద్యాలయం యొక్క ప్రభావం, కృషి ఆంధ్ర ప్రాంతానికంతకూ వర్తింపచేయాలి. అందువల్ల సర్కారులో ఒక్క విశ్వవిద్యాలయ కేంద్రం కూడా లేనప్పుడు ఒకటా? లేక రెండా? అనే ప్రశ్నకంటె- ఎంతత్వరగా ఆంధ్రప్రజానీకానికి విద్యగరపగలం? దానికి చేయవలసిన కృషి ఏమిటి? అనే దృక్పథంతో విద్యాసౌకర్యాల విషయం సమన్వయించి ఆలోచించుట సముచితం అవుతుంది. శ్రీబాగ్ ఒడంబడిక జరిగిన పంధ్రెండు సంవత్సరాలకు ఈనాడు కూడా కడప జిల్లాలో కళాశాల లేకపోవటం ఆంధ్రనాయకులు ఎలా సహించారో! ఈ మధ్య కాలంలో కనీసం ఒక హైస్కూలు అయినా ఉండాలని మద్రాసు ప్రభుత్వం నిర్ణయించేవరకూ, రాయలసీమ జిల్లాలలో హైస్కూళ్లులేని తాలూకాలు ఎన్ని లేవు! నైజాం వచ్చి కర్నూల్లో ఒక కళాశాలని ప్రసాదించవలసి వచ్చిందిగా?

ఆంధ్రజిల్లాలన్నిటిలో ప్రాథమిక పాఠశాలలు సెకండరీ స్కూళ్లు, కళాశాలలు విరివిగా స్థాపించి నూటికి పదముగ్గురు అక్షరజ్ఞానం గల ఆంధ్రులను నూటికి నూరుమందిని విద్యావంతులుగా చేసే వయోజన విద్యాప్రణాళికలు, వీటన్నిటిని చక్కగా నిర్వహించగల్గి అందరికీ అందుబాటైన కేంద్రంలో ఉండే విశ్వవిద్యాలయ కేంద్రం ఇంజనీరింగు, వైద్యశిక్షణ, గనుల త్రవ్వకం, సైనికశిక్షణ మొదలైన ప్రత్యేకపు టెక్నికల్ శిక్షణకళాశాలలు, వాటి అనుకూలాన్నిబట్టి రాయలసీమలోను, కోస్తాజిల్లాలలోను నిర్మించాలి. విద్యాసౌకర్యాల విషయంలో ఒక స్పష్టమైన ప్రజాదృక్పథంతో ప్రణాళిక అవసరం. రాయలసీమయొక్క వెనుకబడిన స్థితిని తప్పనిసరిగా గుర్తించి, అవసరమయిన కళాశాలలను, పాఠశాలలను ముందు కోస్తాజిల్లాల స్థాయికి తీసుకుని వచ్చుటకు సర్కారు నాయకులు అంగీకరించాలి. ఈ దృక్పథంతో శ్రీబాగ్ ఒడంబడికను సవరించవలసిన అవసరం ఉంది.

మన విజ్ఞాన కేంద్రాలను పంచి వెదజల్లే ముందు ఆంధ్రులకు అసలుకున్న దాన్ని సమన్వయించే వైజ్ఞానిక భాషాకేంద్రం లేదని గుర్తించవలసివుంది.

2. నీటి వసతులు, ప్రాజెక్టుల విషయంలో విశేషంగా రాయలసీమకు హామీలు ఇవ్వవలసివుంది. నిత్యమూ అవస్థపడే రాయలసీమ కరువు ప్రాంతంలోని ప్రజలను కరువునుంచి తప్పించలేని ఆంధ్రరాష్ట్రం అవసరంలేదు. ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడే సమగ్రమైన నీటిపారుదల స్కీములను, ప్రాజెక్టులను మనం అమలు చేయగల్గుతాం. తమిళ-ఆంధ్ర వివాదాల మధ్య అధికారం కొరకు ఏర్పడిన చిక్కులలో రామపాదసాగర్ గాని, సంగమేశ్వర్ గాని మరి ఏదికాని సాధ్యపడటం లేదు. రాయలసీమ ప్రజలకు వెంటనే సహాయపడగల పెక్కు చిన్న ప్రాజెక్టులతో ప్రారంభించి, అప్పటికి పెద్ద ప్రాజెక్టులకు- ముందుగా రాయలసీమలో- ఆంధ్రరాష్ట్రప్రభుత్వం పూనుకుంటుందని రాయలసీమ ప్రజలకు ఆంధ్ర నాయకులు హామీ ఇవ్వాలి.

3. శాసనసభల స్థానాల విషయం—ఇది శ్రీబాగ్ ఒడంబడికలోని మూడవ అంశం. జిల్లాలవారీగా శాసనసభలలో సమాన ప్రాతినిధ్యం ఉండాలని అందులో ఉంది. ప్రత్యేక నియోజకవర్గాలు- మతకులవారీ ఓటింగులు ఉన్న రోజులలో సముచిత పద్ధతిని రాజ్యాంగం ఏర్పడినపుడు సూచింపబడిన అంశమని గుర్తించాలి. ఈనాడు రాజ్యాంగపరిషత్తులో మతకులవారీ ప్రత్యేక ప్రాతినిధ్యం ఎత్తివేసి, ప్రాంతీయ నియోజకవర్గాలు ఏర్పరిచి, లక్ష ప్రజలకు ఒక శాసనసభ్యుని చొప్పున రాష్ట్రశాసనసభలకు పంపునట్లు ఇండియా రాజ్యాంగచట్టంలో ఉదహరించబడింది. ఈమధ్య రాజ్యాంగ పరిషత్తులో వెనుకబడిన ప్రాంతాలవారికి (ఉ|| రాయలసీమ) లక్షకు ఒక సభ్యుడుగాక, 75 వేలకే ఒక ప్రతినిధి ఉండాలనే సూచన చర్చకు వచ్చింది.

ఆవిధంగా రాయలసీమ ప్రజలకు కొంతకాలం పాటు ప్రత్యేకసదుపాయాన్ని కల్పించవచ్చునే

గాని, జిల్లాలవారీ సమానప్రాతినిధ్యాన్ని ఈనాడు గూడా కోరుట ఎవరికి సమంజసంకాదు. ప్రత్యేక ప్రాతినిధ్య ప్రాతిపదికకు జాతీయ కాంగ్రెసు సాక్షయే వ్యతిరేకించింది. కొన్ని జిల్లాలు అతివిశాలమైనందున పాలనాభారం ఎక్కువవుతు విభజన అవసరమని తీవ్రాందోళన జరుగుతున్నది. ఈనాటి విశాఖజిల్లా వైశాల్యం 17,136 చతురపుమైళ్ళు. పశ్చిమ గోదావరి 2,361 చ. మైళ్ళు. విశాఖ జనాభా 38,16,000; పశ్చిమగోదావరి జనాభా 18,79,000 ఈరెంటికి శాసన సభలో సమాన ప్రాతినిధ్యం ఇవ్వటం న్యాయమని ఎవరు అనగలరు?

పరిపాలనా భారాన్నిబట్టి వెంటనే విశాఖ విభజన అత్యవసరం. బళ్ళారి జిల్లా అంతా ఇప్పుడు 5,725 చ. మైళ్ళు. జనాభా 1,031,000. అయితే ఆంధ్ర రాష్ట్రములో ఈ జిల్లా అంతా రాదని అందరికీ తెలుసు. అందులో మనకు వచ్చేది శ్రీకృష్ణ అవార్డు ప్రకారం ఆదోని, ఆలూరు, రాయదుర్గం మాత్రమే. ఈ మూటి వైశాల్యం 2,061 చ. మై., జనాభా నాలుగు లక్షలు మాత్రమే. ఇప్పుడు పదహారు లక్షలు జనాభాగల చిత్తూరు, దాదాపుపద్దెనిమిది లక్షలుగల అనంతపురంగాని, పదినొండున్నర లక్షలుగల కడపగానీ, పదిన్నర లక్షలుగల కర్నూలుగానీ. నాలుగు లక్షలుగల బళ్ళారి ఆంధ్ర భాగము సమాన ప్రాతినిధ్యం ఇవ్వమనటం ఏమి న్యాయం?

అందువల్ల జిల్లాలవారీ సమాన ప్రాతినిధ్యం ఉండాలనే శ్రీబాగ్ ఒడంబడికను నేటి పరిస్థితుల ప్రకారం మార్చవలసివుంది. ప్రయోజన పోటీలో సమష్టిని రాజకీయవర్గాలతోపాటు, దామాషా ప్రాతినిధ్యంకూడ ఉన్నప్పుడే, వెనుకబడిన ప్రాంతాలకు శాసనసభలో వాదించటానికి అవకాశం ఉంటుంది. ప్రజాస్వామ్య సూత్రాలప్రకారంచూచినా ఉత్కృష్టమైనపద్ధతిఅదే.

4. ఈ రాష్ట్రముఖ్యపట్టణం, హైకోర్టు, విశ్వవిద్యాలయ కేంద్రాల విషయంలో కూడా శ్రీబాగ్ ఒడంబడికను సవరించవలసి ఉంది.

రాష్ట్రప్రజల ఐక్యతాకేంద్రం అంటే స్పష్టమైన ప్రజాదృక్పథం లోపించి, ఈ విధంగా ముఖ్యపట్టణాన్ని, విశ్వవిద్యాలయాన్ని, హైకోర్టును ఎక్కడికక్కడ పంచి తాత్కాలికంగా కొందరు నాయకులను తృప్తిపరచడానికి రాయలసీమ ఒడంబడిక జరిగినట్లున్నదని చెప్పకతప్పదు.

రాయలసీమలో పరిపాలనా కేంద్రం ఉంటే, ప్రభుత్వవ్యవహారాలరీత్యా, విశాఖపట్నవాసులు రాయలసీమకు ప్రయాణం; హైకోర్టు సర్కారు జిల్లాలలో ఉంటే రాయలసీమవాసులు కోర్టుపనులమీద అక్కడికి ప్రయాణం; విశ్వవిద్యాలయం వాల్తేరులో ఉంటే అన్నిమూలల వారూ అక్కడికి ప్రయాణం! ఆంధ్ర రాష్ట్రంలోని ఏ ప్రాంతపు వారికైనా ఈ విధానం కొంతపుట్టక మానదు. విశ్వవిద్యాలయం ఒకమూలనవాల్తేరులో ఉన్నందువలన కల్గుతూన్న నష్టం చాలదా? దానికి మూడు రెట్లు నష్టం కల్గుటతప్ప ఈశ్రీబాగ్ ఒడంబడిక మరేదు మరి దేనికీ ఉపయోగపడదు.

ముఖ్యపట్టణవిషయంలోగాని, విశ్వవిద్యాలయ విషయంలోగాని, హైకోర్టువిషయంలోగాని, రాకపోకల విషయంలోగాని, రహదారీ మార్గాల విషయాలలోగాని ఆంధ్రప్రజలకు కావలసింది ప్రధానంగా ఒకటే. వారి అందుబాటులో ఉండటమే వారికి ప్రధానం. తక్కువ శ్రమతో ఎక్కువ ప్రయోజనం పొందేటట్టు ఉండాలంటే అన్ని ప్రాంతాలవారికి సమానదూరంలో ఉన్న విజయవాడ ప్రాంతమే కేంద్రం కాగలదు. తెలంగాణా దృక్పథం నుంచికూడా ఇదే సరియైన దృక్పథం కాగలదు. ఆంధ్రజీవితం ఒక విశిష్టతను పొందాలంటే ప్రధానకేంద్రం ఒకదాన్ని ముందు ఏర్పరుచుకొనుట అవసరం.

శ్రీబాగ్ ఒడంబడికను తూచా తప్పకుండా అమలుచేయాలని ఈనాడు కోరడంలో అర్థం లేదు. దాని ఆశయమైన రాయలసీమ అభివృద్ధిని ప్రత్యేకంగా గుర్తిస్తూ, దానికి మెరుగులు పెడుతూ, నేటి పరిస్థితులకు అన్వయిస్తూ దానిలో మార్పులు చేయవలసి ఉన్నది.

ఆంధ్రరాష్ట్రనిర్మాణానికి కీలకమైన రాయలసీమ-సర్కార్ల ఐక్యత వెంటనే సాధించి రాష్ట్రానికీ, విశాలాంధ్రకీ పునాదులు వేయటమే నేటి కర్తవ్యం.

# పరకీయ భాషల సమస్య

కాళూరి హనుమంతరావు

స్వాతంత్ర్యము వచ్చినది. అన్ని మార్పులతో పాటు విద్యావిధానము గూడ మార్పులు చేయబడినవి. అందు వివిధభాషల కీయబడిన స్థానములివి: 1. ప్రాంతీయభాషను మొదటి భాషగా పరిగణించుట—4 పీరీడులు. 2. హింది, సంస్కృతము, ఉర్దూ, ఒక హిందూదేశభాష—వీనిలో నొక దానిని రెండవ భాషగా నేర్చుట—4 పీరీడులు. 3. ఆంగ్లమును మూడవ భాషగా నొనరించుట—6 పీరీడులు. 3వ భాషను రెండవ ఫారమునుండి ప్రారంభింపవలెనని నిర్ణయించుటయు, కాదు కాదు ఒకటవ ఫారమునుండి ప్రారంభింపవలెనని మార్చుటయు జరిగినవి. ఇక రెండవభాష నెప్పటికి మార్చుటనో తేల్చుట కొక చతుష్టయ సంఘ మేర్పఱుపబడినది. ఒక స్థిరాశయము గాని, ఒక శాస్త్రీయమైన పద్ధతి కాని, ప్రజాక్షేమము నందు దృష్టి గాని ఈ మార్పులయందు కానరావు. పైగా ఈ మార్పులయందు అంతర్వాహినిగా స్వార్థపరత్వము, భాషాద్వేషము ప్రవహించుచున్నవి. ఇట్టి మార్పులు సంస్కరణ లనిపించుకొనవు.

మొదటిభాష విషయమును పరిశీలించినచో, ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షలలో మొదటి పరీక్షగా చేయుట తప్ప దానికి కల్గిన విశిష్టత యేమియును లేదు. పోగా యింతకు పూర్వముకన్న నొక పీరీడు తగ్గింపబడినది. మాతృభాషయందు దృఢమైన జ్ఞానము పొందుటకు వీలులేకుండజేసి పుత్రద్రోహమునకును, అటు మాతృభాష పెరుగుటకు వీలులేకుండజేసి మాతృద్రోహమునకును ముందడుగు వేయుచున్నారు.

ఇక రెండవభాష విషయమును జూచినచో జాతీయభాష కానున్న హిందీకిని, ప్రాచీన సంస్కృతి కాలవాలమైన సంస్కృతమునకును ముడిపెట్టినారు. రెండును అవశ్యపరనీయములగు భాషలే. ప్రజా ప్రభుత్వమునందు సర్వవిషయములను ప్రతి పౌరుడు యెఱిగియుండవలెనని యుద్దేశించినచో ఆ విషయములన్నియు జాతీయ భాషలో నికముందు జరుగనున్నట్లు చేసిన ఆ భాషను ప్రతి పౌరుడును నేర్వవలసియును గదా! వర్తక వ్యవహారములు నడపుటకును, ఒక రాష్ట్రమునుండి వేఱొక రాష్ట్రమునకు విద్యాభ్యాసమునకు పోవుటకును, జాతీయత అభివృద్ధి యగుటకును జాతీయ భాషను అవశ్య పఠనీయము చేయవలెను గదా!

సంస్కృతము విషయము జూచినచో అది భారతీయ భాషలన్నిటికిని పుట్టినిల్లు. భారతీయ శాస్త్రము లన్నియును ఆ భాషయందే యున్నవి. పాశ్చాత్యుల మన్ననలకూడ బొంది వారిచే గూడ శ్లాఘింపబడుచున్న వాఙ్మయము మనకున్నది. సాంకేతికపదముల నందుండి గ్రహించుకొనుట సులభము. ఒకప్పుడు హిందూదేశము నకు రాజభాష. ఆంధ్రులమైన మనకు ముఖ్యముగ కావలసిన భాష. అట్టి భాషను ప్రోత్సహించుట లేక సరికదా దానిని విద్యావిధానము నుండియే తొలగింపజూచుట యెట్టి సంస్కారమో? స్వాభావికముగ సంస్కృతముపై ప్రేమ గలవారు ఉన్నతోద్యోగముల నాక్రమించుచు జాతీయభాషను ఎన్నడు మానగలరు?

నిజమునకు మన తమిళసోదరులకు ఈ రెండు భాషలను నేర్చుట కిష్టములేదు. సంస్కృతముతో వారికి సంబంధము లేదట. హిందీ ప్రతిఘటనోద్యమమును నడుపుచునే యున్నారు. వారిదారిని వారిని పోనిండు. మనము మాత్రము వాటిని విడనాడరాదు. సంస్కృతము విశ్వవిద్యాలయమునకు పోవువారికి నాలుగవ ఫారమునుండి అవశ్యపరనీయమగు భాషగానొనరించి కళాశాలలో దేశభాషాంగము నొనరింపవలెను. జాతీయ భాషను ఒకటవ ఫారమునుండి ఎస్.ఎస్. ఎల్. సి. వఱకు అవశ్యపరనీయమగు భాషగా నొనరింపవలెను.

ఇక ఆంగ్లము పేరునకు మూడవభాష కాని దానియందింతకు పూర్వముండవలసిన జ్ఞానమే

స్కెచ్

# ఫాయిదా గల వాయిదా

"హితశ్రీ"

'సాయంత్రం త్వరగా రావాలి సుమండీ.'

'ఏం కథ?'

'బజారుకు వెళ్ళాలి'

'ఎందుకు?'

'చీరలూ అవీ తేవొద్దూ?'

'తీరకు.'

'కావాలనుకుంటే బాగానే తీరుతుంది.'

'అయితే నే నబద్ధం చెబుతున్నాననా నీ ఉద్దేశం?'

'అని ఎవరన్నారు?' శ్రీదేవి చిన్నబుచ్చుకుంది.

మార్గంలో శివరామారావు కూడా బాధపడక పోలేదు. ఏం చేస్తాడు - ఏ రోజు కారోజు ఆఫీసు పని పెరిగిపోతూనే ఉంది. అది గాక ఆరు గంటలకి టెన్నిస్ నుంచి వచ్చి రంగున ఎనిమిది కొట్టేదాకా కబుర్లాడాలనుకొను ఆఫీసరు. అయినా తను. 'ఇవాళ కుదిరేట్టు లేదు; ఐనా సాధ్యమైనంతవరకు ప్రయత్నిస్తాను.' అని ఉంటే బాగుండేది. అసలు ఇవన్నీ ఆలోచించటానికి 'టైం' ఏది? అప్పుడే పన్నెండున్నర దాటుతోంది. లాండ్రీలో బట్టలు తేవాలి. చేతి గడియారం రిపేరుకి ఇవ్వాలి. ఇంకా ఎన్నో కలకు మిగిలిన పనులు.——

'ఏమయ్యా 'రేపు', 'రేపు' అంటూ ఎన్నాళ్ళయ్యా, నాలుగు రోజులనుండి తిప్పుతున్నావు. ఎప్పటి కిస్తావో ఖచ్చితంగా చెప్పు.'

చికాకు పరచే ఆలోచనలతో అడుగులు వేస్తున్న శివరామారావు తల ఎత్తి చూచి వెనక్కి తిరిగాడు లాండ్రీ వైపుగా.

'రేపు తప్పకుండా ఇస్తానులెండి - నేను మాత్రం ఊరికే కూర్చున్నానా, చూస్తానే ఉంటిరిగా. రండి, రండి బాబుగారూ - యేమన్నా గుడ్డలున్నా యేంటి?'

'అవునోయ్' శివరావు గుడ్డలమూట అందించాడు. చుట్టూ మేటెడు గుడ్డలున్నయ్.

'ఎప్పటి కిస్తావు?'

'ఎప్పుడోనా, రేపీపాటికి రండి.' అప్రయత్నంగా అన్నాడు లాండ్రీ యజమాని. శివరామారావుకి ఆశ్చర్యం వేసింది. ఎప్పుడో వేసిన గుడ్డలు ఆ రోజు దాకా ఇవ్వలేదని ఇంతకుముందే కదా ఘర్షణ జరిగింది. తన గుడ్డలు రేపే ఎలా ఇవ్వగలడు?

'ఏందయ్యా, రేపే ఇస్తనన్నావేంది ఈ గుడ్డలన్నీ. ఇస్త్రీ చేయాల్సిన గుడ్డలు ఇన్నుంటే ఇయ్యన్ని యాడవుతయి—?'

'రేపటిసంగతి రేపు. రేపు ఈల్లేదంటే గుడ్డలు ఏసునో ఎయ్యకపోనో—ఒచ్చే గుడ్డలు ఎందుకు వొదులుకోవాలి—?'

పక్కకొట్లో సిగరెట్టు కొంటున్న శివరామారావు నవ్వుకున్నాడు ఆమాటలు విని. పదవుతోంది! గబగబా నడుస్తున్నాడు అతడు. ఎదురుగా మాధవరావు వొస్తున్నాడు. ఈ మాధవరావు తనదగ్గర పాతికరూపాయలు అప్పు తీసుకుని సంవత్సరం దాటింది.

'ఏమోయ్. మాధవరావ్! కులాసా, ఎక్కడా కనపట్టమే లేదు?'

'ఏదోయ్, బొత్తిగా తీరిక దొరక్కుండా ఉంది— అన్నట్టు— నీ పాతికరూపాయలు ఇవ్వలేదే బాబోలు— జ్ఞాపకం ఉండటం లేదోయ్. రేపు తప్పకుండా ఇస్తాను. ఇంటిదగ్గరే ఉంటావు కదూ?' తుర్రుమన్నాడు.

ఇలాంటి రేపులు చాలా గడిచాయి. అయినా శివరామారావుకు కాస్త తృప్తిగానే ఉంది. రేపటిదాకా ఆశ ఉంటుంది రేపు దాటిన తర్వాత కదా పాతికరూపాయల విషయం మళ్ళీ ఆలోచనలోకి వచ్చేది!——

'సుబ్బారావుగారూ, ఈ గడియారం నమ్మె కట్టింది. దీని విషయం కాస్త చూడండి.'

'ఓ, అలాగే.'

'ఎప్పుడు రాను మళ్ళీ?'

'రేపే.'

'రేపేనా?' అన్నాడు శివరామారావు గోడ తీసిన గడియారాలవైపు చూస్తూ.

'అవును,' సుబ్బారావుగారి పెదవులమీద చిరునవ్వు చిందులాడింది.

శివరామారావు ముందుకు సాగాడు. తన ముందు ఇద్దరు విద్యార్థులు మాట్లాడుకుంటూ పోతున్నారు.

'సాయంత్రం సినిమాకి వెళ్దామా?'

'ఓ. ఎంత తిరిగినా, ఎక్కడికి వెళ్ళినా ఇవాళ ఒక్కరోజే.'

'అదేం?'

'రేపట్నుంచీ నేను తీవ్రంగా చదవ దలుచుకున్నాను.'

'ఓహో, అదా. మొన్నటినుంచీ తీవ్రంగాచదవడం ప్రారంభిస్తానన్నట్టున్నావు.'

'అవును. కొన్ని ఇబ్బందులవల్ల అది సాధ్యం కాలేదు. ఏమైనా రేపట్నుంచీ తప్పదు.'ఘంటాపథంగా అనేసి తృప్తిపడ్డాడు, తాత్కాలికంగా.

శివరామారావు అనుకోకుండా గట్టిగా నవ్వాడు. ఆ కుర్రాళ్ళిద్దరూ తనవైపు చూడడం చూసి తప్పిదం గ్రహించి పక్కన నడుస్తున్న అపరిచితుడితో మాట్లాడుతున్నట్టు నటించాడు. 'రేపు' వాయిదాలోని లాభాలూ, సుఖమూ, తృప్తీ అతడికి క్రమంగా అవగతమవుతూన్నాయి.

పోతూ, పోతూ యథాలాపంగా అడిగాడు టైలర్ని.

'ఏమోయ్, అయినాయా?'

ఒచ్చేజవాబు శివరామారావుకి తెలుసు.

"మీ వేనండి కుడుతూంట. రేపు-"

శివరామారావు నవ్వాడు భావగర్భితంగా టైలరువైపు చూసి. టైలరుకూడా నవ్వకుండా ఉండలేకపోయాడు.

శివరామారావు ఆలోచిస్తూ ఆఫీసువైపు నడకసాగించాడు. ఇందాక తను ఎంత పొరపాటు చేశాడు. త్వరగా రమ్మని శ్రీదేవి అన్నప్పుడు, తను కొంచెం ఆలోచించినట్టుగా నటించి తప్పనిసరిగా అన్నట్టు "ఇవాళ తీరిక ఉండదేమో శ్రీ-నిన్న చెప్తే ఎంతబాగుండేది. పోనీలే- రేపు తప్పకుండా వెళ్దాం." అని ఫీలవుతున్నట్టుగా చెప్పి ఉంటే ఆమె ఎంత సంతోషించి ఉండేది.

"ఈ కాస్తపని చేయటానికి మూడు రోజులు కావాలా? ఏమైనాసరే ఈ పని నాకు రేపటిలోపల పూర్తిచేసి చూపించాలి." అరుస్తున్నాడు- ఆఫీసరు పెద్ద గుమాస్తాతో. శివరామారావు గబ గబా వెళ్ళి తన స్థానం ఆక్రమించుకున్నాడు. బల్లమీద మేరుపర్వతంతో పోటీ చేస్తున్న ఫైల్సు ఉన్నాయి.

"వీటికి—జీవనదీ ప్రవాహం, అంతెక్కడ-" అనుకున్నాడు శివరామారావు.

"చూడండి, శివరామారావుగారూ" ఆఫీసరు అన్నాడు అతడి బల్లదగ్గరగావచ్చి. శివరామారావు నిలబడ్డాడు.

"ఇవన్నీ చాలా అత్యవసరమయినవి కావాలు. వీటికి సంబంధించిన పని త్వరగా పూర్తి చేయాలి."

"అలాగేనండి."

'ఎప్పటిలో పూర్తి అవుతుంది?'

శివరామారావు ఫైల్సు వైపు చూశాడు దిగాలుగా.

"ఏం, ఎప్పుడు పూర్తి చేస్తారు ఈ పని?'

ఇక్కట్లలు చూస్తున్న శివరామారావుకి చటుక్కున ఓ భావకిరణం మెరిసి నట్టయింది.

'రేపే' ధీమాగా, నిస్సంకోచంగా అన్నాడు- పెదవుల్లోంచి బయటికి వస్తున్న చిరునవ్వును బలవంతాన వెనక్కి నెట్టుతూ. 'భేష్. పనిమీద ఆసక్తి అంటే అలా ఉండాలి!' శివరామారావు భుజం తట్టి వెళ్ళిపోయాడు ఆఫీసరు, తృప్తిని సూచిస్తూ. పెద్దగుమాస్తా బిత్తరపోయి చూశాడు.




(ఏప్రిల్ 15-వ తేదీ సంచిక తరువాయి)

# ప్రకరణము 3

## బుక్కరాయలు

(క్రీ. శ. ౧౩౫౬–౧౩౭౭)

హరిహరరాయలకు సంతులేదు; అతని మరణానంతరము క్రీ. శ. ౧౩౫౬ వ సంవత్సరము నుండియు నతనికి బదులుగ సామ్రాజ్యమును పరిపాలించుచుండిన అతని రెండవ తమ్ముడు బుక్కరాయ లేకాధిపత్యము వహించెను. పెద్ద తమ్ముడు ప్రథమ కంపరాయలును నతని పుత్రులు నుండగా రెండవవాడగు బుక్కరాయ లెట్లు రాజ్యాధిపతి యాయెనో తెలియదు. అప్పటికి మొదటి కంపరాయలు గతించి యుండినందువలన, రాజ్యమున చాల నిర్వాహకుడై యుండిన బుక్కరాయలు దన యన్నకొడుకులకు రాజ్యమును జెందనీయక ఆక్రమించి సింహాసనము నధిష్ఠించెనని కొందరు పరిశోధకు లభిప్రాయ పడుచున్నారు. కాని ఇది యంగీకార్యము గాదు-ఏలనగా, మొదటి కంపరాయ లింకను సజీవుడై యుండగనే హరిహరరాయలు దన రెండవ తమ్ముని బుక్కరాయలను దనకు తుల్యుని గావించి రాజపదము నొసగి రాజ్యమునకు భాగస్వామిగ జేసి యతని సహాయముతో బ్రజాపాలన సేయ గడగెను. ఈ యేర్పాటునకు పెద కంపరాయలుగాని యతని పుత్రులుగాని ప్రతిఘటించినట్లు కానరాదు. లభ్యమైన సాక్ష్యమును బట్టి చూడగా వారు బుక్కరాయల యాధిపత్యము నంగీకరించినట్లే తోచుచున్నది. వారట్లు సమ్మతించుటకు గారణమేమో నిశ్చయించి చెప్పుటకు వీలులేకపోయినను గొంతవఱకూహింప వచ్చును. మహమ్మదు బిన్ తుగ్లాకు కంపిలి రాజ్యమునకు హరిహర బుక్కలను బంపినపుడు వారి నిరువురిని ఆ రాజ్యమున కధిపతులుగ నియమించినట్లు తెలియ వచ్చుచున్నది. ఇంతే కాక రాజ్యస్వాతంత్ర్యస్థాపన యందేమి యటుపిమ్మట రాజ్యవిస్తరణము నందేమి సర్వకార్యములును బుక్కరాయల మూలముననె జరిగెను. కావున హరిహరరాయలు వజ్రసింహాసనాధిష్ఠుడై సామ్రాజ్యమును పాలించుచుండినను బుక్కరాయల యాధిపత్యము నందఱు ఆద్యమునుండియు నంగీకరించి నట్లున్నది. ఈ కారణమువల్లనే హరిహరరాయల మరణానంతరము సామ్రాజ్యమున కంతటికిని బుక్కరాయలే ఏకాధిపతియై సర్వజన సమాదరణను బొంది యుండవచ్చును.

### తొండమండల విజయము :

బుక్కరాయలు సకల సామ్రాజ్యముపై నేకాధిపత్యమును వహించిన వెంటనే తొండమండలముపై దండెత్తిపోయి సంబువరాయల యధికారమును దుదముట్టించి యతని యేలుబడిక్రింద నుండిన దేశమునంతటిని వశపఱచుకొని సామ్రాజ్యమున గలుపుకొనెను. ఈ దండయాత్రకు కారణమేమో తెలియదు; కాని యూహించుటకు దుస్సాధ్యము గాదు. విజయనగర సామ్రాజ్యముపై బహమనీసుల్తాను అల్లావుద్దీను హసనుగంగూ ఎత్తివచ్చుటయె నిజ స్వాతంత్ర్య ప్రకటనకును రాజ్యవిస్తరణకును నదనని తలచి రాజనారాయణ సంబువరాయలు ద్రావిడ దేశమందు

బాలలో నొక దానిని దెఱపించి ఖడ్గహస్తుడై వెలువడి కుమార కంపణతో నేకాంగిపోరు సలిపి రణశయ్య నలంకరించెనట. అంతట గండరగూళి మారయనాయకుని యాధిపత్యము క్రింద విజయనగరసేనలు రాజగంభీర దుర్గమును లగ్గలువట్టి వశపఱచుకొనిరి. కోటయందుండిన రాజ నారాయణుని పుత్రుడు డిమ్మడి వెన్ను మఱి కొండ సంబువరాయడు మారయనాయకునిచే బందీకృతుడాయెను. అంతట తొండమండలమున సంబువరాయల యేలుబడి తుదముట్టినది. కుమార కంపణ రాజగంభీర దుర్గమునుండి బయలుదేరి యాక్షణమందే వీరసావణ్ణ స్వాధీనము జేసికొని యుండెన సంబువరాయని రాజధాని కాంచీపురమునకుపోయి యచట స్థిరముగ నిలిచి తొండమండలరాజ్యమును బాలింప గడగెను.

తొండమండల విజయముతో కుమారకంపణ దక్షిణ దిగ్విజయయాత్ర ముగియలేదు. మధుర మహమ్మదీయ రాజ్యమును కూలద్రోయవలయు నని యతని ముఖ్యోద్దేశము. దండయాత్రను బంపునపుడు రాయ లొసగిన యాదేశమట్టిది. ఈ దండయాత్ర కేవలము రాజ్యవిస్తరణకొఱకు తలపెట్టినది కాదు. హిందూధర్మ పునరుద్ధారణ యే దాని పరమావధి. సామాన్యముగ చరిత్ర కారుల దృష్టికెక్కని విషయమొకటి దీని గేట తెల్లము సేయుచున్నది. కుమార కంపణతో గూడ బయలుదేరినాడు కావేటి రంగధాముడు నిజావాసస్థలమును చేరుటకు. మల్లికాఫురుచే దఱుమగొట్టబడి, యాదేవు డనేకమొకలు పరదేశముల గ్రుమ్మరి గ్రుమ్మరి తుదకెట్లో తిరుమలకు వచ్చి శ్రీ వేంకటేశ్వరు నాశ్రయించెను. ఆపద్బాంధవుడు గదా యేడుకొండలవాడు. ఉండ నెలవు జూపి గ్రాసవాసములకు గొఱవ లేసియక దగు యేర్పాటులను గావించెను. ఆ గ్రిమ్మరి తనముపోయి కాలము సుఖముగ గడచుచుండినను అంతటి దేవునికి పరపంచల బ్రతుకాడుట నచ్చునా? పరాన్నము రుచించునా? కావున నెట్లయిన నిజ నివాస స్థలమునకు మరలిపోవ నిశ్చయించుకొనెను. అప్పుడే కుమారకంపణ దక్షిణ దిగ్విజయయాత్ర కై వెడలుచున్నాడను విషయ మాయన దివ్యచిత్తమునకు వచ్చినది. ఇక తురకల భయము లేదనియు స్వదేశమునకు బోవచ్చు ననియు ధైర్యము గలిగినది. తన్నిలు సేర్పజాలిన భక్తశిఖామణి కుమారకంపణ దండనాయకులలో గాన వచ్చినాడు. అభినవ ద్రోణాచార్యుడని ప్రఖ్యాతినందిన ద్విజోత్తముడు గోపన్న దనకు నచ్చిన భక్తుడు. అత డుద్దేశించిన కార్యమును పట్టుదలతో నెరవేర్పగలడు. కావున కార్యవాదియగు శ్రీరంగనాయకుడు గోపన్నకు స్వప్నమున బొడచూపి 'వత్సా, మహమ్మదీయులను బాఱద్రోలి మమ్ము శ్రీరంగము సేర్పు'మని యాజ్ఞాపించెను. నిదుర మేల్కొని గోపన్న వేంకటాచలమునకు బోయి రంగనాథుని నాచ్చియారులతో గూడ దోడ్కొని కుమారకంపణ వెంట దక్షిణ దిగ్విజయ యాత్ర వెడలెను. తొండమండలమును సాధించి సంబువరాయ రాష్ట్రము సంపూర్ణముగ స్వాధీన పఱచుకొనిన పిమ్మట కుమారకంపణ మధుర మహమ్మదీయ రాజ్యగడి ప్రదేశమున నుండు చెంజి మల దుర్గమునకు గోపన్న నధ్యక్షునిగ నియమించెను. 'సింజీపురముచెంత సింగరాయపురాఖ్య మగ్రహారము జేసి యందు బసిడి కోవెల గట్టించి గోపరాయుడు రంగపతిని బ్రతిష్ఠించె భక్తి నచట'. శ్రీరంగపతి యాదేవుని యాజ్ఞ చొప్పున శ్రీరంగమున బ్రతిష్ఠింపక మార్గమధ్యమున నొక బ్రాహ్మణాగ్రహారమున బసిడి కోవెల గట్టించి యచట నేల నిలుపవలసి వచ్చెనో కనుగొనవలసియున్నది. దీనికి రెండు కారణము లూహ్యములు- మొదటిది వన్యరాజ ప్రతిష్టంభము. సంబువరాయ మధుర రాజ్యముల మధ్య గడిప్రదేశమున గొన్ని యాటవిక సంస్థానము లుండినవి. దుర్గమారణ్యమధ్య సీమల నుండుట వలన నవి సులభసాధ్యములు గావు- వాని జయించి వశపఱచుకొనక ముందు సాగుట యుక్తముగాదు. ఆ కారణముచే మధురరాజ్యము పై వెంటనే కూడిసేసినట కనుపు లపడియుండక పోవచ్చును. దీనికంటె బలవత్తరమైన కారణము బహమనీ రాజ్యముతోడి యుద్ధము.

సుల్తాను ముహమ్మదుశా బహమనీసింహాసనము నధిష్ఠించినపుడు రాజకీయవాతావరణము నందనికి ప్రతికూల చిహ్నము లనేకములు పొడసూపినవి. రాజ్యములోపల నంతశ్శత్రువర్గము బలిసి యతని యధికారమును గూలద్రోయుటకు ప్రయత్నము సల్పుచుండినది. బలవంతులగు

కాపయనాయకుడు రాయబారమంపెను. మహమ్మదు శా హేమిసేయగలడు ? అప్పటి దుర్బల స్థితియందు దతనికి యుద్ధము తలపెట్టరాని విషయము-అమీరులా విశ్వాసపాత్రులుగారు; బలమా చాలదు; ధనమా లేదు. మీదుమిక్కిలి డిల్లీ పాదుశా హెత్తివచ్చు నను భయము. ఈ స్థితియందు విజయనగర తెలింగాణ ప్రభువు లేకమైక్యమునకు గాలుద్రవ్విన వారి నత డెట్లెదుర్కొనగలడు ? కాని యప్పటి స్థితిగతు లట్టె నిలుకడగ నుండజాలవు. ఖలీఫాకడకు బోయిన తన తల్లి కార్యమును సాధించుకొని వచ్చిన హిందూరాజులకు దగినశాస్తి చేయవచ్చును. కావున తనతల్లి తిరిగివచ్చునంతవఱకు కాలము గడపిన నటువెనుక సర్వకార్యములును సానుకూలపడవచ్చును. అని చింతించి మహమ్మదు శాహు కాలహరణము సేయ నిశ్చయించె. విజయనగర తెలింగాణ రాయబారులను సత్కరించి లాలించి బేలించి ప్రతిసందేశమును జెప్పి వీడికోలిచ్చి పంపక పదునెనిమిది మాసములు గడపెను.

అంతట మహమ్మదుశాహు తల్లి తిరిగి వచ్చినది మక్కానుండి. తాను కోరినట్లె ఖలీఫా ఢిల్లీ సుల్తానుకు ఫర్మనా వ్రాసి యంపెనని తెలియవచ్చెను. ఫీరూజుశాహు తుగ్లూకు మతమునందు గాఢాభిమానముగల ప్రభువు. ఖలీఫా యాజ్ఞను జవదాటక యాచరణకు దేగలడనుటకు సంశయములేదు. కావున రాజకార్యముల నిచ్చవచ్చినట్లు జరుపుటకు జంక బనిలేదు. మొట్టమొదట తనయెడ విముఖులైన యమీరులను శిక్షించెను. పిమ్మట విజయనగర తెలింగాణ రాయబారులను రప్పించి కోపోద్రేకముతో వారి నేలిన ప్రభువులు దనకు జెల్లింపవలసిన కప్పమును ఖజానాకు జమకట్టక నింతకాల మాలస్య మేలచేసిరో తెలుపవలసినదని తీవ్రముగ మందలించెను. రాయబారులంతట భయభ్రాంతచిత్తులై తమ సంస్థానములకు మరలి చని తమ ప్రభువుల కా విషయములను నివేదించిరి. అంతుమీదట బుక్కరాయలును గాపయనాయకుడును బహమనీ సుల్తానుపై యుద్ధము ప్రకటించిరి. తూర్పున గాపయనాయకుని సైన్యములు వచ్చి పూర్వము అల్లావుద్దీన్ హసన్ గంగూ తెలింగాణమునుండి జయించి కైవసము జేసికొనియుండిన కొలాసు మొదలగు స్థలములను స్వాధీనపఱచుకొనెను. అట్లే దక్షిణమునుండి విజయనగర సైన్యములు వచ్చి కృష్ణా తుంగభద్రల మధ్యసీమల నాక్రమించుకొనెను. ఇట్లు విజయనగర బహమనీ రాజ్యములకు యుద్ధము పొసగినది. (సశేషము)



# అద్దెయిళ్ల ఉపాఖ్యానం

'సాగర్'

'ఇల్లు కుదిరింది మాకు' ... 'ఎక్కడా ?'... 'ఎక్స్టెన్షనులో'...'చాలా దూరమే!' ...'ఏం చేస్తాం, వూరంతా గాలించినా ఆ మాత్రం కొంప దొరకందే!...' అతి ప్రయాస మీద యిల్లు దొరికింది. సంతోషకరమైన ఈ విషయాన్ని, మా పినతల్లి కూతురు పార్వతితో చెబుతున్నా, అప్పట్లో అంతకంటె ఆప్తులెవ్వరూ అక్కడ లేకపోవటం మూలాన్ని.

కుదిరిన యిల్లు చూట్టానికి పార్వతీ, నేనూ బయలు దేరాము. చూపించిన ఏజెంటును వెంట బెట్టుకుని, జటాక్కాలో.

మెయిన్ రోడ్డు వెంబడి ఎక్స్టెన్షన్ దాకా వెళ్లి, అక్కడ కొన్ని మలుపులు తిరిగింది మా జటాక్కా. అన్నీ చక్కటి బంగాళాలు, కొత్తగా కట్టినవి. మంచి గాలి అదీ వుంటుందని సంతోషించాను.

జటాక్కా ఆగింది. క్రీమ్ కలరు వేసిన ప్రహరీ గోడ, లోపల ఆ దే రంగు వేసిన డాబా. వార్నిష్ పూసిన తలుపులు, వాట్లకున్న

అందమైన నికెల్ గడియలు మమ్మల్ని లోపలికి ఆహ్వానించాయి. ఒక ముసలావిడ మాకు యిల్లూ, దొడ్డీ అవీ చూపించింది, వాట్లల్లో ఎక్కడ ఎలా మసులుకోవాలో పాఠం చెప్పింది. అన్నిటికీ 'సరే' అన్నాము.

పార్వతికి కూడా యిల్లు నచ్చినట్లే వుంది. జట్కా ఎక్కుతూ, 'ఆలస్యమైనప్పటికీ, మంచి యిల్లు దొరికింది. దూరమయినా సహించవచ్చు!' అంది.

మేం మా యింట్లో ప్రవేశించిన కొద్ది రోజుల్లోనే పార్వతి. భర్తకు ట్రాన్స్ఫరు కావటం మూలాన్ని, మరో వూరు వెళ్ళిపోయింది.

వెళ్తూ వెళ్తూ మాకు హితవుకూడా చెప్పిపోయింది. మంచి యిల్లు దొరికింది, అనవసరంగా గొడవలు పడకండి, యింటి వాళ్లు ఏమైనా అన్నా మనము తగ్గివుండటం మంచిది ...యేమేవో!

ఒక రోజున పార్వతి దగ్గరనుంచి వుత్తరం వచ్చింది మంచి యిల్లు దొరకలేదు! దొరికినది పెద్దదే అయినా చీకటి గుయ్యారం, దోమల పుట్ట, పగలే లైట్లు వుండాలి! పంపు వుంది దొడ్లో...ఎక్కడికక్కడికే నయం ..యింకా యింకా !

రోజులు గడిచిపోతున్నాయి. మళ్లీ పార్వతి దగ్గరనుంచి వుత్తరం: యింటావిడ పిల్లల కోడి; చాపల మార్కెట్టులో లాగ పిల్లలు ఎవరగా, గోల చేస్తూ వుంటారు. పొరపాటున రోడ్డు వెంబడి కారు వెడితే చాలు, దుమ్మంతా యింట్లోనే వుంటుంది...వగయిరా, వగయిరా.

ఇక్కడనుంచి మేమూ రాశాము: ఇంటి వాళ్లు ఒంటెత్తువాళ్లు, మహాగర్వం. అప్పు పుచ్చుకోవడమే గాని తిరిగి యివ్వడమంటూ వుండదు, కాయగూరలూ అవీ చేసుకుంటే ఓర్వలేరు! వాళ్ల పొంగుకు గొంతుకలకు సాయం, పాటలొకటి, తలకాయలు పగిలేలా... యేమేవో.

ఒక వుత్తరంలో పార్వతి అంటుంది: వాళ్ళ ఆయనకు గోడలకు క్యాలెండరులూ, సినీమా బొమ్మలు మొదలయినవి తగిలించడమంటేసరదా. అందుకని బోలెడు డబ్బు తగలేసి రకరకాలయినవి కొని పట్టుకవచ్చి గోడలకు తగిలించాడట. పొరపాటున యింటావిడ వాట్లను చూచింది... దాంతో ఆమె, 'పాపులోలాగ ఏమిటమ్మా పాడు బొమ్మలూ- సంసారుల కొంపల్లో', అని చీదరించుకుని, గోడలనిండా మేకులు కొట్టేశారని కారాలూ మిరియాలూ నూరి, పెద్ద రాద్ధాంతంచేసి చక్కా పోయిందిట.

పార్వతిని ఓదార్చడానికి మేము రాశాము: నయం! మాయింటి ముసలమ్మ, యింట్లో పిండి దంపుకుంటే, డాబా వూడి పడిపోతుందని గోల. అట్ట చెక్కల్లావున్న తలుపులు (అవి మా కర్మ) కొంచెం కొట్టుకుంటే పెద్ద శబ్దం చేస్తాయి. దాంతో పెద్ద గోల - యిదీ వరస.

చూస్తూంటే వానా కాలం వచ్చేసింది. పార్వతి రాస్తుంది కదా: వానంటే భయం పట్టుకుంది, యిల్లంతా కురవటమే! రాత్రిళ్లు వస్తే యింక శివరాత్రి జాగారమే!

మా అనుభవం రాశాము: మాకు వాన వున్నప్పుడే బాధ - మా సంగతిచూడు, పైన డాబా సరిగా గిలాబా చేయకపోవటంచాత నీరు నిలవుండి, వాన వెలిశాక దూలాల్లోంచి లోపలికి దిగి తర్వాత రెండుమూడు రోజులదాకా మా మీద పన్నీరువర్షం. చూచుకో మా అదృష్టం!

ఇంటి సౌఖ్యం విషయంలో ఒకరికి ఒకరం తీసిపోలేదని,వుత్తరాల ద్వారా తెలుసుకున్నాము. ఒకరినొకరం సముదాయించుకున్నాము.

ఎన్ని జాగ్రత్తలు తీసుకుంటేమాత్రం రోజు వస్తే తప్పుతుందా!

ఒకరోజున 'పిల్లిని ఎలక పట్టుకుంది'. అదిగో, యిదిగో అంటూ ముసలమ్మ లేనిపోని తగాదా లేవదీసింది. పెద్ద రగడ అయింది ఆవేళ. దాని పర్యవసాన మేమంటే-ఆ మధ్యాహ్నమే మేము చిన్నదయినా, ఇరుకయినా, ప్రహరీ లేక పోయినా, హంగులు సున్నా అయినా, ఏమీ ఆలోచించకుండా మరొక యింట్లో ప్రవేశించాము.

మూడో రోజుకే పార్వతి దగ్గరనుంచి వుత్తరం వచ్చింది. ఇంటివారబ్బాయికీ, వాళ్ళ రాముడికీ మధ్య తగాదా వచ్చింది. రాముడు వాడిని చితకబాదాడు. పెద్దలు అనవసరంగా రొంపి చేసుకుని తగాదాపడ్డారు, పర్యవసానం వాళ్లు యిల్లు ఖాళీ చేసేశారు!

# సంగీతం బహుముఖ ప్రభావం

"సూరి"

మనస్సుకూ శరీరానికీ యెంతో అవినాభావ సంబంధం వుందన్న సంగతి మనకు తెలుసు. శారీరకమైన బాధా, అనారోగ్యమూ మనిషి యొక్క మనస్సును క్రుంగదీసి అంతర్గత శక్తులను నశింపచేస్తాయి. దానికి విపర్యయంగా శాంతి, సంతృప్తులను కవచంగా ధరించి మానవుడు చిరాకు, నిరాశ, భయం, అనారోగ్యం తన దారికి రాకుండా కాపాడుకోవచ్చు. ఈ సిద్ధాంతాన్ని గమనించినప్పటినుంచి వైద్యులు యెక్కువగా దానిని వినియోగించుకొంటున్నారు. చక్కని సంగీతం శరీరారోగ్యంమీద, వివిధావయవములమీద ఎంతో ప్రభావం కలిగి వుందని గ్రహించారు. ఎక్సరే, పెన్‌సిలిన్ యెల్లాగ వుపయోగించుకొంటున్నామో, అల్లాగే సంగీతంకూడ తగుపాళ్ళలో సేవించేరోజు యెంతో దగ్గరలో వుంది. సంగీతం ఒక రకమైన యోగం. ఆ యోగాన్ని అభ్యసించేవాళ్లు శాంతి ననుభవిస్తారు. అంచేత మనస్సుకు, ముఖ్యంగా వ్యధిత హృదయానికి అది చక్కని మందు.

దైనిక జీవితంలోను, విద్యావిధానంలోను సంగీతంయొక్క స్థానాన్ని మన దేశస్థులు యేనాడో గుర్తించారు. అంచేతనే అష్టవిదవిద్యల్లో ఒకటిగా పేర్కొనబడ్డది. సంగీతంయొక్క మహత్తర ప్రభావాన్ని గూర్చి యెన్నో వింత వింత కథలున్నాయి. తాన్‌సేన్ యొక్క దీపకరాగం, త్యాగయ్యగారి 'తెరతీయగరాదా' అందులో చేరతాయి. 17 వ శతాబ్దంలోని ఒక ఇటలీ రచయిత మన నాగస్వరం లాంటిదే ఒక గేయాన్ని రచించాడు. అది పాడుతూ, నృత్యం చేస్తే 'టారంటెల్లా' అనే పాముకాటువలన కలిగిన బాధ పోతుందంటారు. ఆ నృత్యం చేస్తే కలిగే చెమటలోబాటు కొంతవిషం వెలికివక్కబడి బాధోపశమనం అవుతుందేమో! ఇప్పటికీ 'టారంటెల్లా' వ్యాప్తిలోఉన్న నృత్యవిశేషములలో ఒకటి. అంతవరకెందుకూ! పిల్లలను నిద్రపుచ్చడానికి కమ్మని లాలిపాటలను తల్లులు పాడడం మన యెరుగనిది కాదు. సంగీతంవలన కలిగే హాయికీ, ఆనందానికీ రసాయనిక శాలల్లో చేసిన పరిశోధనలు యోగ్యతా పత్రములు నివ్వవలసిన ఆవశ్యకత లేదు.

నాడి, ఉచ్ఛ్వాస నిశ్వాసములు, రక్తపు పోటు, గ్రంధిస్రావము వీటన్నిటి మీద సంగీతం తనప్రభావం చూపెడుతుంది. 'మనశ్చాంచల్యము కలిగిన రోగులను బాగుపరచడానికి, సామాన్య రోగులు త్వరగా నయం అవడానికి సంగీతం యెంతో తోడ్పడుతుంది.' అంటాడు మన్‌హాటన్ ఆసుపత్రి సూపరింటెండెంటు అయిన 'డెంట్' అనే శాస్త్రజ్ఞుడు. బాల్టిమూర్‌లోని హాప్‌కిన్స్ వైద్యశాలలో శాస్త్రోక్త పద్ధతిని తయారుచేసిన సంగీతం వినిపిస్తారు. డెట్రాయిట్ వద్ద 'ఇలాయిస్' వైద్యశాలలో వారానికి పది గంటలు సంగీతం వినిపిస్తారు. రోగుల తీరునుబట్టి ప్రోగ్రామ్ మారుతూవుంటుంది. ఈసురోమని మందకొడిగావుండే రోగులయితే, ఉత్సాహాన్ని, రేకెత్తించే సంగీతం వినిపిస్తారు.

సామాన్యులకుకూడ సంగీతం యెంతో మేలు చేకూరుస్తుంది. శస్త్రచికిత్సలలోకూడ అది ఉపకరిస్తుందని అనుభవజ్ఞులు చెబుతున్నారు. సంగీతం రోగులదృష్టిని మరల్చడమేకాక బాధనుకూడ కొంత ఉపశమింపచేస్తుంది. కాన్పుకు యెంతో కష్టపడే ఒక గర్భిణీ స్త్రీ ప్రసవసమయంలో చెవులకు ఫోన్ పెట్టుకొని రేడియో వింటోందిట. సంగీతంవలన కలిగిన సంతోషంలో అసలామెకు ప్రసవవేదన తెలియనేలేదట. దంతవైద్యులుకూడ అదేవిషయాన్ని బలపరుస్తున్నారు. రోగులకు తగిన సంగీతం వినిపిస్తే, వారి దృష్టి మరల్చడమే కాక, మనస్సును ఉల్లాస పరుస్తుందనీ, తమపని సుకరమవుతుందనీ వారి ఉద్దేశ్యం. "నిర్మలమైన హృదయంతో కోపభయాదులకు తావులేకుండా మనం భోజనం చెయ్యాలి. అంతేకాదు. భోజనసమయంలో సంతోషాన్ని కలిగించే సంగీతంవింటే గ్రంధులెక్కువగా జీర్ణరసములు ఉద్భవింపజేసి ఆహారం సులభంగా

జీర్ణమవడానికి తోడ్పడతాయి.' అంటాడు 'పావ్‌లావ్' అనే రష్యన్ శాస్త్రజ్ఞుడు.

ఇంకవరకూ రోగులు సంగీతానికి శ్రోతలుగా మాత్రమే వున్నారు. వారు కూడ పాల్గొనడం వల్ల గలిగే ఫలితాలు యింకా బాగుంటాయి. ముఖ్యంగా పిచ్చిఆసుపత్రులలోను, క్షయను నివారించే శానిటోరియంలలోను రోగులకు తగిన వసతులను కల్పిస్తే, వారు క్రొత్తవాద్యములమీద పరిశ్రమచేసి 'తాము పూర్తిగా నిరుపయోగులు కాదు' అనేభావాన్ని యేర్పరచుకొని త్వరగా కోలుకొంటారు.

అసలు సంగీతాన్ని వ్యాయామంలో ఒక భాగంగా పేర్కొనవచ్చు. అందులో గంభీర శ్వాసము వుంది. అందువలన ప్రతి జీవకణము ఆమ్లజనీకరణముచెంది నూతనమైన శక్తి నిస్తుంది. ఎక్కువ ఆకలిని పుట్టిస్తుంది. అందుకనే గాయకులలో ఉదరబాధలతోగాని, రొమ్ముబాధలతోగాని వుండేవారిని తరచు చూడం. అజీర్తి, కాలేయపువ్యాధులు, కామెర్లను కుదర్చడంలో సంగీతం యెక్కువగా ఉపకరిస్తుందని ఒక డాక్టర్ చెబుతున్నాడు. ఒక్కరూ పాడడానికి కంఠం బాగుండదనో, నలుగురూ ఆక్షేపిస్తారనో సిగ్గుపడేవారు నలుగురితో కలిసి పాడినప్పుడు ఆ సిగ్గుపోయి యెంతో చక్కగా పాడతారు. అయినా స్నానంచేసేటప్పుడు చాలమంది కూని రాగాలు తీయడం కద్దు. ఆ క్రితంరాత్రి అతను చక్కగా నిద్రపోయాడనడానికీ, ఆనాటి దైనిక సమస్యలను ఉత్సాహంతో యెదుర్కొంటాడనడానికీ అది ఒక చక్కని సూచన.

'చాలామంది సంగీతం వినడం అలవాటు చేసికొనడమే కాకుండా పాడడం కూడా అభ్యసిస్తే, ప్రపంచకంలో యింతమంది మతిభ్రమించిన మనుష్యు లుండ'రనిమనస్తత్వశాస్త్రజ్ఞులు చెబుతున్నారు. మనం అటువంటి ఉత్సాహాన్ని కల్పించుకొని, సంగీతం నేర్చుకోవాలి. అప్పుడే వ్యవహారపు చిక్కులనుంచి, సంసారపు బాధలనుంచి విముక్తిచెంది హాయిగా సుఖనిద్రపోవచ్చు. చక్కని సంగీతం మన జీవితపుటానందానికే గిలిగింతలు పెట్టినట్లుగా వుంటుంది. ఈన్‌స్టీన్ చక్కగా ఫిడేలు వాయిస్తాడు. అల్లాగే చాల మంది ప్రఖ్యాతపురుషులు తాము సంగీతం అభ్యసిస్తూ యెంతో ఆనందం పొందుతారు-శ్రోతలను సంతోషపరపలేకపోయినా !

పరిశ్రమలలో కూడ సంగీతానికి తావు లేకపోలేదు. కొన్నిచోట్ల కూలీలు పనిచేస్తున్నంతసేపూ, మరికొన్నిచోట్ల కూలీల భోజనసమంలోను, ఇంకాకొన్నిచోట్ల వారు పని మొదలుపెట్టేటప్పుడు ప్రోగ్రామ్‌లు వినిపిస్తారు. 'దానివలన తక్కువకాలంలో యెక్కువపనిని నిర్వహించగలుగుతా'రని విక్టర్ చెబుతున్నాడు. కూలీలు అలసటచెందుతే తిరిగి వారిని ఉత్సాహపూరితులను చెయ్యడానికి అనువైనది సంగీతం. ఆ ప్రోగ్రాములలో ఇలా యెన్నోరకాలు వుంటాయి.

సరే. సైన్యంలో సంగీతంనిర్వహించే ప్రముఖపాత్రనువేరే చెప్పనక్కర లేదు. కదం తొక్కుతూ సైనికులు నడుస్తూంటే, దానితో మేళవించి వాయిద్యములు మ్రోగుతూంటే వాళ్ళల్లో ఉడుకురక్తం ప్రవహించక మానదు. ఒకసారి నెపోలియన్ ఆల్ప్సు పర్వతాలు దాటి వెడుతున్నాడు. శీతాకాల మవడంచేత దట్టమైన మంచు కురుస్తోంది. ఫిరంగులను లాగడం సైనికులకు కష్ట మనిపించింది. గుర్రములుకూడ నిరుపయోగ మయాయి. వేడిరక్తాన్ని ప్రవహింపజేసే సంగీతం, ఉత్సాహాన్ని రేకెత్తించే సంగీతం ఆ పనిని యిట్టే పూర్తి చేసింది. అంతే కాదు. న్యూయార్కులో మాడిసన్ గార్డెన్‌లో సైకిల్ పోటీలు జరిగాయి. సగటున 18.6 మైళ్ళుపోయే పోటీదారులు, తమతో లయగలిపి సాగే సంగీతాన్ని ఊతగాతీసికొని, 19.6 మైళ్ళు పోజొచ్చారు.

దీన్నిబట్టి సంగీతానికి నిత్యజీవితంలో యెంత ప్రభావంవుందో మన విద్యాధికారులు తెలుసుకోవాలి. సంగీతం నేర్పడంమాట అటుంచి, కనీసం విద్యార్థులకు దానియందు అభిరుచి పుట్టేటందుకన్నా తోడ్పడాలి. అంతేకాక వైద్యశాలల్లో రోగులకు సంగీతం వినిపించడం అట్టే కష్టమైనపని కాదు. పారిశ్రామికులు, కనీసం భోజనసమయంలోనైనా, కూలీలకు సంగీతం వినిపించడానికి తగిన యేర్పాటులు చెయ్యాలి. వీటికి ఆలిండియా రేడియో ఉపయోగపడుతుంది.

(ఆధారం: 'గుడ్ హెల్త్')

ఇంగ్లీషు — ప్రపంచ సాహితి — రై డేవిస్

# అతడు కనిపెట్టిన రహస్యం

(రై డేవిస్ ఇంగ్లాండు వేల్సు భాగంలోని ర్హోండాలోయలో 1903 లో జన్మించాడు. బాల్యమంతా కూలీల సమ్మెలు, లాకౌట్ల సంరంభంతో గడిచి పోయింది. 18 వ ఏట లండన్ చేరుకున్నాడు. మొట్టమొదట వ్రాసిన నవల సంపాదించిన పారితోషికంతో ఫ్రాంస్, ఇటలీలు సంచారం చేశాడు. ఈయన పుస్తకాల్లో Tomorrow to Fresh Woods అనే నవల ప్రఖ్యాతమైంది. ఈయనే బౌద్ధ మతాభిమాని. ఆ మత సిద్ధాంతముల గురించి బహుళమైన పరిశోధనలు సాగించాడు. అహింసావాది.)

భూగర్భంలోనుండి పగటి షిఫ్టు కూలీలు పైకెగబాకుతున్నారు. కూలీల్ని సూర్యకాంతిలోకి చేర్చిన ఎలక్ట్రిక్ కేజ్, తన భారాన్ని భూమ్మీద కుమ్మరించి సురసురా బొగ్గు గుంటలోకి వెళ్లిపోయింది, తరువాతి జట్టును పైకి చేర్చటానికి. భూగర్భాంధకారాభ్యంతరం నుంచి విముక్తులైన కార్మిక బృందం వొక్కసారి సూర్యరశ్మిలో శరీరాల్ని విదిల్చి దూరంగా లోయలో నిద్రిస్తున్న వసతి గృహాలవేపు నడక సాగించారు.

గనిలో పనిచెయ్యటానికి తీసికెళ్లిన లాంతరు పవర్ హౌస్‌లో యిచ్చేద్దామని వెళ్ళిన ఆ జట్టులోని వొకడు తన పేరు నెవరో పిలవడం విన్నాడు.

'గోమర్ వాఘన్! వొక్క క్షణం యిలా వొస్తావా?' గోమర్ ఆ పిల్చిన వ్యక్తివేపు నడిచాడు.

'మీ యిల్లు మా యింటికి దగ్గరే కదా? వెళ్లే దారిలో వొక్కసారి మా యింటికెళ్లి నా భార్యతో నేను రాత్రి 8 గంటలదాకా యింటికి రాలేను లేదని చెప్పు. నే నీరైము కు యింటికి వస్తానని చెప్పాను కనుక నాకోసం ఎదురు చూస్తూంటుంది. అలా వెళ్ళటం నీకేం ప్రయాస కాదుకదూ?

'ప్రయాసేమీ లేదు.' చీఫ్ ఇంజనీరు పంపిన కబురందజేయటానికి గోమర్ సంతోషించాడు. ఇంజనీరు మాంటేగ్ ఇంగ్లీషువాడైనా బొగ్గు గుంట కార్మికులంటే సానుభూతితో వుంటాడు. అందువల్ల వాళ్ళందరికీ ఆయనంటే గాఢాభిమానం. గోమర్ సరేనని తల వూపి, వెళ్ళి ముందు నడుస్తున్న తన సహచర బృందాన్ని కలుసుకున్నాడు. వాళ్లంతా యువకులు.

'ఆయనకేం కావాలిట?' అడిగా డొకడు.

గోమర్ చెప్పాడు.

'బలే అందగత్తె ఆవిడ, బలే అందగత్తె' అన్నా డింకొకడు, మాంటేగ్ సతి నుద్దేశిస్తూ. 'ఆవిడ అహంకారమంతా - యీ లోకమంతా నాముందు బలాదూర్ - అన్నట్టుండే నడకలోనే కనిపిస్తుంది.'

'ఆవిడ గర్వపడ్డానికి కారణం లేకపోలే' దన్నాడింకొక శ్వానముఖం వామనమూర్తి, తనమాట అందరూ వినాలని గట్టి ప్రయత్నం చేస్తూ. 'అంతకంటే వుల్లాసంగల మనిషింతవరకూ పుట్టలేదు. ఆవిడరక్తంలో సగం ఫ్రెంచి రక్తంట! ఆవిడముందర మన ఆడమూక తడిసిన కోడి పెట్టల్లా వుంటారు. మన మందకులేని లక్షణాలు ఆవిళ్ళో వున్నవి.'

వాళ్ళందరిలో వయసుకు పెద్దయిన వాడన్నాడు: 'నా ముసలిదాని కావి కన్నెప్పుడూ మార్చుకోను. ఆ మొహంలోనే తాండవిస్తుంటుంది, లోపలి అహంకారమంతా. నే పందెం వేస్తా. యింట్లో ఆదుపుచిప్పిన గుజ్జులా వుంటుం దావిడ.'

గోమర్ ఏం మాట్లాడలేదు. ఆ అందరిలోకీ ఆఖరున పెండ్లయినవా డతనే. స్త్రీజాతిని గురించి చేసే సంభాషణల్లో యేమీ మాట్లాడ్డం అతని కిష్టం లేదు. అతడు చెప్పవలసిం దేమీ లేకపో లేదు. చాలా వుంది. తల్చుకుంటే స్త్రీజాతిమీద దూషణప్రవాహాన్ని వదలగలడు. లోపల వుడుకుతున్న వుద్రేకం కళ్ళని జ్యోతుల్లాగ చేయగా పళ్లు బిగించి, మిగతావాళ్ళు ఆడపెత్తనంమీద విసరే అవాకులూ చెవాకులూ వింటూ నడుస్తున్నాడు. అతనికి పెండ్లయి యేడాదయింది. భార్య బ్లాడ్‌వెన్‌తో పడే తగాదాలు హృదయంలో రగిల్చిన చిచ్చు యింకా మండుతూనే వుంది. ఆడదంత గయ్యాళిగా వుంటుందని కలలో కూడా అనుకోలేదతను. పెండ్లి కాకముం దెంత మృదువుగా, అణకువగా వుండేది! బుద్ధి చెప్పక పోడు. అందరూ నడుస్తూంటే కోపంతో సీలలు కొట్టిన బూట్లను రోడ్డుమీద గట్టిగా కొట్టాడు.

వాళ్ళు, కొండ దిగటమయి వరుసలు దీరిన నివాసాలు చేరగానే, ఎవరి ఎవరింటికి వాళ్ళు నడిచారు. గోమర్ యిల్లు కొండను ఆనుకొని వున్న ఆఖరువరుసలో వుంది. ఆ వరుస చివరనే ప్రత్యేకంగావున్న బంగాళాలో ఇంజనీరు నివాసం. ఆ బంగాళా వెనకనే పర్వతశిఖరాలు మేఘాల్లోకి చొచ్చుకుపోయాయి. గోమర్ తన యింటిని దాటి ఇంజనీరు బంగాళా చేరాడు.

అది వసంతకాలపు ప్రశాంత సాయంత్రం. సువర్ణభస్మపు సూర్యకాంతిలో మిళితమైన మందపవనాలు ప్రాణుల్ని ఉత్తేజపరుస్తున్నవి. ఆ పరిసరంలో చల్లదనాన్నిచ్చే ఫలవృక్షాలు, ప్రక్కనే పారుతున్న సెలయేళ్లు ఉన్నట్లయితే వాటిపక్కని విహరించివుండేవాణ్ణికదా అనుకున్నాడు గోమర్. కాని-భోజనమయి శరీరాన్ని కడుక్కున్న తరవాత ప్రతిరోజూ సంచారం వీధిమూలలకు, కాఫీ హోటళ్ళకేగా! అబ్బ, ఎంత అర్థరహితమయిన జీవితం! గోమర్ నిట్టూర్చాడు. రోజు తరువాత రోజు అదే క్రమం: బొగ్గు గుంటలోకి వెళ్ళటం, పైకిరావటం, భోజనం, శరీరప్రక్షాళన, బ్లాడ్‌వెన్‌తో పోట్లాట, తలుపు బ్రద్దలయ్యేటట్లు మూసి వీధిమూలలను పరువెత్తి తోటికూలీలతో రెండు గంటలసేపు లోకాభిరామాయణం, గయ్యాళితనంతో ప్రేలుతున్న బ్లాడ్‌వెన్ ముఖం ప్రత్యక్షమయ్యే యిల్లు.

బంగాళా గేటు తెరిచేముం దొకసారి గొంతు సవరించుకుని, కేకరించి వుమ్మేశాడు. ఇల్లాలి పోరు చాలారోజులు భరించాడు. ఇక తగాదాకు ఆవిడ సిద్ధమయితే తనూ సిద్ధమే. తల్లిలాగనే ఆవిడకూడా తనమీద నియంతృత్వం సాగించ ప్రయత్నిస్తోంది. పియానో కొంటానికి డబ్బు కావాలట! అది యింట్లో వాయించేవాళ్లెవరూ లేరు. పియానో యిస్తాడు...! తళతళ మెరుస్తున్న తలుపును తట్టాడు. ఒక్కసారి పరిసరాల్ని పరీక్షించాడు. అందమైన యిల్లు. పూచి విదులుస్తున్న పూలమొక్కలతో నిండినతోట. పొదలుపొదలుగా విరబూచిన గులాబీ గుంపులు. జీవితంలో ఎప్పుడూ అంత పెద్ద తెల్లని ఎర్రని గులాబీలు చూచి ఎరగడు. ఏం సువాసన! ఆ సువాసనంతా పీల్చే ప్రయత్నంతో యిసలు కొట్టాడు. అతని పిలుపు కెవరూ జవాబివ్వలేదు. తలుపు మళ్ళీ తట్టాడు. బాత్రోతు లేదా యింట్లో? ఆకలేస్తోంది. మళ్ళీ కొట్టాడు. లోపల్నుంచి అడుగుల చప్పుడు వినపడ్డది, మేడమీద నుంచి దిగివస్తున్నట్టు. అడుగుల చప్పుడు ద్వారాన్ని సమీపించింది. ఒక స్త్రీ మధురకంఠం:

'డార్లింగ్. ఒక్క నిమిషం ఆగలేవూ?'

ఆవిడ మాంటేగ్ సతి అయివుండాలి అనుకున్నాడు గోమర్. ఆవిడ భర్తే తలుపు కొడుతున్నా డనుకున్నట్లుంది. ఆవిడ కంఠధ్వనిలో వుద్రేకంతో నిండిన నవ్వు తొణికిసలాడుతోంది.

అలసిపోయి యింటికి వస్తున్న భర్తనెదుర్కొని ఆహ్వానించే విధాన మదే! ప్రేమతో, వుద్రేకంతో నిండిన కంఠంతో 'డార్లింగ్' అనటం... అటువంటి స్త్రీ భార్యాత్వాని కెంతేనా తగివుంది. తలు పొక్కసారిగా తెరుచుకుంది-

ఆశ్చర్యంతో గోమర్ నాలిక ఒక్కసారి అంగిలి కతుక్కుపోయింది. కొన్నిక్షణాలపాటు యిద్దరిమధ్య నిశ్శబ్దం గడ్డకట్టింది. అతని ఎదట పూర్తిగా నగ్నంగావున్న స్త్రీ నిలబడి వుంది. ఆవిడ నెమ్మదిగా, గుప్పిళ్లు బిగించిన హస్తాలు వక్షోజాలమధ్య పెట్టుకుని వెనక్కి నడిచింది.

'మిస్టర్...మిస్టర్...మాంటేగ్...నన్నా అడిగారూ...' గొణిగాడు గోమర్, ఎదుటిరూపం మీద హత్తుకుపోయిన దృష్టిని మరల్చలేక.

అబ్బ! ఏమిసౌందర్యం!

'నాతో చెప్పారు...' నమ్రతతో బొంగురు పోయిన కంఠంతో, 'నన్నడిగారు... '

కంఠం మూసుకుపోయింది. ఆవేశించిన వాడిలాగ ఆవిడవేపు చూస్తూ నిల్చున్నాడు.

వెనక్కి అడుగులేస్తూ ఆవిడ మేడమెట్ల దగ్గర వెనక్కి తిరిగింది. పైకి పరిగెత్తింది. ఆ వెళ్ళటం రాజహంస స్వర్గారోహణ చేసినట్లుంది.

'...చెప్పారు- మీతో 8 గంటలదాకా యింటికి రా తీరదని చెప్పమన్నారు...' అని అరిచాడు నిర్మానుష్యంగావున్న యింటిలోపలికి.

ఆవిడేమైనా జవాబిస్తుందేమో నని కొద్ది క్షణాలు వేచాడు. ఆవిడ మేడ దిగి వచ్చింది. లేత నీలిరంగు వాయిలు గౌను పైన కప్పుకుని. దిగివస్తున్న ఆవిడ ముఖం కందివుంది. కాని అతనివేపు నడిచేటప్పుడావిడ నవ్వింది. అబ్బ! ఏం లలితమైన నవ్వు! గోమర్ నాళాల్లోని రక్తం పరుగులెత్తింది. ఆవిడేం సిగ్గుపడలేదు, నగ్నంగావున్న ఆవిడ పాదాలు తెల్లకలువల్లాగ నేలను హత్తుకుని వున్నవి.

'నా భర్తవిషయమేమిటి?' అడిగింది మామూలుగా. గోమర్ చెప్పాడు. గనిలో అంటుకున్న బొగ్గు మసికింద అతని చెక్కిళ్ళు వుద్వేగంతో మండాయి.

అత నావార్త నందజేసినందు కావిడ కృతజ్ఞత తెలిపింది తరవాత.

'తలుపు కొట్టింది అతనే అనుకున్నాను నువ్వేమీ అనుకో వనుకుంటా. నేను స్నానం చేస్తున్నాను. నాకు వివాహమయింది కాదూ?'

గోమర్ తలవూపాడు. తీక్షణంగా పరికిస్తున్న అతడికళ్ళల్లోకి ఆమె నవ్వుతున్న కళ్ళతో చూసి సాఫీగా అంది.

'మంచిది. నువ్వు తెచ్చిన కబురుకు చాలా థాంక్స్'.

అతడు వెనుదిరిగాడు, తలుపు మూసుకుంది. వసారా దిగి, ఆలోచనగా ఆశ్చర్యంతో విడివడ్డ కళ్లతో గేటువేపు నడిచాడు నెమ్మదిగా... అంతవర కెప్పుడూ స్త్రీ నగ్నత్వాన్ని చూడలేదు—అంటే సజీవంగా సంచరిస్తున్న స్త్రీని. నగ్నచిత్రా లెన్నో చూశాడు. గౌరవకుటుంబ స్త్రీలు శరీరసౌందర్యాన్నెప్పుడూ అతిరహస్యంగా దాచుకుంటారని అనుకునేవాడు. అలా రహస్యంగా దాచుకోవాలా? నగ్నంగా అంతశ్శృంగారంగా వుంటారే! మాంటేగ్ సతి చాలా గౌరవనీయురాలే! ఆవిడభర్త కూడా అందరి మన్ననలు పొందిన వాడే! నీతిబాహ్యమైన పనులు చేస్తే అతడు వొప్పుకుంటాడా?... స్త్రీ తన భర్తను నగ్నంగా కలుసుకోవటం నీతిబాహ్యమైన పనికాదని గోమర్ నిర్ణయించుకున్నాడు. కాగా అది బహు రసవత్తరమైంది కూడా

గేట్ తెరుస్తూ గోడమీదకు పాకుతున్న గులాబిపొదను చూశాడు. విచ్చి. అందాల్ని వెదజల్లుతున్న పూలగుత్తుల్ని చూశాడు. ఒక పూలగుత్తి తీసుకున్నా పోయినట్లు గుర్తు తెలియదు. వెంటనే ఒక అందమైన గుత్తిని కోసి గేటు దాటుతూనే భోజనం తెచ్చుకున్న పాత్రలో పెట్టుకున్నాడు.

ఇంటివేపు నడుస్తున్న అతని నడక వడి హెచ్చింది. ద్విగుణీకృతోత్సాహంతో ఛాతీ విశాలమైంది. బ్లాడ్వెన్‌తో రాజీపడతాడు. కాని ఆవిడకు లొంగిపోయేమాట మాత్రం వుత్తది. ఏదెటువచ్చినా ఆవిడ తనభార్య. తానన్యాయవర్తనుడుకాడు. ఆవిడంటే ఎంతో ప్రేమగా వుండేవాడు కూడా. ఏ పురుషుణ్ణయినా సమ్మోహింపచేయగలిగిన అందం ఆవిడలో వున్నదని ఎప్పుడూ అనుకునేవాడు కూడా.

'నువ్వింత ఆలస్యంగా వచ్చావేం?' అన్నది నిందాపూర్వకంగా. అతడి జవాబు వినకుండానె అన్నది రుసరుసలాడుతూ-' 'భోజనం పాడయితే నన్నే మనవద్దు.'

'అంటే అర్థం పాడయిపోయిందనే అనుకుంటాను!' అన్నా డతను తన తెల్లని పలువరుస బొగ్గుతో నల్లబడ్డ ముఖంలో ప్రవేశించే టట్లు.

'అయితే వేళకు రా యింటికి,' అన్నది కటువుగా, ప్లేట్‌లోని పదార్థాన్ని వేళ్తో పొడుస్తూ.

అతడు ముందుకు వొంగి చిలిపిగా ఆమె వీపుమీద చురక వేశాడు. ఆవి డొక్క కేక వేసింది- ప్లేటులోని పదార్థం వొక్క క్షణం మేజా చివరని తటపటాయించి క్రిందకి జారింది. అతని చిలిపిచేష్ట, తత్ఫలితంగా కల్గిన ప్రమాదం ఆమెను ఉద్రిక్తురాల్ని చేశాయి. ఆమె మెడ పొడుగ్గా సాచి, కోపంతో జ్వలితమైన ముఖంతో పక్క గదిలోకి వెళ్ళిపోయింది.

'చాలు. ఇక యీ అల్లరి చాలు.' అని అరుస్తూ పళ్లాలూ గ్లాసులూ అటూ యిటూ విసిరి కొట్టింది.

'కోపగించకు' గోమర్ లాలించాడు. 'కోప్పడకు. ఇప్పుడేం నష్టంవచ్చింది?. ఆ పదార్థం మీద కాస్త దుమ్ము పడ్డ దంతేగా! ఇప్పుడు చూడు బాగవుతుంది. బ్లాడ్, శాంతించు. భోజనమేది? నా కాక లేస్తోంది.'

ఈ లాలన ఆమెకి చాలా ఆశ్చర్యాం కలుగ జేస్తు దని అతడికి తెలుసు. మామూలు సమయాల్లో అయితే వొక్క సారి తిడుతూ ఆవిడ మీద విసుచుకు పడేవాడు. ఆవిడమాత్రం పక్క గదిలోనే వుండి పోయింది. నిట్టూరుస్తూ అత డక్కడికి వెళ్ళాడు. అతన్ని చూడకుండా వెనక్కి తిరిగి పంపు దగ్గరకు వెళ్ళింది. ఆమెని వెంబడించి చెవులో వూదాడు-

'నీకంత ఆగ్రహమెందుకు డార్లింగ్! నిన్ను పోషించటానికి పొద్దస్తమానం ఎముకలు విరుచుకుని అలసి యింటికి తిరిగి వచ్చిన మనిషిని ఆహ్వానించే విధంకదూ యిది? ఒకసారి యిటు తిరిగి నీ నవ్వు ముఖాన్ని——వెనకటి రోజుల్లో మాదిరి- నాకు చూపించు. నీకేం తెచ్చానో తిరిగి చూడు...'వెనక దాచిన చేతిలో వున్న గులాబీతో ఆమె చెవులకు చక్కలిగింత పెట్టి, ముక్కు దగ్గర వాసన చూపించాడు.

'వాసనచూడు. గ్లాస్‌లో పెట్టుకో'

ఆవిడ ఆగ్రహంతో తిరిగి, 'చాకిరి చేసుకునేందుకు వేసుకున్న గ్లానెకి గులాబీ యెందుకు నాకు? అయినా ఎక్కడణ్ణించి తెచ్చావు దాన్ని!' ఆమె వెంకితనం కొంత సడలుతోంది.

'అది నా రహస్యం.'

'సరే అయితే. మేజామీద కప్పులో వుంచు దాన్ని.' అన్నది వొత్తుగావున్న కురుల్ని విదులుస్తూ.

అతడు భోంచేస్తూవుంటే మళ్ళీ పియానో విషయం ప్రస్తావించింది.

'జోన్సు ఇవాన్సు కంపెనీనుండి యీ వేళ కాటలాగ్ వచ్చింది. మిగతా కంపెనీ లన్నిటి కన్న వాళ్ల దగ్గర చవక. వారానికి ఏడున్నర కడితే వచ్చే దొక రకం వుంది.'

ఆగ్రహంతో వొక్క క్షణం అతని కనుబొమ ముడి పడింది. అతడు మాట్లాడలేదు. ఆమె మాట్లాడుతూనే వుంది.

'చూద్దాంలే' అన్నా డతడు.

భోజనం కాగానే మండుతున్న బొగ్గుల ముందర చాప చుట్టబడి, పెద్ద కొయ్యతొట్టి లాగబడింది. కండలు తీరిన హస్తాల్లో బ్లాడ్‌వెన్ నిప్పులమీదవున్న పెద్దకాగులోని వుడుకుతున్న నీళ్లను తొట్టిలోకి దొర్లించింది. గోమర్ దుస్తుల్ని తీసివేశాడు. బొగ్గుగుంట మసంతా అతని శరీరమ్మీదేవుంది. బ్లాడ్‌వెన్ చన్నీళ్లు కలిపి పాళాలు చేస్తుంటే గోమర్ తొట్టిలోకి దిగాడు. అతను శరీరం పరిశుభ్రం చేసుకుంటుంటే, భోజనంచేసిన పళ్ళాల్ని కడిగిం దామె. పనిలో ఆమె మంచి చలాకీది; యిల్లంతా పరిశుభ్రంగా మెరుస్తూ వుంటుంది.

'మిగతా అంతా అయింది. వీపు రద్దు.' అని కేకేశాడు.

'ఒక్క నిమిష మాగు,' అన్నది కటువుగా, పళ్ళాల్ని లోపలికి తీసికెళ్లుతూ. తుడిచి, తెల్లగావున్న ముందుభాగాన్ని వెక్కిరిస్తున్నదా అన్నట్లున్న మసితో నిండిన వీపుతో అలానే కాచుకుని వున్నాడు. ఆమె తన మామూలు

వెంకే తన్నాని చూపుతోందని తెలుసతనికి. రమ్మని వొక్కటంకే వేసేవాడే కాని యీరోజు మాత్రం అలా చెయ్యదల్చుకోలేదు. ఆమె వీపు తోమి తుడవడానికి వచ్చినప్పు డతనేమీ మాట్లాడలేదు.

'నగ్నంగావున్న మగాడి శరీరమంటే నీకేమీ గౌరవమున్నట్లు లేదు బ్లాడ్: నా శరీర మేదో పాతచర్మంలాగ రుద్దుతున్నావు.'

'బహ్! రుద్దడానికి పౌడర్ పఫ్ తెస్తావా.'

సుహృద్భావంతో మందమందంగా నవ్వాడు. ఎలాగైనా ఖుషీలో వుంచాలి.

'ఏదో వొకరోజు నీభర్త శరీరంమీద వున్న చర్మం ఎంతఅందమైందో గ్రహిస్తావులే బ్లాడ్' అన్నాడతడు, ప్రేమతో మృదువయిన కంఠ స్వరంతో.

'అహంభావం' అన్నది, అతడు శరీరాన్ని తువ్వాలుతో తుడుచుకుంటుంటే చూడకుండా వెనుదిరిగి.

సాయంత్రం ఆవిడ బయటకు వెళ్ళడానికి దుస్తులు మార్చుకునేటందుకు పైకి వెళ్ళుతుంటే, మండుతున్ననిప్పు వెచ్చదనంముందర చలికాచు కుంటూ విశ్రాంతి తీసుకుంటున్న గోమర్:

'బ్లాడ్, సాయంత్రం ఎక్కడికేనా బయ టకు వెడతావా?'

'అవును. చర్చికి వెడుతున్నాను.'

'ఈ సాయంత్రం వెళ్లకు' అన్నా డతడు.

ఆవిడముఖంలో ఆశ్చర్యం తొణికిసలాడు తోంది. ఈ ఆప్యాయంతో గౌరవప్రదంగా సంభాషించటం, ఆవిడ నిర్ణయాలకు అడ్డురావ టం ఎప్పుడూ లేదు.

'అల్లాగా' అన్నది కయ్యానికి కాలు దువ్వుతూ.

ఆవిడవేపొక్కసారి తన అందమైన తల వూపాడు. కళ్ళలో ఏదో వింతకాంతి గోచ రిస్తోంది; పెదవులమీద మందహాసం తొణికిస లాడుతోంది.

'ముందువెళ్ళి బట్టలు మార్చుకురా' అన్నాడు

ఈసడించుకుంటూ పైకెళ్ళిపోయింది. ఆవిడ రాక కెదురుచూస్తూ కూర్చున్నాడు. ఎట్టని పట్టు దుస్తుల్లో తిరిగి వచ్చింది. ముఖం పరిశుభ్రంగా కళకళలాడుతోంది. చర్చిలో జరగనున్న మహిళాసభకు వెళ్ళటానికి ముస్తాబైంది. ఆవిడ అందాన్ని మెచ్చుకుంటున్న దృక్కుల్తో మృదు వుగా అన్నాడు—

'ఇలా రా బ్లాడ్-'

'ఏంకావా లిప్పుడు?' అన్నదావిడ వుత్సాహ శూన్యంగా. అతడి కుర్చీకి దగ్గరగా వచ్చింది— కాని పక్కనున్న షెల్ఫుమీద దేన్నో వెతుక్కో టానికి.

'ఈ రాత్రి నువ్వెంతో అందంగా వున్నావు' అన్నాడు. అంటూ హఠాత్తుగా ముందు కొరిగి ఆమెని పట్టుకున్నాడు. ఆమె తనకున్న దుస్తుల్లో కల్లా మంచివి వేసుకొని వున్నప్పుడు చేస్తున్న యీ చిలిపి చేష్టలకు ఆగ్రహించింది. కాని అతడు గట్టిగా పట్టుకున్నందున మెదలకుండా వూరక తప్పిందికాదు...అతడామె చెవులో ఏదో వూదాడు.

హఠాత్తుగా, బలవంతంగా అతని పట్టు నుంచి విడిపించుకుని చెంపమీద కొట్టింది. అతడు కుర్చీలోంచి దుమికి లేచాడు. ఆమె సన్నని గొంతుమీదా ముఖమ్మీదా నరాలుబికాయి.

'అలాగా...అలాగా...మూర్ఖుడా, దుష్టుడా ...నే నెవ రనుకున్నా వేమిటి? నీ భార్య ననే విషయంమర్చిపోకు. నన్ను గౌరవించటంనేర్పుతా నుండు నీకు— గోమర్ వాఘన్.' అన్నది వగర్చుతూ. ఆమె కంఠ ధ్వనిలోవున్న క్రోధా సహ్యాల వెనుక భయం లేకపోలేదు.

కాని అతని శరీరం జ్వాలానలంలో వుంది. ఆమెవేపు తల సాచాడు— కండ్లు మండుతున్న గాజుగోళాలలా వున్నాయి.

'అదే జ్ఞాపకం వుంచుకో దొరసానీ, నీవు నాభార్యవు గనుకనే అలా చేస్తున్నానని జ్ఞాపకం వుంచుకో. ఇటు చూడు. ఇన్నాళ్లూ చేస్తున్న నీ వేషజాలు, నాజూకు యిక కట్టిపెట్టు. ఇన్నాళ్లూ యీ యింట్లో పరాయివాడిలాగా వున్నానేమో. ఇకమీద నే నేం కోరితే అది చెయ్యాలి నువ్వు.'

'ఏ మాత్రం వీల్లేదు. ఇంత మొరటుదనం నేను కనీ వినీ యెరగను.'

'దీంట్లో తప్పేమిటి?' వుక్రోషంతో అడిగా డతడు. 'నేను స్నానం చేసేటప్పుడు నన్ను చూట్టంలేదూ నువ్వు?'

భయంతో అతడినుండి వెనక్కి జరుగుతోంది.

'ఈ ధిక్కారం నేనెప్పుడూ వినలేదు' అన్నదావిడ. ముఖం వాడిపోయింది; కళ్లలో భీభత్సం తాండవిస్తోంది.

'ఎప్పుడూ వీల్లేదు. మగాడికీ ఆడదానికీ ఎంతో భేదం. అయినా నీవే చెప్పుడూ నేం చూడను...ఆ దృష్టితో-'

ఆమె వేపు లంఘిస్తున్నాడతడు. అతని కళ్లల్లో మండుతున్న మారని నిర్ణయాన్ని చూచిందామె. హఠాత్తుగా, గభీమని గదిలోంచి బయటకు దూసుకుపోయింది. అతనిదూకు వొక్క క్షణం ఆలస్యమైంది. బయటి తలుపు వేసిన చప్పుడైంది. ఆమె యిల్లు దాటి పోయింది.

* * *

ఆమె పదిగంటలకి తెలుసుకోవలసి వచ్చింది. క్రితం రెండుసార్లు పెద్దగా పోట్లాడుకున్నప్పుడు తల్లి, విధవరాలు హాప్కిన్సుసతి యింటికి వెళ్లింది ఆవిడ మిఠాయి దుకాణాదారు. తరవాత తల్లి రావటం జరిగింది- 'ఆవిషయం మాట్లాడ్డానికి'. ఈరాత్రి ఆవిడ తప్పకుండా వస్తుంది. ఆవిడంటే అతనికి విపరీతమైన ద్వేషం.

ఒకగంట తరువాత ఆవిడ రానే వచ్చింది. కయ్యానికి తయారైన ఆవిడముఖం కనబడగానే గోమర్ బెల్టుబిగించి గట్టిగా చూచాడు.

'మా బ్లాడ్‌వెన్ చెప్పిన విషయమేమిటి గోమర్‌వాఘున్?' అని ప్రారంభించింది, నొచ్చుకున్న కంఠధ్వనితో. ఈసారి కూడ బెదిరిపోయి భీతావహం చెందినదానివలె నటించింది.

కోపంతో గట్టిగా అరచాడు: 'నీ కూతురుకసలు భార్యగావుండే యోగ్యతే లేదు, లిడ్డీ హాప్కిన్స్. గుజ్జుపిల్లలాగ తల్లిదగ్గరకు పరుగెత్తటం! నువ్వుమాత్రం మా విషయంలో ఏమీ జోక్యం కల్గించుకోకు. వెంటనే తిరిగివెళ్లి నీ మూర్ఖపుకూతుర్ని పెండ్లిచేసుకున్న మొగుడిదగ్గరకి తక్షణం రమ్మను. తెలిసిందా?' అని వెనక్కు తిరిగాడు.

'నీకు సిగ్గులేదూ?' గయ్యాళిగా అరచింది, హాప్కిన్సుసతి. 'ఎంత అపకీర్తికరమైన విషయం నేనిప్పుడు బ్లాడ్‌వెన్ నుండి విన్నది? నాసలహా అడిగింది. మర్యాదస్థుడనుకున్నాను గోమర్ వాఘున్. మంచి కట్టుబొట్టుంగా, దేవుడు, దేవత భక్తితో, వొక్క అపవాదుకూడా ఎరక్కుండా పెరిగినపిల్ల నా కూతురు. ఇప్పుడు దాన్ని నీ పిచ్చిపిచ్చి కోరికలకు తలొగ్గమంటావు-' కంఠధ్వని అంతిమస్థాయికి పోయింది. 'నే విన్న ఈ విషయం ఘోరంగా వుంది. నీ వసలు గౌరవ కుటుంబపు పిల్లని చేసుకోతగవు. సిగ్గుచేటు నీ పని. నా రొలెండ్ బతికుండి యీ విషయం విన్నట్లయితేనా! ఇంతెందుకు గోమర్‌వాఘున్, నలభయి సంవత్సరాలతనితో కాపురం చేసినా వొకసారికూడా నన్నట్లా మాడాలని కోరలేదతను. దైవభీతి కూడా లేదూ? సర్వం దేవుడు చూస్తుంటాడని మర్చిపోయావా?'

ఈ కేకలు సాగించినంతసేపూ గోమర్ నిశ్శబ్దంగా వున్నాడు. ఎదుటవున్న నిప్పులోకి వుమ్మేసి:

'ఛో. ఎంత సంకుచిత స్వభావం!'

హాప్కిన్సు సతి భారంగా వూపిరిపీల్చింది.

'నన్నింత అవమానపరుస్తావా? నా భర్తే బతికున్నట్లయితేనా! అయ్యో నా కూతురికి పెండ్లికాకుండావున్నా ఎంతబావుండును.'

దాంతో గోమర్ శాంతం అంతరించింది. ఆవిడవేపు తిరిగి అరిచాడు:

'నోరు మూసుకూరుకో- ఇప్పటి దంపతుల సంగతి నీకేం తెలుసు, కలిగించుకుంటావు? బ్లాడ్‌వెన్ అభిప్రాయాల్ని వంకర మార్గంలో పెడుతున్నావు. ఆమె ఆడది కాదూ! నే నడిగిందాంట్లో విపరీతమేం లేదు. ఈవేళే నే నటువంటి విషయాన్ని చూచాను.'

'ఎవరూ?' అడిగింది హాప్కిన్సు సతి ఆత్రుతతో, కోపంతో. తరవాత ఏఅర్థంతీసేది గమనించకుండా జవాబిచ్చాడు. 'మాంటేగ్‌సతి నేను—'

ఆవిడ అతన్ని మాట్లాడనివ్వలేదు.

'హా! ఆవిడా? ఆవిడంటే చాలాకాలం నుంచి వున్నది నాఅనుమానం...సరేలే గోమర్ వాఘున్ ... సరేలే—' అంటూ గదిలోంచి మెల్లిగా వెనక్కు నడిచింది, జయసూచకమైన కండ్లతో.

గోమర్ అరిచాడు: 'వెంటనే బ్లాడ్‌వెన్ని యిక్కడకు పంపు—'

హాపిక్సున్న సతి తన స్థూలకాయాన్ని ఆశ్చ ర్యకరమైన వేగంతో బయటకు చేర్చింది. 'మూర్ఖాంలే...అబ్బాయా... మూర్ఖాంలే...'

గోమర్‌కు మాత్రం బ్లాడ్ వెన్ తిరిగి వస్తుందన్న విషయంలో ఏమీ సందేహం లేదు.

* * *

అత ననుకున్న దానికంటే ముందుగానే తిరిగొచ్చింది, ఇంటికి కల్లి వెళ్ళిఅశను కనిపెట్టిన రహస్యాన్ని చెప్పిందో లేదో.బ్లాడ్ వెన్ కోపంతో భర్త కూర్చున్న గదిలోకి పరుగెత్తింది.

'నీవా మనిషిని చూస్తున్నావా?' రొక్కింది బ్లాడ్ వెన్. ఒక్కసారి అతని మీదకు దూకు దామా అన్నట్లు చూసింది. కట్టబడి వున్న జాగిలం మాదిరి - కోపంతో యిటూ అటూ తిరి గింది, కళ్లలోంచి నిప్పులు కక్కుతూ.

'ఇంటికి ఆలస్యంగా వచ్చినప్పుడల్లా వెళ్లి తున్న దక్కడకా! ఇవా నీకోతిచేష్టలు...'

'ఆగు, ఆగు, బ్లాడ్ వెన్—' అని మొద లెట్టాడు. కాని మెదలకుండా పూరుకున్నాడు. ఆమె మోపిన నిందని కాదనటానికూడా ప్రయత్నించలేదు. కొంటెతనం అతని పెదవుల మీద తాండవం చేస్తోంది. బ్లాడ్ వెన్ మాత్రం అతన్ని దూషణ పరంపరల్లో ముంచేస్తూ నేవుంది. ఆమెలో ఆవేశం మరీ ఎక్కువవుతోంది. ఆమె నోరు నురుగులు కడుతోంది, కండ్లు వుబికాయి. ఆగ్రహంలో వున్న ఆమెశక్తి.సౌందర్యం అతణ్ణి ముగ్ధుణ్ణి చేశాయి. అలా వున్నప్పుడామె అందం జగన్మోహనంగా వుంది. అతని కొంటె నవ్వు మాత్రం ఎక్కువవుతూనే వుంది. ఆమె ఆగ్రహం మితిమీరి పోయింది.

'ఇంకొక్కరాత్రి కూడా నేనీయింట్లో గడ పను. నాతల్లి నన్ను మళ్ళీ తన యింటికి సంతో షంగా ఆహ్వానిస్తుంది.'

ఆమెభయం వున్నతస్థాయి నందుకున్నదని గ్రహించాడు. లేచి దగ్గరకెళ్ళాడు. భయం తో వెనక్కుపోయింది; అతడు వెంబడిం చాడు. బలంగా ఆమెచేతుల్ని పట్టుకుని:

'నీదూషణ చాలాసేపు భరించాను బ్లాడ్. నేను అవినీతిగా వున్నాననే అభిప్రాయం ఎవరు కలిగించారు నీకు? ఆముసలిది బోధించిం దేమిటి?'

'మాంటేగ్ సతిని నగ్నంగా చూచానని చెప్పా వుటగా ఆవిడతో ?'

'మాసినమాట నిజమే—' బ్లాడ్ వెన్ పట్టు తప్పించుకోటానికి ప్రయత్నించింది. 'ఓ' అని పెద్దగా ఏడ్చింది.

'ప్రపంచంలో కొంతమంది స్త్రీలు సమపాం దర్యం విషయంలో నీలాగ లోభులుకారు. భర్త నెలా సంతోష పెట్టాలన్న విష యంలో మాంటేగ్ సతికి మంచి అభిప్రాయా లున్నాయి. నామాట విను...' అని సాయంత్రం జరిగిన విషయం చెప్పాడు.

ఆమె శాంతించింది. ఆశ్చర్యం, అద్భుతం, విస్మయం, ఒకదానివెంట ఒకటి ముఖాన్ని ఆవ రించాయి. ఆవిడకళ్లల్లో నెమ్మదిగా అవగా హనా కాంతి వుదయించింది.

'ఇప్పుడు తెలిసిందా విషయం? నా గురించి ఎంత త్వరగా చెడు అభిప్రాయానికి వచ్చావు! మాంటేగ్ సతి యివ్వగలిగిన దృశ్యం చూద్దా మని నేనింటికి వచ్చాను. నిజంగా కూడా చూసే వాణ్ణే. కాని నీవు తప్పుఅభిప్రాయాల్తో పెంచ బడ్డావు. అందులోనే వుంది లోటంతా. విపరీత మైన సిగ్గును నేర్పారునీకు.'

ఆమె తల వంచింది.ఆరోగ్యంతో వుబికి వం పులు తీరిన చెక్కిళ్లు చూస్తుంటే అతడిలో ప్రేమ వెల్లువలైంది. ఉదారత అతన్ని ముంచెత్తింది. మృదువుగా అన్నాడు:

'నే చెప్పేది విను, బ్లాడ్. మనిద్దరం వొక రాజీకొద్దాం. నీ కా పియానో కావాలని గట్టి కోరికవుందికదూ? సరే వొకరినొకరం మన్నించు కుందాం...సరేనా ?'

ఆమె తల యింకా వంచింది. బంగారంలా మెరుస్తున్న ఆమె శిరోజా లతని పెదవుల్ని తాకి నవి. అతడు కంపించాడు. అతని చెయ్యి ఆమె భుజాలమీదకు జారింది. ఆవిడేం మాట్లాడలేదు.

'—వొకరంటే వొకరం ప్రేమగా వుందాం. మీ తల్లి తంద్రుల్లాగ ఎప్పుడూ పోట్లాడు కుంటూ కాకుండా. మనయిష్టం వచ్చినట్లు జీవిం చాలి బ్లాడ్... ఆ! యిప్పుడు చూడు...కనుల పండువుగా లేదూ? ... నా బంగారం ...నా దేవత !

(అనువాదం: కె. యస్. శివరావు)

# ఆమె తపన

మూలం : లాస్లొగొమోరి　　　　అనువాదం : గోపాలచక్రవర్తి

ఆమె సోఫా మీద పవ్వళించి చాలసేపు విలపించింది. ఉదయం నుంచీ ఆమె మనస్సు ఎంతగానో బాధపడుతున్నది. వార్తా పత్రిక చదువుతూవుంటే చేతులు వొణికాయ్. ఇక చదవలేకపోయింది. ఇల్లంతా తమస్సముద్రంలా గోచరిస్తున్నది. ఏదో తెలియని భయంతో ఆమె శరీరం ఘనీభవించింది. పేపరులో ఆవిడ చేసిన ప్రకటన స్పష్టంగానే వున్నది. 'పేరూ, విలాసం, బహుమతీ' అన్నీ కూడా చాల జాగ్రత్తగానే వ్రాసింది. అంత జాగ్రత్తగా వ్రాసినా ఇంకా ఎవ్వరూ తీసికొనిరాలేదేం చెప్మా, తన తెల్ల కుక్క పిల్లను! మల్లికా ప్రసూనలాం, భద్ర గజం దంతంలా, శరత్కాలమేఘంలా తెల్లని కుక్క పిల్ల. ఒంటినిండా బొచ్చొ అదీ ఎంత ముద్దేస్తుంది!

ఆ రోజు మధ్యాహ్నం ఆమె మళ్ళీ కొత్త ప్రకటన చేసింది. 'తప్పిపోయెను—అతి తెల్లనైన కుక్కపిల్ల. మూకీ అని పిలిస్తే ఊ కొట్టుంది. తీసికొచ్చి ఎవరైనా అప్పగించిన యెడల అయిదు పౌన్లు బహుమతిగా యివ్వబడును.' అని డెయిలీన్యూస్ పత్రికలో ప్రకటించింది.

మరునాడు ఉదయమంతా కిటికీలోనుంచి వీధిలోనికి చూస్తూ కాలం గడిపింది. ఎవరైనా కుక్కపిల్లను ఎత్తుకొని వస్తారేమోనని ఆమె ఆశ. మధ్యాహ్నం అయ్యేటప్పటికి భరించలేనంత పిచ్చియెక్కిపోయింది. వెంటనే పత్రికా కార్యాలయానికి ఫోను చేసింది.

'ఎవరు మాట్లాడుతున్నారు?'

'ఆఫీసు కుర్రాణ్ణి'

'మీ సంపాదకుణ్ణి పిలు. నా మూకీగాని యింకొక గంటలో యింటికి రాకపోతే నా జన్మలో మీ పత్రికను కొనను.' ఆమె మొహం కణకణమండే అగ్నివలె వున్నది.

సాయంకాలం ఆరుగంట లయింది. కుక్కపిల్ల జాడ తెలియలేదు. కాలుకాలిన పిల్లిలా యింటి చుట్టూ ప్రదక్షిణం చేసింది. కుక్కపిల్ల యింకా రాలేదు. ఇక లాభం లేదని నగరంలో వున్న పత్రికలన్నిటికీ ప్రకటన పంపించింది. ఈసారి బహుమతి పదిపౌన్ల వరకూ పెరిగింది.

నాలుగురోజులు గడిచాయ్. మూకీరాలేదు ఆమెకు యింకేమీ పాలుపోవలేదు. డిటెక్టివ్ కోసం కబురుచేసింది. అతను వచ్చాడు. 'నా చిన్నికుక్కపిల్ల తప్పిపోయింది. నా మూకీ నన్ను ఒంటరిగా చేసి వెళ్ళిపోయింది. మీరు ఎట్లాగయినా దానిని పట్టుకోవాలి. మీ మేధస్సునంతా కరిగించి, పరిశ్రమించి వెతకాలి. ప్రతి యిల్లూ సోదాచేయండి. రేపు సాయంసమయానికి మీరు అప్పగించినట్లయితే ఇరవై అయిదు పౌన్లు బహుమతి! మీ ప్రతిభ నాకు తెలియదూ? నా మూకీని నాకు చూపించరూ' ఆమె వెక్కివెక్కి రోదించసాగింది.

డిటెక్టివ్ పదినిమిషాల వరకూ మాట్లాడలేకపోయాడు.

'అమ్మా! అయితే కుక్కపిల్ల ఎప్పుడు తప్పిపోయిందో చెప్పగలరా?'

'మా ఆయన...'

'మీ కుక్కపిల్ల సంగతి చెప్పండి, ముందు.'

'మా ఆయనా, కుక్కపిల్లా, వారంరోజుల క్రితం ఒక సాయంకాలం షికారు వెళ్లారు. ఇద్దరూ యింతవరకూ యిల్లు చేరుకోలేదు.'

ఆమె క్షణం సేపాగి, నా కుక్కపిల్లను నాకు చూపించరూ అని మళ్ళీ సప్తమస్థాయిలో అందుకున్నది.

స్కెచ్

# ముసలమ్మ మొర

పి. దుర్గానాగేశ్వరరావు

టైము అయిపోయింది. తొందరగా పరిగెత్తు కొచ్చాను బుకింగ్ ఆఫీసు దగ్గరకు. రైల్వే గడియారం చూశాను: ఇంకా పది నిమిషాల టైం ఉంది; అమ్మయ్య! చేతిలో సంచీయే కాబట్టి సరిపోయింది; బతికాను!

కిటికీ దగ్గర జనం కిక్కిరిసి ఉన్నారు; రణగొణ ధ్వని.

పర్సు తీశాను.

ఎవరో ముసిల్ది, దాదాపు ఏడుస్తూ వచ్చింది: 'బాబూ! ఎన్నడూ అడిగే దాన్ని కాదు నాయనా! ఆ కనిస్టీబు చేశాడింతా. పదణా లిప్పించు బాబూ! టిక్కెట్టు కొనుక్కుంటా.'

తొందర్లో ఎవరి కాలో తొక్కాను. నావంక ఉరిమి చూసిన మొహానికి ఒక 'సారీ' సరిపోయింది.

వెనకనుంచి ముసల్ది: 'కూతురికి ప్రాణంమీది కొచ్చింది తండ్రీ! టిక్కెట్టు తెస్తానని ఆ కనిస్టీబు కాజేశాడు నాయనా డబ్బులు.'

తల తిప్పాను అటువైపు:

ఏడుస్తూ ముసిల్ది, ఆత్రుతగా అడిగింది: 'నాయనా! పిల్లదానికి చాలా జబ్బు చేస్తే చూడ్డానికి పోతున్నాను. తెచ్చుకోలేక గాని పెట్టమని ఆ పోలీసు కనిస్టేబు కిచ్చాను— '

'ఎవరికిచ్చావు— ? వాడి నంబరెంత ?'— పక్కన ఎవరో అడిగారు.

'నంబరా ? అదేమో నాకు తెలియదు నాయనా. నే తెస్తా నిమ్మన్నాడు. నమ్మి యిచ్చా నాయనా,మాయ చేస్తా డనుకోలేను.'

'ఎవరి కిచ్చావో— ?' అని మరొకడు అన్నాడు.

'ఆ ఎర్రటోపీకి నాయనా !'

అడిగినాయన దర్జాగా వెళ్లిపోయాడు.

జనాన్ని నెట్టుకుపోయి టిక్కెట్టు తెచ్చుకుందామని ప్రయత్నించాను. ఎవరో ఇద్దరి మీంచి ఎగిరి, కిటికీ ఊచ పట్టుకుని టిక్కెట్టు అడుగుతున్నాడు. ఓ నిమిషం ఆగుదామని పించింది.

'నాయనా !' దీనంగా, ముసిల్ది.

మహా ఆర్చేవాడిలా- తీర్చేవాడిలా అడిగాడు ఒకడు : 'ఎప్పుడిచ్చావు ?'

'ఇందాకనే బాబు ! ఇక్కడున్నట్టే మాయమైనాడు, దొంగచచ్చినాడు.'

అటూ యిటూ చూశాను. ఎవడూ పోలీసు లేడు.

'ఆరణాలు ఎవరో పుణ్యాత్ము లిచ్చారు నాయనా. దయతలిచి-' చెయ్యి చాపింది, ముసిల్ది.

ఒక తలపాగామనిషి పోతూ 'పాపం!సాయం చెయ్యండి బాబూ !' అని సిఫార్సు చేసి పోయాడు. ఏదన్నా యిద్దా మనిపించింది. చేతిలో నోటు !

'మీ ఊరికి టిక్కెట్టెంత ముసలమ్మా !' అని ఒక కుర్రాడు అడిగాడు.

'రూపాయిబేడా, నాయనా.'

కుర్రాడు వెళ్ళిపోయాడు. ఈ కేసు చాలా 'హోప్‌లెస్' కింద కట్టేశాను; పన్నెండణాలు ఎవ డిచ్చుకోగలడు ?

జనంలోకి తెగించి చొరబడ్డాను, చూస్తూ, నుంచుంటే పనికాదని. చొక్కా చింపుకుని, కాలు ఎవడో తొక్కితే నెత్తురు రాగా, చెమట పట్టి బయటి కొచ్చాను.

ఒక్కసారి ఊపిరి పీల్చుకుని ప్లాట్‌ఫారం మీదికి పోదా మనుకుంటున్నాను.

ముసిల్ది ఎదురు- 'బాబూ ! నీకు తోచింది—'

ఒళ్లు మండింది; కాలు తుడుచుకుంటున్నాను. 'పోపో' అన్నాను. చాలా కర్కశంగా అన్నానని యిప్పుడు తెలుస్తోంది. ముసిల్ది ఏం మాట్లాడలేదట్లే ఉంది.

ఎవర్నో అడుగుతోంది. ఎవరో 'ఇదో వేషం' అంటున్నారు.

నడిచిపోయాను. స్నేహితుడు వాసు కనిపించాడు: ఆసి, 'అంత తొందరేమిటోయ్?' అన్నాడు.

'లైటు మవలేదూ? ఎక్కడికి పోతున్నావు?' అని అడిగాను.

'ఇంకా ఈ బోటు యిప్పుడిప్పుడే బయల్దేరదు. ఎదురుబండి యిక్కడే క్రాసింగ్... అందుకని ఆగుతాము లే. మా ఆఫీసరు—'

పాసింజరు బండి. ఎప్పుడూ లేట్. విసుగేసుకొచ్చింది.

'అటు పోదాం రా. కాస్త సోడాయేనా తాగుదాం.'

పోయి ఐస్ సోడా తాగాం. హాయిగా సమర్పించుకున్నా.

'కొంచెం సిగరెట్లు తీసుకో' మని వాసు-అణాన్నరపెట్టి రెండు విల్సుముక్కలు కొనిచ్చాడు.

'ఇక పోయొస్తా' నంటున్నాడు వాడు.

పోలీసు వాడొకడు మేగోన్ని పాన్-బీడా-సిగరేట్-అగ్గిపెట్టె-వాణ్ణి గసమాయిస్తున్నాడు: 'ఏరా రాస్కెల్! మళ్ళీ—'

వాడు పారిపోయాడు- బాబూ, బాబూ' అంటూ

వాసు బ్లింటు తీసుకున్నాడు; వాడికి డబ్బులు యివ్వడం తప్పింది!

'ఉండను. ఇక పోతా' అన్నాడు వాడు.

ఏదో కంపార్టుమెంటు ఎక్కాను.

నాకోసం వచ్చి పక్కకొచ్చిట్టు వాసు చెప్పి పోయాడు. మళ్ళీ ఎప్పుడో పాసు తరాత్తే.

ప్లాట్‌ఫారం కటకటాల అవతల ముసిలిది ఏడుస్తూ ఉంచుంది-కనిపించింది.

మనస్సు చివుక్కుమంది.

మొదటి గంట మోగింది.

'నా ట్రెయిన్ వచ్చింది పోతున్నా' నని వాసు అన్నట్టున్నాడు. వెనకనుంచి—

'అడుగులు ఎక్కుతుంటేనే తప్పులేవేం?' అని ఎవరో అన్నారు.

పక్కకి చూశాను; ఎవరో అమ్మాయి సర్కస్ చేసినట్లుగా ఎక్కింది కంపార్టుమెంటులోకి, నన్ను రాసుకుంటూ పోయి.

'అరే-' అనిపిలిచాను. వాసువినిపించుకోలేదు.

ముసలమ్మవంక చూస్తూనే ఉన్నాను. అంతగా ఎన్నడూ బాధ అనిపించలేదు. గుండె కొట్టుకుంది. కనీసం హాయిగాలయినా యివ్వలేకపోయాను.

సిగ తీసుకోద్దామనిపించింది.

రెండో గంట కొట్టారు.

ముసిల్ది ఏడుస్తోంది, చేతులుసాచి.

ఒక్క పరుగున పోయి పిల్చుకొస్తే-గార్డుతో చెబితే—

గార్డు విజిల్.

నేస్తుడిలాగ కంపార్ట్మెంటు గేటుదగ్గర నిలబడ్డాను.

ట్రెయిను కదిలింది కాబోలు- సాగిపోతున్నాను. చల్లగాలి వచ్చి కొట్టింది. దీపస్తంభం పోయి, టెలిగ్రాఫ్ స్తంభం ఒచ్చింది-

లోపల ఎవరో పుర్లుణపడుతున్నారు. ఎవరో పిల్ల ఏడుస్తోంది. వెనక్కి తిరిగాను.

పోలీసు, బెంచీలకింద తొంగిచూస్తున్నాడు: చాలా బియ్యంమూటలు బయటపడ్డాయి.

నాకు చోటు దొరకడం చాలా అదృష్టం; ఎవడో దయతల్చి ఇచ్చాడు. కూచున్నా.

పోలీసు బెదిరిస్తున్నాడు. మూటలు తెచ్చినవాళ్ళు 'బాబూ, బాబు' అంటున్నారు. 'కనిస్టీబు బాబు!' అని ఎవతో వెకిలిగా నవ్వుతోంది, మూట తెచ్చినది.

పోలీసు కనిస్టీబు బుద్ధావతారమెత్తి, అప్పుడప్పుడు భాషణం పారాయణ చేస్తున్నాడు. బియ్యంమూటలు తెచ్చిన ఆడవాళ్ళు, మగవాళ్ళు, పిల్లలూ — బోలెడుమంది. గొంతులో దోపిన మాలరుసంచుల్లోంచి, రవికచాటుల్లోంచి, దొంగ మూటల్లోంచి చెల్లించుకుంటున్నారు ముడుపులు.

నాపక్క ఆసామి మూడుమూటలు తన వెనక దాచి, బీదవాడికి సాయం చేస్తున్నాడు.

'ఆ గింజలకోసం బతుకుతున్నాం బాబూ' అని మూటలు తెచ్చినవాడు ఎవడో అంటున్నాడు.

'ఇది ఎన్నోసారే—' అని కనిస్టీబు ఎవరో బెదిరిస్తున్నాడు. 'ఈపాలికి పోనియ్యి కనిస్టీబు బాబూ' అని మరొకతె సిఫార్సు.

ఎవర్నీ ఏం అనగలిగిన స్థితిలో లేను. అని చెయ్యగలిగినదీ లేదు, చేసి నెగ్గగలిగినదీ లేదు.

ముసిల్ది తలపుకొస్తోంది—



# పుస్తక సమీక్ష



ఉమర్ ఖయ్యామ్ ఆంధ్రీకరణ: శ్రీ ఉమర్ అలీషాకవి. (ప్రచురణ: శ్రీ అలీషాకవి గ్రంథమండలి, పిఠాపురము, తూర్పుగోదావరి జిల్లా. 127 పుటలు, వెల 3 రూ.)

రామాయణాన్ని ఎందరెన్నిసార్లు రాసినా పుణ్యమే అన్నాడు కంకంటి పాపరాజు. ఉమర్ ఖయామ్‌ను ఎందరెన్నిసార్లు తెలిగించినా పురుషార్థమే కాబోలు. వేమనపద్యాలలాగ ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు ఎన్ని వందలున్నాయో ఎవరికీ తెలియదు. తమకు లభ్యమైనన్ని సేకరించి, తమకు తోచిన రీతిగా తెలిగించారు శ్రీ ఉమర్ అలీషాగారు. ఫలితం 714 పద్యాల చాపూ కావ్యం. ఇది కవిగారి జీవితకాలంలో అచ్చుకాలేదు. ఇంకా వారివి ఇరవైదాకా అముద్రిత గ్రంథాలున్నాయి వాటన్నింటినీ ప్రకటించడానికి 1946 లో "శ్రీ ఉమర్ అలీషా కవి గ్రంథప్రచురణ సంఘం" ఒకటి ఏర్పడింది. ఈ సంవత్సరం "ఉమర్ ఖయ్యాం" వెలువడింది. ఈ గ్రంథ ముద్రణకు "మహాయోగిని శ్రీమతి అల్లూరి సత్తెయ్యమ్మగారు" ధన సాహాయ్యం చేశారు.

మొత్తంమీద మనం గమనించదగ్గ సంగతి, ఒక కవి బతికుండగా అతని రచనలు అచ్చుకావడానికి వీలులేనికాలంలో మనం బతుకుతున్నామని. కొంతమంది ఒక సంఘంగా ఏర్పడి కొన్ని సంవత్సరాలు తాపత్రయపడితే ఒక్క పుస్తకం అచ్చుకావడం సాధ్యమవుతోంది. దాని ఖరీదు మూడురూపాయలు. ఇక ఆ పుస్తకాన్ని ఎంతమంది కొంటారో ఎందరు చదువుతారో!

ఖయ్యాం కవిత్వంగురించి ఇప్పుడు కొత్తగా చెప్పదగ్గ దేమీలేదు. "It is the best expression of a bad mood" అన్నాడొక ఆంగ్ల విమర్శకుడు. తమ తర్జుమాల్లో శ్రీ ఉమర్ అలీషా గారు మాతృకకు సాధ్యమైనంత చేరువగా ఉండడానికి ప్రయత్నించినట్లు కనబడుతుంది. కాని మన గ్రాంథిక భాషా, మన ఛందస్సులూ బిగించిన ఉచ్చులలో చిక్కుకొని ఖయ్యాం భావాలు సరళతనీ, స్పష్టతనీ కోలుపోయాయి. నిజానికి, ఖయ్యాం భావాలను మన వృత్తాలలోకి దించడం కేవలం వాటిని Paraphrase చెయ్యడమే అవుతుంది. అంటే అటువంటి రచన వచనానికి ఒక్కమెట్టుమాత్రం ఎగువగా ఉంటుంది. రుబాయీకి సరిపోయిన ఛందస్సు ఏదీ తెలుగులో లేదు. నాలుగు పాదాలలో 1, 2, 4 పాదాల చివర ప్రాస కలిగి 3 వ పాదం నిష్ప్రాసంగా ఉండేది రుబాయీ. ఇటువంటి ఛందస్సును తెలుగులో క్రొత్తగా కల్పించడం అంతకష్టం కాదు. అయితే ఇంతవరకు ఖయ్యాంను తర్జుమా చేసిన మన కవులెవరికీ ఇదొక ముఖ్యావసరంగా కనబడలేదు. ఒక్క 'పఠాభి' మాత్రం ఇందుకు ప్రయత్నించి చాలావరకు కృతకృత్యుడయాడు.

ఇంతవరకు తెలుగులో వెలువడ్డ రుబాయత్ అనువాదాలన్నింటిలోనూ దువ్వూరి రామిరెడ్డిగారి 'పానశాల' శ్రేష్ఠమైనదని పలువురి అభిప్రాయం. ఇది కాదనడం కష్టమే కాని రుబాయీకి దగ్గరగా ఉన్న ఛందస్సులో ఈ అనువాదం లేకపోయిందనే వెలితి మాత్రం రామిరెడ్డిగారి 'పానశాల'కు ఉంది.

రామిరెడ్డిగారి శయ్యాసౌలభ్యంతో పఠాభి ఛందస్సౌందర్యం కలిపి ముమ్ముందు ఎవరైనా ఉమర్ ఖయ్యాంను పునర్ అనువదించ వలసి ఉంది.

శ్రీ. శ్రీ.

**వాణి: సంచిక 1. సంపుటి 1.** (ఆలిండియా రేడియో, మద్రాసు కేంద్రమువారి ఆధిపత్యముక్రింద రేడియో కార్యక్రమాలను వివరించే తెలుగు పక్షపత్రిక. విడి సంచిక: అయిదు అణాలు. సంపాదకుడు, పబ్లిషరు: స్టేషన్ డైరెక్టర్, ఆలిండియా రేడియో, మద్రాసు-౪)

'తెలుగువారికై ప్రత్యేక రేడియో కేంద్రముతోపాటు రేడియో కార్యక్రమాల గురించి తమ మాతృభాషలోనే తెలిపే ఒక ప్రత్యేక రేడియో పత్రికనుకూడ మనవారు చిరకాలముగ వాంఛిస్తూ వచ్చారు.'

విజయవాడ కేంద్రముతో ఆంధ్రులకు ప్రత్యేకంగా రేడియోలేని కొరత తీరింది. 'వాణి' అవతరణతో ప్రత్యేకమైన రేడియో పత్రిక ఏర్పడింది. 'ఎంతో ఆనందంతో, ఎంతో ఆసక్తితో, కొంత భయంతో వాణి తెరమరుగు వీడినది' అన్నారు సంపాదకులు. అధికారులు తెర తొలగించారు: 'పత్రికా పత్రిక' 'వాణి' ఉపమకు అనుగుణంగానే స్త్రైణహృదయంతో తొలిసారి యవనికాభ్యంతరం వెలువడింది.

ఆకృతి రమణీయంగా ఉంది. తుంగభద్రా నదీతీర దృశ్యం ముఖచిత్రం. సంచికలో ఉన్నత శ్రేణికి చెందిన కవివరులు, గాయకులు, రాజకీయనాయకుల చిత్రాలు పత్రిక శోభ కలుగచేస్తున్నాయి. సాధారణంగా ప్రభుత్వాధికారం క్రింద వెలువడే పత్రికలు చప్పచప్పగా, అనాకర్షణీయంగా ఉండడంలో ప్రథమ తాంబూలం అందుకుంటాయి. 'వాణి' ఆ ప్రమాదాన్ని తప్పించుకున్నందుకు అభినందించదగినది. ప్రముఖుల ఉపన్యాసాలనుండి కత్తిరింపులు, ప్రధాన న్యాయమూర్తి శ్రీ రాజమన్నారుగారి 'కాళిదాసుని పాత్రపోషణా శిల్ప' పరిశీలన, ప్రసారవిశేషాలు—పాఠకుని మనస్సును ఆహ్లాదపరిచే విశేషాలు.

రేడియోశ్రోతల అభిరుచులను అధికారులకూ, అధికారుల సదాశయాలను శ్రోతలకూ వ్యక్తపరిచి 'వాణి' ముమ్ముందు అభివృద్ధి చెందడమే ఆంధ్రుల ఆశయం. నేడు 'కల' వారి యిండ్లలో మాత్రమే రేడియో వాణి వినిపిస్తుంది. పారిశ్రామికంగా వెనుకబడివున్న తెలుగుదేశంలో అశేష ప్రజానీకానికి రేడియో అందుబాటులో లేనిది. రేడియో ద్వారా అందించబడుతున్న వినోదవిజ్ఞానాలు సంగ్రహరూపంలో 'వాణి' అందించగల్గితే కేవలం ప్రోగ్రాముల పట్టికగానే కాకుండా, ఒక విలక్షణపత్రికగా పాఠకుల ఆదరాభిమానాలను చూరగొంటుంది.

---

**హోమియోపతీ తత్వశాస్త్రము:** గ్రంథకర్త: వేమవరపు వెంకట రమణ శర్మ, కపిలేశ్వరపురము, తూ. గో. జిల్లా. వెల: రూ 5.

ఇదివరలో ఆంధ్ర హోమియోపతీ వైద్యశాస్త్రం ప్రచురించిన వేమవరపు వెంకటరమణ శర్మగారు ఇప్పుడు హోమియోపతీ తత్వశాస్త్రం కూడా ప్రచురించారు. హోమియోపతీ వైద్య విధానానికి ఇది పునాది. ఈ పునాదిమీద విజ్ఞానం సంపాదించినవారు చికిత్సలో నైపుణ్యమూ, దక్షతా సంపాదించగలుగుతారు.

హానిమాన్, కెంట్ మొదలైనవారు హోమియోపతీకి చెందిన తాత్విక విషయాలు క్రోడీకరించటానికి అపారమైన కృషిచేశారు. ఈ కృషి ఇంకా జరుగుతూనేవుంది. వెంకటరమణశర్మగారు నేటివరకూ జరిగిన కృషిని ఈ గ్రంథంలో చక్కగా ఇమిడ్చారు. ఔషధముల రోగనివారణశక్తినీ, వాటిరసాయనిక స్వరూపానికీ గల సంబంధాన్ని చివరి ప్రకరణంలో విశదీకరించారు. సుగుణాజములనుగురించి ఈ పుస్తకంలో ప్రత్యేక ప్రకరణాలున్నాయి. రోగలక్షణాలను ఏ విధంగా చిహ్నలతో విలువకట్టాలో, వేటికి ప్రాముఖ్యం ఇవ్వాలో, అవి ఎట్లా మార్పుచెందుతాయో. లక్షణాలను గుణచయం ఏమిటో ఈ పుస్తకంలో చక్కగా వివరించబడ్డాయి.

హోమియోపతీ విజ్ఞానశాస్త్రాన్ని సరిగా ఉపయోగించదలచినవారు ఈ గ్రంథాన్ని చదవటంవల్ల చాలా లాభం పొందుతారు.

# జనవాక్యం

సంపాదకునికి ప్రకటనార్థం పంపించిన లేఖలు యీ శీర్షికక్రింద ప్రచురితమవుతాయి. లేఖలు క్లుప్తంగా, కాగితానికి ఒక పక్క వ్రాసి పంపాలి.

## సంఘ ద్రోహులకు ప్రభుత్వ సన్మానము

సమ్మెలో పాల్గొనని నాన్ గెజిటెడ్ ఉద్యోగులకు ఏడాది ఇంక్రిమెంట్లు యిచ్చెదమని ప్రభుత్వము ప్రకటించింది. ఒకింత ఆత్మీయత-జాతీయతగల ప్రతి స్వతంత్ర పౌరుని ఈ ప్రకటన అవమాన పరచునదై యున్నది. తమ న్యాయమైన హక్కులు సంపాదించుకొన అహింసతో పోరాటాలు సల్పుటలో సమ్మె ఏకైక ఆయుధమని అంగీకరించిన ప్రముఖ కాంగ్రెస్ నాయకుల పరిపాలనలో నే-సమ్మె వ్యతిరేకులు, సంఘ ద్రోహులునైన ఉద్యోగులకు ఇంక్రిమెంట్లు ఇవ్వడము, సమ్మెలో పాల్గొనినవారిని ఉపేక్షించడము శోచనీయము. నాన్ గెజిటెడ్ ఉద్యోగుల సంఘము ప్రభుత్వము గుర్తించింది. అధిక సంఖ్యాకులగు యన్. జీ. ఓ. లు సమ్మె చేయుటకు నిశ్చయించిన తరువాత కొందరు సమ్మెకు వ్యతిరేకముగా ప్రవర్తించుట సంఘ ద్రోహము కాదా? బీదరికము చేతనో, మీది ఉద్యోగుల భయము చేతనో, వ్యక్తిత్వము లేకనో సమ్మెలో పాల్గొననంత మాత్రమున ప్రభుత్వాభిమానులని గుర్తించి అట్టివారిని బహూకరించుట ప్రభుత్వ జాతీయ గౌరవానికి తీరనిలోటు. కాంగ్రెస్ మంత్రివర్గము, విదేశ పరిపాలకుల పరిపాలనా విధానములను విడిచి స్వతంత్రముగా న్యాయముగా వ్యవహరిస్తుందనటానికి ఉదాహరణగా, సమ్మెలో పాల్గొనిన ఉద్యోగులకుకూడ ఏడాది ఇంక్రిమెంటు ఇచ్చెదనని వెంటనే ప్రకటించాలి. మద్రాసు మంత్రివర్గము నాన్ గెజిటెడ్ ఉద్యోగులందరికి ఇంక్రిమెంట్లు ఇచ్చి సామాన్య ప్రజల మన్ననలను పొందుతుందా?

లఖణాపురం — బాబు పరాంకుశం

---

## సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇండియన్ మెడిసిన్

దేశీయ వైద్య కేంద్రసంఘపు ఎన్నికలలో B క్లాసువైద్యులకు న్యాయముగా ప్రత్యేకింపదగినన్ని స్థానములను ప్రత్యేకింపక, అల్పసంఖ్యాకులయిన A క్లాసువారికి అత్యధిక స్థానములను ప్రత్యేకించి, ఆయుర్వేదవైద్యులకు ప్రభుత్వమువారే చాలా అన్యాయము చేసియున్నారు. అందువలన కేంద్రసంఘమునందు, యథార్థముగా ప్రజాసేవ చేయుచున్న అధిక సంఖ్యాకులయిన B క్లాసు వైద్యులకు తగినంత ప్రాతినిధ్యము లేకపోయినది.

సెంట్రల్ బోర్డుకుగల 26 స్థానములలో 23 స్థానములకు ఎన్నికలు జరిగినవి. తక్కిన మూడు స్థానములును ప్రభుత్వం భర్తీచేయవలసి ఉన్నది. కావున, ప్రభుత్వమువారు, సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యులును, పండితులును, ఆయుర్వేదాభివృద్ధికై నిరంతమును కృషిసల్పుచున్న I శ్రీ. భిషగ్వర, పండిత మల్లాది రామమూర్తి శాస్త్రి (ఆంధ్రరాష్ట్ర) ఆయుర్వేద కాంగ్రెస్ అధ్య

క్షులు) 2 శ్రీ వస్తాదు వెంకటస్వామినాయుడు (పశ్చిమ గోదావరిజిల్లా ఆంధ్రవైద్యమండలి అధ్యక్షులు) 3 శ్రీమాన్ అగ్నిహోత్రం విజయ సారథి ఆచార్యులు (ఆంధ్రవైద్యమండలి అధ్యక్షులు) గార్లను సభ్యులుగా నియమించి, B క్లాసు వైద్యులకు న్యాయము కలుగచేయవలెను.

బెజవాడ — గోనెళ్ల వెంకటేశ్వర్లు

---

## విశాఖపట్నం శుభ్రత

'ఏ వూరు మీది' అని యెవరైనా అడిగినప్పుడు, 'విశాఖపట్నం' అని చెప్పడానికికూడ సిగ్గు వేస్తుంది. ఈ వూరులో విశాలమైన వీధులు లేవు. గృహానికీ గృహానికీ మధ్య అడుగు దూరము కూడా ఉండదు. ఎక్కడ చూచినా చిన్న చిన్న సందులు. తెల్లవారింది మొదలు మిట్టమధ్యాహ్నం వరకు వీధులను తొంగి చూడలేం. కాలువలు తుడిచిన తుక్కు పక్కనే పోగు పెడతారు. ఇంతకీ విశాఖపట్నానికి శుభ్రత లేదు. పట్టణపారిశుద్ధ్యం విషయంలో మునిసిపాలిటీవారు తగు శ్రద్ధ వహించడం లేదు. ఇలా ఎంతకాలం - అధికారులు చూడకపోవడం, వూరు అశుభ్రంగా ఉండడం?

విశాఖపట్నం — సోమయాజుల లక్ష్మణరావు



అమెరికా సంయుక్త రాష్ట్రాల రక్షణశాఖ మాజీ సెక్రటరీ జేమ్సు వి. ఫారెస్టాల్ ఇటీవల ఆత్మహత్య చేసుకొని చనిపోయాడు. కొద్దికాలం క్రితం ఆయన తన పదవికి రాజీనామా నిచ్చి, ఉద్యోగపు ఛార్జి కొత్త సెక్రటరీ లూయీ జాన్సన్‌కి అప్పగిస్తున్నప్పుడు తీసిన ఛాయాచిత్రం.

(ఎడమనుండి కుడికి) :- జేమ్స్ ఫారెస్టాల్, హారీ ట్రూమన్, లూయీ జాన్సన్.

### అగ్రనాయకుల దృక్పథం

'రాష్ట్రపతి గాను ఎవరు తోడుకున్నా సరే, వారు పటేల్, నెహ్రూ ప్రభృతుల చేతుల్లో కీలుబొమ్మ అయి తీరవలసిందే, అట్లా కానట్లయితే వారి కాస్థానం అధిష్ఠించే అర్హత లేదు.'

దీనిని మన డాక్టరుగారు రుజువుపరిచారు. అధ్యక్షపదవి పోటీలో పట్టాభి విజయానికి వారు పూర్తిగా సహకరించినంతమాత్రాన, వారి మెప్పు బడయటానికై ఆంధ్రులను అన్యాయం చేయపూనుకోవడం అసమంజసం.

రెవెన్యూ మంత్రిగా ఉన్నంత కాలం 'మద్రాసు ఆంధ్రులకే కాదా చెందుతుందని వాదించేవారిలో నేను ప్రథముణ్ణి' అని ఘోషించిన కళావారు కాంగ్రెస్ కార్యదర్శి అయిన మరుక్షణం ఇట్లా తిరిగిపోవడం ఆశ్చర్యమైన విషయం.

ఇటువంటి సమయంలో శ్రీ ప్రకాశంగారు మౌనముద్ర వహించడం శోచనీయం. శ్రీ [illegible] రామమూర్తిగారు ఎంతో సమంజసంగా తీర్పు చెప్పారు. నిజానికి [illegible] కాపాడటానికి మన నాయకుల్లో ఏ ఒక్కరికీ వీలు లేదని నిస్సందేహంగా చెప్పొచ్చు. కాబట్టి ఆంధ్రులంతా సక్రమమార్గంలో సరియైన ఆందోళన జరిపి అగ్రనాయకుల ప్రస్తుతదృక్పథాన్ని మార్పించాలి.

మద్రాసు — బొ. రామారావు

## 2

మొదటినుంచీ భాషా ప్రయుక్తరాష్ట్ర విభజనకోసం విపరీతమైన ప్రచారాందోళన చేసిన మన ఆంధ్రుడు రాష్ట్రపతి కావడంతో, అప్పుడే స్వరాష్ట్రం సిద్ధించినట్లుగా ఆనందించిన ఆంధ్ర ప్రజానీకానికి అగ్రనాయకత్రయ నివేదిక అశనిపాతం లాంటిది. అధ్యక్షుడు కావడంతో ఆంధ్ర రాష్ట్రాన్ని గురించి పట్టాభిగారు చేసిన ప్రకటనలు—నాటి జయపూరు కాంగ్రెసు మహాసభ అధ్యక్షోపన్యాసం, 'మద్రాసు మన ఉమ్మడిసొత్తు' అన్న [illegible]రంగనీతులు విశాలాంధ్ర నిర్మాణాని దోహదం చేస్తాయనుకున్నాం. కాని నాయకత్రయనివేదిక - పట్టాభిగారు చెన్నపట్టణాన్ని గురించి పదేపదే అయాచితంగా చేస్తున్న



"నవజీవనం" తమిళ చిత్రంలో ఒక సన్నివేశం

ప్రకటనలు - ఆంధ్రుడై వుండికూడా చెన్నపట్ట ణంపై ఆంధ్రులు హక్కులు వదలుకోవాలన్న వీరి సుభాషితాలూ ఆంధ్రజాతికి విపరీతమైన ఆశాభంగాన్ని కలిగించడమే కాకుండా, తీరని ఖేదాన్నికూడా కలిగిస్తున్నాయి.

మొన్న మొన్నటిదాకా 'మన ఉమ్మడి సొత్తు' అన్న పట్టాభి ఇప్పుడు చెన్నపట్టణాన్ని తమిళ సోదరులకు కట్టిపెట్టడంలో అంతర్యమేమిటో? తాము రాష్ట్రపతి కావడానికి పూర్తిగా సహకరించిన తమిళనాడు కాంగ్రెసు సంఘానికి ఇది వీరు చేయవలచిన ప్రత్యుపకారమేమో? లేకపోతే 'అవసరమైతే చెన్నపట్టణం కోసం రక్తాన్నికూడా ధారపోస్తా' మన్న కామరాజనాడార్ బెదరింపులకు పట్టాభిగారు జడిసిపోయారేమో! 'ఆంధ్రులుకూడా చేతగానివారు కారు. ఖబడ్దార్' అన్న శ్రీ కళావారు స్తబ్ధులై మాట్లాడ కూరుకోవడానికి కారణమేమిటో?

నాయకుల చిత్తప్రవృత్తు లెట్లున్నప్పటికీ ఆంధ్రప్రజలు మాత్రం చెన్నపట్టణాన్ని వదలుకోలేరు. ప్రజాప్రతినిధులమని చెప్పుకుంటున్న ఈ ఆంధ్రనాయకులు ప్రజాభిప్రాయాన్ని మన్నించి, వెంటనే ఆంధ్రరాష్ట్ర రాజకీయ మహాసభను ఏర్పాటుచేసి, 'విశాలాంధ్ర' నిర్మాణానికి(చెన్నపట్టణం రాజధానిగా) కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకొని తీవ్రప్రయత్నాలుచెయ్యడం ఎంతైనా అవసరం.

పుల్లేటికుర్రు    వి రామచంద్రుడు

---

మంత్రివర్గంపై ఆరోపణలు

ఈ మధ్య కొందరు మద్రాసు కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీవారు సంతకాలతో మద్రాసు మంత్రివర్గంపై కొన్ని ఆరోపణలనుచేస్తూ ప్రకటనచేయగా, ఆరోపణలు కాంగ్రెస్ అగ్రనాయకుల దర్యాప్తు నిమిత్తం పంపబడినట్లు దినపత్రికలలో చదివేను. అందులో సంకుచిత మానవ స్వభావమైన ఇతర నేరాలన్నిటికంటె కాంగ్రెస్ వ్యతిరేకులైన కమ్యూనిస్టు పార్టీవారిని మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గంవారు స్వకీయప్రయోజనం కొరకు వినియోగించుకున్నట్టు ఆరోపణ చెయ్యబడింది. నిజానిజాలు ధైర్యంగా రుజువు చెయ్యలేని పరిస్థితిలో ఈ ఆరోపణ చెయ్యబడి వుండదు. బాహ్యదృష్టికి పర్యవసానం మరుగుపడినా, ప్రజలలో ఆందోళన అంతరించకుండానే మొన్ననే డాక్టరు సుబ్బరాయన్ గారిపై తమిళ డొకడు దౌర్జన్యం చేయబూనినట్లు, నేరస్థునికి శిక్ష విధించినట్లు వార్త వచ్చింది. ధర్మం కొరకు, న్యాయంకొరకు త్యాగంచేసే ప్రతివారి జీవితంకూడా కాంగ్రెస్ ఖరఖాలోవున్న కమ్యూనిస్టుల అనుగ్రహంపై ఆధారపడవలసినదేనా? దీనికి కాంగ్రెస్ అగ్రనాయకులు బుద్ధిపూర్వకంగానే అవకాశాలిస్తున్నారా? కార్యకర్త లేవరైనా మహాత్ముని హత్యాదృశ్యం మన పెద్దల మానస వీధుల్లోంచి అప్పుడే మాయమైందా? అట్టి సందర్భంలో తాము ప్రజలపాలిటి భగవంతునివలె మద్రాసుప్రభుత్వము చేసే ప్రజావ్యతిరేక కృత్యాలను బహిర్గతంచేస్తూ, స్వతంత్రపత్రిక యొక్కయు, తమయొక్కయు త్యాగస్థైర్యాలను మరొక్కసారి నిరూపించేరు. (దీనికి కృతజ్ఞతాపూర్వకంగా) [illegible] పరిస్థితి నెదుర్కొడానికి సిద్ధపడవలసిన అవసరం ఎంతైనా వుంది.

మద్రాసు    శ్రీ విజయ

---

బోనసు కూపన్లు

ప్రకాశంగారి ప్రభుత్వంలో రైతులకు రొక్కంగా బోనసులు యిచ్చినారు. రెడ్డియారుగారి హయాములో బోనసులు ఎరువులు కొనుక్కునేందుకు కూపన్లగా యిచ్చినారు. కాని ఎరువులు సప్లయి చేయలేక పోయినందువల్ల రైతులలో కూపన్లు అనేకవిధాలుగా చేతులు మారినవి. తిరిగి ఆ కూపన్లకు రొక్కం యిస్తామని ప్రభుత్వం ప్రకటించగానే రైతులు అధికార్లకు కూపన్లు యిచ్చినారు. చేతులుమారిన కూపన్లకు రొక్కం యివ్వక త్రిప్పి వేసినారు. అందువల్ల కొంతమంది అమాయిక రైతులు నష్టపడుతున్నారు. రైతుల తాలూకు ఈ-ఫారములబట్టి కూపన్లు తీసుకుని నగదు యిచ్చేందుకు ప్రభుత్వం వుత్తర్వు చేయవలసి యున్నది.

తం. కృష్ణానంద తిలక్